# గోదాన్

(నవల)





రచన:

స్వర్గీయ ప్రేమచంద్

అనువాదం:

ఎ. పిచ్చేశ్వరరావు



విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# ప్రేమచంద్

1880-1936 అక్టోబరు 8

---

## ముందుమాట

20 వ శతాబ్ది ప్రారంభంలోగూడా, మధ్యయుగాల బంధనాలలో నేపడి, మ్రగ్గుతూ వగ్గిపోయిన హిందీసాహిత్యాన్ని పునరుజ్జీవింపజేసిన మహారచయిత ప్రేమచంద్.

1920 లో, ప్రభుత్వోద్యోగం వదలి, సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్ననాటినుండి, భారతజాతీయోద్యమంలోని అభ్యుదయశక్తులతో పాటు పెరుగుతూ, భారతజాతీయ జీవితానికి సాహిత్యంలో స్థానం యేర్పరచిన జాతీయరచయిత ప్రేమచంద్.

భారత ప్రజాసామాన్యపు సాహజిక జీవితానికీ, సుఖదుఃఖాలకూ, ప్రజాపోరాటాలకూ సాహిత్యరూప మిచ్చిన ప్రజారచయిత ప్రేమచంద్.

ఆధునిక హిందీ కథాసాహిత్యానికి పునాదులు వేసి, గట్టిపరచాడు: ఆయన వ్రాసిన కథలే మూడువందలకు పైగా వున్నవి.

ఆయనకు హిందీ నవలా చక్రవర్తి అనే పేరున్నది. ఆయన వ్రాసిన పెద్ద నవలలే పన్నెండుకు పైగా వున్నవి.

"మనుష్యజాతంటే సానుభూతి, పీడిత ప్రజలంటే ప్రేమ వున్న రచయితల్లో ప్రేమచంద్‌లాంటి కళాకారులు బహు

కొద్దిమంది కన్పిస్తారు" అంటాడు ప్రఖ్యాత ఉర్దూ, హిందీ సాహిత్యవేత్త, సజ్జాద్ జహీర్.

"ప్రపంచంలోని వుత్తమ సాహిత్యకారుల శ్రేణిలో ప్రేమచంద్ సుస్థిరస్థానాన్ని సంపాదించుకున్నాడు" అని సోవియట్ విమర్శకుడు, కోంపాన్‌ట్సెవ్ అన్నాడు.

* * *

ఈ ప్రఖ్యాత రచయిత రచనలను అనువదించి తెలుగు పాఠకలోకానికి అందజేయగలుగుతున్నందుకు మేం సంతోషిస్తున్నాం.

భారతీయ గ్రామీణ జీవితాన్నీ, రైతు జీవితాన్నీ, గ్రామీణజీవితంలోని వైవిధ్యాన్నీ, రైతు జీవితంలోని సమస్యల్నీ, సంఘంలోని ఆర్థిక వ్యవస్థనూ ఎంతో సహజంగా ప్రతిబింబించే నవల, **గోదాన్**ను ప్రప్రథమంగా ఆంధ్ర పాఠకలోకంముందు వుంచుతున్నాం.

ఆంధ్రుల ఆదరాభిమానాలమీద ఆధారపడుతూ, ఆ మహారచయిత వ్రాసిన మిగతారచనలనుగూడా త్వరలోనే తెలుగులో ఆంధ్రదేశానికి అందజేయగలమని ఆశించుతున్నాం.

— ప్రకాశకులు.



# 1

ఎడ్లకి రెంటికీ కుడితి పెట్టిన తర్వాత హరీరాం తన భార్య - ధనియాని పిలిచి “అబ్బాయిని చెరుకు నరకటానికి పంపు. నే నెప్పుడొస్తానో. కాస్త ఆ కర్ర య్యిట్లా యియ్యవే” అన్నాడు.

పిడకలు చేస్తున్న ధనియా “ఇప్పుడప్పుడే యేం ముంచుకుపోయింది? రెండు మెతుకులు నోట్లో వేసుకుని వెళ్ళ గూడదూ” అంది.

ముడతలుపడ్డ నుదురు మరింత ముడుస్తూ “ఆలస్యం అయితే దొరగారి దర్శనం ఔతుందో, కాదో అని నే నేడుస్తుంటే నీ మెతుకుల గొడవానూ, నువ్వానూ. స్నానంచేసి పూజలోకూర్చుంటే ఆయనకే తెలియదాయె ఎప్పుడు లేచేదీని” అని గుంజుకున్నాడు హరీ.

“అందుకనేగా రెండు మెతుకులు కతికి పొమ్మనేది. ఐనా మొన్నేగా వెళ్ళొచ్చింది. ఇవ్వాళ వెళ్ళకపోతే యేం?”

“తెలిసినా తెలియకపోయినా, అన్నిటికీ ‘తగుదునమ్మా’ అంటూ వస్తావు. ఆ కఱ్ఱ యిట్లాయిచ్చి పోయి నీ పని నువ్వు

చూసుకో. అట్లా వెళ్ళి వస్తూండబట్టే యీ మాత్రం అయినా నిలబడివున్నాం. ఊరంతా ఎట్లావుందో చూట్టంలా. జప్తులూ; వేలంపాటలూ; ఒకటే రభస. మన ప్రాణాలు ఆయన పిడికిట్లో వున్నప్పుడు 'అయ్యా! బాబూ!!' అనటమే మంచిది."

పాపం! ధనియాకి యీ లోకం అర్థం అయ్యేదికాదు. జమీందారుగారి పొలం చేస్తున్నాం, అంతమాత్రాన ఆయన కాళ్లు వొత్తవలసిన అవసరం ఏవుంది. దేవుణ్ణి కొలిచినట్టు కొలవవలసిన ఖర్మేం పట్టింది? శిస్తు కడ్తూనేవున్నాం గదా! నిజమే. పెళ్ళయి ఇరవై యేళ్ళయింది. అప్పట్నుంచీ చూస్తూనేవుంది. ఎంత తూచి, తూచి ఖర్చుచేసినా, ఎంత పొట్టకట్టుకుని, గీసి, గీసి కానీ దగ్గర్నుంచీ జాగ్రత్త పడుతున్నా శిస్తు కట్టడమే గగన మౌతూండె! అందుకనే గదా కొంపలో ప్రతిరోజూ యీ కీచులాటలు. పుట్టింది ఆరుగురైతే మిగిలింది ముగ్గురు. పదహారేళ్ళు పెరిగిన కొడుకు గోబర్. ఇద్దరాడపిల్లలు. సోనా పెద్దది. రూప చిన్నది. పెద్దదానికి పన్నెండేళ్ళు. చిన్నదానికి ఎనిమిది. ముగ్గురు బిడ్డలు పుట్టగానే పోయారు. మందూ మాకూ దొరికితే వాళ్ళనిగూడ బ్రతికించుకునేదే. ఏం లాభం. ఎర్రని ఏగానీ కూడా లేకపోయింది చేతిలో. తనకు మాత్రం ఏమంత వయసువచ్చింది. ముప్పైఏళ్ళు రేగా. అప్పుడే తలంతా నెరిసింది. మొహం ముడతలు పడింది. వంట్లో ఓపిక లేదు. కళ్ళ కూడా మసకొచ్చిపడింది. కాలుమడిచి కూర్చుంటాసి కూడా వీలులేకపోయె. ఎందుకొచ్చిన కర్మ. పొట్టకూటికేగా యీ కొంపలో పడి ప్రొద్దస్తమానమూ వెట్టిచాకిరీ చేస్తూన్నది. అయినా పొట్ట నిండదాయె. అందుకనే ధనియా అప్పుడప్పుడూ

ఎదురు తిరిగేది, నాలుగైదు చీవాట్లు తిన్న తర్వాతగాని మళ్ళీ మామూలు మనిషయ్యేదికాదు.

ఇంట్లోకెళ్ళి కర్రా, పై పంచీ, చొక్కా, చెప్పులూ, తమలపాకుల సంచీ తెచ్చి హోరీ ముందు పడేసింది.

"ఇవన్నీ తెచ్చావెందుకే! అత్తారింటికెళ్ళమనా. అక్కడ మాత్రం ఎవరున్నారు. వయసొచ్చిన మరదలు పిల్లలు వెళ్ళి చూపిద్దామన్నా" అని కళ్ళురిమాడు హోరీ. వురిమి ముసిముసి నవ్వులు నవ్వుకున్నాడు. "ఆఁ! ఈ సుందరాకారం చూచి మురిసిపోవటానికిక వాళ్ళే తక్కువయ్యారు" అని మూతి తిప్పు కుంది, సిగ్గుతో, ధనియా.

చిరిగిన చొక్కా తీసి, జాగ్రత్తగా మడతపెట్టి, మంచం మీద పెడుతూ "అయితే నేను ముసలివాణ్ణయ్యాననేనా నీ వుద్దేశం? ఇంకా నిండా నల్భై రాలేదు. మగవాళ్ళు అరవై యొచ్చినా మేకుపుల్లాగానే వుంటారు తెలుసా!" అన్నాడు హోరీ.

"వెళ్ళి అద్దంలో మొహం చూసుకో. నీలాంటివాళ్లు మేకువులు కాదు; ఇంట్లో చూస్తే నెయ్యా, పాలూ కలికానికి కూడా దొరకవు; మేకువులంట మేకువులు. భగవంతుడా! యీ రోజు లెట్లా గడుస్తయి. ముసలివాళ్లం అయితే ఎక్కడికెళ్ళి బిచ్చమెత్తుకోవాలీ అని నే నేడుస్తుంటే."

కళ్ళముందు కన్పించే యీ వాస్తవికతలోపడి హోరీ ముసిముసినవ్వులు కమిలి కుమిలి పోయినయి.

"అరవయ్యొచ్చేదాకా ఎక్కడుంటామే పిచ్చిదానా. అంతకుముందే ఎగిరిపోతాం" అంటూ కర్ర తీసుకున్నాడు.

"ఇకచాల్లే అవేంమాటలు. నీతో మంచిమాటంటం గూడా భయమే. పాడుమాటలూ నువ్వాను" అని విసురుకుంది భార్య.

హోరీ భుజంమీద కర్ర పెట్టుకుని బయల్దేరాడు. ధనియా అతను కనబడుతూన్నంతసేపూ వాకిట్లోనే నిలబడింది. భర్త అన్నమాటలు విన్నతర్వాత భార్యకు గోరుచుట్టుమీద రోకటిపోటు కొట్టినట్లయ్యింది. ఆవిడ మనసు మనసులో లేదు. తాను నోచిన నోములవల్లనైనా తన భర్త దక్కుతాడేమో. ఆవిడ అతఃకరణంలోంచి బయల్దేరిన ఆశీర్వాదాలు ఆయన్ని కంటికిరెప్పల్లా కాపాడతాయి. ఆ 'పసుపు కుంకమే' ఆవిడకున్న కాస్త ఆధారమూనూ. ఆ గడ్డిపరకను పట్టుకునేవున్న కష్టాల కడలిని యీదుతోంది. ఆయనన్న మాటలూ అబద్ధంకాదు. అబద్ధం కావుకనుకనే ఆవిడకంతబాధ. గుడ్డివాడివంటే కళ్లులేని కబోది కెంత బాధ కలుగుతుందో కళ్లున్నవాళ్ల కెట్లా అర్థమాతుంది.

హోరీ కాలిదారినే పడి నడచి వెళ్తున్నాడు. దారి కిరువైపులావున్న పచ్చని చెరకునిచూచి అతని మనసు వురకలు వేసింది. దేవుడిదయవల్ల అదునులో వానకురిసి, కాడ పెరిగితే ఒక మంచి ఆవుని కొనుక్కోవాలి. అడవారకం ఆవుకాదు. ఆవన్న తర్వాత నాలుగైదుసేర్లన్నా పాడి వుండాలి. గోవర్ పాలంటే ఆర్చుకుని చూస్తాడు. ఈ వయసులో తినకపోతే ఎప్పుడు తింటాడు. ఒకేడన్నా పాడి తాగితేకాని వాడికి మనిషి రూపు రాదు. ఒకటి రెండు కోడెలు పుడితే యింకా మంచిది. ఆవు లేని దొడ్డి ఏమిదొడ్డి. ప్రొద్దున్నే లేవగానే గోవు దర్శన

మైతే యింకా కావలసిం దేముంది. ఈ కోరిక ఎప్పటికి నెర వేరుతుందో. ఆ మంచిరోజెప్పుడొస్తుందో !

హోరీకి యీ కోరిక చాలా రోజులున్నుంచి వుంది. ఏ గృహస్థు కోరుకోడు తనదొడ్డిలో ఆవుండాలని? బ్యాంక్ లో డబ్బువేసి వడ్డీతింటూ బ్రదకటం మంచిదనీ, ఇంకో పదెకరాలు కొనుక్కోవాలనీ, మరో గట్టిమేడ కట్టుకునీ, హాయిగా కాలుమీద కాలు వేసుకుని బ్రదకాలనీ గొంతెమ్మ కోరికలు కోరుకోగల శక్తిలేదు హోరీ పసి హృదయానికి. హోరీకున్న కోరికల్లా 'ఆవు!' అదే అతని సర్వస్వం! జ్యేష్ఠమాసం. సూర్యుడు మామిడితోపులోనుంచి పైకెక్కుతున్నాడు. గాలికూడా వేడెక్కుతోంది. పొలాల్లో పనిచేస్తున్న రైతులు పలకరించి రెండు గుక్కలు హుక్కాతాగి వెళ్ళమని హోరీని ఆహ్వానించు తున్నారు. కాని హోరీ కంత తీరుబడి యెక్కడుంది? ఏదో దొరగారితో తనకున్న పరిచయాన్నిబట్టి వీళ్ళందరూ యిట్లా గౌరవిస్తున్నారు కాని లేకపోతే తనవంక చూచేవాళ్ళెవరు? తనదగ్గరేముంది. అయిదుకుంటల కొండ్ర. అయినా నాలుగైదు నాగళ్ళున్న మోతుబరులుకూడా తనని గౌరవిస్తున్నారంటే— అదంతా ఆ దొరగారి చలవ.

ఇప్పుడతను పొలాలమధ్యగా పోయే కాలిదారి వదలి పెట్టి లోయలో అడుగుపెట్టాడు. జ్యేష్ఠమాసం కాబట్టి లోయంతా పచ్చటి గరిక పరచుకునుంది. చుట్టుప్రక్కల గ్రామాల గోవులన్నీ యిక్కడికే వస్తాయి మేతకి. లోయలో గాలి చల్లగా తగిలింది. పగలల్లా ఎట్లాగో ఎండలోనూ, వడ గాలిలోనూ తిరగాలెనామె. కాస్సేపు కూర్చుని అలసట తీర్చు

కుందామనుకున్నాడు. కొందరు మోతుబరులు యీ లోయ పట్టా వ్రాయించుకుందామని తంటాలుపడ్డారు. ధర గూడా బాగానే పెట్టేవాళ్ళు. రాయ్ సాహబ్ ససేమిరా అన్నాడు. 'అదంతా పశువుల మేతకే. ఎంత డబ్బిచ్చినా అమ్మేది లేదు' అన్నాడు. ఆయన కడుపు చల్లగుండ. ఇంకొక జమీందారైతే ఆమాటనేవాడా? 'గోవులా గాడిదగుడ్డా. డబ్బొస్తోంది. అమ్మి కూర్చుంటా!' అనేవాడు. కాని రాయ్ సాహెబ్ అట్లాంటి వాడు కాదు. అయినా ప్రజల మంచీ చెడ్డా చూడనివాడు ఏం జమీందారు?

భోలా ఆవుల్ని తోలుకుని ఎదురుగా వస్తున్నాడు. భోలా గూడా ఆవూరివాడే. గొల్లవాడు. పెరుగూ, నెయ్యీ అమ్ముకుని కాలం గడుపుతుంటాడు; మంచి ధరలొస్తే ఆవుల్నీ అమ్ముతాడు: అతను తోలుకొస్తూన్న ఆవుల్ని చూస్తే హోరీకి మనసయ్యింది. స్వామి రంగా! ఆ ముందొచ్చే ఆవుని తనకిచ్చేస్తే! డబ్బు దేముంది. ఏదో వెనకా ముందూ చూసుకో వచ్చు. నిజమే ఇంట్లో డబ్బులేదు. ఇంతవరకూ శిస్తు బకాయి వుంది. విశ్వేశ్వరుడిగారి కివ్వవలసిన అప్పు వడ్డీతోసహా పాపంలాగా పెరుగుతూంది. అయినా బీదతనానికి దూరదృష్టంటూ వుండదు. అప్పులిచ్చినవాళ్ళ తిట్లూ, శాపనార్థాలూ అలవాటయిపోతాయి. సిగ్గూ, బిడియమూ అంటూ వుండవు. అందులోనూ యిన్ని సంవత్సరాలనుంచీ వెంటపడుతూన్న కోరిక. అందుకనే "ఏం భోలా.! బావున్నావా! సంతకెళ్ళావంట. ఆవులేమన్నా కొనుక్కొచ్చావా యేమిటి?" అనడిగాడు.

భోలాగూడా సామాన్యుడుకాదు. హోరీ మనసులోని మాట యిట్టే పసికట్టేశాడు. "ఆఁ రొండు ఆవులూ, రొండు పెయ్యలూ కొనుక్కొచ్చా. వుండావులు ఎండిపోయినాయ్. పాలమ్మొందే గడవదుగా" అన్నాడు.

ముందున్న ఆవు మెఱుగులు చరుస్తూ "పాడావుకుమల్లేనే వుంది. ఎంతధర పెట్టావు?" అనడిగాడు హోరీ.

"సంతలు మండిపోతున్నయ్యనుకో. ఎనభై రూపాయ లిచ్చేప్పటికి తాతలు దిగొచ్చారు. పెయ్యలు ఒక్కొక్కటీ ముప్పై. ఒకేపున ధరలిట్టా మండుతుంటే షావుకారేమో రూపాయి కెసమిదిసేర్ల పాలిమ్మంటాడు."

"గుండెంటే మీదేరా అబ్బాయి. అయితేఏంతే ఇలాంటి ఆవులు చుట్టుప్రక్కల ఎక్కడా లేవు."

భోలాకి నిక్కెక్కువయ్యింది. "ఆఁ రాయ్‌సాహెబ్ వందిస్తానన్నాడు. పెయ్యకి యాభై పెడ్తానన్నాడు. అయినా నేనొప్పుకోలా. దేవుడు దయదలిస్తే..."

"నిజమేలేరా అబ్బాయి. ఆయనమాత్రం ఏంపెట్టి కొంటాడులే. నజరానాగా యిస్తే పుచ్చుకొంటాడుగాని కొనా లన్నా, అమ్మాలన్నా మీదీ తెగింపు. ఇట్లాంటి ఆవొక్కటుంటే చాలు దొడ్డి కళకళ లాడుతుంది. అయినా మాకంత అదృష్ట ముంటేగా. భోలాతో చెప్పకూడదా అంటుంది ఇంట్లో. ఎప్పు డన్నా కనబడితే అట్లాగే చెబుతాలే అన్నా. నీ గుణంచూచి మురుసుకుంటుందనుకో అది. పరాయి ఆడవాళ్లని చూస్తే తలన్నా ఎత్తడు. తలొంచుకునే మాట్లాడుతాడు. పెద్దమనిషి!" అంటుంది.

భోలా మనసునిండిన పాలచెంబయ్యింది. "ఆడవాళ్ళని ఆడబడుచులికిమల్లే చూసుకోని మనిషేంమనిషి. అలాంటివాడి ప్రాణం నిలువునా తీసేసినా పాపంలేదు!"

"బంగారంలాంటి మాట మాట్లాడావు భోలా! ఇతరుల గౌరవం తన గౌరవం అనుకున్నవాడే మనిషి!"

"మగాడు చస్తే ఆడదానికి దిక్కుండ దంటారు గాని ఆడది చచ్చిం తర్వాత మగాడి జన్మ అంతేగా. కాళ్ళూ చేతులూ యిరిగినట్టే. నాకు ఆడదిక్కు లేకుండా పోయిందిగా బాబూ. కొంపలో గుక్కెడు మంచినీళ్ళందిచ్చే వాళ్ళుగూడా లేకుండా పోయారుగా."

హోరీకికూడా తెలుసు. క్రిందటి సంవత్సరమే వడదెబ్బ తిని చనిపోయింది భోలా భార్య. కాని యాభైయేళ్ళు నెత్తి మీద కొచ్చిన యీ గొల్లమనసు యింత మెత్తగా వుంటుందని హోరీ కలలోగూడా అనుకోలేదు. భోలా భార్య కావాలని తపన పడుతున్నాడు. ఇంకేం! హోరీ మంచి లౌకికుడు.

"ఎవరో అన్నట్లు — ఆడది లేని కొంప దయ్యాల కొంపతో సమానం. ఎక్కడా సంబంధం చూడలా మరి?"

"చూడకేం బాబూ! అంత తొరగా తేల్తుందీ. వందో యాభయ్యో ఖర్చు చెయ్యాలనిగూడా అనుకుంటున్నా. దేవుడి దయ ఎట్లా వుందో గాని..."

"నేనుగూడా కనుక్కుంటాలే. దేవుడి దయదలిస్తే ఒక యింటివాడ వౌదూగాని."

"అంతే బాబూ అంతే! ఏదో దేవుడు తిండికి మాత్రం

లోటు చెయ్యటం లేదు. రోజుకి పాతిక ముప్పై శేర్ల పాలు కళ్ళ చూస్తూనే వుంటా."

"మా అత్తారి వూళ్లో ఒక పిల్లుంది. నాలుగైదేళ్ళయ్యిందనుకుంటా దాని మొగుడు కలకత్తా వెళ్లి. ఏదో పాపం చాకిరీ చేసుకుని బ్రదుకుతోందనుకో. పిల్లా జల్లాగూడా లేరు. పిల్ల మంచిదే."

వింటూంటే భోలాకి నోరూరింది. ఆశలో వున్నంత అమృతం మరెక్కడ దొరుకుతుంది? "అదంతా నీ చేతులో పని బాబూ! తీరుబడి చూసుకోని వకసారెళ్ళొద్దామా."

"మంచీ చెడ్డా మాట్లాడి నీకు చెబుతాగా. ఇట్లాంటి విషయాల్లో తొందర పట్టంగూడా మంచిది కాదు."

"అంతేలే బాబూ. నీ యిష్టం వచ్చినట్టే కానీ. తొందరేముందులే. ఆఁ అన్నట్లు యీ ఆవును తోలుకెళ్తావా. తోలుకెళ్ళు."

"నే నెక్కడ భరించగలనయ్యా దాన్ని. నువ్వుమాత్రం నష్టపడ్డం మంచిదా! అయినవాళ్ల గొంతులు నొక్కడం నాకు చేతకాదు బాబూ. ఏదో ఒక విధంగా రోజులు గడుస్తూనే వున్నవిగా."

"ఏమిటి బాబూ! నేనుమాత్రం పరాయివాడినా? ఆవునితోలుకెళ్ళు. నీ యిష్టం వచ్చినంత యిద్దూగాని. నీ యింట్లో వున్నా నా యింట్లో వున్నా ఒకటేలే. ఎనభై యిచ్చొచ్చాగా! ఆ ఎనభయ్యే యియ్యి."

"చూడు. నా దగ్గర రొక్కం అనే మాట లేదు. చెపుతున్నా."

"నిన్ను రొక్కం ఎవరివ్వమన్నారయ్యా అంటే" హోరీ రొమ్ముగజం పెరిగినట్లయ్యింది. ఎనభై రూపాయలంటే ఏమంత ప్రియమూగాదు. అయిదారు సేర్లన్నా యిస్తుంది. కోడెలు పుడితే కోడెలే చేస్తాయి యింతకంటే రెట్టింపు. దొడ్లో వుంటేనే చాలు, యిట్లాంటి ఆవు. నాలుగైదు వందలు అప్పన్న మాట నిజమే. తీర్చేదా; పెట్టేదా! ఆ మూండుముళ్లూ పడితే రెండేళ్ళదాకా నోరుగూడా ఎత్తడు యీ భోలా. పడకపోతే మాత్రం ముంచుకుపోయే దేముంది. రోజూ వస్తాడు. కేక లేస్తాడు. పోట్లాడతాడు. అంతేగా. ఈ కేకలూ, తిట్లూ రోజూ ఎట్లాగో వుంటూనే వుండె. రైతుల కిదొక లెఖ్ఖా? ఇవన్నీ కాసి వడపోసి త్రాగిన ఘటాలు. ఇక భోలాని మోసం చేస్తున్నాడా అంటే అదంతా లౌకిక వ్యవహారం. అందులో తప్పేముంది. స్వంతలాభంకోసం ఇట్లాంటివి రోజు కెన్ని చేయటం లేదు? ఇంట్లో నాలుగైదున్నా నా దగ్గరొక్క కానీ గూడా లేదు బాబూ! అని మున్సబు ముందు ఒట్టులు పెట్టుకోలా! అమ్మేముందు జనపగింజలమీద నీళ్ళు చిలకటంలా, ప్రత్తిలో గింజలు తియ్యకుండా వుంచటంలా యింకొక సేరు తక్కువ తూగుతాయని. అయినా భోలా ముసలివాడు. పడుచువాడి లాగా పెళ్లాం కావాలంటున్నాడు. అట్లాంటివాడి దగ్గర యీ మాత్రం లాభం కొట్టినా—ఫర్వాలేదు!

భోలా ఆ ఆవు పలుపు హోరీ కిస్తూ "తోలుకెళ్ళు బాబూ! ఐదారు సేర్లిస్తుంది. పద నేను గూడా యింటిదాకా తోలిపెట్టే వెళ్తాలే. కొత్తగాదూ. దాన్లో గల్లంతేమన్నా చేస్తుందేమో. నిజం చెప్పనా బాబూ. దొర తొంభై యిస్తా

నన్నాడు. కాని వాళ్ళకి గోలచ్చిమి విలవేం తెలుస్తుంది? నా దగ్గర తీసుకుంటారు. ఎవరికో తోలిపెట్తారు. వాళ్ళు మేపు తారా? ఏమన్నా నా. పాలిస్తాంటే వుంచుకుంటారు. లేకపోతే అమ్మిపారేస్తారు. డబ్బులో ఏముంది బాబూ! మాటుండాలి గాని. మీ యింట్లో కట్టేస్తే మేపుతావు, పాలు తాగుతావు. దాని డొక్కలు ఎండవు. దాని వుసురు నాకు తగలదు. ఏం చెప్పను బాబూ! ఇంట్లో చిట్టు నిండుకొంది. మున్సబు దగ్గర అప్పు తెద్దామనుకుంటున్నా. అప్పుడెప్పుడో తెచ్చుకుంది ఇప్పటి దాకా తీర్చకపోతిని. ఆయనమాత్రం యెట్లా యిస్తాడులే. ఏం ఖర్మో బాబూ. ఒకొక్కదానికి గుప్పెడు గుప్పెడేసినా రోజుకి యిరస కావాలాయె. ఎక్కణ్ణుంచి తేవాలో. ఏం చెయ్యాలో ఏమీ తోచటంలేదు" అన్నాడు.

"అరి నీ దుంపతెగా! నాతో మాటన్నా అనకపోతివే. మొన్నే అమ్మేశా మిగిలిందంతా" అని తన సానుభూతి తెలియజేశాడు హోరీ.

భోలా తల బాదుకున్నాడు. "కష్టాలేమని చెప్పుకోను బాబూ. ఆదుకోటానికి ఒక్కడూ రాడు. విని అందరూ సంతోషించే వాళ్ళే. ఎండిపోయిన ఆవులికి ఫర్వాలేదనుకో. వరిగడ్డేసినా సరిపోతుంది. పాడావులి కెట్టా. నువ్వొక పాతికో, ముప్ఫయ్యో యిస్తే వాటికని చిట్టన్నా కొనుక్కుంటా."

రైతులు స్వార్థపరులే! లంచం ఇవ్వాలంటే తొందరగా మూట విప్పరు; బేరసారాలు గూడా బాగా ఓపిగ్గానేచేస్తారు. వాళ్ళ గడప రోజుకి పదిసార్లు త్రొక్కినా బకాయి వసూలంటూ కాదు. ఇదంతా నిజమే. కాని మనం ఒక సంగతి మరచిపో

గూడదు. వాళ్లు ప్రకృతితో కలసిమెలసి జీవిస్తారు. చెట్లకి కాయలు కాస్తే మనమందరం తింటాం. పొలాల్లో ధాన్యం పండితే లోకం అంతా తింటుంది. ఆవు పొదుగులో పాలున్నా ఆవు త్రాగదు. ఆ పాలని త్రాగేది మనమే. మేఘాలు వర్షిస్తే పృథ్వి దాహం తీరుతుంది. ఇలాంటి ప్రకృతిలో కుత్సిత స్వార్థానికి తావులేదు. హోరీ రైతుబిడ్డ. ఇతరుల గుడిసెకి నిప్పంటుకుంటే చలి కాచుకుంటూ కూర్చోవటం అతనికి చేతగాదు.

భోలా కష్టాలు వింటూంటే అతని మనసు చివుక్కుమన్నది. ఆవు పలుపు మళ్ళీ అతని చేతులో పెడుతూ "నా దగ్గర డబ్బు లేదు నాయనా. వున్న చిట్టులోనే కాస్తోకూస్తో వచ్చి పట్టికెళ్ళు. చిట్టుకోసం గోవు నమ్మటం ఎందుకు నాయనా నాకు మాత్రం ఆ వుసురు తగలదూ" అన్నాడు హోరీ.

భోలాకూడా నిండారు లయ్యాడు. "నీ ఎడ్లకి మాత్రం డొక్క లెండవూ. నీ దగ్గర మాత్రం ఏమంత వుందిలే" అన్నాడు.

"ఈ ఏడు కాస్త బాగానే వుందిలే."

"ముదనష్ట పాడిని ఈ వూసెందుకెత్తాలి నేను?"

"నువ్వు చెప్పలేదే అనుకో. నాకు తెలిస్తే నేను మాత్రం బాధ పడనూ. భోలా నన్నింత పరాయివాడుగా చూశాడే అని. అవసరమైనప్పుడూ ఆదుకోకపోతే ఎట్లాగురా నాయనా."

"సరేలే. నా మాటని ఆవుని తోలుకెళ్ళు."

"ఇప్పుడు కాదులే. తర్వాత."

"అయితే చిట్టి ధర పాల ఖాతాలో మినహాయించు కొంటావా."

"ఆఁ ధరానూ, పాడూనూ. మీ యింట్లో రెండు మూడు పూటలు అన్నం తింటే డబ్బు పుచ్చుకుంటావా ఎక్కడైనా. పిచ్చివాడా!" అన్నాడు హోరీ బాధపడుతూ.

"నీ ఎడ్ల డొక్కలు మాత్రం ఎండవా అంట"

"దేవుడు దయయుంటే దారే దొరక్కపోతుందా. ఆషాఢం ఎట్లాగో నెత్తిమీదకొచ్చిందా. జొన్న చొప్ప వేస్తాగా."

"ఏమన్నా అనుబాబూ. ఈ ఆవు నీదే. నీయిష్టంవచ్చినప్పుడొచ్చి తోలుకెళ్లు."

"అదికాదురా నాయనా. వేలంపాటలో ప్రక్కింటివాడి ఎద్దు చౌకగా వచ్చిందిగదా అని కొట్టేయించుకుంటావూ? నీ ఆవూ అంతే."

హోరీకి గొళ్లాడగొట్టి పుచ్చుకోగల శక్తిలేదు. వుంటే మాట్లాడకుండా దొరికిందేసందుగదా అని ఆవుని తోలుకెళ్లేవాడే. భోలా రొక్కం అడగడంలేదు. అతను ఆవునమ్మేది చిట్టికోసం కాదని హోరీకికూడా తెలుసు. అయితేనేం. కష్టాల్లో వున్నవాళ్ల వస్తువులు ముట్టుకోగూడదు. జన్మ జన్మాంతరాల నుండీ, అతని నరనరాల్లోనూ ప్రవహిస్తూన్న నీతి అందుకు అంగీకరించలేదు.

"అయితే చిట్టికోసం ఎవర్నన్నా పంపమంటావా" అన్నాడుభోలా గద్గదస్వరంతో. "ఆఁ ఇప్పుడు నేను దొరగారి దివాణానికని వెల్తున్నా. నేను వచ్చింతర్వాత పంపు యిప్పిస్తా" అన్నాడు హోరీ.

భోలా కళ్ళు నిండారినయి. "నువ్వివ్వాళ నన్ను గట్టెక్కిచ్చావు బాబూ. ఇప్పటికి తెలిసింది నాకు, నేనూ వొంటరివాణ్ణి కాదనీ, నా మంచి కోరేవాళ్ళుకూడా వున్నారనీనీ," అని ఒక్క క్షణం ఆగి "ఆ సంబంధంమాట మాత్రం మర్చిపోబాకు బాబూ !" అని హెచ్చరించాడు.

సరే లెమ్మంటూ హోరీ ముందుకు నడచాడు. అతని మనసేదో విచిత్రానందంతో కేరింతలు కొట్టింది. ఐదారు మణుగుల చిట్టు పోతేమాత్రం ఏం? వాడి కష్టాలు గట్టెక్కుతాయి కదా ! పాపం ! ఆవు నమ్మనలసిన అవసరం లేకుండా పోతుంది. చేతిలో నాలుగు రాళ్లాడినప్పుడే తోలుకు రావచ్చు ఆవుని. దేవుడి పుణ్యమా అంటూ వాడికి భార్య దొరికితే— చిక్కే వుండదు.

హోరీ ఒకసారి వెనక్కి తిరిగి చూశాడు. ఆ గంగిగోవు తోకతో ఈగల్ని తోలుకుంటూ, తలవూపుకుంటూ, మెల్ల మెల్లగా అడుగులు వేసుకుంటూ, వూగుతూ అందంగా నడచి వెళుతోంది. దాస దాసీ పరివేష్టితమైన రాణిలాగా వుంది. ఆ ఆవులమంద మధ్య నడచిపోతున్న ఆ గోవు ఆ కామధేనువుని తన దొడ్లో కట్టివేసుకునే అదృష్టం ఎప్పుడు లభిస్తుందో !

# 2

సేమ్రీ, బేలారీ అనే గ్రామాలు రెండూ అవధి ప్రాంతంలోనివే. బేలారీ హోరీ వుండే వూరు. రాయ్ సాహబ్ అమర్పాల్ సింహుడు సేమ్రీలో వుంటాడు. రెండు గ్రామాలకీ ఐదుమైళ్ళ దూరం వుంటుంది. క్రిందటిసారి జరిగిన సత్యాగ్రహంలో పాల్గొని, కౌన్సిల్ సభ్యత్వానికి రాజీనామా యిచ్చి, అమర్పాల్ గొప్ప ఖ్యాతి సంపాయించుకున్నాడు. ఆ దెబ్బతో ఆయిలాకాలోని ఆసామీ లందరూ ఆయన్ని గౌరవించటం మొదలు పెట్టారు. అంటే ఆసామీలంటే ఆయన కపరిమితమైన దయవుందనిగానీ, పన్నులు శిస్తులూ తేలిగ్గా వుండేవి కాబట్టి జప్తులూ, జుల్మానాలూ, నజరానాలు తక్కువ వుండేవనిగాని మనం పొరపాటు పడకూడదు. కాకపోతే ఆ తప్పంతా గుమాస్తాలమీదికీ, మున్సబులమీదికీ పోయేది. అయినా రాయ్‌సాహబ్‌ని పల్లెత్తుమాటకూడా అనేందుకు వీల్లేదు. ఆయనగూడా ఆ వ్యవస్థకి బానిసేకదా! చట్టం అంటూనూ, 'లా' అంటూనూ వుందిగా. దానిప్రకారం అందరూ నడచుకోవలసిందే. రాయ్‌సాహబ్ ఎంత మంచివా డైతేమాత్రం ఏం లాభం? అంచేతనే అధికారంలోనూ, రాబడి

లోనూ, ఆయన కేలోటూ కన్పించకపోవటమే కాకుండా మంచిపేరుకూడా దక్కించుకొంటున్నాడు. ఆ సామీలతో ఎంతో స్వతంత్రంగా నవ్వుతూ పేలుతూ మాట్లాడతాడు. అదిమాత్రం మాటలా? వేటాడే సింహం గర్జించుకుంటూ రొమ్ము విరుచుకొని తిరిగితే వేటకేం దొరుకుతుంది? అదే మెదలకుండా పడుకొని మంచి మాటలాడ్డం నేర్చితే కాలు కదుపకపోయినా దాని కడుపు నిండుతుంది. అడవంతా కాళ్లరిగేట్లు తిరగవలసిన, అవసరమూ వుండదు!

రాయ్‌సాహబ్ దేశభక్తుడు. ఐతే అధికారుల్తోగూడా కలిసిమెలిసి తిరుగుతూనే వుంటాడు. ఆయన కందే కానుకలకీ, ఫల పుష్పాలకి, నజారానాలకీ, ఆయన వుద్యోగుల కందవలసిన మామూళ్ళకీ ఏమీ లోటు కలిగేదికాదు. సాహిత్యం అంటే అమిత ప్రేమ. సంగీతం అంటే చెవికోసుకునేవాడు. నాటకాలన్నా మంచి యిష్టముంది. చక్కటి వ్యాసకర్త, ఉపన్యాసకుడు. మంచి వేటకాడుగూడాను. ప్రథమ పత్నీ వియోగం జరిగి పది సంవత్సరాలౌతున్నా యింతవరకూ ద్వితీయ వివాహం చేసుకోలేదు. ఆ ఏకాంత జీవితాన్ని సరదాగా మాట్లాడుతూ గడిపేస్తున్నాడు.

హోరీ అడుగు పెట్టేప్పటికి వూరంతా కోలాహలంగా వుంది. జ్యేష్టంలో వచ్చే దసరా పండగ జరిపేందుకు కావలసిన హంగామా అంతా జరుగుతోంది. నాటకాలకోసం పందిళ్ళూ, అతిథులకు చావళ్లూ, దుకాణాల బడ్డీలు వూరు నాలుగవైపులా తయారౌతున్నాయి. అంతా తిరునాళ్లాగా వుంది. ఎండ తీవ్రంగా కాస్తూన్నా లక్ష్యపెట్టకుండా దొరగారు పనులు పురమాయిస్తూ

తిరుగుతున్నాడు. ఆయన తండ్రిగారి దగ్గరనుంచి ఆ స్తితో పాటు భగవద్భక్తినిగూడా స్వీకరించాడు. ఈ వేడుకలు చూచేందుకు ఆయన స్నేహితులూ, అధికారులూ, బంధువులు, సకుటుంబ సమేతంగా తరలివస్తారు. బలగంగల కుటుంబంకదా. ఏడు తరాలనుంచీ వస్తున్న బంధుత్వంగూడా వుంది. అందులో ఒకరు రాధాదేవి వుపాసకులు; ఆయ నెప్పుడూ బృందావనం లోనే వుంటూంటాడు. భక్తిరసం చెప్పేవే గీతాలు వ్రాసి, వ్రాసినప్పుడల్లా అచ్చొత్తించి మిత్రబృందానికి పంచిపెడ్తూం టాడు. మరో ఆయన రామభక్తుడు; ఆయన రామాయణాన్ని పారసీ భాషలోకి అనువదిస్తున్నాడు. వీళ్ళందరికీ యిక్కడి కర్రతీసి అక్కడ పెట్టవలసిన పనిలేదు. వాళ్ళ జీవనభృతికూడా సంస్థానం ఆదాయంలోంచే ముట్టుతుండేది.

తానొచ్చినట్లు దొరగారి కెట్లా తెలియజెయ్యాలా అని ఆలోచిస్తూ నిలబడిపోయాడు హోరీ. ఇంతలోకే ఆయన అటే వచ్చేడు. హోరీని చూసీ చూడ్డంతోనే "అరే! వచ్చేశా వటోయ్! ఇంకా నిన్ను పిలిపించుదామనుకుంటున్నా. చూడు నువ్వు జనకమహారాజుగారి మాలివేషం వెయ్యాలి. జానకీదేవి దేవాలయానికి వెళ్తూన్నప్పుడు నీవా ప్రక్కనే నిలబడి ఆవిడ కొక పూలహారం సమర్పించాలి తెలిసిందా? ఇంకో మాట. ఆసామీ లందర్నీ యీ ఉత్సవాలు చూసేందుకు రావలెనని నా తాకీదుగా చెప్పు. రా లోపలికి వెళ్దాం. నీతో మాట్లాడ వలసిన పనుంది కొద్దిగా" అన్నాడు.

లోపలికి వెళ్ళింతర్వాత తాను కుర్చీమీద కూర్చొని, హోరీని కూర్చోమని నేలకేసి సంజ్ఞచేశాడు. హోరీ కూర్చున్న

తర్వాత ఆయన తన సంభాషణ ప్రారంభించాడు. "నేను చెప్పింది అర్థమైంది కదూ. ఉద్యోగస్థులు కూడా చేయగలిగిందేదో చేస్తారనుకో. ఎంత చెప్పినా నువ్వు రైతువి. రైతులు నువ్వు చెబితే వెంటనే వింటారు. ఈవారం లోపుగా మనం ఇరవై వేలైనా ప్రోగయ్యేట్లు చూడాలి. దొరగారు యీ గొడవంతా నాకెందుకు చెబుతున్నారా అనుకుంటావేమో. ఏమిటోగాని నువ్వంటే నాకు మంచి నమ్మకం ఏర్పడింది. నా మాటలు విని నువ్వు లోలోపల నవ్వుకోవు అని నా ధైర్యం. నువ్వొకవేళ నవ్వుకొన్నా నాకేమీ బాధ కలగదు. కాని నా సాటివాళ్ళు నవ్వితే మాత్రం నేను సహించలేను. వాళ్ళు ఈర్ష్యతోనూ, అసూయవల్లా, వ్యంగ్యంగా నవ్వుతారు. వాళ్లు మాత్రం ఎందుకు నవ్వకూడదు లే. వాళ్ళనుచూచి నేను మాత్రం నవ్వనూ - చూడు, హోరీ! సంపదకీ సహృదయతకీ బద్ధవైరం అనుకో. మేమూ దానధర్మాలు చేస్తాం. ఎందుకో తెలుసా? సాటివాళ్లకంటే మంచివాళ్లం అని బుజూ చేసుకునేందుకు. మా దానధర్మాలన్నీ శుద్ధ అహంకారాలు; పటాడంబాలు. సాటివాళ్లలో ఎవరిమీదైనా డిక్రీ జరిగితేనూ, జప్తులుగాని, ఖైదుగాని అయితేనూ, పెరిగిన పెద్దకొడుకు చనిపోతేనూ, ఇంట్లోవున్న విధవ లేచిపోతేనూ, వాళ్లింటికి నిప్పంటుకుంటేనూ, ఎవడైనా వేశ్యవలలో చిక్కి శంభయ్య అయిపోతేనూ, రైతుల్తో దెబ్బలు తింటేనూ, మిగతావాళ్లందరమూ కలసి పొట్టలు చెక్కలయ్యేట్లు నవ్వుకుంటాం. చూచి ఆనందిస్తాం. మళ్లీ ఎదురుబడితే అతనికోసం ప్రాణాలర్పిస్తామా అన్నంత ఆప్యాయంతో కౌగలించుకుంటాం. అంతేకాదు. ఇప్పుడింత

మంది బంధువులు, తిరిగేస్తే ఏడుతరాల యీ మధ్య ఏ సంబంధమూ కలవని బంధువులింతమంది, సంస్థానండబ్బు తింటూ, తాగుడూ, జూదమూ, వ్యభిచారమూ చేస్తూ దుర్వ్యయం చేసేవాళ్లున్నారే - వీళ్లందరికీ నేనంటే ఎంత మంటనుకున్నావ్! నేనివ్వాళ చనిపోతే దేవుడికి దీపారాధన చెయ్యాలని చూస్తారువాళ్లు. కష్టం వస్తే ఆదుకునేవాడొక్కడు లేడు. వీళ్లందరి దృష్టిలోనూ నేను పెళ్లి చేసుకోకపోతే స్వార్థపరుణ్ణి; చేసుకుంటే విలాసపురుషుణ్ణి. తాగకపోతే పిసినిగొట్టుని; తాగితే ప్రజల రక్తం తాగుతున్నాడంటారు. జల్సాగా వుండకపోతే రసికుడినికాదు; వుంటే డబ్బు విలువ తెలియని వాడని.

వాళ్లకున్నదల్లా ఒక్కటే యాతన. వీడితో డబ్బు ఎట్లా ఖర్చు పెట్టించాలి; వీళ్లేం చేస్తున్నా కళ్లుండీ గుడ్డివాడిలాగానూ, చెవులుండీ చెవిటివాడిలాగానూ వుండి వూరుకోవాలి: అన్నీ తెలిసి అసమర్థుడనైపోవాలి!" అని వూపిరి పీల్చుకోనేందుకా అన్నట్లు రెండు తమలపాకులు తీసి చుట్టుకొని నోట్లో వేసుకొన్నాడు. హోరీ యేమనుకుంటున్నాడో అన్నట్లు చూస్తూ కూర్చున్నాడు.

హోరీ ధైర్యంచేసి "ఈ లక్షణాలన్నీ మా వాళ్లలోనే వుంటాయనుకున్నాను. గొప్పగొప్ప యిళ్లల్లోకూడా అట్లాగే వుంటుందన్నమాట!" అన్నాడు.

"ఓరి పిచ్చివాడా! మేం గొప్పవాళ్ళం అనుకుంటున్నావా? పేరు గొప్ప; వూరు దిబ్బ! పేదవాళ్ళు స్వార్థం కోసం, పొట్టకోసం పెంచుకుంటారు యీర్ష్యలీ్షి, వైరాల్నీ.

వాళ్ళని క్షమించగలం. పొట్టగొడుతూంటే చూస్తూ చూస్తూ వూరుకో లేకపోవడంలో ఆశ్చర్యం ఏముంది? కాని మావాళ్లలా గాదు. ఈర్ష్యించీ, వైరం తెచ్చుకునీ ఆనందిస్తారు. ఎంత కుత్సితమూ, నైచ్యమూ వుంటే అంత గొప్ప. ఇతరులు ఏడుస్తూంటే చూస్తూ నవ్వుకోగల దేవాంశసంభూతులమోయ్ మేము! ఇం తెందుకు? మాదెంత పెద్ద కుటుంబమో చూస్తూనే వున్నావుగా. ఎప్పుడూ ఎవళ్లో ఒకళ్లు మూలుగుతూనే వుంటారు. పెద్దవాళ్ళంగదా మేము. అందువల్ల మాకొచ్చే జబ్బులు గూడా గొప్ప గొప్పవే. మామూలు జబ్బులొచ్చే వాళ్ళు గొప్పవాళ్లెలా ఔతారు. ఇతరులకొచ్చే సామాన్య జ్వరమే మాకొస్తే సన్నిపాతం వచ్చిందంటారు. అందరికీ వచ్చేదాన్ని దగ్గంటే మాకొచ్చేదాన్ని క్షయ అంటారు. ఇం కేముంది శెలి గ్రాములిచ్చి సర్జన్లని పిలిపించాలి. ఢిల్లీ వెళ్ళి యూనానీ వైద్యుణ్ణీ, కలకత్తా వెళ్ళి భిషగ్వాచార్యుణ్ణీ పిలుచుకురావాలి సొస్తుంది. అం తేకాదు. దేవాలయాల్లో దుర్గపూజ, ఇంట్లో భూత వైద్యుడి స్తోం, హోంలు. దొరగారిని యమధర్మరా జెత్తుకొని పోతాడేమోనని బంధువర్గం అంతావచ్చి ఆప సోపాలు పడుతూంటారు. ఈ మహాకుటుంబంలో ఎప్పు డెవరికి తలనొప్పి వస్తుందా? ఎప్పుడు తమ జేబులు నిండుతాయా అని వైద్యులూ, డాక్టర్లూ కాచు కూర్చుంటారు. వీళ్ళకిచ్చే డబ్బంతా ఎవరిదో తెలుసా? లాఠీలు చూపించి మీ దగ్గర నుంచి వసూలుచేసే డబ్బే! మీ నిట్టూర్పులూ, మీ దుఃఖానలమూ మమ్మల్ని దహించివేయ దేమాఅనిఅప్పుడప్పుడూ ఆశ్చర్యపోతూంటా నేను. అయినా ఆశ్చర్యపడవలసిన అవసర

మేముందిలే. భస్మీపటలం అయ్యేందుకు మాత్రం ఎంతకాలం కావాలి ? మీదుఃఖానలంచూచి మీ హాహా కారాల్ని చూచి మమ్మల్ని మేం రక్షించుకోవాల్సనేగదా మేం యీ పోలీసుల వెనకా, ఈ కోర్టుల వెనకా, యీ ప్లీడర్ల వెనకా దాక్కొంటూన్నది. అందమైన రూపాన్నమ్ముకునే స్త్రీ లాగా అందరి చేతుల్లోనూ కీలుబొమ్మలమై కూర్చున్నాం. ప్రపంచ మేమో మే మెంతో సుఖపడుతున్నాం అనుకొంటుంది. జమీందారీలు పెద్దపెద్ద మేడలు, పల్లకీలు, మందీ మార్బలం, అప్పులూ, వేశ్యలూ అన్నీ వున్నయి మాకు. కాని లాభ మేముంది ? మా ఆత్మకు బలం లేదు; అభిమానం లేదు. ఇంకా మేం మనుష్యులం ఎట్లా అవుతాం ? శత్రువు లేం చేస్తూన్నారోనని ఆలోచిస్తూ రాత్రిళ్ళు నిద్రపోం. మా కేదైనా కష్టమొస్తే అందరూ ఆనందించేవాళ్లే; పాపం అనేవాళ్లొక్కళ్ళుండరు. భోగవిలాసాల మత్తులో మమ్మల్ని మేమే మరచి పోతాం. మా క్రిందవాళ్ల రక్తం పీలుస్తాం; మా పైవాళ్లముందు మోకరిస్తాం. ఇంక మాకు సుఖమెక్కడిది? మా అంత దౌర్భాగ్యులు దేశంలో ఎవ్వరూ వుండరు. పై అధికారు లొచ్చారూ అంటే - వాళ్ళు వేటకోసం వచ్చినాసరే, తనిఖీకని వచ్చినాసరే-వాళ్ళ అడుగులకి మడుగులొత్తుతూ తిరగవలసిందే. వాళ్ళు కనుబొమలు ముడిచారో మా పైప్రాణాలు పైనేపోతాయి. ఇదంతాచెబితే నువ్వు నమ్మలేవు కాని వాళ్లకి నమస్కారాలూ, నైవేద్యమూ పెట్టటంతోనే మా బ్రతుకుకాస్తా తెల్లవారుతోంది. వారిముందు కుక్కల్లా తోకలాడిస్తూ తిరుగుతాం. వాళ్ల అండచూచుకొని ప్రజల

మీద సవారీ చేస్తాం. మాకున్న ఆస్తి పాస్తులన్నీ తీసుకుని ఎంతో కొంత జీవనభృతియిచ్చే ప్రభుత్వం ఏదైనావస్తే చేయెత్తి నమస్కారం పెట్టాలె ననిపిస్తోంది నాకు. మావర్గం ఎలాగో ఇక నిలవదనిపిస్తోంది యిప్పటి లక్షణాలన్నీ చూస్తూంటే. ఆ రోజు ఎప్పుడొస్తుందా అని చూస్తున్నాను నేను. ఆనాడే నిజంగా మాకు ముక్తికలిగేది. మేము పరిస్థితులకి బానిసల మైపొయ్యా మోయ్! ఈ పరిస్థితులే మమ్మల్ని సర్వనాశనం చేస్తున్నాయి. ఈ సిరిసంపదలు మా కాళ్లను పెనవేసుకుని వున్నంతకాలం, ఈ శాపం మా తలమీద చక్రబంధం వేసివున్నంతకాలం మేం మానవులం కాలేం. మాకు మోక్షంలేదు.''

మళ్ళీ రెండు చిలకలు చుట్టుకొని నోట్లో వేసుకున్నాడు రాయ్ సాహెబ్. ఇంకా యేదో మాట్లాడాలని అనుకొంటూండ గానే ఒక బంట్రోతు వచ్చాడు. వచ్చి "అయ్యా! కూలాళ్ళు పని సెయ్యం అంటున్నారండి, అన్నం పెట్టందే యీడున్న పుల్లి ఆడ పెట్టం అంటన్నారండి. మేం నాలుక్కేక లేస్తే పని సెయ్యటవేఁ మానేసారండి!" అన్నాడు.

రాయ్ సాహెబ్ కి పట్టలేనంత కోపం వచ్చింది. కళ్ళురు ముతూ "ఈ వెధవలకి బుద్ధి చెప్పాలి. పని చెయ్యకేం చేస్తారు? ఎప్పుడూ లేనిది యిప్పుడెందుకు పెట్టాలి వీళ్ళ కన్నం? ఎప్పటి లాగానే అణా కూలీ యిస్తాం. చేస్తే చేస్తారు. లేకపోతే వీళ్ల తాతలు దిగొచ్చి చేస్తారు" అన్నాడు.

హోరీవంక చూస్తూ "సరే హోరీ! ఇంక నీ వెళ్లవచ్చు. అంతా సిద్ధంచెయ్యి. నేను చెప్పినమాట మాత్రం మరచిపోకు

సుమా! ఎంత లేదన్నా అయిదువందలైనా వసూళ్లు రావాలి మీవాళ్లలో" అన్నాడు. అని రుసరుసలాడుతూ బయటికి వెళ్ళిపోయాడు.

హోరీకి ఆశ్చర్యమేసింది. ఇప్పటిదాకా ఆడిన ధర్మపన్నాలేమిటి! ఇప్పుడీ రుసరుస లేమిటి!

సూర్యుడు నడినెత్తిమీది కొచ్చాడు. నేలంతా వణుకుతూన్నట్లుంది. హోరీ చేతికర్ర పుచ్చుకుని యింటిముఖం పట్టాడు: ఈ అయిదువందలూ ఎట్లా వసూలు అవుతాయిరా భగవంతుడా అనుకుంటూ.

# 3

హోరీ గ్రామం పొలిమేరలోకి అడుగుపెట్టాడు. గోవర్, అతనితోపాటు ఆడుపిల్లలిద్దరూ యింకా పొలంలో పనిచేస్తూనే వున్నారు. ఈ చెవివడ ఆ చెవికి తగులుతోంది. గాలి నిప్పులు చెరుగుతోంది. వీళ్లింకా పొలంలోనే వున్నారు. వీళ్లకి ప్రాణాలంటే తీపిగూడ లేకుండా పోయిందేమిటి ? పొలం దగ్గరికి వెళ్ళి కదలవేంరా గోవర్. ఇక్కడే మీంటేసు కూర్చుంటావేంరా ?" అని కేక వేసాడు హోరీ.

తండ్రి కేకలు విని ముగ్గురూ చేతిలో పని వదలి యింటి ముఖం పట్టారు. గోవర్ చామనచాయగా, బారుగా వుంటాడు. అతనింతసేపూ పొలంలో వున్నది పని చెయ్యాల్సనీగాదు; పనంటే యిష్టం వుండీకాదు. 'నేను అన్నం అంటే పడి చచ్చే మనిషీనికాదు' అని చెప్పేందుకా అన్నట్లు చేస్తాడు. పని పెద్ద కూతురు సోనాగూడ చామనచాయగానే వుంటుంది. వయస్సు వచ్చిన పిల్ల. ఎర్రచీర మోకాళ్లపైన త్రిప్పి గోచీ పెట్టుకొని వుంటం మూలాన ప్రౌఢలాగా కన్పిస్తోంది. చిన్నపిల్ల రూప చిన్నపిల్లే. వల్లంతా మట్టి; జీబురుతల, ఒక చిన్న పరికిణి మాత్రం కట్టుకుంది.

రూప తండ్రి కాళ్లకి అడ్డంపడి "చూడు నాన్నా! నే నొక్క మట్టిగడ్డకూడ వదలిపెట్టలేదు. అక్కాయేమో వెల్లి చెట్టుక్రింద కూచోమంటుంది. నాన్నా గెడ్డలన్నీ చితగొట్టక పోతే చేను బాగుపడతం దేమిటి!" అంది.

హోరీ పిల్లని అందుకుని భుజంమీద కూర్చోబెట్టు కున్నాడు. "మాతల్లి బంగారం కాదూ. పనంతా చక్కగా చేస్తుంది" అని ముద్దుసుకున్నాడు. ఇంతవరకూ మాట్లాడకుండా వూరుకున్న గోవర్ "రోజూ యిట్లా యీ దొరలచుట్టూ కాళ్ళరిగేట్టు తిరగటం ఎందుకు? శిస్తు చెల్లించకపోతే ఎట్టాడు పనుగెత్తుకొస్తాడు. నానా మాటలూ అంటాడు. మామూళ్లూ నజరానాలు యివ్వకా తప్పదాయే. ఇచ్చేది యిస్తానూవుండి యీ వంగి వంగి దణ్ణాలు పెట్టడం ఎందుకు?" అన్నాడు.

హోరీ గూడ అదే అనుకుంటున్నాడు. అయినా కుర్ర వాళ్ళకి అలుసివ్వటం మంచిదికాదు! "దణ్ణాలు పెట్టకపోతే ఎట్లాగరా. ఎవరి కర్మ వాళ్ళది. అట్లా వెళ్తూండబట్టే గదా మొన్న యింటిముందు మట్టి తోలుకున్నా మున్సబు మాట్లాడ కుండా వూరుకున్నాడు. అదే ఎవళ్ళైనా చేస్తే యీపాటికి జుల్మానా వేసేసేవాళ్ళు. నేనుమాత్రం వూరికే వెళ్తున్నానా. ఏదో దేవుడి దయవల్ల యింకా కాళ్ళల్లో ఓపిక చావలేదు గదా. ఆరి పిచ్చొడా. వెళ్లి వంగి వంగి సలాం చెయ్యటం అంటే నాకుమాత్రం యిష్టమా? వెళ్లినప్పుడల్లా దొరగారి దర్శనం అయి చచ్చింది! ఆయన ఇష్టమైతే దర్శనం యిస్తాడు. లేకపోతే మళ్ళీ రా అంటాడు......

"ఆఁ! గొప్పగొప్పవాళ్ల వెనక వెనకే తిరగడంగూడా గొప్పేలే! అదేమన్నమాట..." అంటూ ఎత్తిపొడిచాడు గోవర్.

"అంతే లేవోయ్. కబుర్లకేం. కబుర్లందరూ చెబుతారు. నెత్తిమీద కొస్తేగాని తెలిసిరాదు ఎవళ్లకైనా. నేనూ మొట్టమొదట నీకుమల్లేనే అనుకునేవాణ్ణి. ఇప్పటికి తెలిసొచ్చింది నాకు. మన ప్రాణాలు వాళ్ల గుప్పెట్లో వున్నయ్. మనం నిక్కేం లాభం? నీలిగేం లాభం?"

తాననవలసినమాట కాస్తా అనేసినట్లు సంతృప్తిగా నడుస్తున్నాడు గోవర్. "నీకు కాళ్ళు లేవా ఏమిటే భుజాలెక్కి కూర్చున్నావు. దిగి నడవరాదూ?" అన్నది సోనా రూపతో.

రూప తండ్రిని మరింత కరుచుక్కూర్చుంది. "నే దిగనుపో. చూడు నాన్నా నన్ను దిగమంటాది. నేను దిగనే దిగను" అన్నది రూప. అది "అదికాదు నాన్నా నేను నీ భుజాలెక్కానని అక్కాయికోపం వచ్చింది నాన్నా" అన్నది.

"దిగొద్దులే తల్లీ. కోపంవస్తే వెళ్లి కాలవలో దూకమను" అని బుజ్జగించాడు తండ్రి. ఇక రూపని పట్టేందుకు పగ్గాల్లేకుండా పోయాయి. ఆ వుత్సాహంలో జర్రున క్రిందికి జారి "కోపం వస్తే - కాలవలో - దూకు" అంటూ చప్పట్లు చరుస్తూ అందరికంటే ముందు గంతు వేసుకుంటూ పరుగెత్తింది.

ఇంటికి వెళ్లేప్పటికి ధనియావాకిట్లోనే కూర్చునివుంది. ఏం పనిరా. తిండీ తిప్పలూ లేకుండానూ." అని కొడుకుని కోప్పడింది. "పొలం ఎక్కడకన్నా పారిపోతందనుకున్నావా.

వూరెళ్లినవాడివి మళ్లీ పొలం ఎందుకెళ్లా?" అని భర్తని మందలించింది.

నుయ్యి వాకిట్లోనే వుంది. తండ్రీకొడుకులు రెండు బొక్కెన్ల నీరు తలలమీద గుమ్మరించుకుని, ఒక బొక్కెనడు రూప నెత్తిమీదపోశారు. స్నానాలయిం తర్వాత అందరూ భోజనానికి కూర్చున్నారు. జొన్నరొట్టెలు గోధుమ రొట్టెల్లా తెల్లగా మెరుస్తున్నాయి. మామిడి చిగురు వేసిన కందిపప్పుకూర• రూప తండ్రి పళ్లెంలో కలబడి తింటూంటే "ఏమి సంబడమే!" అని చూస్తున్నట్లు కూర్చుంసోది సోనా.

"దొరగా రేమన్నాడు?" అని అడిగింది ధనియా. గ్లాసులో మంచినీళ్ళు గటగటా త్రాగి "ఆఁ ఏముంది అన టానికి. తాసీళ్ళూ; వసూళ్ళూ!. మనమేమో వాళ్ళంతా హాయిగా వుంటారనుకుంటాం కాని మనకంటే కనాకష్టం వాళ్ళు. మనకంటే పొట్ట ఎట్లా గడుస్తుందా అన్న చింత ఒక్కటేగాని, వాళ్లకన్నీ చింత లే. మనమే నయం అనుకుంటా" అన్నాడు హోరీ.

రాయ్ సాహబ్ చెప్పిందంతా హోరీకి గుర్తురాలేదు కాని తానన్న మాటల్లో ఆయన చెప్పిందంతా యిమిడే వున్న దని భావించాడు హోరీ.

గోవర్ మళ్ళీ ఎత్తిపొడిచాడు. "అట్లాగా? పాపం! అయితే ఆయన ఆస్తంతా మనకిమ్మను. మన గొడ్డూ, గాదా, పలుగులూ, పారలూ ఆయన కిచ్చేద్దాం. ఏసుకుంటాడా మారకం? అంతా వేషాలుకాని మెదిత్తే మోటూరుల్లోనూ,

బంగాళాల్లోనూ తిరిగేవాడికీ, హల్వా పూరీలు తినేవాడికీ, భోగంమేళాల్లో కూర్చునేవాడికీ కష్టమంట కష్టం. ఒకేపున జల్సాగా తిరుగుతానే వుంటారు; అబ్బా! అమ్మా! అంటా వుంటారు.''

కొడుకు మాటలు వింటూంటే తండ్రికి కంపరమెత్తింది. ''మాటలు నేర్చుకున్నావులేరా. ఎవళ్ళ దెవళ్ళొదిలి పెట్టార్రా? మనం వ్యవసాయం చేస్తున్నాం, ఏం మిగులుతోంది? రోజుకి అణా కూలీగూడా పడదాయె. నెలకి పదిరాళ్ళు తెచ్చుకునే నౌకర్లే మనకంటే మెరుగ్గా వుండిరి! మనకంటే బాగా తింటారు; తిరుగుతారు. అందుకని మనం పొలా లొదిలిపెట్టు కుంటున్నామా? వ్యవసాయంలోవున్న మర్యాద వుద్యోగంలో ఎక్కడుంటుంది అనేగా మనం వదిలిపెట్టుకోంది! జమీందార్లూ అంతే. అధికార్లొస్తే అణిగి మణి గుండాలా! టీ పార్టీలూ, భోగం మేళాలు అన్నీ ఏర్పరచాలా! కాస్త ఎగుడూ దిగుడూ అయితే కోర్టుల కెక్కాలా? మనమేనయం. బాగా అయితే నాలుగు మాటలు నన్నూ కాదనుకుని వింటే సరిపోయె!

తండ్రి చెప్పిన మాటలు కొడుక్కి నచ్చలేదు. అదంతా వొఠిదనుకో. మనకి కట్టుకోడానికి అతుకుల్లేని గుడ్డలుండవు. గింజలేరుకుని అన్నం తినాలి. రాత్రీ పగలూ అనకుండా వళ్ళంతా నుగ్గూ, నూచమూ చేసుకున్నా కడుపు నిండదు. వాళ్ళకేం? మహారాజులు! పట్టెమంచాలమీద పవ్వళిస్తారు. ఇంటినిండా నౌకర్లూ,చాకర్లూ కడుపులో చల్ల కదలవలసిన అవసరం లేదు. డబ్బు ఖర్చుపెడ్తూ కాలుమీద కాలేసుక్కూర్చుంటారు. ఇంకా మిగలమంటే ఎక్కడ్నుంచీ మిగుల్తుంది?''

"అయితే ఏమిట్రా నువ్వనేది? మనకీ వాళ్ళకీ తేడా లేదంటావ్?"

"దేవుడు అందర్నీ ఒకే మాదిరిగా పుట్టించాడు."

"అదికాదురా బాబూ! చిన్నా పెద్దా దేవుడి దగ్గర్నించే తయారై వస్తారు. డబ్బు ఎంతో తపస్సు చేస్తేగాని దొరకదు. పూర్వజన్మలో ఏం నోములు నోచారో వాళ్ళీరోజున సిరిసంపదల్తో తులతూగుతున్నారు. మనకర్మ మనం అనుభవిస్తున్నాం."

"నే నొప్పుకోన్నా నా! భగవంతుడికి మన మందరమూ ఒకటే. ఇక్కడికొచ్చిం తర్వాత బీదవాళ్ళని పీల్చే దుర్మార్గు లందరూ ధనవంతు లౌతారు."

"ఇదంతా నీ భ్రమరా నాయనా! దొరగా రిప్పటికీ ఎట్టా లేదన్నా రోజుకి నాల్గు గంటలు భగవద్భజన చేస్తా వుంటారు"

"ఈ దానధర్మాలూ, పూజాపునస్కారాలూ ఎందుకు చేస్తన్నాడంటా?"

"మంచాడు కాబట్టి."

"అతనుకాదు మంచాడు. రైతులూ, కూలాళ్ళూ మంచివాళ్లు కాబట్టి. లేకపోతే యీ పాపపు డబ్బు జీర్ణం యెట్లా ఔతుంది? ఏమీ పనిచెయ్యకుండానే డబ్బొచ్చిపడే దారుంటే అందరూ చేస్తారు పూజాపునస్కారాలు. మనలాగా పస్తులుండి పూజలు చెయ్యమను కనబడుతుంది. ఒక్కనా డొచ్చి పొలంలో నడుంవంచి పనిచెయ్యమన్ను యీ పూజా పునస్కారాలన్నీ ఎగిరిపోతయి."

తండ్రికి జవాబేమని చెప్పాలో అర్థం కాలేదు. "సీతో ఎవళ్లు మాట్లాడగల్రులేరా. నువ్వు దేవుడు చేసేదానికూడా వంకలు పెడ్తాంటివి" అని తప్పించుకున్నాడు.

కాస్సేపున్న తర్వాత కొడుకు పలుగూ పారా పుచ్చుకుని పొలానికని బయల్దేరాడు. "కాస్త ఆగరానాయనా. నేను గూడా వస్తన్నా. ఇంతలో కాస్త చిట్టుతీసి బయటపెట్టు. పాపం ఆ భోలా మా యిబ్బంది పడుతున్నాడు. నేను సస్తుతాలెమ్మని మాటిచ్చాను" అన్నాడు తండ్రి.

"అమ్మటానికి మనదెగ్గరెక్కడుంది!" అన్నాడు కొడుకు అయిష్టంగా.

"అమ్మటంలేదులేరా ఏదో యిబ్బంది పడుతున్నాడని.."

"మనం పాడిలేక యిబ్బంది పడుతున్నాంగా ఆవునితోలి పెడతానన్నాడా!"

"తోలిపెడతానన్నాడు. నేనే వద్దులెమ్మన్నా." ఇంతలో యింట్లోనుంచివచ్చిన తల్లి అందుకున్నది. "తోలిపెట్టకేం. తోలిపెడతాడు. కలిగ్గానికూడా గరిటెడుపాలు పొయ్యడు కాని ఆవుని తోలిపెడతాడంట ఆవుని" అని దీర్ఘాలు తీసింది.

హోరీ ఒట్టు పెట్టుకున్నాడు. "నాతోడంటే నమ్మవే అడిగిన ఆవునిస్తానన్నాడే. పాపం యిబ్బంది పడుతున్నాడా! ఆవునమ్ముకుని చిట్టూఅది కొనుక్కోవాలనుకున్నాడు. ఆపదలో వున్నాడి ఆవుని తీసికోటం ఎందుకులే అని నేను పంపిస్తాలే, చేతులో నాలుగు రాళ్లున్నప్పుడే తోలికెళ్తాలే అవుని అన్నాను. ఆవంటే ఏమావనుకున్నావు. బంగారంలాంటి ఆవులే. ఎనభై రూపాయలు."

కొడుక్కి కోపంవచ్చింది. "మూలావు ధర్మాత్ముడివి బయల్దేరావులే. ఇట్లాచేసికాదూ యీ తిప్పలన్నీ తెచ్చిపెట్టింది? ఆవు ఎనభై రూపాయలైతే చిట్టు యిరవై రూపాయలు. ఆవుని తోలిపెట్టమను మిగతా అరవయ్యీ వీలున్నప్పుడు యిద్దాం" అన్నాడు!

"నేనుమాత్రం తక్కువతిన్నానంట్రా. వాడికీ ఏదో ఒక సంబంధంమాస్తా. ఆ మూడుముఖ్యా; ఈ చిట్టూ వూరికే పోవులే" అని కిలాడి నవ్వినట్లు నవ్వాడు.

"అయితే యిక వూళ్ళోవాళ్ళందరికీ సంబంధాలు కుదర్చటమేనన్నమాట నీపని!" అని వెటకారంగా అన్నాడు కొడుకు.

"ఆఁ ఇక ఇదొక్కటే తక్కువయ్యింది. చిట్టూ యివ్వొద్దు, పొట్టూ యివ్వొద్దు. ఈ భోలాకి భీలాకీ మనమేమీ బుణపళ్ళా అవీ యివీ కట్టబెట్టడానికి" అని మూతి విరుచుకున్నది ధనియా.

"అదీకాదే. ఒకళ్ళయిల్లు నిలబెట్టటం మంచిదేగదంటే" అని సద్దుకున్నాడు హోరీ.

కొడుక్కీ సంభాషణ వింటూంటే కంపరమెత్తింది. అందుకనే అక్కడనుంచి లేచివెళ్ళి దూరంగా కూర్చున్నాడు.

"ఒకళ్ళఇల్లు నిలబెట్టేవాళ్ళు ఎనభైరూపాయల ఆవుని తీసుకుని వూరుకోరు. సంచెడుడబ్బు పుచ్చుకుంటారు. తెలుసా!" అన్నది ధనియా.

ఆ మాత్రం నాకూ తెలుసులేవే. చూచా, మనిషి గూడా మా మంచాడులే. ఎప్పుడు కనబడ్డా నీఅంత మంచిది

లేదని చెబుతాడు. నువ్వు లక్ష్మీదేవివంట. ఎంతో మంచిదాని వంట."

ఆ మాటలు యింకోసారి అనిపించుకొని వినాలనుకున్నది ధనియా. కాని తన కేమీ పట్టనట్లు "ఊం ఆ అబ్బాయి పొగడ్తే దనే ఏడుస్తున్నా" అన్నది పైకి.

"నేనూ అదే అన్నా. 'అదెక్కడి ఆడది. ఊపిరి సలప నివ్వదురా. నోరు కదిపితే చాలు శాపనార్థాలు పెడతంది' అన్నా వింటేనా ? 'ఆయమ్మకి చేయెత్తి మొక్కాలిసిందే. లక్ష్మీదేవనుకో; అంటాడు. నా మాటే వినిపించుకోడు. అసలు భోలా పెళ్ళాం వుందే కాస్త గయ్యాళిలే. అందుకనే పాపం యింటిపట్టునేవుండేవాడు గాదు. 'మీ యిల్లాలి మొహంచూస్తే పాపాలన్నీ పోతయి. అనుకున్న పనల్లా జౌతుంది' అంటాడు. 'ఓరి నీ దుంపతెగ ! దాని మొహంచూస్తే అయ్యే పనిగూడా అగిపోతందిరా ! అని నేనంటా.'

"నీ అదృష్టం అట్టాంటిదైతే నేనేం చేస్తాను !"

"పాపం. వాడి పెళ్ళాం పేరెత్తితే చాలు తిట్లు లంకించు కునేవాడు. పిల్లికూడా బిచ్చంపెట్టేది కాదంట. ఉప్పుదగ్గర్నుంచీ, నిప్పుదగ్గర్నుంచీ పొరుగిళ్లకెళ్లి అప్పులు తెచ్చేదంట."

"చచ్చిపోయినవాళ్లని అనకూడదుకాని నన్నుచూస్తేనే కళ్ళల్లో నిప్పులు పోసుకునేది."

"భోలా మంచివాడులే. అందుకనే దాంతో కాపరం చెయ్యగల్గాడనుకో. ఇంకొకడెవడన్నా అయితే విషంతాగి చచ్చేవాడు. ఎట్టా లేదన్నా నాకంటే పదేళ్లు పెద్దాడా. అయినా సరే ముందు తనే పలకరిస్తాడు నన్ను ఎక్కడ కనబడ్డా."

"అయితే ఏమంటాడూ. నాముఖం చూస్తే అనుకున్న పని అవుతుందంటాడూ!"

"ఆవేళ దేవుడేదో ఒక మేలు చేస్తాడన్నాడు."

"పాపం! కోడళ్ళూ అట్లాంటాళ్లే దొరికారు. ఒకటే అప్పులు ......"

అంటూ ధనియా మాట్లాడుతూండగానే గోవర్ లేచి "ఇదిగో భోలా వచ్చేస్తున్నాడు. పదిపది హేను కట్టలిచ్చి పంపించెయ్యి" అన్నాడు.

పెద్దమనిషి యింటి కొస్తాంటే అయ్యేం మాటల్రా. వాకిట్లో మంచంవాల్చు. చెంబుతో నీళ్ళు తెచ్చియ్యి. కాళ్ళు కడుకుంటాడు. కష్టం వొచ్చినప్పుడు ఆదుకోపోతే ఎట్లారా! దాహం కావాలేమో అడుగు" అన్నది ధనియా.

"దాహంలేదు గీహంలేదు. ఎరగని చుట్టమంటలే" అన్నాడు హోరీ.

ధనియాకి కోపంవచ్చింది. "ఎరగని చుట్టంగాక ఎరిగిన చుట్టమా యేంటి? రోజూ రాబొయ్యాడా నీ యింటికి? పాపం ఎండలోపడి నడిచొస్తాంటే దాహం యియ్యకపోతే యెట్లా? రూపా ఇట్రాఅమ్మా. కోమటింటికెళ్లి ఒక అర్ధణా పంచదార పట్టుకురా. లస్సీ చెయ్యాలి."

భోలాకి ఈ రోజున జరిగినంత మర్యాద మరెప్పుడూ జరగలేదు. గోవర్ మంచం వాల్చాడు. సోనా లస్సీ చేసింది. రూప పొగాకుపాయ అందించింది. ధనియా తలుపుచాటున నిలబడి తననిగురించి ఏమంటాడోనని చెవులు చేటలు చేసుకొని చూస్తోంది.

భోలా చుట్ట చుట్టుకుంటూ "మంచియిల్లాలు, యింట్లో అడుగు పెడితేనేచాలు. ఇంకేంకావాలి? ఆవిడకే తెలుస్తుంది ఎవళ్లనెట్టా మర్యాద చెయ్యాలిసిందీని" అన్నాడు.

ఈమాటలు వింటూన్న ధనియామ్ముఖం చేటంతయ్యింది.

భోలా తెచ్చిన తట్టపట్టుకొని హోరీ యింట్లోకివెళ్లాడు. భార్యనిచూచి "చూశావే! ఎంతపెద్దతట్ట పట్టుకొచ్చాడో. ఎక్కడదొరికిందోగాని యిందుట్లోనే యిరసదా కాపట్టేటట్టుంది" అన్నాడు.

ధనియా తన్మయత్వంలో వుంది. "ఏంతెస్తే. నీకోసమని పువ్వులు కోసుకొచ్చాడా చిన్నబుట్ట తేటానికి. ఇచ్చేవాడివి పాపం! కావాలసినంతా యివ్వు. మళ్లీ యిందుట్లో కొసరెందుకు. పాపంకొడుకుల్నన్నా పిల్చుకురాలేదు: ఒక్కడూ ఎట్టాపట్టికెళ్తాడో ఏమో!"

"కావాలిసినంతా నే నెక్కడ తేగలనే!"

"లేకపోతే ఒక తట్టిచ్చి పంపుతావా? అబ్బాయినక్కూడా ఒక్క తట్టెడిచ్చిపంపు."

"వాడు పొలం వెళ్ళాలిగా!"

"ఒకనాడెళ్ళకపోతే ఏమీ మునిగిపోదు లెద్దూ."

"అంత కావాలిసుంటే కొడుకుల్నే తెచ్చుకునేవాడుగా!"

"ఇంటో లేరేమో. బజారుకి పాలుపట్టుకెళ్ళారేమో"

"బాగానేవుంది! ఇచ్చేది ఇవ్వటమే కాకుండా యింటిదాకా పట్టికెళ్ళి యిచ్చిరావాలీ?"

"వొద్దులేబాబూ! మీరెవ్వరూ వెళ్లొద్దు. ఎట్టాగొట్టా తిప్పలు నేనే పడతాలే."

"అదికాదే- మూడుతట్టలిస్తే మనకేం మిగులుతుందీ అని."

"ఆమాట మొదటే ఆలోచించుకోకపోయా."

"ఆసి నీదుంపతెగ! అందుకని యిల్లంతా దోచిపెట్టా వంటే?"

"జమీందారుగారైతే ఏం చేస్తా. నువ్వెత్తుకుని, కొడుకు నెత్తినా, కూతుళ్ల నెత్తినా ఎత్తి బయల్దేరేవాడివి కాదూ?"

"జమీందారుగారి మాట వేరు!"

"కాదూ మరి! కర్రపుచ్చుకుంటాడాయె."

"అదికాదే. ఆయన పొలంచేసుకుంటున్నామూ మరి!"

"ఏం పొలంచేస్తే? శిస్తు కట్టటంలా?"

"అంతేలేవే. ప్రాణాలు కొరుక్కుతినకే. వెళ్తాంలే. నేనూ, అబ్బాయీ యిద్దరమూ వెళ్తాం.

మూడుతట్టలూ నిండినయి. కొడుక్కిదంతాచూస్తూంటే ఏమిటోగా వుంది. వాళ్లనాన్న చేసే వ్యవహారాలంటే అతని కేమీ గౌరవంలేదు. ఆయన చేసే పనులన్నీ నష్టమేనని అతని అభిప్రాయం. ధనియాకి హాయిగానే వుంది. ఇక హోరీ వున్నాడంటే - అతను చేసేది ధర్మంకోసమో, స్వార్థంవల్లనో అతనికే తెలియలేదు.

తండ్రి కొడుకులు తోడుపట్టి ఒక తట్ట వాకిట్లోకి పట్టుకొచ్చారు. భోలా పైపంచితీసి చుట్టచుట్టి నెత్తిమీద పెట్టుకుని "ఈ తట్ట యింటిదగ్గరపెట్టి యిక్కడున్నట్టువస్తా. ఇంకో తట్టెడు పట్టుకెళ్తా" అన్నాడు.

"ఒక్కటేమిటి? ఇంట్లో యింకా రెండు నిండివున్నాయి. నువ్వురానూవద్దూ; పెట్టావద్దు. మేంయిద్దరం చెరొకటీ ఎత్తు కొస్తాం. అందరం కలసి వెళ్దాం" అన్నాడు హోరీ.

భోలా తన్ను తాను నమ్మలేకపోయాడు. తనతోడ బుట్టిన వాడు చేయని సహాయం చేస్తున్నాడు హోరీ. అప్పుడతనికి కలిగిన సంతృప్తి అతని జీవితాన్నంతా హర్ష పరిప్లావితం చేసింది.

తట్టలు నెత్తినెత్తుకుని బయల్దేరారు ముగ్గురూ.

"దసరా దగ్గరకొస్తోంది. దొరలు మహాజల్సా చేస్తారు" అన్నాడు భోలా.

"పందిళ్లూ, పాకలూగూడా వేసేశారు. నాటకంలోనేనూ వేషం వేస్తున్నా. జనకమహారాజుగారి మాలివేషం వెయ్యమని మా పట్టు పట్టారు జమీందారుగారు" అన్నాడు హోరీ.

"ఔన్లే జమీందారిగారికి నువ్వంటే యిష్టంగామరి."

"ఏమిటోలే వారిదయ!"

కాస్సేపెవరూ మాట్లాడల్లేదు. "సరేగాని మరి చందా సంగతేమన్నా చూస్తున్నావా? మాలివేషం కట్టినంత మాత్రాన వూరుకోరుగా జమీందారు!" అన్నాడు భోలా.

హోరీ కారే చెమట తుడుచుకున్నాడు. "అదేనయ్యా బాబూ! పండిందికాస్తా కల్లంలోనే అమ్మేశాను. జమీందారు భాగం జమీందారు తీసుకున్నాడు. షావుకార్లసొమ్ము షావు కార్లు తీసుకున్నారు. జమీందారంటే ఒక్కడుగాని షావుకార్లు ముగ్గురు. అసలు షావుకారు, చిల్లరకొట్టు షావుకారు, దాతా దీన్ షావుకారు. ఇంకా ఎవరిబుణమూ తీరలేదు. జమీందారు

గారి బాకీ సగం తీరిందేమో. చిల్లరకొట్లో మళ్లీ అప్పులు. పగలల్లా రెక్కలువిరుచుకునిపనిచెయ్యటం, వున్నవాళ్ళయిళ్ళల్లో మరింతవేయటం. మనం పుట్టిందే అందుగ్గదయ్యా! తీసుకున్న అసలుకంటే రెట్టింపు చెల్లగట్టినా వడ్డీయే తీరదాయె. అసలు అట్టాగేవుండె. జమీందారు కొడుకుపెళ్లికి పాతికవేలు ఖర్చు పెట్టాడంట. షావుకారు తండ్రితద్దినానికి అయిదువేలు ఖర్చు పెట్టాడు. అదేమని అడగటానికి వీల్లేదు. మనకిమాత్రం వుం డదూ మనశుభకార్యాలూ, కర్మలూ అట్లాగే చేసుకోవాలని. మన మర్యాదమాత్రం వాళ్ళ మర్యాదవంటిది కాదూ?''

"గొప్పవాళ్ళతో మనమెక్కడ పోటీపడగలం!" అని సానుభూతి వ్యక్తంచేశాడు భోలా.

"మనంగూడా మనుషులమే గదయ్యా."

"మనమేం మనుషులంలే! మనకేముంది మనుషులం అవటానికి? మనుషులంటే డబ్బుండాలి; శక్తి సామర్థ్యా లుండాలి; చదువు లుండాలి. మనది దున్నపోతు బ్రదుకు. కాడి మెడని వేసుకుని కష్టపడేవాళ్లమాయె మనం. ఒకణ్ణి చూస్తే ఒకడికి గిట్టదు. ఏమనుకుని ఏం లాభంలే! ప్రపంచంలో ప్రేమంటూ, నావాడంటూ లేకండాపొయ్యిం తర్వాత.''

ముసలివాళ్లెప్పుడూ అంతే. జరిగిపోయిన రోజుల ప్రాభ వాన్ని తలచుకునీ, పడుతూన్న కష్టాల్ని గురించీ, భవిష్యత్తులో దాగివున్న విపత్తుల్ని గురించీ మాట్లాడుకొంటూంటారు. అట్లాగే యీ యిద్దరు స్నేహితులూనూ. భోలా తన కొడు కుల్ని గురించి చెప్పాడు. హోరీ తన తమ్ముల్ని గురించి చెప్పాడు. ఇంతలో ఒక నూతిదగ్గర కొచ్చారు. ముగ్గురూ

తట్టలు దింపుకున్నారు. గోవర్ బొక్కెనతో నీళ్ళు తోడు తున్నాడు.

"అయితే పాపం వేసులుపడ్డప్పుడు నువ్వు చాలా బాధ పడ్డావంటగా ? వుండదంటలే మరి కొడుకులికిమల్లే పెంచి పెద్ద వాళ్ళని చేస్తివి తమ్ముళ్ళని" అన్నాడు భోలా.

హోరీ కళ్లు చెమ్మగిల్లినాయి: "ఏమని చెప్పను ? ఎందుంట్లోనన్నాపడి చద్దామన్నంత బాధ కలిగింది. వాళ్లని ఇంతప్పట్నుంచీ సాకి పెద్దవాళ్ళనిచేశా. వేసులెందుకు పడాల్సొచ్చిందనుకున్నావ్? మా ఆడది పొలంపని కెళ్లలేదంట! నువ్వే చెప్పు. ఇంట్లో మంచీచెడ్డా చూడాలా? అదిమాత్రం కూర్చొని వుండేదా? కోడికూసినప్పుడు లేచింది ఝాంపొద్దు పోయేదాకా లేచింది లేచినట్లే వుండేది. హీరా పెళ్లానికీ, శంకర్ పెళ్లానికి ఏం తెలుసు అది ఎన్ని అష్టకష్టాలు పడేదో. ఎన్ని అప్పు సొప్పులుచేసి కుండ పొయ్యిమీద కెక్కించేదో. ఇప్పుడు చూస్తన్నాంగా. వాళ్లిళ్లల్లో పొయ్యిలో పిల్లి ఒకపూటలేస్తే రెండోపూట లేవదు. ఉమ్మడిగా వున్నప్పుడు నాలుగుసార్లు లేచేయి బంతులు. ఇప్పుడుతినమను నాలుగుసార్లు చూద్దాం. ఇంటిది పడ్డకష్టం నాకు తెలుసు; దేవుడికి తెలుసు. అది చిరిగిన చీరలు కట్టుకుని తోడుకోడళ్లకి పండగలికి కొత్త కొత్త చీరలు కొనిపెట్టేది. అది పస్తులుండి వాళ్ళకి ఫలహారాలుచేసి పెట్టేది. దాని మెడలో పసుపుతాడు తప్పితే ఏమీలేదా వాళ్ళ కొక్కొక్కళ్ళకీ రెండేసీ మూడేసీ నగలు చేయించి పెట్టింది. బంగారపుయి కాదనుకో. వెండివేననుకో. వాళ్లకిక అక్కసేమీ లేదబ్బాయ్. ఇది యింట్లో యజమానురాలుగా ఎందుకుండాలి?

అని. వేరులు పట్టమే మంచిదయ్యిందిలే. నాకు బరువు తప్పి పోయింది.''

భోలా మంచినీళ్ళు త్రాగాడు. "ఏ యింటో చూచినా యింతే బాబూ. సరే తమ్ముళ్ళమాట అట్లావుంచు. నా కొడుకులు మాత్రం ఏం వుద్ధరిస్తున్నారు ? వెధవపనులు చేస్తూంటే చూస్తూ వూరుకోలేను బాబూ నేను. జూదం ఆట్టానికీ, గంజాయి తాగటానికీ, కోడిపందా లాట్టానికీ డబ్బెక్కడ్నుంచొ స్తుంది? జమీందారుబిడ్డవా ఏమన్నానా ! ఊఁ పోనీ సంపాదించుతారా అంటే అదీ లేదు. పెద్దాడు బజారు కెళ్ళాడంటే పాలమ్మిన డబ్బులో సగం యింటికి రాదాయె. ఇక చిన్నాడు. ప్రొద్దుగూకితే చాలు వాడూ, వాడి సావాసమూనూ. నాటకాలేనా, కోలాటాలేనా ! సావాసం చెయ్యొద్దన్ను నేను. పని చేసుకున్న తర్వాత సావాసం. పనీలేదు; గినీలేదు. గొడ్డకక్కడితి నేను పోసుకోవాలి, పాలు నేను పితుక్కోవాలి; బజారెల్లి పాలమ్ముకు తెచ్చుకోవాలిసింది నేనే. ఏం చెయ్యాను? చావనా. ఏమి సంసారమో. మింగాలేను, కక్కాలేను. ఒక్కగా నొక్క కూతురు. ఝునియా. దానిరాత అట్లా తగలడె. నువ్వా వచ్చావుగా పెళ్లికి? సంబంధం మంచిదే. వున్నవాళ్ళుకూడాను. దాని మొగుడికి బొంబాయిలో పాల కొట్టుండేది. అక్కడ హిందువులికీ మహమ్మదీయులికీ పోట్లాట వచ్చింది. ఎవడో అతన్ని కత్తితో పొడిచేశాడు. ఇంకాఅక్కడుండి ఏంచేస్తుందిలే అనివెళ్ళి వెంటబెట్టుకొచ్చేశా, రెండోపెళ్ళి చేసుకోవే అంటే ఒప్పుకోదు. ఇంట్లో ఇద్దరు వదెన్లు. దాన్ని రెండు కళ్ళతో

చూడనేలేరు వాళ్లు. ఏంచెప్పను. మాయిల్లోక మహాభారతంగా వుందనుకో బాబూ."

ఇట్లాగే మాట్లాడుకుంటూ వూరిదగ్గరకొచ్చారు. భోలా దికూడా పల్లెటూరే. చిన్న దేగాని కళకళలాడుతూ వుంటుంది. వూళ్లోవాళ్ళందరూ గొల్లవాళ్లే కాని వాళ్లపరిస్థితి రైతుల కంటె కాస్త బాగానేవుంటుంది. భోలా వూరికంతటికీ పెద్ద. ఇంటిముందు పది పదిహేను పశువులు మేతమేస్తూన్నాయి. వసారాలో ఒక పెద్దభోషాణం. ఒక మూలమేకుకి మద్దెలా. మరొక మేకుకి మంజీరా వ్రేళ్లాడేసివున్నవి. చూరులో ఒక పెద్దపుస్తకం- బహుశా రామాయణం అయివుంటుంది- వుంది. కోడళ్ళిద్దరూ వాకిట్లో పేడచేసుకుంటున్నారు. కూతురుఝునియా గుమ్మంలో నిలబడి వుంది. అప్పుడిదాకా ఏడుస్తూవున్నదా అన్నట్లుంది; కళ్లు ఎర్రబడ్డవి; ముక్కు చీదుకుంటూంది. మంచి వయసులో వున్నది. అంగ సౌష్టవమూ, ఆ ఆకారంలో నిండుదనమూ చూస్తూంటే వయసు మెరుగులు దిద్దుతూన్న బొమ్మలాగుంది. ముఖం చంద్రబింబంలా గుండ్రంగా వుంది. బుగ్గలు పొంగివస్తూన్నట్లున్నవి. విశాలమైన నుదురు. కళ్ళు చిన్న వేగాని వక్షభారమూ, శారీరకదార్ఢ్యమూ ఆ కన్నుల్లో ఏదో ఒక విచిత్రమైన ఆకర్షణని మలిపి, మెలిపాయి. కట్టుకున్న గులాబీ రంగుచీర ఆసౌందర్యాన్ని యినుమడింపచేస్తోంది.

తండ్రిని చూడటమే తడవుగా పరుగెత్తుకెళ్ళి నెత్తినున్న తట్ట దింపింది. అందరూ తట్టలు దింపుకుని కూర్చున్న తర్వాత "చూడమ్మా కాస్త పుగాకు తీసుకొస్తా. తర్వాత కాసిని దాహం గూడా పట్టుకురా తల్లీ - బొక్కెన పట్టుకురా. కాసిని

నీళ్ళు తోడతా. హోరీ బాబుని ఎరుగుదువుగా?'' అన్నాడు భోలా కూతురితో.

అని, హోరీవంక చూచి "ఇల్లాలేని యిల్లేం యిల్లులే బాబూ. శాస్త్రం చెప్పినట్టు - ఊడిసిందే చేను: పెళ్లాంవుంటేనే యిల్లు, కొడళ్ళ సంసారం దున్నపోతుల వ్యవసాయమే అనుకో, దీని తల్లి చచ్చిపోయింది; ఇంట్లో సిరి ఎగిరిపోయిందనుకో. కొడుకుల సంగతి నీకు తెలవందేముంది? వరి చచ్చుదద్దమ్మలూ సోమరిపోతులూనూ. నేను చచ్చిన మర్నాడు అడుక్కుతింటూ పోతారంటే నమ్ము. కూతురూ అంతే. ఇక్కడంటే జరుగు తోంది గాని అత్తారింటికెళ్తే ఎట్టా బాబూ!'' అన్నాడు భోలా మళ్లీ.

ఒక చేత్తో పుగాకు, రెండోచేత్తో దాహమూ పట్టు కొచ్చింది. అవన్నీ వాళ్ల ముందుపెట్టి బొక్కెన పట్టుకుని నీళ్లు తెచ్చేందుకు వెళ్లింది. గోవర్ కూడ వెళ్లాడు. "నువ్వెందుకులే. నీళ్ళు నేనే తోడతాలే. బొక్కెనిట్టా యివ్వు'' అన్నాడు సిగ్గు సిగ్గుగానే; అని బొక్కెనిమ్మంటూ చేయి చాచాడు.

ఝునియా బొక్కె నివ్వలేదు. నూతిదగ్గరికెళ్లి ముసిముసి నవ్వులు నవ్వుతూ "నువ్వు చుట్టానివి. అవతలికెళ్లిం తర్వాత వాళ్లింటికెళ్తే నీళ్లుగూడ యిచ్చేవాళ్లు లేకపొయ్యారు. నేనే తోడుకున్నాను అంటానికా? వద్దులే!'' అంది.

"నేను చుట్టాన్నెట్టా ఔతాను? పొరుగింటివాడినామె!''

"ఇరుగుపొరుగు నున్నా సంవత్సరాలకి సంవత్సరాల దాకా కనబడకుండావుంటే చుట్టంతో సమానమే!''

"రోజూ వస్తే మర్యాదమాత్రం వుంటుందంటలే" ఝునియా చిలిపిగా చూచింది. "అందుకనేగా నేను మర్యాదచేస్తాంది. నెలకొకసారొస్తే చల్లటి మంచినీళ్లిస్తా. పది హేనురోజుల కొకసారొస్తే ఒకపాయి పుగాకిచ్చి వూరుకుంటా. వారంవారంవస్తే కూర్చోటానికి చాపమట్టుకువేసి వూరుకుంటా. రోజూవస్తే ఏమీలేదు; ఏమీచెయ్యను" అని కొంటెగా చూచింది. "ఎంత లేదన్నా దర్శనం దొరుకుతుందిగా?" "దర్శనంకావాలంటే పూజలుచేయాలి!" అంటూనే ఝునియా ముఖం పాలిపోయింది. మరచిపోయిన మాటేదో గుర్తుకు వచ్చింది. తాను విధవ. మొన్నటివరకూ తన స్త్రీత్వాన్ని భర్త వేయికళ్లతో కాపాడుతూండేవాడు. అతని అండచూసు కుని తన విషయం మరచిపోయేది. ఇప్పుడట్లాకాదు. తన భర్త లేడు. అప్పుడప్పుడూ తన ఒంటరి జీవితమంటే విసుగెత్తినపుడు, తన మనస్సు చుట్టూ మూసికొనివున్న తలుపులు తెరచేది. ఆ తలుపులుదాటి ఎవరైనా లోపలికివస్తే తలుపులు చెరుస్తా రేమోనని కంగారు పడిపోయేది. దభీమని తలుపులు మూసి వేసుకునేది.

గోవర్ నీళ్ళు తోడాడు. అందరూ దాహం పుచ్చుకుని దప్పిక తీర్చుకున్నారు. చుట్టలు ముట్టించారు. "రేపొచ్చి ఆవుని తోలుకెళ్ళు బాబూ!" అన్నాడు భోలా గోవర్‌తో.

గోవర్ కన్నులన్నీ ఆ ఆవుమీదే వున్నాయి. తన నాన్న చెప్పిన ఆవింత మంచిదనీ, యింత అందంగా వుంటుందని కలలో కూడా అనుకోలేదు.

"తోలికెళ్తాంలే. ఇప్పుడే ఏమంత తొందరొచ్చింది" అన్నాడు హోరీ తన కేమీ ఆదుర్దాలేనట్లు.

"నీకు తొందరలేదనుకున్నా, నాకైనా తొందరేగా. వాకిట్లో ఆవును చూచినప్పుడల్లా నేనుచెప్పినమాట గుర్తుకొస్తా వుంటుంది" అన్నాడు భోలా.

"ఆసంగతి మరచిపోనంటున్నాగా !"

"ఇంకేం. రేపు అబ్బాయిని పంపు, తోలిపెడ్తా."

తండ్రీకొడుకులు తట్టలుపుచ్చుకుని బయల్దేరారు. ఇద్దరూ వెండికొండ దొరికినట్లు సంతోషపడుతున్నారు. ఈనాటికి హోరీ కలలు నిజమయ్యేరోజు వచ్చింది. దీనికితోడు కాండబ్బుగూడ ఖర్చుకావటంలేదు. ఇక గోవర్ మాట చెప్పవలసిన అవసరమే లేదు. అతనికొక అమూల్యమైన వస్తువు లభించింది. అతని మనసులో కోరిక లూరినై. నిద్రపోతూన్న వాంఛలు మేలు కొన్నవి.

వీలు దొరకటమే తడవుగా వెనుదిరిగి చూచాడు. ఝునియా వాకిట్లో నిలబడి తనవైపే చూస్తోంది మత్తెక్కిన కోర్కెల్లా కదిలే కళ్లతో.

44

# 4

హోవారీ పండుకున్నాడు గాని నిద్రరాలేదు. ఇంటి ముందు వాకిట్లో, డొక్కునారమంచంమీద చుక్కలవంక చూస్తూ పడుకున్నాడు ...

ఆవుని తోలుకొచ్చి ఎక్కడ కట్టెయ్యాలి? కట్టుకొయ్య పాతాలి; కుడితితొట్టె పెట్టాలి. ఎద్దులికి దూరంగానే కట్టేస్తే మంచిది...బయటకట్టెయ్యడం ఏమంత మంచిదిగాదు. 'దిష్టి' తగులుతుంది. అదేంఖర్మో కొందరి కళ్ళుపడితేచాలు, పాడు గులో చెయ్యిగూడ పెట్టేందుకు వీలుండదు! అయినా బజార్లో కట్టేస్తే మున్సబు వూరుకోడు...ప్రతిచిన్నపనికీ జమీందారు గారిదగ్గరికి పరిగెత్తితేమాత్రం ఏంబాగుంటుంది? అంతేకాదు. నీళ్ళల్లో వుండదలచుకున్నతర్వాత మొసళ్లతో వైరంపెట్టు కుంటే ఎట్లా?

ఎంతలేదన్నా ఐదుసేర్లన్నా యిస్తుంది. సేరు పాలు అబ్బాయి తాగుతాడు. చిన్నవానికొకగ్లాసుడు. అప్పుడప్పుడూ సేరో, రెండుసేర్లో అధికార్లకికూడా యివ్వకతప్పదు. మున్సబు గారినిగూడా మరిచిపోగూడదు. ఎందుకైనామంచిది ...

భోలాని మోసంచెయ్యగూడదు. ఈపెళ్లీ, టక్కూ, టమారాలన్నీ ఎందుకు ? ఎనభై రూపాయల ఆవుని నా మాటంటే నమ్మక ముంచి యిస్తున్నాడు. నమ్మినవాళ్ళగొంతు కొయ్యకూడదు ...

అబ్బాయి యింత సోమరిపోతు ఐపోతున్నాడు. అదే మన్న మాటలే ! ఆ వయసలాంటిది. వాడి వయసులో నేను మాత్రం పనిచేసి ఏడిశానూ ! అయ్య ఝాము పొద్దుందన గానే లేచి పెంటపోగు తోలటానికని బండికడితే నేను పొద్దు కరకరా పొడిచొచ్చేదాకా నిగడదన్ని పడుకునేవాడిని ! ఆయ నొచ్చి తెగ్గొడితే దేశాంతరం పోతానంటూ ధుమధుమలాడే వాడిని ......

అంతేలే ! తల్లీ, తండ్రీ బ్రదికుండగానే పిల్లలేమన్నా సుఖపడేది. అయ్య చచ్చిపోగానే నేను ఇల్లు చక్కబెట్టుకోలా ! అంతవరకూ అట్లా తిరిగినవాడిని ఇట్లా ఎట్లా మారానా అని వూరంతా ముక్కుమీద వేలేసుకుంది ...

తమ్ముళ్లు వేరుపడిపోయారుగాని – లేకపోతే వ్యవసాయం ఎంత నిండుగా వుండేది. అది వుందంటే పల్లకీ దిగటం ఆలస్యం నడుం వంచింది వంచినట్లే వుంది. ఎముకలు విరగ్గొట్టుకుంటూ పనిచేసే మనిషి తోడుకోడళ్ళని గూడ పనిచెయ్యమంటే తప్పే ముంది? అప్పుడేమో మరదులకోసం సతమత మయ్యేది. ఇప్పుడు బిడ్డలకోసం వల్లు హూనం చేసుకుంటూంది. పాపం ఎన్ని తిప్పలొచ్చినా అదేమని ఎరగదు. కపటమన్నమాట లేదు. అదే మంచిది కాకపోతే తమ్ముళ్ళ తిప్పలు కుక్కలు

గూడ చూచేవికాదు. ఏం లాభం! ఎంత పొట్టకట్టుకుని పని చేస్తేమాత్రం వేరులుపడకుండా వుండగలిగామా?......

తూర్పు తెల్లవారుతోంది. వెలుగొచ్చింది. వర్జ్యంలేని రోజు. చీకటుండగానే లేచెళ్లి ఆవుని తోలుకొస్తానన్నాడు గోవర్. ఇంతవరకూ పెట్టిన ముసుగు తీయలేదు. కట్టు గొయ్యే పాత్తే, కుడితితొట్టికి గాడితీస్తే పనైపోతుంది. అయినా ఆవొచ్చే దాకా ఆగితేనే మంచిదేమో. ఎవళ్ళు చూచొచ్చారు భోలా మనసుమారినా మారొచ్చు. ఎదిగిన కొడుకులున్నారామరి. ధూత్ కాదంటే అతను మాత్ర మేంచేస్తాడు?......

ఇంతలోనే గోవర్ వులిక్కిపడి లేచాడు. "అరే! తెల్లారి పోయిందే!! కట్టుగొయ్యపాతేసావానాన్నా?"

లేచిన కొడుకు ఓమ్మచూచాడు తండ్రి. పీడికే ఆవు పాలు దొరికితేనా అని మురుసుకుంటూ "ఇంకా పాతలేదురా ఏమోలే ఇంతాచేస్తే ఆవురాకపోతే,....."

"ఎందుకురాదు?" అనికళ్లెగరేశాడు కొడుకు. "మనసు మారితే..." అని నీళ్ళు నమిలాడు తండ్రి. "మనసు మారదు, గినసూ మారదు. ఇవ్వాకెక్కడికెళ్తాడు." అంటూ ముల్లుగర్ర పుచ్చుకుని చరచరా వెళ్లిపోయాడు కొడుకు.

కోపంగా నడచివెళ్లే కొడుకుని అదేపనిగా చూడ బుద్ధయ్యింది హోరీకి. కొడుక్కి పెళ్లి చేసెయ్యాలి; పెద్దవా డయ్యాడు; ఈడొచ్చింది; అనుకుంటే విసులుబాటే కన్పించటం లేదాయె. రెండు మూడు సంబంధాలొచ్చి తిరిగిపోయినయినై. ఈ రోజుల్లో పెళ్లంటే మాటలా? ఎంతలేదన్నా పిల్లకి రెండు మూడొందలివ్వాలి. పైన ఇంకా రెండుమూడొందలు ఖర్చు

పెట్టాలి. ఇంట్లో ఎర్రని ఏగాని కన్పించదు. పెద్దమ్మాయికూడా పెళ్లి చేసేయ్యాలి. మొగవాడంటే నాలుగు రోజులాగినా ఫర్వా లేదు. ఎదిగిన కూతురుపెళ్లి చెయ్యకపోతే నలుగురూ నాలుగు మాటలంటారు. ముందు అమ్మాయి సంగతే ఆలోచించాలి...

ఇంతలోనే "ఎదురు కర్రేమన్నా దొరుకుతుందా బాబూ!" అంటూ వచ్చాడు మేదర మనిషి ఎక్కడినుంచో వూడిపడినట్లు.

సంవత్సరాని కొకటి రెండుసార్లు వచ్చే మనిషి. తట్టలు, బుట్టలు, పరదాలు చేసేందుకని వెదురు కొనుక్కెళ్తాండేవాడు. నల్లగా, పొట్టిగా, బొద్దుగా వుంటాడు. బుగ్గమీసాలు; జ్యోతుల్లాంటి ఎర్రటి కళ్లూ. బొడ్డులో వెదురు కొట్టేందుకు కత్తి.

చేతిలో నాలుగురాళ్ళుపడే అవకాశం వచ్చింది; హోరీ ఎగిరి గంతేశాడు. తీసికెళ్ళి వెదురుతోట చూపించాడు. కాస్సేపు అటూ ఇటూ లాగి చివరికి నూటికి పాతిక చొప్పున బేరం నిశ్చయించుకున్నారు. ఇంటికొచ్చిం తర్వాత ఒక పుగాకుపాయ తీసి యిచ్చాడు.

"నువ్వు ఎరిగినవాడివి గదా అని యిచ్చానుగాని నీకూ తెలుసుగా ముప్పైరూపాయలకి చిల్లిగవ్వ తక్కువైనా వొప్పుకునేవాడినికాదు యింకొకళ్లైతే" అన్నాడు హోరీ. అని "అయితే ఆమధ్య పెళ్ళిచేద్దామని సంబంధం కుదుర్చుకున్నాక నీ కొడుకు దేశాంతరం వెళ్లాడన్నారు. వచ్చాడా?" అనడిగాడు.

చుట్టుకున్న చుట్ట నోట్లోపెట్టుకుని, చివర కొరికి, కాండ్రించి వుమ్మేశాడు వచ్చిన మనిషి – "ఆ వెదవ మూలాన్నేగా యీ యిబ్బందులన్నీని. ఈడొచ్చిన పెళ్లాం యింటో

వుంటే. ఆడి కక్కర్లేదంట. ఇంకొకదాన్ని లేపుకుపోయి తుర్రు మన్నాడు. ఇక్కడిది యింకొకణ్ణి లేపుకుపోయింది. మాది కూడా జాతే నంటలే; యెదవ జాతి. నీ యిష్టంవొచ్చినట్టు తిను; కట్టుకుని తిరుగు అని యెంతజెప్పినా యింటేనా? లచ్చ చెప్పు. ఆడదానికి దేవుడేం యిచ్చినా పర్వాలేదు కాని అందం మాత్రం పెట్టగూడదనుకో, అందం వున్న ఆడదానికి ఇంట్లో కాలు నిలవదంటే నమ్ము బాబూ. సరేకాని ఎదురుతోట బాగా లేసుకున్నారా?'' అనడిగాడు.

హోరీ క్రిందా, పైనా, చూచాడు: "అన్నీ పంచు కున్నాం. బిడ్డల్లాగా పెంచి పెద్దవాళ్లనిచేశానా! ఈనాటికి వాళ్లూ నాయంతయ్యారు. నువ్వీచేత్తో డబ్బులిస్తే ఆచేత్తో వాళ్లవంతు వాళ్లకిచ్చేస్తా. బ్రతికేది నాలుగురోజులు. మళ్లీ యింతలో అన్నాదమ్ముల్లో మోసం ఎందుకు? అదికాదు నూటికి యిరవయ్యే పుచ్చుకున్నానంటే వాళ్లకిమాత్రమేం తెలుస్తుంది? నువ్వెళ్లి చెప్పొచ్చావా; ఏమన్నానా? నువ్వూ నాకు తోడబుట్టిన వాడిలాంటి వాడివాయె!" అని మేదరివంక చూచాడు హోరీ. మేదరి యిలాంటివన్నీ కాసి వడపోసి, త్రాగిన ఘటం. హోరీ బయటపెట్టిన బలహీనతని పసికట్టేశాడు. "అంతేననుకో. పుట్టిందగ్గర్నుంచీ యెరుగుదుం నిన్ను నేనూ, నన్ను నువ్వూ. ఇరవయ్యన్నమాటేంటి! పదిహేనే అనమన్నా అంటా; కాని యిరవైకి బేరం వప్పేసుకో"

''అదేమిటయ్యా. ఇంతఘోరకలి యింకెక్కడైనా వుందా? ఇరవైకి యిట్లాంటి కర్ర యెప్పుడన్నా కొన్నావా?"

''అదేంవన్నమాటలే. పదిపెట్టినా దొరుకుతుంది కర్ర.

ఇంకా పదికోసులుదూరం వెళ్ళితేసరి. ఇదంతా కర్రవిలువే అనుకొంటున్నావా? దూరాభారం గదా అని దగ్గిరున్నదానికి యింకా నాలుగెక్కువపెడతాం. అంతే అంతదూరం యెల్లొచ్చేప్పటికి యిక్కడే రొండుమూడు రూపాయలు పనిసేస్కోలేకపోతావా: అని. అంతేగానీ —...

తానొకటి తలిస్తే దైవమొకటి తలచాడు. మేదరి చాకూ విడిచి, చూరుమీదపెట్టి వెదురు నరుకుతున్నాడు.

హీరా-హోరీ తమ్ముడు - భార్య బొక్కెన పుచ్చుకుని నూతికెళ్తూ వెదురు నరికే మేదరిని చూచింది. చూచి, పమిట సర్దుకుని "ఎవరా యెదురుకొట్టేది? కొట్టానికీల్లేదు!" అన్నది.

అదేంవిఁటమ్మో. వంద పదిహేనుకాడికి బేరం పైసలు చేసుకునే కొడతన్నా. వూరికే కొడతన్నాననుకున్నావేంటి!"

హీరా భార్య సామాన్యమైన స్త్రీ కాదు; తన యింటికి యజమానురాలు. వేరులు పడేందుకుగూడా చాలావరకు కారణం ఆవిడే. ధనియాని నుప్పతిప్పలుపెట్టి మూడుచెరువుల నీళ్ళు త్రాగించింది. వేరుపడ్డతర్వాత ఆవిడ మాటకు ఎదురు లేకుండాపోయింది. భర్త అపుడప్పుడూ పట్టుకుని చావచితక గొడుతూండేవాడు. అయినా ఆవిడ అధికారానికి తలవంచక తప్పేదికాదు అతనికి. వుండి, వుండి, విసిగి, వేసారి, కోపం పట్టలేక నాలుగు తన్నేవాడు-యజమానిదగ్గరికి వచ్చినప్పుడు తన్నే గుర్రంలా. చివరికి యజమాని వీపుమీదెక్కి కొరడా ఝుళిపించగానే పసుగత్తే గుఱ్ఱంలాఆవిడ కనుసన్నల్లో మెలిగేవాడు.

బొక్కెనక్కడ పడేసి "మా యెదురు పదిహేను రూపాయలకి అమ్మం అంటే అమ్మం" అన్నదావిడ.

ఆడవాళ్ళతో నోరు చేసుకోవటం మంచిదికాదనే విషయం మేదరికి తెలుసు. "సరే లేమ్మా. మీ ఆయన్ని పంపించు. ఆయన్తోనే మాట్లాడతా" అన్నాడు.

హీరా భార్య పేరు - పున్నీ. కాన్పులు రెండే ఐనా మనిషి జారిపోయింది. తల దువ్వుకుని, బొట్టుపెట్టుకుంటూ వుంటే బాగానే వుండేదేమోకాని, తిండికే గతిలేని రోజుల్లో ఇంట్లోపని చేసుకోవటంతోనే ప్రొద్దుకుంకుతోంది. ఇంక తల దువ్వుకునే దెప్పుడు? బొట్టుపెట్టుకునే దెప్పుడు? దీనికితోడు బీదతనం గూడా కలిసి మనిషిని ఎండుకట్టెను చేసేసింది.

"మగాళ్లని పిలవటంవెందుకు? చెప్పేదేంటో నాతో చెప్పరాదూ? కొట్టానికి యీల్లేదంటే యీల్లేదు". అంటూ అతని చేయి పట్టుకోబోయింది.

ఆవిడచేతి కందగూడదని విశ్వప్రయత్నం చేశాడు మేదరి. మరీ పైపైకి రాసాగింది ఆవిడ. ఈ త్రొక్కిడిలో తప్పించుకునేందుకు వీల్లేక ఒక్కతోపు తోసాడు ఆవిడని. పున్నీ క్రిందపడిపోయింది. ఎట్టాగో తెప్పరిల్లి లేచింది. ఇక నిలబడిన వాడిని నిలబడినట్లు కుడీ యెడమా చూడకుండా చావబాదటం మొదలుపెట్టింది. ఆ మానవుడికి ఏం చెయ్యాలో, ఎటు చూడాలో గూడ తోచలేదు: ఆడకూతురిమీద చేయి చేసుకున్నాడు. ఆవిడ కొట్టటం ఆపలేదు; రెండు చేతుల్తోనూ అందిన వాడిని అందినట్లు బాదుతోంది. బాదుతూనూవుంది; శోకాలూ తీస్తూనూఉంది. అతను అట్లాగే నిలువునా గుడ్లప్పజెప్పి చూస్తూ నిలబడిపోయాడు.

~~G VENKATESWARA REDDY~~



పున్ని ఏడుపువిని హోరీ పరుగెత్తుకొచ్చాడు. బావని చూచి మరింత బిగ్గరగా ఏడుస్తోంది పున్ని. పున్నిని మేదరి కొట్టాడేమో ననుకున్నాడు హోరీ. కోపం ఆపుకోలేక ఎగిరి ఒక్కతన్ను తన్నాడు మేదరిని. "కళ్లు నెత్తిమీదకొచ్చినయ్యంట్రా నెధవ? ఆడకూతురుమీద చెయ్యిచేసుకుంటా? ఫో యిక్కడ్నుంచి. లేకపోతే నీ నెత్తురు కళ్లజూస్తా" అంటూ వురిమాడు.

మేదరి నెత్తీ నోరూ కొట్టుకున్నాడు; వట్లు పెట్టుకున్నాడు. తానేమీ పాపం పుణ్యం యెరగడు. ఈ దెబ్బలూ, తన్నులూ వృధాగా తింటున్నాడు. అతనావిడని ముట్టుకోనే లేదు. రైతుల యిళ్ళల్లో ఆడకూతుళ్లని ముట్టుకో సాహసించగల మూర్ఖుడు కాదతను.

హోరీ యీమాటలన్నీ నమ్మే స్థితిలోలేడు. "నాకళ్లు కప్పుదామని చూస్తున్నావా? ఈ అబద్ధాల కూడు కూడ నేర్చావ్. నువ్వేమీ అనందే అమ్మాయి అనవసరంగా ఏడుస్తుందేం? డబ్బిచ్చి కొంటున్నానుగా అనుకుంటున్నావేమో. ఆ పప్పులేమీ వుడకవ్. వేన్లుపడ్డాంగదా అనుకుంటున్నావు కామన్న. మాదంతా ఒకటేకుటుంబం తెలుసా. మళ్లీమాట్లాడావంటే పళ్ళు పీకించేస్తా. ఏమనుకున్నావో."

పున్ని భయంకర కాళిరూపందాల్చింది. "నువ్వా నన్ను తోపుతోసి కిందపడేసావా లేదా? నీబిడ్డమీద్దొట్టుపెట్టుకో" అని గొంతు చించుకుంది.

తన భార్యా, మేదరీ పోట్లాడుకుంటున్నారనే వార్త హీరాకి కూడ తెలిసింది. మేదరి తనభార్యని పడదోశాడనీ,

ఆవిడ అతన్ని రెండుచేతుల్తోనూ చావమోదిందనీ కూడ తెలిసింది అతనికి. వెంటనే చేతిలో పనివదిలి వున్నవాడు వున్నట్లు లగెత్తుకొచ్చాడతను. మనిషిపొట్టివాడై నాశరీరందుండు ముక్కలాంటిది. బహుకోపిష్టి. కోపంతో నిప్పులు కక్కుతూ వచ్చాడు. కళ్ళు గవ్వల్లా వుబ్బి పొడిచుకొచ్చినయి. మొహం అంతా కందగడ్డలా ఎర్రనయ్యింది. అతనికి కోపం వచ్చింది మేదరి మీదకాదు. భార్య ఆ తక్కువ కులంవాడితో ఎందుకు పోట్లాడాలి? వంశ మర్యాద యిట్లా మట్టిపాలెందుకు చెయ్యాలి? ఇంత బ్రతుకూ బ్రతికి మేదరితోనా పోట్లాడవలసింది! వచ్చి తనతో చెప్పగూడదూ? తర్వాత మంచీ, చెడ్డా తాను చూసు కునేవాడుగద. వాడితో తగువు కెందుకు వెళ్ళాలి? పాపం! అతనివల్ల కావటంల్లేదుగాని-భార్య గడప బయట అడుగుపెట్టిం దని వింటే నిలువెల్లా దహించుకు పోయేది. తానెంత వృద్ధుండుట్లో తనభార్య అంత శాంతమూర్తిగా వుండాలని అతని కోరిక. అన్నయ్య పదిహేను రూపాయిలకి బేరం కుదిరిస్తే యిదెవరు మధ్య కలగజేసుకునేందుకు?

వచ్చీరావటంతోనే . పున్నిచేయి పట్టుకుని బరబరా లాక్కెళ్ళాడు. కాస్తదూరంలాక్కెళ్లి "మేంనలుగుర్లోనూ తలెత్తు కుని తిరక్కుండా చేస్తావే బోడీముండ. నువ్వైన వాళ్లతోనూ కానివాళ్లతోనూ పోట్లాడతాంటే సిగ్గుచేటు!" అంటూ ఎడా పెడా తన్నడం ప్రారంభించాడు. "మళ్లీ ఎప్పుడన్నా నోరెత్తి నట్టుంటే గొయ్యితీసి గోతిలో పాతిపెడ్తా" అంటూ రంకెలువేసి మళ్ళీ నాలుగు తన్నాడు.

పున్ని నెత్తి నోరు కొట్టుకుంటూ తిట్లు ప్రారంభించింది.

నీకు మహమ్మారిరాను. నీపాడెత్త. నువ్వు దుమ్ములోకలవ. నీ కాళ్లూ చేతులు పడిపోను.

ఈ తిట్లు వింటూంటే హీరావళ్లు మాడిపోయింది. జుట్టుపట్టుకుని వంగదీసి "నా కాళ్లూ చేతులూ పడిపోవాలంటే భాడ్కావ్. నేనుచస్తే పిల్లల్ని నువ్వు ఏం సాస్తావంటే ముండా. నేను చచ్చిన మర్నాడు పెళ్లి చేసుకుందామని చూస్తున్నావంటే వెధవముండా! అంటూ నాలుగు గుద్దులు జమురుకున్నాడు.

ఆ దెబ్బలు చూస్తూంటే మేదరికికూడ జాలేసింది. "చూడుబాబూ! అయ్యిందేదో ఐపోయిందిగా. వూరుకో నన్ను నాలుగేసింది. అంతేగా! ఆ మాత్రానికే చిన్నాడివైపోయా నంటలే. పోనీబాబూ. వూరుకోండూ" అంటూ హీరాని బ్రతిమలాడాడు.

"సంతోషించాంగాని యిక వూరుకో. లేకపోతే నీపని గూడా పట్టాలిసొస్తుంది. ఇవ్వాళ నీతో పోట్లాడింది; రేపు యింకొకడితో పోతుంది. నువ్వంటే వూరుకున్నావుగాని అందరూ ఎందుకూరుకుంటారు ? అవతలివాళ్లు గూడా చెయ్యి చేసుకుంటే ఇంకా ఎక్కడన్నా తలెత్తుకు తిరగగలమా ?" అంటూ అతనిమీదగూడ ఝుంయ్యిమంటూ లేచాడు హీరా.

బయటికన్న మాటలన్నీ మననం చేసుకునేప్పటికి మళ్ళీ పట్టరాని కోపం వచ్చింది హీరాకి. మళ్ళీ నాలుగు తన్నుదామని భార్యవేపుకి తిరిగాడు. ఇంతలో హోరీవచ్చి, అడ్డంబడి, తమ్ముడిని వెనక్కినెట్టాడు. "ఇక చాల్లే ఊరుకోవోయ్. మాలావు బలవంతుడివి నువ్వేగనక బయల్దేరావ్. అమ్మాయిని చంపుకు తింటేతప్ప నీకోపం తీరదా యేంటి ?" అని మందలించాడు.

తలుచుకుంటే అన్నని ఒక్క విదలింపు విదలించేవాడే హీరా. కాని అన్నంటే వల్లమాలిన గౌరవం అతనికి. ఎదురుబడి పల్లెత్తు మాటగూడ అనగలిగిన ధైర్యంలేదు. మేనరి వాడివంక చూచి "నీయెదురు నువ్వు కొట్టుకో. ఇంకా అట్టా నిలువుగుడ్లేసుకు చూస్తావెందుకు. నూటికి పదిహేను. బేరం ఖాయమేలే!" అన్నాడు.

ఇప్పటివరకూ నోట్లో పైటకుక్కుకుని ఏడుస్తూన్న పున్ని రయ్యిమంటూ లేచింది. "ప్లో. ఇంటికి నుప్పెట్టు నా గీత ఇట్టా రాసుండబట్టే ఇట్టాంటి కసాయాడిని కట్టుకున్నా. దొయ్యి. ఇల్లంతా దోచిపెట్టు" అని కేకలేసి తెచ్చిన బొక్కెన అక్కడ పడేసి ఇంటిముఖం పట్టింది.

"అటెక్కడికే. బొక్కెన పుచ్చుకుని నూతికెల్తావా? పాతిపెట్టనా?" అంటూ లేచాడు హీరా.

పున్ని కొయ్యబారినట్లు నిలబడిపోయింది. అడుగుతీసి అడుగువేసే ధైర్యంలేదు. నోరెత్తకుండా వంగి, బొక్కెన అందుకుని నూతివైపుకు నడిచింది.

"ఆడదాన్ని అట్టా కొట్టగూడదురా. వాళ్లు సిగ్గూ శరమూ వదిలేశారూ అంటే నిభాయించుకోటం మాటలు గాదు. తెలుసా!" అంటూ బుద్ధిచెప్పాడు హోరీ తమ్ముడికి.

ఇంతలో ధనియాగూడ గుమ్మంలోకి వచ్చింది, "ఏం. అక్కడ నుంచిని తమాషా చూస్తన్నావా. నీ మాటెవళ్ళన్నా ఇంటారనా నుంచుని వేదాంతం చెబుతున్నావ్. ఈ మరదలేగా నిన్నగాక మొన్న నిన్ను నానామాటలూ అంది. సిగ్గులేకుండా

పరాయి మొగాళ్ళో పోట్లాడేదాన్ని ఏమీ అనకుండా నెత్తినపెట్టుకుని పూజిస్తారా?" అంటూ కేక లేసింది భర్తమీద.

హోరీ కిమ్మనకుండా భార్య దగ్గరికివచ్చి కొంటెగా చూచాడు. "నేనుగూడా నిన్ను వాడు తన్నినట్టు తంతే!" అన్నాడు.

"ఊహుం ఎప్పుడూ కొట్టేరగనట్టే..."

"వాడు కొట్టినట్టు వెనకా ముందూ చూడకుండా కొడితే యిల్లొదిలిపెట్టి పోయేదానివి. పున్ని కాబట్టి అంతా మింగి వూరుకుంటుంది."

"ఒహ్హో! మాలావు జాలిగుండె వాడివికాదూ. హీరా కొట్టనూకొడతాడు; నెత్తికెక్కించుకుంటాడు. నీకు కొట్టం మట్టుకు చాతనౌతుంది. నేను కాబట్టి యీకొంప యీదు కొస్తున్నాగాని..."

"చాల్లేవే శ్రీరంగనీతులు చెప్పొచ్చావ్. అలిగలిగి పుట్టింటికి పారిపోతే వచ్చి మూతి సవరదీసీ, బ్రతిమలాడుకునీ వెంటబెట్టుకొచ్చేవాడిని గాదూ?"

"అవసరమైతే మరి నువ్వే నన్నమాటేంటి? అందరూ చేస్తారు."

"అందుక నేగదే నువ్వంటే నాకంత మక్కువ!"

దాంపత్య జీవితమే అలాంటిది. వివాహమైన మొదటి రోజుల్లో ఉదయించిన కోరికలు గులాబీపువ్వుల్లా వికసిస్తాయి. అరుణారుణ కిరణాలు హృదయమంతటా పరచుకుంటాయి. జీవితమంతా ఒక మధుర స్వప్నమేనేమోననిపిస్తుంది. కొంత కాలం జరిగింతర్వాత జరిగే కథేవేరు. జీవితమంతా మధ్యాహ్న

మార్తాండుడిలా మండుతుందా అనిపిస్తుంది. ప్రభాత కిరణాల లోని లాలిత్యం మాయమైపోతుంది. జీవితంలోని నగ్నసత్యం గేలిచేస్తూ నిలబడుతుంది కళ్లముందు. మనసంతా అప్పుడికి నట్టుడుకుతుంది. తర్వాత సాయంసమయం వస్తుంది. అలసి పోయిన బాటసారుల్లా ఆసాయం సమయపు నీడల్లో కూర్చొని మనం నడచిన బాటలూ, గడచిన వూళ్లూ జ్ఞప్తికి తెచ్చు కుంటాం. ఆ చల్లగాలిలో కూర్చుని పడిన కష్టాలన్నీ మరచి పోతాం–ఆ కష్టాల్ని అనుభవించింది మనం కాదన్నట్లూ, మనం ఏదో ఎత్తైన శిఖరంమీద కూర్చుని, మైదానంలో జరిగే గందర గోళానికంతటికీ దూరంగా, అందకుండా, సంబంధం లేనట్లుగా వున్నట్లూను.

అంతవయసు చూచిన ధనియా కళ్లుగూడ ఏదో వింత కాంతితో మెరసిపోయినయి. "చాల్లేద్దూ! చెప్పొచ్చావు. కాస్త పనాలస్యమైతే గొంతెక్కి కూర్చుంటావూ!"

"ఇదిగో! ఆ మాటంటేనే నాకు బాగుండదు. భోలా నడగరాదూ? నీకే తెలుస్తుందిగా నిన్ను గురించి నేనేం చెప్పేదీని" అన్నాడు హోరీ. కోపమూ, విసుగూ కలిగినట్లభినయిస్తూ.

భార్య మాట మార్చేసింది. "చూద్దాంగా. అబ్బాయి అవుని తోలుకొస్తాడో మరి చేతులూపుకుంటూ వస్తాడో!"

"భోలా మంచివాడేనే. కొడుకులు మాత్రం వుద్దండులు. ఏమీ గల్లంతు జరగలేదుగదా అని చూస్తూన్నా."

ఇంతలోనే చెమటలు కారుకుంటూ వచ్చాడు మేదరి. "వచ్చి వెదురుకర్ర లెక్కపెట్టుకో బాబూ. రేపొచ్చి యెత్తించుకుపోతా."

వెళ్లి లెక్కపెట్టుకోవలసిన అవసరమేమీ లేదనుకున్నాడు హోరీ. యీ మేదరి గూడా ఎరిగినవాడే. అదీ కాకపోయినా ఒకటీ అరా ఎక్కువ పట్టికెళ్తే మాత్రం పోయేదేముంది? రోజూ ఎవళ్ళో ఒకళ్ళు పెద్దపనికీ, చిన్నపనికీ, పండెళ్ళకనీ, కొట్టుకుపోతూనే వుంటారు అడగకుండా.

మేదరి రొంటి ముడివిప్పి ఏడున్నర లెక్కపెట్టి హోరీ చేతిలో పెట్టాడు. హోరీ లెక్కచూచుకుని "మిగతాది కూడా యిచ్చెయ్యి. ఇంకా రెండున్నర రావాలిగా" అన్నాడు.

"అదేంటయ్యో. పదిహేనుగ్గా పైసల్చేసుకుంది?"

"పదిహేనని ఎవడన్నాడు? ఇరవయ్యి!"

"నీ ముందే కదండీ మీ తమ్ముడు పదిహేనన్నాడు. కావాలంటే యెళ్ళి పిలుచుకొస్తా."

"ఈమాటలన్నీ ఎందుకులే. నీకూ తెలుసు నాకూ తెలుసు ఇరవయ్యని. ఇకనీఇష్టం. రెండున్నర కాకపోతేమానె. రెండన్నా యివ్వు."

మేదరివాడే నా అంత తక్కువ తిన్నది? హోరీ నోరెత్తేందుకు వీలులేదు. నెత్తీ నోరూ కొట్టుకుని "ఈ రెండు రూపాయల్తోనూ ఊళ్లేల్తానంటలే" అని మాత్రం అని ఊరుకున్నాడు.

మేదరివాడూ ఊరుకోలేదు. "కాదులే. తమ్ముళ్ళని మోసంచేసి నువ్వే ఏలేవాడివి ఊళ్ళని యీ రెండు రూపాయల్తోనూ. నాలుగు డబ్బులకోసమని నానా గడ్డి తింటావు. నాకు నీతులు చెప్పొస్తావు. పద పది మందిలోకి" అన్నాడు.

పాపం! హోరీకి చెప్పుదెబ్బలు తిన్నట్లయింది. వాడు డబ్బు ముందు పడేసి వెళ్ళిపోయాడు. అట్లాగే వాకిట్లో

కూర్చుని 'ఎంత తప్పు చేశాను. ఎంత తప్పు చేశాను' అని కళ్ళ నీళ్ళు కళ్ళ కుక్కుకున్నాడు హోరీ. ఆ రెండున్నరే మేదరివాడి దగ్గర పిండివుంటే నాయంత ఘనుడు లేడని మురిసిపోయేవాడు. పాపం! ఎదురుదెబ్బ తగిలింతర్వాతేగదా ఎవరైనా దారిచూచి నడిచేది!

మేదరివాడు రాగానే యింట్లోకెళ్ళిన ధనియా మళ్ళీ వాకిట్లోకొచ్చింది. క్రిందపడివున్న డబ్బుతీసి, లెక్కపెట్టి "మిగిలినడబ్బేదీ? పదిగా రావాలిసింది?" అనడిగింది.

"హీరా పదిహేను రూపాయలకే యిచ్చేశాడంటలే." అని యింత మొఖం చేసుకున్నాడు హోరీ.

హీరా ఐదురూపాయల కిచ్చుకుంటాడు! మనకా బేరాలేమీ కుదరవ్."

"అక్కడంత దెబ్బలాట జరుగుతోంటే ఇంకా నేనేం మాట్లాడతాలే అని వూరుకున్నా."

మామిడికాయలు దొంగతనంగా కోసుకుందామని చెట్టెక్కినవాడు కాలుజారి క్రిందబడితే దెబ్బతగిలిందే అని చూచుకోడు. గబగబా లేచి, మన్నుదులుపుకుని ఎవళ్ళూ చూడలేదుగదా అని నాలుగువైపులా చూస్తాడు. అట్లావుంది హోరీ పరిస్థితి. మోసంచేసి లాభంపొందితే గొప్పగాని; అంత యిసుక తక్కేడా పేడతక్కేడా అయితే...!

ధనియా భర్తని చీవాట్లుపెట్టింది. వస్తుతః భర్త మంచి లౌకికుడు. ధనియా కిలాంటి అదునెప్పుడూ చిక్కలేదు. దొరికిందే వీలుగదా అని "అవున్లే పాపం! చిన్నారి తమ్ముడా. కాదంటే చిన్నబుచ్చుకుంటాడేమో నని వూరుకున్నావు.

అందుట్లోనూ పాపం మరదలుపిల్ల ఏడుస్తూంటే ఇంకేం బావగారి మనసునీరై పోయుంటుంది. అందుకనేగా వూరుకొంది' అంటూ ఎత్తిపొడిచింది.

హోరీ కిమ్మనలేదు. కుళ్ళుబోతుతనం వచ్చింది; కోపం కలిగింది, పళ్ళు కొరుక్కుని వూరుకున్నాడు. మాట్లాడకుండా కొడవలి చేతబట్టుకుని పొలానికని బయల్దేరాడు.

"పొద్దు నెత్తికెక్కినతర్వాత పొలంవెళ్లి నువ్వు పాటు పడేదేంటి? నీళ్ళుపోసుకురా. అన్నంవుడికింది" అంటూ కొడవలి లాక్కుంది భార్య.

"నాకు ఆకలెయ్యటంలా!" అన్నాడు హోరీ చిన్న పిల్లాడిలా.

"కాదంటలేమరి. ఆకలెందుకేస్తుంది. తమ్ముడు పెట్టిన లడ్డులు తినొచ్చావాయె." అని అగ్నిలో ఆజ్యం పోసింది ధనియా.

ఇక కోపం దిగమింగలేక పోయాడు హోరీ. "నాలుగు తంతేకాని వూరుకోవేమిటే?"

"అంతేలే. సవరదీసి సవరదీసి అలిసి పోయావుగా!" అని నోటితో మాటాడి, నొసటితో వెక్కిరించింది ధనియా.

ఇంట్లో వుండనిస్తావా? పైపంచి భుజానేసుకుని ఎక్కడి కన్నా వెళ్లిపొమ్మంటావా?"

"అయ్యయ్యో! అదేంవన్నమాట. ఈ యిల్లునీది. కామందువి నువ్వు. మధ్య నేనెవర్ని వెళ్లిపొమ్మనటానికి?"

ఏమని మాట్లాడితే భార్యనోటికి తాళం పడుతుందో అర్థంకాలేదు హోరీకి. ఈ యెత్తిపొడుపులు యెట్టా తప్పించు

కోవాలో అర్థంకాలేదు. మాట్లాడకుండా అంగవస్త్రం తీసుకుని స్నానానికి వెళ్లాడు. స్నానంచేసి వచ్చేటప్పటికి అరఘంట పైనే అయ్యింది. ఇంకా కొడుకు రాలేదు. అక్కడే నిద్ర పోతున్నాడో ఏమో! నిన్ననే ఆ భోలా కూతుర్తో సరసాలు మొదలుపెట్టాడు. దాంతోనే నవ్వుతూ, ప్రేలుతూ కూర్చున్నాడో ఏమో. ఆవుని తోలిపెట్టకపోతే తిరిగి రావచ్చుగా. ఒంటరిగా కూర్చుని అన్నం తినేదెట్లా!

"ఇంకా కూర్చొన్నావెందుకు? అబ్బాయి సాయంకాలానిగ్గాని రాడేమో" అన్నది భార్య.

ఏమంటే ఇంకేమంటుందో అని మాట్లాడకుండా, భోజనం చేసి, డొక్కనారమంచం మీద నడుం వాల్చాడు హోరీ.

ఇంతలో చిన్నకూతురు రూప ఇల్లెగిరిపోయేట్లు ఏడుస్తూ వచ్చిపడింది. తండ్రి పొట్టమీద పడుకుని ఒకటే ఆలాపన! ఆవొస్తే నన్నావుదగ్గరికి వెళ్ళనివ్వను అంటుంది అక్కయ్య. పేడ తనని చెయ్యనే చెయ్యనివ్వదట. రూప కిదంతా ఏమీ బాగుండలేదు. పెద్దక్క ఏమైనా మహారాణీయా యేమిటి తనని ఆవు దగ్గరికి పోనీకుండా చేసేందుకు. రూపమాత్రం చిన్నదా? అక్కయ్య అన్నం వండుతుంది. నిజమే! రూప మాత్రం అంట్లు తోమటంలేదా? అక్కయ్య నూతికని కడవ చంకనబెట్టుకెళ్తొంటే రూప బొక్కెన, త్రాడూ మోసుకెళ్లటం లేదూ? అక్కయ్య పొలం పనికి వెళ్తే రూప గొర్రెల్ని మేపుకొస్తుంది. ఇకరూప అక్కయ్యకంటే ఎందులో తక్కువ?

ఆ అమాయకత్వాన్ని చూస్తే తండ్రికి నవ్వొచ్చింది.

"అంతేలేమ్మా. నువ్వే వెళ్తూగాని. ఆవుదగ్గరికొస్తే అక్కయ్యని తరిమి తరిమి కొడదాం. సరేనా!" అని బుజ్జగించాడు.

పాలుగూడా నేనే పితుకుతా..." అంటూ కూతురు మారాంచేస్తే "నువ్వుకాకపోతే యింకెవళ్లు పితుకుతారమ్మా! అని సముదాయించాడు తండ్రి.

"అది నా ఆవే. నాదేగాదూనాన్నా!" అని కూతురు గుచ్చి, గుచ్చి అడిగితే "ఓ ఆవంతా నీదేతల్లీ" అని ముద్దు పెట్టుకున్నాడు తండ్రి.

ఇక రూపని పట్టేందుకు పగ్గాలులేకండా పోయినాయి. యీ విజయాన్ని అక్కదెగ్గరికివెళ్లి చెబితేగాని నిద్రపట్టదు. ఆవునాదే. పాలు నేనే పితుకుతా. పేడ నేనే చేస్తా. ఇక నీ పని వట్టిదే.

పెద్దకూతురు సోనాకి కూడ పెద్ద వయసులేదు. అయినా అంగసౌష్టవం వున్న పిల్ల కావటంచేత యీడొచ్చి నట్లుంటుంది. కాని యింకా పసిబుద్ధి వదలలేదు. యౌవనం ముందుకు లాగుతుంటే శైశవం వెనక్కి లాగుతోంది. కొన్ని మాటలు చదువుకున్నవాళ్ళకంటే మిన్నగా మాట్లాడుతుంది - వయసుకు మించినట్లు ఒక్కోసారి చూస్తే 'ఇంకా చిన్నపిల్లేనా!' అని పిస్తుంది. పొడుగ్గా, కర్రలావున్నా ముఖం కళకళలాడుతూ వుంటుంది; కళ్ళల్లో ఒక విధమైన తృప్తి మెరుస్తూంటుంది. కళ్ళకి కాటుకలేదు; తలకి నూనెలేదు; మెళ్లో చిన్నమెత్తు నగ లేదు. కుటుంబ భారం ఆ అమ్మాయి యౌవనాన్ని అదిమి పెట్టేసిందా అనిపిస్తుంది.

తలతో వొక్క విసురు విసిరి "ఫో ఫోవే. ఎళ్లి పేడ చెయ్. పాలు పితుక్కురా. నేను తాగాలి" అంటూ చెల్లెల్ని గదమాయించింది.

"పాలచెంబే అలమరలో పెట్టి తాళం ఏస్తా."

"తాళాం పగలగొట్టి తాగుతా పాలు" అంటూ మామిడితోపుకని బయల్దేరింది అక్క. అక్కడికెళ్తే గాలికి క్రిందబడ్డ మామిడిపిందలు ఏరుకుని తినవచ్చు. చెల్లెలు గూడ వెంటబడింది. అక్కయ్య యేపనిచేసినా సరే, చెల్లెలు గూడా ఆపని చేసెయ్యవలసిందే. ఈమధ్య అక్కయ్య వివాహాన్ని గురించి అందరూ మాట్లాడుకుంటున్నారు. రూప పెళ్లిసంగతి ఎవ్వరూ పట్టించుకోనేలేదు. అందుకని తానే స్వయంగా పట్టుపట్టింది. 'నాపెళ్ళి చేయిం చెయ్యండి" అని పెండ్లి కొడుకిట్లా వుండాలి; ఈ యీ నగలుపెట్టాలి; నాకిది యిది పెట్టాలి; నన్నిట్లా యిట్లా చూడాలి; నాకీచీరలు కొనిపెట్టాలి, అంటూ ఆవిడగారు చెప్పేమాటలూ, కోరుకునే కోరికలూ వింటే ఏ మగవాడూ 'ఈ అమ్మాయిని నేను చేసుకుంటా' అనేందుకు సాహసించలేదు!

ప్రొద్దు వాలిపోయింది. ఏమిచెయ్యకపోయినా హోరీ అలిసిపొయ్యాడు. పొలంవెళ్ళాలంటే ఓపికలేకుండాపోయింది. ఎడ్లకి రెంటికీ కుడితిపెట్టి, చుట్టచుట్టుకుని మళ్లీ మంచంమీద నడుం వాల్చాడు.

ధాన్యం అంతా కల్లంలోనే అమ్మేశాడు. అయినా అప్పులు అట్లాగే పెరుగుతున్నవి పాపం పెరిగినట్లు. మూడు

వందలకి వంద వడ్డీ. ఎడ్లకని అయిదు సంవత్సరాలనాడు అప్పు తెచ్చిన అరవయ్యీ తీర్చేసినా, వడ్డీ మళ్లీ అరవయ్యయ్యింది. ఝూంగ్లో శాస్త్రిగారిదగ్గర ముప్పై తెచ్చి బంగాళాదుంపలు నాటాడు. అయిన దుంపలు దొంగలు త్రవ్వేసుపోయారు. ఈ మూడు సంవత్సరాల్లోనూ ఆ ముప్ఫయీ గుణకారం చేసుకుని వంద అయినయి. వేర్లుపడ్డప్పుడు కోమటమ్మదగ్గిర నలభై అప్పు తెచ్చి తమ్ముళ్ళకి సర్దాడు. రూపాయికి అణా వడ్డీ. దగ్గర దగ్గర అది వందదాకా దేకేవ్రుంటుంది. ఇంకా పాతికరూపాయలు పన్నుగట్టాలి. మళ్లీ యీ దసరామామూళ్ళొకటి వెదురమ్మిన డబ్బుతో ఎట్లాగో ఒకలాగు యీ మామూళ్ళబెడద వదలించుకోవాలి. చేతిలోకి చిల్లిగవ్వ వచ్చిందని తెలిస్తే చాలు అప్పుల వాళ్ళు యీగల్లా ముసురుకుంటారు. అసలైన రెండుపనులూ అట్లాగేవున్నయి. అబ్బాయికీ, పెద్దమ్మాయికి పెళ్లిళ్ళు చేయాలి. ఎంత లేదనుకున్నా మూడునందలు కావాలిసొస్తుంది. ఎవళ్ళింట్లో కన్నంవేస్తే ఎవరూరుకుంటారు......?

అప్పులన్నీ తీర్చేద్దామనుకుంటాడు. తర్వాత చచ్చినా కాండబ్బు అప్పుచెయ్యకుండా, హాయిగా, కాలుమీద కాలు వేసుకుని బ్రదకాలనుకుంటాడు. ఎంత పొట్టగట్టుకున్నా, ఎన్ని యిబ్బందులు పడ్డా అప్పు తీరిపోయేదారి కన్పించదు. వడ్డీ పాపం పెరిగినట్లు పెరుగుతూనేవుంది. ఇంకా నాలుగు సంవత్సరాలు యిట్లాగే వుంటే - ఇల్లూ, గొడ్లూ, గోదా - అన్నీ - అమ్మినా అప్పు తీరేవిధానం కన్పించటంలేదు. వున్నది కాస్తా వేలాం అయిపోతే బిడ్డలనెత్తిమీద నీడగూడ లేకుండాపోతుంది. బిచ్చమెత్తుకుని బ్రదకాల్సి వస్తుంది......

పనీ, పాటా చేసుకున్నతర్వాత కాస్సేపు నడుంవాల్చితే యివీ ఆలోచనలు. నాలుగువైపుల్నుంచీ యీ నల్లటి గోడలు అతన్ని జైలులో బంధించినట్లు వూపిరి సలపనీయవు. కాకపోతే ఒక్కటే మనశ్శాంతి: అతను ఒంటరిగాడుకాదు. ఈ కష్టాలన్నీ ఆవూళ్లోవున్న రైతుల కందరికీ వున్నయి. కాస్త తనేమెరుగేమో. తమ్ముళ్ళు వేరుపడి మూడు సంవత్సరాలయ్యిందో లేదో అప్పుడే ఒకొక్కడూ నాలుగేసి వందలు అప్పులు చేసుక్కూర్చున్నారు.

ఆలోచనలు ఒక ఒడ్డు చేరకముందే ఆడపిల్లలిద్దరూ పరుగెత్తుకుంటూ వచ్చారు. "నాన్నా! నాన్నా!! అన్నయ్య ఆవుని తోలుకొస్తున్నాడు." అని యిద్దరూ ఒకేసారి చెవులు గింగురు పడేట్లు చెప్పారు.

రూప అందరికంటే ముందు చూచింది. అయినా అక్కయ్యకూడా తనతోపాటు చూచొచ్చినట్లు చెబుతోంది. అందుకని "ముందునేను చూచానానాన్నా. నీకు చెబుదామని పరిగెత్తుకొస్తాంటే అక్కాయిగూడా వచ్చింది" అంటూ నాన్నతో ఫిర్యాదుచేసింది.

"అన్నయ్యని ఆనవాలు పట్టలేకపోయావ్‌గాని - ముందు చూచిందట. ముందు. ఏదో ఆవు పారిపోయొస్తాందని చెప్పింది. నేనేగా చెప్పిందికాదే అన్నయ్య తోలుకొస్తున్నాడే అని" అన్నది సోనా.

మళ్లీ యిద్దరూ తోటవైపుకి పరుగెత్తారు ఆవుకి స్వాగత మిచ్చేందుకు.

భార్యా భర్తలు ఆవుని కట్టేసేందుకు కావలసిన ఏర్పాట్లు చూస్తున్నారు. "పద; కట్టుగొయ్య పాద్దాం" అన్నాడు హోరీ.

"అప్పుడే యేం తొందరొచ్చిందిలే. పళ్ళెంలో కాస్త పిండీ, బెల్లమూ కలపనీ. ఎండలోపడి వచ్చిందా పాపం! నువ్వు కట్టుగొయ్య పాతు. నేనాపని చూస్తాలే."

"చూడవే. ఆ చూర్లో గంటల పట్టెడుండాలి. ఆవు కట్టడతాం."

"పెద్ద దెక్కడికి చచ్చింది? ఆవుకి దిష్టి తగుల్తుందేమో. కోవఁటింటికి పంపి నల్లదారఁవ్వూఁ, మిరపకాయలూ తెప్పించాలి."

"అబ్బ! ఎప్పట్నుంచీ అనుకుంటున్నానో. ఈనాటికి దేవుఁడు దయతలిచాడు."

ధనియా ఆనందంతో వుబ్బితబ్బిబ్బౌతోంది. ఇంత సంతోషపడుతున్నాను. ఏమీ ఆపద రాదుగదా తర్వాత అని కాస్త నిలదొక్కుకుంది కూడాను. ఏమోలే! ఇదంతా దేవుఁడి దయ. ఇల్లలగ్గానే పండగయ్యిందంటలే!!

అట్లా ఆ భారమంతా దేవుడిమీదే వేయటం మంచి దనిపించింది ఆవిడకి. లేకపోతే యీ ఆనందం అంతాచూస్తే దేవుఁడికి కన్ను కుట్టవచ్చు. కన్నుకుట్టిన దేవుఁడేమైనా చేస్తాడు!

ఇంకా పిండి కలపనే లేదు, గోవర్ ఆవుని తోలు కొచ్చేశాడు. హోరీ పరుగెత్తికెళ్ళి ఆవుమెడ కౌగిలించు కున్నాడు. ధనియా పిండీ, పళ్ళెమూ వదలిపెట్టి గబగబా పాత

చీరొకటి చూచి, నల్లటంచు బరబరా చింపి, వెళ్ళి ఆవు మెడలో కట్టేసింది.

సాక్షాత్తూ భగవంతుడే తన యింటికి విచ్చేసినట్లు భావించాడు హోరీ. ఈనాటి కతని దొడ్డిలో గోదేవత పాదం పెట్టింది; అతని బ్రదుకు పవిత్రమైంది. ఎన్ని నోములు నోస్తే కలిగిందో యీనాటి కీ సౌభాగ్యం !

# 5

గోవర్ కి వూళ్లో జరిగిన గొడవేమీ తెలియదు. అతను భోజనం చేయగానే గొల్లపల్లె పోయాడు. ఇవ్వాళ ఝునియాతో చాలా సంభాషణ జరిపాడు; ఆవును తోలుకొచ్చేప్పుడు ఝునియా అతనితోపాటు సగందూరంపైగావచ్చి సాగనంపింది. ఒంటరి మనిషికి ఆవునిచ్చితోలిపెట్టడం బావుండదు; నిజమే. కాని బాగా పరిచయంలేని మనిషితోపాటు పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ నడవడం అంటేనూ మాటలుకాదు! కొంచెం దూరం నడిచింతర్వాత "ఇంకా మా వూరెందుకొస్తావులే" అని ఎత్తిపొడిచినట్లుగా అన్నది ఝునియా.

నిన్నటివరకూ అతను కుర్రవాడితో సమానమే. "ఊళ్లో వున్న వయసు వచ్చిన ఆడపిల్లల్ని చెల్లెళ్లనో, అక్కలనో, వదెన్లనో వరసలు కల్పించి మాట్లాడేవాడు; వరసకి అక్కా-చెల్లెళ్లయినవాళ్ళు ఎట్లాగూ సరసాలాడరు; వదినెలయ్యేవాళ్లు అప్పుడప్పుడూ సరసాలాడేవారేకాని; ఆ సరసాల్లో దాగిన కోర్కెలుగాని, అందనిభావాలుకాని వుండేవిగాదు. ఆ సరసాల గిలిగింతలు నవ్వు తెచ్చిపెట్టేవేకాని మనసుకు గిలిగింతలు పెట్టేవికావు. ఏ వైపునుండీ తగిన ప్రోత్సాహం కలక్కపోవటం

చేత కౌమార్యం అతన్ని మరింత గట్టిగా కౌగలించుకుని కూర్చుంది. ఝునియాకి కూడ యీ విషయం తెలుసును. అంచేతనే అతనంటే ఆవిడకంత ఆకర్షణ. ఎండుటాకులు గలగల మనగానే లేచి నిలబడే జంతువులా అతనిలో ఇంతవరకూ దోబూచు లాడుతూన్న యౌవనం ఒక్కసారిగా లేచి వళ్ళు విరుచుకుంది.

" ఎందుకు రానూ? బిచ్చం దొరుకుతుందనే ఆశ కలిగింతర్వాత ఏ బిచ్చగాడన్నా గుమ్మం వదలిపెడ్తాడా! పగలనకుండా, రాత్రనకుండా అక్కడే పడిగాపులు పడుంటాడు" అన్నాడు గోవర్.

"అంతేలే! బెల్లంవున్నచోటకే వస్తయి చీమలు!" అని అంటించింది ఝునియా.

అతని ధమనుల్లో రక్తంపరుగులు పెట్టింది. "ఆకలైన వాడు చెయ్యిచాచక యేంచేస్తాడు? వాడ్నేమన్నా అంటే మాత్రం లాభంఏముంది!" అన్నాడు.

ఝునియా మరింతలోతుకు దిగింది. "బిచ్చగాడు పది గుమ్మాలు తిరిగితేగాని పొట్టనిండదు. నే నట్టాంటి బిచ్చగాళ్ళ ముఖంగూడా చూడను. అట్టాంటాళ్ళు 'కో' అంటే కోటి మంది దొరుకుతారు. వాళ్ళు 'మాతల్లి మంచిది' అనంటే మనకొరిగేదిమాత్రం ఏముంది? వాళ్ళామాటన్నా నిండుతుంది, అనకపోయినా నిండుతుంది నాపొట్ట."

గోవర్‌కి యీ మాటల లోతుపాతులేమీ అర్థం కాలేదు. అతనికంత తెలివితేట లెక్కడివి? ఝునియా అంటే ఇంతప్పటినుండి పాలమ్మేందుకు పట్టణం వెళ్ళేది; ఎక్కని

గడపంటూ లేదు. ఇప్పటికీ అప్పుడప్పుడూ పెరుగు పట్టుకెళ్తూనే వుంటుంది అమ్మకానికి. రకరకాల మనుష్యుల్ని చూచింది; లోకం పోకడలన్నీ తెలుసుకుంది. ఆవిడ కోరేది మిణుగురు పురుగుల మిలమిలలు కాదు; దీపాన్ని అంటిపెట్టుకుని వుండే నిశ్చలకాంతి కావాలి ఆవిడకి. ఆ కాంతికోసం ఆవిడ తన సర్వస్వం అర్పించేందుకు సంసిద్ధంగా వుంది. కనులు గిలిపి, సరసాలాడి, సర్వనాశనం చేసే జల్సాగాళ్లని తన దరిదాపుల్లోకి కూడా రానీదు. ఝునియా నీతీ, నియమమూ వున్న ఇళ్ళల్లో పెరిగిన ఆడపడుచు.

గోవర్ తెప్పరిల్లి "అడిగిన యింటికాడే, అడిగినంతా, పొట్టనిండా దొరికితే ఇంటింటికీ తిరిగి బిచ్చమెందుకు ఎత్తుకుంటాడు బిచ్చగాడు మాత్రం? రోజూ ఆ యింటికే వెళ్తాను!" అన్నాడు.

అతనిమాటలు వింటూవుంటే ఝునియాకి జాలివేసింది. పాపం? ఒఠి అమాయకుడిలా వున్నాడు. అభమూ, శుభమూ తెలియనట్లుంది.

"బిచ్చగాడి కడుపునిండా వొక్కింటికాడే ఎట్లా దొరుకుతుంది. పట్టెడన్నం కంటే ఎక్కువ ఎట్టాగూ దొరకదు. నీకున్నదంతా నువి స్తేనేగా ఎవళ్లైనా వాళ్ళకున్నదంతా నీకిచ్చేది!"

"నాదగ్గరేంవుంది ఝునియా యివ్వటానికి?"

"నీదగ్గరేమీం లేదూ? కోటికి పడగలెత్తేవాళ్ల దగ్గర కూడానీదగ్గర వున్నదాంటో వందోవంతులేదు. నన్ను బిచ్చమడగాల్సిన పనేలేదు; నించున్నదాన్ని నించున్నట్టే కొనేసెయ్యగలవ్ తల్చుకుంటే."

గోవర్ ఆశ్చర్యపోయాడు. ఝునియావంక వింత చూపులు చూచాడు. ఝునియా మళ్ళీ అంటుకుంది.

"ఏంచేస్తే నన్ను కొనుక్కోగల్గుతావో తెలుసా? బ్రతికి నంతకాలమూ నావాడివిగానే వుండాలి. మళ్లీ యింకో యింటి కెళ్లి బిచ్చమడిగినట్లు తెలిస్తేనా, నిన్నింటోనుంచెళ్ళ గొట్టానన్న మాటే!"

ఆనందంలో వుప్పొంగిపోయాడు గోవర్. చీకట్లో తారట్లాడే మనిషికి కావలసిన వస్తువు చేతికందింది. ఇంత ఆనందంలోనూ ఎక్కడో ఒకమూల, ఏదో అర్థంకాని భయం, జంకు నక్కి కూర్చున్నట్లుంది. ఇదంతా సాధ్యమయ్యే సంగతేనా? ఝునియాని వుంచుకుంటాడా? వుంచుకుంటే - వుంపుడుగత్తెను తీసుకొని యింటికెట్లా వెళ్తాడు? ఇరుగు పొరుగువాళ్లేమంటారు? లోకులు కాకులు కాదూ? ఊరంతా కట్టడికట్టి ఎదురుతిరిగితే? ఇదంతాయెందుకు? అమ్మేఊరుకోదు వెంటపెట్టుకునివెళ్తే. అయినా ఆడదానికిలేని భయం తనకెందుకు? అంత ముంచుకొస్తే వెలివేస్తారు. అంతేగా! పోనీ, వేరేనే వుంటాడు. ఎన్ని జన్మలెత్తినా దొరకదు ఝునియాలాంటి ఆడది. ఇట్లాంటి ఆడది వూరంతా గాలించినా కనిపించదు. ఏమి తెలివి తేటలు; ఎంత చక్కగా మాట్లాడుతుంది! ఆయమ్మాయికున్న తెలివితేటల్లో వందోవంతుగూడా లేవు తనకి; అయినా ఝునియా తనతోనే వుంటానంటుంది. తననే ప్రేమిస్తోంది. ఊళ్లోవాళ్లు వెలివేస్తే యింకోవూరికి పోవచ్చు. దేశంలో వూళ్లే కరువైనవా? అయినా వూరుమాత్రం ఎందుకు వదలాలి? శర్మ మాదిగదాన్ని తీసుకొచ్చి యింట్లో పెట్టుకోలా. అంటే ఒకటి. ఇప్పటికీ

స్నానమూ, సంధ్యాచేస్తేనేగాని మంచినీళ్లుకూడా ముట్టడు. ఏమైతేనేం? శాస్త్రి, శర్మ, ఒక పంక్తిని కూర్చుని భోజనం చేస్తున్నారిప్పుడు. ఝుంగురసింగు బ్రాహ్మలమ్మాయిని తెచ్చి యింట్లో పెట్టుకుంటే ఎవ్వరూ నోరుమెదిపిన పాపానపోలేదు. ఇదివరకెట్లా వున్నాడో యిప్పుడూ అట్లాగే వున్నాడు. ఆ మాటకివస్తే యిప్పుడే కాస్త మెరుగని చెప్పవచ్చు. ఇదివర కంటే వుద్యోగంకోసం అదేపనిగా తిరుగుతూండేవాళ్లు. ఇప్పుడంటే వూళ్లో పెద్దమనిషి! అయినా ఝునియూ గమ్మత్తు చేస్తూండేమో. అడిగి తేల్చేసుకుంటేనే బాగుంటుంది.

"మనస్ఫూర్తిగానే అంటన్నావా ఝునా! లేకపోతే నన్ను బెల్లించుతున్నావా? నేను నీవాడినే; నువ్వు నావాని వయ్యినట్టేనా?"

"నువ్వు నావాడి నైపోయ్యావా? ఋజువేంటి?"

"నువ్వు ఊఁ అంటే ప్రాణాలిచ్చేస్తా!"

"ప్రాణాలివ్వటమంటే ఏఁవిఁటో తెలుసా నీకసలు?"

"నువ్వు చెప్పరాదూ తెలిసేట్టు?"

"ప్రాణం యివ్వటం అంటే కలిసి, మెలిసి కష్టాలుపట్టం. ఒకసారానుకుం తర్వాత ప్రాణాలు పొయ్యేదాకా వదిలిపెట్ట కుండా వుంటం. లోకం ఏమనుకున్నా సరే లెక్కపెట్టకుండా వుంటం. తల్లిదండ్రుల్నీ, అన్నదమ్ముల్నీ, అయినవాళ్ళనీ, ఇల్లూ గిల్లూ - ఏదైనా సరే - వదిలిపెట్టాలిసొస్తే వెనకాడకుండా వదలి పెట్టెయ్యటం. ప్రాణాలిస్తాం; ప్రాణాలిస్తాం అని నోటిమాటలనే వాళ్ళని చాలమందిని చూశా. వాళ్ళంతా తేనె తాగి

పువ్వుల్లోనదిలిపెట్టిగిరిపోయే తుమ్మెదల్లాంటోళ్ళు. నువ్వు గూడా అట్టాగే ఎగిరిపోతావా ?"

గోవర్ ఒకచేత్తో ఆవుపలుపు పుచ్చుకుని నడుస్తున్నాడు. రెండో చేత్తో ఝునియా చేయిపుచ్చుకున్నాడు. ఎలెక్ట్రిక్ తీగెను చేతితో తాకినట్లయింది. శరీరమంతటా విద్యుత్ ప్రవాహం ప్రాకినట్లయింది. అతని యౌవనం అందుకుని, ఆనందించిన ప్రథమ స్పర్శ యిది. ఆవిడ చేయి ఎంత మెత్తగా, సున్నితంగా, కోమలంగా వుంది!

ఈ ఆనందంలో తానేమీ పాలు పంచుకుంటున్నట్లు కన్పించలేదు. ఝునియా చేయి వదిలించుకోలేదు. కాస్సేపున్న తర్వాత "ఇవ్వాళ నువ్వు నా పాణిగ్రహణం చేశావు. మర్చిపో బాక" అన్నది గంభీరంగా.

"చచ్చినా మర్చిపోను ఝునా. ప్రాణాలు పొయ్యే దాకా మర్చిపోను."

నమ్మకం కుదరనట్లు ఒక చిన్న నవ్వు నవ్వింది ఝునియా. "అందరూ యిట్టాగే అంటారు. ఇంతకంటే ఎక్కువగానే చెబు తారు తియ్యటి మాటలు. అరటిపండొలిచి చేతుల్లో పెట్టినట్టు మాటాడుతారు. లోపలేదన్నా కపటం వుంటే యిప్పుడే చెప్పెయ్యి. ముందుగానే జాగ్రత్త పడతా. అట్టాంటోళ్ళని దగ్గరిక్కూడా రానివ్వను; నవ్వుతూ పేలుతూ మాట్టాడతా; అంతే. పుట్టిందగ్గర్నుంచీ బజారుకెళ్తన్నా పాలమ్మటానికి. డబ్బున్నవాళ్లూ, వకీళ్ళూ, గొప్ప గొప్ప వాళ్ళూ ఒకళ్ళకంటే ఒకళ్ళు పైయెత్తు లేసేవాళ్ళు నన్ను చిక్కించుకోవాలని. 'ఝునియా! మమ్మల్నేడిపించబాకే!" అని రొమ్ముల

మీద చేతులు పెట్టుకుని ఏడుస్తున్నట్టు చూచేవాళ్ళు నావంక. కొందరు నేను చూడకపోతే ప్రాణాలే పోతయ్యా అన్నట్టు కళ్ళల్లో ప్రాణాలుపెట్టుకుని వుసూరుమంటూ కూర్చున్నట్టుండేవాళ్ళు. కొందరుడబ్బులు ఎరగాపెట్టే, కొందరు నగలు చూపించి వశంచేసుకోవాలనుకునేవాళ్ళు. వీళ్ళందరూ 'చచ్చినా, బతికినా నువ్వేగతి'అనేవాళ్ళు. అయినా వాళ్ళ అసలురంగంతా తెలుసునాకు;వాళ్ళంతా కుమ్మెదల్లాంటాళ్ళు. తేనెకాస్తా తాగేసింతర్వాత ఎగిరిపోయే రకం. నేనూ వాళ్ళ వంక దొంగచూపులు చూసేదాన్ని? ముసిముసి నవ్వులు నవ్వి మోసం చేసేదాన్ని. నేను పిచ్చిదాన్ననుకునేవాళ్లు వాళ్ళు; వాళ్ళని గాడిదల్ని చేసేదాన్ని నేను. నేను చచ్చినా వాళ్ళకంట ఒక్కబొట్టుకూడా రాదు.వాళ్ళు చస్తే 'బలేపని జరిగిందిలే. పీడొదిలిపోయింది!' అంటా నేను. ఒకళ్ళదాన్నవటం అంటే మాటలా! మంచికీ; చెడ్డకీ; సుఖానికీ; దుఃఖానికీ; బ్రదికినా; చచ్చినా; ఒక్కళ్ళతో నేవ్వుండాలి. నేనేఁవీఁ దిమ్మరిదాన్నిగాను అందరితోనూ వుంటానికి. నేను డబ్బుకీ, గుడ్డకీ, నగలకీ, మొహం వాచిలేనుఆశ చూపించినాళ్ల వలల్లోపట్టానికి. నేనూ చూస్తన్నా. ఎవళ్ళన్నా బుద్ధిమంతుడు కనబడకపోతాడా అని. ఊళ్ళో ఒక శాస్త్రుల్లగారుండేవాడు. వీభూతి పెండికట్లలు మా పెట్టేవాడు. రోజూ అర్థశేరు పాలు కొనేవాడు. ఒకనాడు ఆయన పెళ్లాం పేరంటానిక్కావఁన్నెళ్ళింది: నాకేం తెలుసు? ఎప్పటికిమళ్ళేనే పాలట్టుకుని యింటోకెళ్లా. 'అమ్మగారూ అమ్మగారూ!' అని ఎంత పిలిచినా, ఎవ్వరూ పలకరు. ఇటుతిరిగి చూద్దునుగదా శాస్త్రుల్లగారు బజారుతలుపు గెడేసి వస్తున్నాడు. వీడి నడకేమీ

బాగావుండ లేదని అప్పుడే అనుకున్నా నేను. "ఇంట్లో ఎవళ్ళూ లేరెక్కడికెళ్లారు? తలుపేశా స్తన్నా వెందుకు?" అని గద్దించడిగా.

"పేరంటానికి కెళ్లిందిలే" అంటూ యింకా పైపైకి రాబోయాడు.

"పాలు కావాలి స్తే తీసుకో. లేకపోతే నేనెళ్ళిపోతన్నా" అన్నా నేను. "ఓ ఝూనారాణీ! ఇంకెక్కడి కెళ్తావులే. రోజూ నా రొమ్ముల్లో చిచ్చెట్టెళ్తన్నావు. ఇంకెక్కడికి తప్పించుకు పోతావులే!" అన్నాడు శాస్తుర్లు.

"నిజంగా గోవర్! నాకు పిచ్చెక్కిందంటే నమ్ము."

"అస్సి చూచానంటేనా? గొయ్యితీసి గోతిలో పాతి పెడ్తా. పేగులుతీసి పచ్చినెత్తురు తాగుతా. ఎక్కడుంటాడా ముండాకొడుకు?" అన్నాడు గోవర్ ఆవేశంతో.

"వినుమరి! అట్టాంటాళ్ళ దవళ్ళు పగలగొట్టానికి నేను చాలనంటలే. నాగుండె గబగబా గబగభా కొట్టుకుంది. వీడేంవన్నా తప్పుడుపని చెయ్యబోతే? అరుద్దామా అంటే అరిచినా ఎవళ్ళకీ వినబడదు. ఐనా అంటుకున్నాడా అంటే ఆ పాలకుండపెట్టి నెత్తి పగలగొట్టాం. పోతే నాలుగైదు శేర్లు నష్టం ఔతాయి; చచ్చేదాకా గాపకం పెట్టుకుంటాడు అనుకున్నా. అనుకుని గుండె గట్టిచేసుకుని "ఏంవనుకుంటున్నావో శాస్తుర్లుగారూ. గొల్ల దేకదా అనుకుంటున్నావేమో మీసానికి మీసంపీకి అక్కడపెడతా. అయినవాళ్ళ, కానివాళ్ళ్ళడపడుచుల్ని చెరచమని వుందంటయ్యా నీ శాస్త్రాల్లో? ఇందుకేనా యింటిభూతి రాసుకుని తిరుగుతావ్. పెద్దమనిషంట పెద్దమనిషని!" అంటా నాలుగొడ్డించా. "అదికాదే. నాప్రాణంపోతాందే! నా

ప్రాణం నిలబెత్తే నీకేంతక్కువౌతుందే? నువ్వు నా రాణివి గదంటే! కాస్త నాలాంటి బీదా బిక్కీని కనిపెట్టుండకపోతే రేపు భగవంతుడుమాత్రం నిన్నడగడంటే నీకింత రూపూ, చూపూ యిచ్చినా ఒక బ్రాహ్మణ్ణి కాదన్నావెందుకే అని?" అంటూ కాళ్ళావేళ్ళా పడ్డాడు. "నేను బ్రాహ్మణ్ణే. నాకందరూ ఏదోవొక దానం చేస్తానే వుంటారు. నువ్వు నీ రూపం దానం చెయ్యవే!" అంటూ బతిమలాడాడు.

"ఖారికినే వుండలేక ఏఁవంటాడో చూద్దామని యాభై రూపాయలిస్తావా అన్నానేను. చెబితే నమ్మవుకాని గోవర్! గబగబా యినపెట్టె తెరచి ఐదు పది రూపాయలనోట్లు పట్టుకొచ్చాడు. పట్టుకొచ్చి నా చేతుల్లో పెట్టబోయ్యాడు. నేనా నోట్లు నేలమీదిసిరికొట్టి తలుపులు తీద్దామని బయల్దేరానో లేదో దబుక్కున నా చెయ్యి పట్టుకున్నాడు' నేననుకున్నంతా అయ్యింది. ఆపాటిని పాలకుండెత్తి దభీమని వాడినెత్తిమీద లాగికొట్టా. వల్లంతా పాలేననుకో. దెబ్బగూడా బాగా, గట్టిగానే తగిలిందేమో రెండు చేతుల్తోను తల పట్టుకుని కూచోబడ్డాడు. ఇదే సందుగదాఅని యింకా రెండు తన్నులు తన్ని, గబగబా తలుపులు తెరచుకుని పారిపోయొచ్చా."

గోవర్ విరగబడి నవ్వాడు. "బలేపని చేశావులే. ఆ పాలతో ఆ పెండెకట్టెలుగూడా కరిగిపోయుంటయ్యే. సరేగాని మరి మీసాలు పీక్కుండానే వచ్చేశావేఁ?" అన్నాడు.

"మర్నాడు మళ్లీయెళ్లా ఆయింటికి. ఆయనపెళ్ళాం గూడా యింటోనేవుంది. వసారాలో తలకి వాసనగట్టుకుని పడుకున్నాడు, 'ఏఁవఁయ్యా. నిన్నటికథంతా చెప్పేసెయ్యనా

అమ్మకి?' అన్నా. దణ్ణాలుపెట్టాడు. 'నేలమీదపడి నాకితే చెప్పకుండావుంటా; లేకపోతే చెప్పేస్తా!' అనిబెదరించా. గబగబా మంచందిగి మోకాళ్ళండాయేసి దణ్ణాలుపెట్టాడు. 'నీకు పుణ్యముంటుంది, వూరుకో తల్లీ! దానికి తెలిస్తే నన్ను బతక నివ్వదు' అని మా ఏడిచాడు. నాకూడా వుసూరుమని పించింది."

"అదేంవిటి? వుసూరుమంటం యెందుకు, పెళ్ళాంతో చెప్తే పెళ్ళాం నాలుగు చెప్పుదెబ్బలు కొట్టి గడ్డి పెట్టేదిగా. అట్టాంటాళ్ళంటే వుసూరుమంటం ఎందుకు? రేపుచూపించాణ్ణి నాకు. ఎట్టా మరమ్మత్తుచేస్తానో చూద్దువుగాని!"

"శాస్తిర్ని కొట్టటంవంటే మాటలనుకుంటన్నా వేంటి. ధర్మపిండాలు తిని దుండుముక్కకిమల్లే వుంటాడు" అన్నది ఝునియా. అని 'నువ్వింకా కుర్రాడివేగా!' అన్నట్టుచూచింది గోవర్ ని.

ఇంత అవమానాన్ని గోవర్ మాత్రం ఎట్లా సహిస్తాడు! అందుకనే "ఏం లావుగావుంటే సరిపోతందేంవిటి? ఈ బొమికెలూ చూచావా! ఇనప ముక్కలు. ఏంవనుకున్నావో. పాలు తాగటంలేదుకనక గాని పాలే తాగితేనా యీపాటికి కెట్టా వుండేవాడినో నీకేంవన్నా తెలుసా?" అన్నాడు.

నిజమే నన్నట్లు తలవూపింది ఝునియా. "చూపిస్తాలే; ఎప్పుడో ఒకప్పుడు. ఇక్కడందరూ ఒకటే రకమాయె. ఎంత మందినని మరమ్మతు చేస్తా? ఈ మొగాళ్ళంతా యింతే! కాస్త అందంగావుండే ఆడది కనిపిస్తేచాలు లొట్టలేస్తారు; కళ్ళు

గిలుకుతారు. ఇక యీ గొప్పవాళ్ళమాట చెప్పక్కర్లేదు. వరి తిరుగుబోతులు; అయినా నేనేమంత అందగత్తైననీ ..."

"నువ్వా! నువ్వే!! నిన్ను దేవుడిగుళ్ళో కూర్చోబెట్టి పూజలు చేస్తా!" అంటూ అడ్డంవచ్చాడు గోవర్.

గోవర్ వీపుమీద ఒక్క చిన్న చరుపు చరిచింది ఝునియా. "ఉఁహ్హూఁ! నువ్వుగూడా మొదలుపెట్టావన్నమాట. నేనేమాత్రం అందగత్తైనో నాకూ తెలుసులే. వీళ్ళందరికీ కాస్త కంటికి నదురుగా వుంటేచాలు; ఒక గంటసేపు పబ్బం గడుపుకుంటారు. వాళ్ళకి గుణాలెందుకు? బతికినంతకాలమూ కలిసిమెలిసి వుండేవాళ్లగ్గాని. వున్నవాళ్ళిళ్ళు చూస్తాంటే బలే గమ్మత్తుగా వుంటుందిలే. మాఅత్తారిల్లున్న పేటలోనే 'గపదూ-గపదూ' అనేఒక కాశ్మీరాయన వుండేవాడు. బాగానే వున్నవాళ్ళు లే. రోజుకైదు సేర్లపాలు తీసుకొనేవాళ్లు. ఆయనికి ముగ్గురాడపిల్లలు. అందులో ఎవళ్ళకీ ఇరవై యేళ్లకి తక్కువుండవు. ఒకళ్ళకంటే ఒకళ్లు అందగత్తెలు. పెద్ద పెద్ద క్లాసుల్లో చదువుతుండేవాళ్లు. అందులో ఒకమ్మాయి పంతులమ్మగూడాను. నెలకి ఎట్టాలేదన్నా మూడొందలు సంపాదించేదనుకుంటా. అందరికీ సితార్ వాయించటంవచ్చు. హార్మనీమీద పాడేవాళ్ళు. డాన్సులు చేసే వాళ్ళు. ఒకటేఁవిఁటి! అన్నీ చేసేవాళ్ళు; కాని పెళ్లి మాత్రం చేసుకునేవాళ్ళుకాదు. మరి వాళ్ళ కేమొగాడూ నచ్చేవాడు కాదో, లేకపోతే వాళ్ళే ఏ మొగాడికీ నచ్చేవాళ్ళుకాదో దేవుడికే తెలవాలి. ఒకసారి నేను పెద్ద అమ్మగారినిగూడా అడిగా. ఆ అమ్మ నవ్వూరుకుంది. అబ్బ! ఎప్పుడు చూచినా యిద్దరు ముగ్గురు జల్సాగాళ్ళుండేవాళ్ళు వాళ్ళ చుట్టూతా.

అందరికంటే పెద్దమ్మాయి పాంటూ, కోటూ వేసుకుని గుర్రం యెక్కి షికారుకని బయల్దేరేది మగాళ్ళతో పాటు. పట్టణంలో వాళ్ళకందరికీ తెలుసు యీ గొడవ. ఆ పెద్దబాబు పాపం తలొంచుకొనే తిరిగేవాడు. కూతుళ్ళకి నచ్చజెప్పాలని చూచేవాడు, బెదిరించాడు, కసుకుసనేవాడు. వాళ్ళంటేనా? "మా సంగతి మాట్లాడొద్దు. మాయిష్టంవచ్చినట్టు చేస్తాం. నువ్వెవగివి అడగటానికి?" అని పబ్లిగ్గానే అనేవాళ్ళు. పాపం ఆయన మాత్రమేంచేస్తాడు! పెరిగిన పిల్లలు. చెయ్యిచేసుకుంటానికి వీల్లేదయ్యె. అయినా గొప్పోళ్ళు గొప్పోళ్ళేబాబూ. వాళ్ళేం చేసినా చెల్లుబడౌతుంది. ఇరుగుపొరుగేమంటాదో, పంచాయితీవాళ్ళేమంటారో అనే భయమే వుండదాయె. సరేగాని రోజుకొకసారి మనస్సెట్టా మారతందో ఎంత తలపగులగొట్టుకున్నా అర్థంకాటంలేదు నాకు. మనిషికీ, పశువులికీ తేడా వుండదూ? మరీ అంత కనాకష్టమా! ఎవర్నని యేంలాభంలే. మనం యెట్టాచెప్తే అట్టావింటుంది మనస్సు. రోజూ పచ్చడి మెతుకులు తినేవాళ్ళు అప్పుడప్పుడూ హల్వా, పూరీలకని ఎగబట్టం చూట్టంలా. కొంతమందికేవో పెరటిచెట్టు మందు పనికిరాదు; పొరిగింటి పుల్లకూర రుచిగావుంటుంది. నాలాంటాళ్ళు వున్నదాంతోనే కాలం గడుపుకుంటారు. హల్వాలూ అవసరంలేదు; పూరీలూ అవసరంలేదు. ఎక్కడిదాకానో యెందుకు? మావదిన్ల నెమగుమవుగా. మా అన్నయ్యలకి మూతొంకరా? ముక్కొంకరా? అయినా వాళ్ళకి నచ్చరంట! రోజుకొక చీర తెచ్చేవాడూ, బంగారం నగలు చేయించేవాళ్లూ కావాలంట. నగలన్నా,' చీర

లన్నా నాకూ ఇష్టమేననుకో. అందుకని మానం అమ్ముకుం టామా? బ్రతికిన నాలుగురోజులూ ఒక్క-మనిషిని నమ్ముకుని వుంటమే మంచిది. అసలు ఆడవాళ్ళని చెడగొట్టేదే మగవాళ్ళు. మగాడు చెడుదారుల్నిపోతే, ఆడదిమాత్రం ఉట్టికట్టుకుని ఊరేగుతుందా? మగాడు ఆడాళ్ళంటపోతే ఆడది మగాళ్ళంట పోతంది. మగాడు చెడ్డాడయితే ఆడదానికిమాత్రం కష్టంవెం య్యేదూ. నేను మా ఆయన్తో అప్పుడే చెప్పేశాను: నువ్వటూ యిటూ తిరిగావంటే నా యిష్టంవచ్చినట్టు నేనూ తిరుగుతానని. నీ యిష్టంవొచ్చినట్టు నువ్వు తిరుగుతా, ఆడదాన్ని కొట్టో, తిట్టో అదుపులో ఎట్టా పెట్టగలవ్? నువ్వు బజార్నపడి చేస్తే, అది చాటుగా, మాటుగా చేస్తుంది. ఆడదాన్ని వుసూరుమని పిస్తే సుఖం వుండదుగా!"

గోవర్ ఇదంతా మరో ప్రపంచపు మాటల్లా విన్నాడు. ఒకో-సారి తన్మయత్వంతో, మైమరచి, నడుస్తూన్నవాడు నిలబడిపోయేవాడు; మళ్ళీ తనంతట తానే, తెప్పరిల్లి, నడవడం మొదలుపెట్టేవాడు. మొట్టమొదట ఝునియా రూపం చూచి సమ్మోహితుడయ్యాడతను. తనకున్న అనుభవాన్ని, సతీ త్వాన్ని గురించీ, చెబుతూన్న ఝునియాని జూచి అతను ముగ్ధుడైపోయాడిప్పుడు. ఇంత రూపసంపదా, యీ గుణాల గోపురాలూ, ఇంత లోకానుభవమూ, తమంతట తామే దగ్గరకొస్తుంటే కాదనగలవారెవరు? ఇంకా పంచాయితీ దార్లంటేనూ, యిరుగు పొరుగంటేనూ భయం దేనికి?

అతని తన్మయత్వాన్ని చూచేప్పటికి ఝునియాకి గూడ స్థయిర్యం చిక్కింది. 'అమ్మయ్య!' అనుకుంది. "అరెరె

నే చూడ్నే లేదు. మీవూరు దగ్గర కొచ్చేసిందే! బలేవాడివే. చెప్పనన్నా చెప్పగూడదూ?" అంది నాలుక కరచుకుంటూ.

అని వెనక్కి తిరిగింది.

"ఒక్క క్షణంసేపు మాయింటికి రారాదూ? అమ్మగూడా చూస్తుందిగా!" అని పట్టుపట్టాడు గోవర్.

ఝునియా సిగ్గుపడింది. "అసలు యింతదూరం యెందు కొచ్చానా అని నేను చూస్తూంటే యిప్పుడు మీ యింటికెట్టా వస్తాను. సరేగాని, ఎప్పుడొస్తావో చెప్పుమరి! రాత్రికొస్తావా నేను యింటెనక దొడ్లోవుంటా."

"తప్పకుండా కలుసుకుంటావా?"

"ఆ!"

"కలుసుకోపోతే?"

"తిరిగెళ్ళిపో."

"అయితే రాను."

"నే చెప్తున్నాగా. తప్పకుండా రావాలి.

"కలుసుకుంటానని చేతిలో చెయ్యెయ్యి."

"చేతిలో చెయ్యేయ్యన్నేను."

"అయితే న్నేరాను."

"రాకపోతే నన్ను చంపుకుతిన్నట్టే!"

ఉంగరం చూపించి వెళ్ళిపోయింది ఝునియా. ప్రథమ సమావేశంలోనే ఒకరి నొకరు ఆకర్షించుకో గలిగారు. ఝుని యాకి తెలుసు: అతను వస్తాడు! ఎందుకు రాడు? గోవర్కి

తెలుసును ! తప్పకుండా కలుసుకుంటుంది ! కలుసుకో కేం జేస్తుంది ?

స్వర్గాన్నుంచి జారిపడ్డవాడిలా, ఒంటరిగా, ఆవుని తోలుకుంటూ, యింటిముఖం పట్టాడు గోవర్.

# 6

ఆవు హారీ దొడ్లో అడుగు పెట్టింతర్వాత పరిస్థితులు మారిపోయినయి. ధనియాకి కిందా, మీద కన్పించటం లేదు. మెదిలినా, కదిలినా ఒకటేమాట: ఆవు.

చిట్టు నిండుకుంది. చెఱకుతో పాటు వేసిన చొప్ప తలలు కోసి పశువులకి మేపవలసి వచ్చింది. వర్షం ఎప్పుడు కురుస్తుందో నని అందరూ ఆకాశం కేసి చూడవలసివచ్చింది; వర్షం పడితేనే గాని బీళ్ళు పచ్చబడేవు. బీళ్ళు పచ్చబడితేగాని పశువులకి మేత దొరకదు. ఆషాఢమాసం సగంపైగా గడచినా, చినుకన్న మాట పడ లేదు.

ఉన్నట్లుండి ఒకనాడు మబ్బుపట్టింది. ఎట్లాగైతే నాలుగు చినుకులు పడ్డయి. రైతులు రెండోపంట సాగుచేసేందుకని నాగళ్ళు భుజాన పెట్టుకుని బయలుదేరారు. ఇంతలో జమీం దారుగారి కబురొచ్చింది: పాతఅప్పులు చెల్లించకపోతే రెండవ సాగు చేసేందుకు వీల్లేదని. నెత్తిమీద పిడుగు పడ్డట్లయింది రైతుల కందరికీ. జమీందారు యింత గట్టిగా ఎప్పుడూ అనే వాడుకాదు. ఇప్పుడెందుకు పంపాడో ఈ తాఖీదు? ఊరు వదలి

పెట్టి ఎక్కడికెళ్తారు? సాగుచెయ్యకపోతే డబ్బెక్కడనుంచి వస్తుంది? అందరూ కలిసి జమీందారిగారి ఏజంటు దగ్గరికి పరుగెత్తారు. ఆయనపేరు నోఖేరాంపండితుడు. మనిషి ఏమంత చెడ్డవాడుకాదు; అతనుమాత్రం ఏం చేస్తాడు. ఆజ్ఞ ఆజ్ఞే. కాదని ఎట్లా అనగలడు. నిన్నగాక మొన్న జమీందారుగారు హోరీకి తియ్యటి కబుర్లు చెప్పాడు; అప్పుడే ఆసామీలమీద యీ జులుం. దొరగారి దర్శనం చేసుకొద్దామా అని ఆలోచించాడు హోరీ. వెళ్తేమాత్రం యిచ్చిన హుకుం వద్దంటాడా? తానుమాత్రం మొనగాడిలా వెళ్లటం ఎందుకు? వున్న కాస్త మంచిపేరూ పోయినా పోవచ్చు? అందరూ వూరుకుంటే తనెళ్లి నుప్పుల్లో కాళ్లుపెట్టడం దేనికి? నలుగురితోపాటు నారాయణా!

రైతులందరూ కలవరపడి పోయారు; వూళ్లోవున్న షాహుకార్ల దగ్గరకు పరుగెత్తారు. మంగ్రూ షాహుకారు కాస్త బాగానే పచ్చబడ్డాడు. ఈ సాలు మంచి లాభాలే గడించాడు. శాస్త్రిగారూ, చిల్లరకొట్టు కోమటమ్మా గూడా కాస్తా కూస్తో వడ్డీకిచేతులుమారుస్తూనేవున్నారు. వీళ్ళందరికంటే ఝింగురసింగు పని మహావాటంగావుంది. ఈయనగారు పట్టణంలోవున్న షాహుకారుకు ఏజంటు. ఈయనక్రింద యింకా నలుగురున్నారు; వాళ్లు పల్లెటూళ్ళు తిరిగి వడ్డీ వ్యాపారం చేస్తారు. వీళ్ళందరూగాక యింకా వకళ్లిద్దరు వున్నారు నోటూ, పత్రం లేకుండా 'అనా వడ్డీలకిచ్చేవాళ్ళు' పల్లెటూళ్ళో అందరూ అంతే: ఎవరిదగ్గరైనా పాతికో పరకో వుంటే ఆ నాలుగుడబ్బులూ వడ్డీకి తిరిగే వరకూ నిద్రపట్టదు. ఒకానొకప్పుడు హోరీగూడ వడ్డీకిచ్చినవాడే. అందుకనే యిప్పటికీ హోరీ దగ్గర డబ్బు లేదనంటే ఎవరూ

నమ్మరు; ఎంతో కొంత దాచి వున్నాడనే అందరికీ అనుమానం. మరి ఆ డబ్బేమయింది? వేస్లు పడేప్పుడు బయటికి రాలేదు; తీర్థ యాత్రకు వెళ్ళాడా అంటే అదీ లేదు; ఇల్లు కట్టలేదు, పెళ్లి చేయలేదు! మరేమైనట్లు?

ఏమౌతుంది? మనం చెప్పులు తొడుగుకుంటే కాళ్ళకు కాయలు కాస్తయి. చెప్పుల్ని మనం వదలిపెట్టినా, కాయలు మాత్రం మనల్ని వదలవు!

కొంతమంది దేవుళ్ళకి మొక్కుకున్నారు! కొంతమంది మనుష్యులకే దణ్ణాలుపెట్టారు. కొందరు అణావడ్డీ పెడితే, యింకొందరు బేడావడ్డీకి ఒప్పుకొన్నారు. హోరీ మరి యెవళ్ళ దగ్గరకుపడితే వాళ్ళదగ్గరకు వెళ్ళలేడు. అప్పులు తీసుకున్న తర్వాత తీర్చకుండా మళ్లీ అప్పుకావాలని వాళ్లదగ్గరకే ఎట్లా వెడతాడు? ఇక ఝింగురసింగొక్కడే మిగిలాడు. అతనంటే అంతా పక్కాగా నడుస్తుంది. నోటు వ్రాయాలి; నజరానా యివ్వాలి; వ్రాతకోతలకివ్వాలి; స్టాంపులకివ్వాలి. పైన ఒక సంవత్సరం వడ్డీ ముందుగానే మినహాయించుకుంటాడు. పాతిక రూపాయీలకి నోటువ్రాస్తే, చేతిలోకి పదిహేడురూపాయలొచ్చేప్పటికి గగనమైపొయ్యేది. అయినా యీ కక్కురితిరోజుల్లో అక్కడికి వెళ్ళక తప్పదు. జమీందారుగారింత జబర్దస్తీ చెయ్యకపోతే వీళ్ళందరి దగ్గరకూ వెళ్ళి బాబూ, నాయనా అని బ్రతిమాల వలసిన అవసరమే వుండేదిగాదు.

ఝింగురసింగు కూర్చుని ముఖం కడుగుకుంటున్నాడు. నల్లగా, లావుగా, పొట్టిగా వుంటాడు. బొరుముక్కు; బొద్దు మీసాలు. అక్షరాలా విదూషకుడిలా వుంటాడు. నిజంగా

కూడ కాస్త హాస్యప్రియుడే. ఆయనకి ఆ వూరంతా అత్తవారింటితో సమానమే: మగవాళ్ళందరూ బావమరదులు; ఆడవాళ్ళందరూ ఏదో ఒక వరసని మరదలు పిల్లలు. ఊళ్ళో పిల్లలు ఆయన వెనకపడి గల్లంతు చేసేవారు, ఝింగురసింగు వెనక్కి తిరిగి "మీకళ్లు పూడిపోను, మీ జిమ్మలాగ, మిమ్మల్నమ్మోరెత్తికెల్ల, మీకొంపకాల!" అంటూ ఆశీర్వాదాలు పెట్టేవాడు. పిల్లలు శాపనార్థాలేమీ లెక్కపెట్టుకునేవారుగాదు. అయనా యిచ్చి పుచ్చుకోవటంలో ఆయన కాయనే సాటి. వడ్డీ అన్న తర్వాత కానీడబ్బు గూడ వదలి పెట్టేవాడుగాదు. అన్నరోజుకి డబ్బు చెల్లగట్టకపోతే వాకిట్లో తిష్టవేసుకుని కూర్చునేవాడు; కదలేవాడేకాదు.

హోరీ దణ్ణంపెట్టి తన కష్టాలు చెప్పుకున్నాడు.

"అయితే అప్పటి డబ్బంతా యేంజేశావ్?" అంటూ నవ్వాడు ఝింగురసింగు.

"బాబూ! డబ్బుంటే అప్పులు తీర్చేసుకునేవాణ్నేగా. వడ్డీమీద వడ్డీ యెక్కుతాంటే చూస్తూ ఎందుకూరుకుంటాను?"

"ఆఁ. మీసంగతి నాకు తెలవదంటలే. వడ్డీ పెరగనీ; దానమ్మా మొగుడు పెరగనీ. పాతరేసిన డబ్బు చచ్చినా బైటికి తియ్యరు మీరు; నాకు తెలుసుగా."

"బలేవారు బాబూ. తింటానికి లేక ఏడుస్తాంటే పాతరెక్కడ్నుంచొస్తుంది బాబూ. పిల్లవాడు పెద్దాడయ్యాడు. ఇంతమట్టుకి పెళ్ళిచేద్దామంటే దిక్కులేకుండావుంది. పెద్దమ్మాయి కూడా పెళ్ళీడొచ్చింది. వీటికేటికీ అక్కరకి రాకుండా డబ్బు పాతరేస్తానా బాబూ?"

హోరీ వాకిట్లో కట్టివేసుకున్న ఆవుని ఝింగురసింగు చూచాడు; అప్పటినుండీ దానిమీద కన్నువేసే వుంచాడు. ఆవు పొడుగు, గిడుగు చూస్తే ఎంతలేదనినా ఐదుసేర్లు యిచ్చేట్లుంది. హోరీని ఏదో ఒక యిరకాటంలో పెట్టి ఆవుని కాజెయ్యాలని ప్లాను వేసుకునే కూర్చున్నాడు. ఇంకేం? ఇదే అదును.

"సరేనయ్యా. నీదగ్గరేఁవీఁలేదు; ఒప్పుకున్నాం. ఎంత కావాలంటే అంత పట్టుకెళ్ళు. కాని నీమంచికే చెపుతున్నా. నగా గిగా యేఁవఁన్నావుంటే తాకట్టుపెట్టటమే మంచిది. స్టాంపులు పెట్టి రాయిస్తే వృధాగా వడ్డీ పెరుగుతుంది; యిరకాటంలో పడిపోతావ్."

ఇంట్లో నగన్న మాటలేదని హోరీ ఒట్టుపెట్టుకున్నాడు. ధనియా చేతికి మురుగులున్నాయిగాని అవి వఠి గిల్టువి.

ఝింగురసింగు సానుభూతి చూపించాడు. "అయితే ఒక పనిచెయ్యి. ఈమధ్య కొనుక్కొచ్చావే కొత్తావుని, దాన్ని మ్మేసెయ్యి. రాతికోతలూవద్దు. వడ్డీ గిడ్డీ బాదరబందీ అంతా తప్పుతుంది. నలుగురూ ఎంతంటే అంతాయిస్తా. నువ్వెంతో మక్కువపడి తోలుకొచ్చావని నాకూ తెలుసు. అమ్మాలంటే మనస్సు చివుక్కుమంటుంది. ఏంచేస్తాం? ఇబ్బందులందరికీ వొస్తాయి."

ఆవు నమ్మమని షాహుకారు చెబుతూంటే హోరీకి నవ్వొచ్చింది. అదంతా వఠి ప్రతివితక్కువ అనిపించింది. షావుకారు ఒకటే గొడ్డవగా చెప్పాడు. పాపంలా పెరిగే వడ్డీ తీర్చ లేకపోతే చేతులకు సంకెళ్ళు. షాహుకారు చెప్పేది నిజమే.

డబ్బు చేతులోకి రాగానే షావుకారు కిచ్చేసి ఆవుని మళ్ళీ తోలుకొని వెళ్లి కట్టేసుకోవచ్చును. ముప్పై రూపాయలు తీసు కొని నోటు వ్రాస్తే బాగావస్తే పాతిక వస్తయ్యేమో చేతిలోకి. రెండు మూడేళ్లవరకూ యివ్వకపోతే వందౌతాయి. ఇంటికొక సారి వచ్చింతర్వాత వెళ్తాననిగూడా అనకుండా భోజనాలు చేస్తూ, విందులు గడుస్తూ కూర్చునే అతిథిలాంటిది అప్పు! హోరీకి యిదంతా బాగా అనుభవమే.

"ఇంటికెళ్ళి మావాళ్ళతో మాటాడొచ్చింతర్వాత గాని చెప్పలేనుబాబూ," అన్నాడు హోరీ.

"మాట్లాడ్డఁ వెందుకు? అప్పుచేస్తే చచ్చిపోతాఁవఁని చెప్పు."

"తెలుసుబాబూ తెలుసు. ఇప్పుడేవస్తా."

ఆడపిల్లలు యిద్దరూ ఆవంటే పంచప్రాణాలుగా చూసు కుంటున్నారు. ఆవుకు దానా వెయ్యకుండా నోట్లో ముద్ద పెట్టుకునేదిగాదు రూప. ఎప్పుడు చూచినా చావిట్లోనే ఆవుతోపాటు వుండేది. ఆవుకూడ ఎంతో ప్రేమతో చూచేది రూపవంక; ఎంతో ఆప్యాయంగా రూపచేతులు నాకేది. ఆవు యీనితే యేం పేరు పెట్టాలో అప్పుడే తేలిపోయింది. 'మట్రూ'. దూడనిగూడ తన ప్రక్కలోనే పండుకోబెట్టుకోవా లనుకుంది రూప. ఆవుకోసమని అక్కా చెల్లెళ్ళు పోట్లాడుకోని రోజులేదు. ఆవుకు నేనంటే యెక్కువ యిష్టం; నేనంటే యెక్కువ యిష్టం అని యిద్దరూ పోట్లాడుకునేవారు.

హోరీ క్రిందా, మీదాపడి, ఎట్లాగైతే, భార్యని ఒప్పిం చాడు. ఒక స్నేహితుడి దగ్గరనుండి అప్పుగా తీసుకున్న ఆవుని

అమ్మివేసుకోవలసి వచ్చిన రోజుగూడా వచ్చింది. ఏంచేస్తాం? ఆపదలొచ్చినప్పుడు మనిషి మతాన్నే వదలిపెడతాడు? ఇదే మంత గొప్ప విషయం. అవును. లేకుంటే ఆపదలినిచూచి మనుష్యులిట్లా ఎందుకు తారుకుంటాడు? గోవర్ కూడా పెద్దగా అభ్యంతరం చెప్పలేదు. అతనిప్పుడు యింకో నిష్ఠలో వున్నాడు. సరే. ఆడపిల్లలిద్దరూ నిద్రపోయింతర్వాత ఆవుని తోలికెళ్ళి ఝింగురసింగుగారికి యిచ్చివేయాలని నిశ్చయమైంది.

సాయంకాల మయ్యింది. ఆడపిల్లలిద్దరూ ఎనిమిది కొట్టే ప్పటికి అన్నాలుతిని నిద్రపోయారు. గోవర్ యిదంతా చూడ వలిసి వస్తుందని ముందుగానే వెళ్ళిపోయాడు ఎక్కడికో. ఆవు దొడ్లోనుంచి వెళ్ళిపోతుంటే, కళ్ళతోచూస్తూ ఎట్లా వూరుకుంటాడు? కళ్లంట నీళ్ళు బొట బొటా కారవూ? హోరీ పైకి చలనంలేనట్లున్నాడు గాని పాపం లోపల్లోపల కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నాడు. పాతిక రూపాయలిచ్చేనాథుడు కన్పించకపోయె: తర్వాత యాభై చెల్లగట్టుకున్నా యిబ్బందిలేదు. వెళ్ళి ఆవు ముందు నిలబడ్డాడు హోరీ. నల్లగా మెరిసే ఆవు కళ్ళల్లో నీరు నిండుకుంటూన్నట్లనిపించింది అతనికి 'నాలుగురోజుల్లోనే మొహం మొత్తిందానీకు? చచ్చినా నిన్నుఅమ్మనని మాట యిచ్చావే. మరచిపోయావా? నేను నిన్నేమీ యిబ్బంది పెట్ట లేదే. నువ్వేసినఎండుగడ్డి తిని వూరుకున్నానే. నాకింత కష్టంగా ఉందని నేననుకోనుగూడా లేదే. మరి యీఅన్యాయమేమిటి?" అని ఆవు అడుగుతూన్నట్లనిపించింది.

"పిల్లలు నిద్రపొయ్యారుగా; తోలుకెళ్ళరాదూ? అమ్మాలనుకున్న తర్వాత ఇంకా ఆగటమెందుకు?" అన్నది ధనియా.

"నాకు చేతులాడ్డం లేదే. ఆవు మొహం చూస్తాంటే వుషారుమనిపిస్తాంది. ఏఁవోఁలే. డబ్బు వస్తేకే తెచ్చుకుంటే పోతందేఁమో. రెండు మూడొందలైతే మాత్రం ఏంలే? ఒకేడిరగబండిందంటే అన్నీ తీరిపోతయి" అన్నాడు హోరీ.

ధనియా గర్వంగా, ప్రేమతో చూచింది అతన్ని. "కాకపోతే యేంటి? యింత తపస్సుచేసి తోలుకొచ్చావుగా మరి! రేపెళ్ళి అప్పట్టుకురా, అన్నీ తీర్చినట్టే ఇదీ తీర్చుద్దాం." అని బలపరచింది.

లోపల అపరిమితంగా వుక్కబోస్తోంది; గాలి లేదు. ఆకులుగూడా అల్లల్లాడటంలేదు. మబ్బుపట్టిందికాని వర్షం వచ్చేట్లు లేదు. ఆవును బయటికి తీసుకొచ్చి కట్టివేశాడు హోరీ. ఎక్కడికి తీసుకెళ్తావని భార్య అటకాయించింది కాని హోరీ వినలేదు. "బయట గాల్లో కట్టేస్తా పాపం! దానిమాత్రం ప్రాణం కాదేంటి?" అన్నాడు. ఆవును కట్టివేసి తమ్ముడు శేఖర్ని చూచొద్దామని బయల్దేరాడు. తమ్ముడు గుండెదడతో బాధ పడుతున్నాడు. మందూ, మాకూ తెచ్చుకొనే తాహతు లేదు; సజావైన తిండిలేదు. పైనరొమ్ములు విరిగేట్టు చాకిరీ చేయనిదే గడవదు. అంచేత పాపం అతని ఆరోగ్యం ఆనాటి కానాటి చెడిపోతుందేగాని బాగుపడటంలేదు. శేఖర్ మంచివాడు. ఒకళ్ళ జోలికిపోడు. పోట్లాటంటే భయం. తన పనేమిటో తను చూచుకునేరకం. హోరీకి అతనంటే బాగాయిష్టం. అతనికి కూడా అన్నయ్యంటే మంచిగౌరవం. ఇద్దరూ కూర్చుని మంచీ, చెడ్డా మాట్లాడుకున్నారు. జమీందారుగారి కొత్త ఫర్మానా సంగతిగూడా వచ్చింది.



హోరీ యింటికొచ్చేప్పటికి పదకొండయ్యింది. యింట్లో కెళ్ళబోతూంటే ఆవుదగ్గర అలికిడి వినట్లనిపించింది; తిరిగిచూస్తే ఆవుదగ్గర ఎవ్వరో నిలబడి వున్నట్లుంది. "ఎవరానుంచుంది?" అని అడిగాడు.

"నేనే నన్నయ్యా. మీ కావులో నుప్పట్టుకెల్దామ నొచ్చా" అన్నాడు హీరా.

తనతమ్ముడు తన కావులోనుండి నిప్పుపట్టుకెల్దామని వచ్చాడు. ఎంత ఆత్మీయత లేకపోతే వస్తాడు? ఊళ్లో కావులు వేసుకునేవాళ్ళు బోలెడుమంది వున్నారు. అయినా తనకావు దగ్గరకే ఎందుకువచ్చాడు? తనవాడు కాబట్టేగదా! అంత పోట్లాట జరిగినతర్వాత. నిజంగానే హీరాకి కపటమంటే ఏమిటో తెలియదు. ముక్కోపిగాడూ; అంచేత కోపంవస్తే దబ దబ లాడతాడు. అంతే. వాడిమనస్సు మాత్రం బంగారం లాంటిది.

"పుగాకుందా? తేనా?" అని అడిగాడు ఎంతో ఆప్యాయంగా.

"వుందన్నయ్యా! పుగాకుంది."

"ఏమోరా! శేఖర్ కేమీ తగ్గినట్టులేదు."

"మందుతింటేనా తగ్గటానికి? వైజ్జుడూ, హాకీమూ - అందరూ - వట్టి దద్దమ్మలంటాడు. దేశంలోవుండ తెలివంతా ఆ మొగుడూ పెళ్ళాలకే పెట్టినట్టుండాడు దేవుడు."

"అదేరాబాబూ! ఎవళ్ళకీ లెక్కేపెట్టడయ్యో. అయినా జబ్బొచ్చినప్పుడందరూ విసుక్కుంటారు లే. బక్కకోపంగాదూ? నీకు గుర్తుందా ఇంఫింజా వచ్చినప్పుడు మంచం దగ్గరికి తేనచ్చే

వాడివేకాదు; విసిరికొట్టే వాడివి. నేను నీ రెండుచేతులూ పట్టుకునేవాడిని; మీా వదిన నీ ముక్కుమూసి నోట్లో మందు పోసేది. నువ్వేమో తిట్లు లంకించుకునేవాడివి.''

''నిజంవేఁ అన్నయ్యా. అప్పుడంత చెయ్యకపోతే నీతో పోట్లాడ్డానికి బతికుండేవాడిని గాదుగా!''

హీరా కంఠం గద్గదమైనట్లుంది. హోరీగూడ నిండారు లయ్యాడు.

''అదేంవిటిలేరా. పుట్టిం తర్వాత పోట్లాడుకోకుండా ఉంటామా? యింట్లో నలుగురు తిరుగుతూంటేనేగా పోట్లాడుకున్నా, మాట్లాడుకున్నా. పోట్లాడినంత మాత్రాన అయిన వాళ్ళు కాకుండా పోతారా?''

ఇద్దరూ కలిసి, చుట్టలు చుట్టుకుని, కాల్చుకున్నారు. తర్వాత హీరా యింటికి వెళ్ళిపోయాడు. హోరీ భోజనానికి లేచాడు.

ధనియా కోపంగా ఉంది. ''చూచావా నీ కొడుకేం చేస్తున్నాడో. ఇంత పొద్దుపోయింది. అజా, పజా లేదు. ఏం ఉద్ధరిస్తున్నాడో ఏంవోఁ నాకు తెలవ దనుకున్నాడు కాంవంన్న. ఆ భోలాకి కూతురుముండ లేదూ? దాని కొంకపట్టుకు తిరుగుతున్నాడు.'' అని కేకలు వేసింది.

ఇదే వార్త హోరీ చెవుల్లోకూడ పడింది. కాని అతను నమ్మలేదు. పాపం! గోవర్ కింత గొడవ జరుగుతూన్నట్లు తెలియనే తెలియదు.

''నీ కెవరు చెప్పారే?'' అన్నాడు హోరీ.

ధనియా ప్రచండరూపం దాల్చింది. "నీకు తెలవ దేమో. వూరంతా గుప్పుమంటాంది. అది వీణ్ని కోతినిజేసి ఆడిస్తాంది; తనకోసం పడి చచ్చిపోతా దనుకున్నాడో యేమో. నువ్వన్నా చెప్పి చూడకూడదూ? చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకుంటే లాభం యేంటి?"

హోరీ మంచిగుణంలోనే వున్నాడు. "ఏమే ఝునియా అందంగానే వుంటుందిగదే! నీ కొడుక్కి దానే చేసేసుకోరాదు. ఇంత చౌక సంబంధం యింకెక్కడ దొరుకుతుంది!" అని వేళాకోళం ఆడాడు.

ధనియాకి మరీ మండింది. "ఆముండ యీ యింటో అడుగు పెడితే దాని ముహాన మొద్దులు పెట్టనూ? గోవరంటే అంతయిష్టమైతే వాళ్ళిద్దర్నీ వుట్టిగట్టుకుని వూరేగమను. అంతే గాని నా యింటోకి రావటానికి మట్టుకు వీల్లేదు." అంది.

"అబ్బాయే వెంటపెట్టుకొస్తే?"

"అయితే యింకా ఈ ఆడపిల్లలికి పెళ్ళౌతుందా? ఇంకా తలెత్తుకుని తిరగ్గలమా నలుగుర్లో."

"ఇదంతా లెక్కజేస్తాడేంటి వాడు?"

"ఇన్నేళ్ళా పెంచి పెద్దాణ్ని చెయ్యాలా నామాటినకండా ఎక్కడికిపోతాడు? దానోట్లో దుమ్ముగొట్ట."

ఇంతలోకే గోవర్ వచ్చాడు గాబరాపడుతూ. "నాన్నా! నాన్నా! ఆవుని చూడవే పురుగేఁమన్నా కుట్టిందా? పడుకుని అట్టా గిలగిల కొట్టుకుంటాంది?"

అన్నం ముందు కూర్చున్న హోరీ పళ్లెం అవతల నెట్టి బయటికి వచ్చాడు. "అదేఁవిట్రా అట్టా అంటావు. అశుభాలు

పలుకుతావెందుకు. ఇప్పుడేగా నేనుచూచొచ్చింది? పడుకు నుందే."

ముగ్గురూ బయటికి వెళ్ళారు. దీపంపట్టుకెళ్ళి చూచారు. ఆవు కాళ్ళు బారజాచి పడుకునుంది; కళ్ళు తేలవేసింది; నోటి వెంట సొంగ కారుతోంది. ధనియా నెత్తీ, నోరూ కొట్టుకుంది. హోరీ శాస్త్రిగారి దగ్గరకు పరుగెత్తాడు. ఊళ్ళోకల్లా ఆయనే పశువైద్యం తెలిసిన మనిషి. శాస్త్రిగారు నిద్రపోబోతున్నవా డల్లా గబగబా వచ్చేశాడు. కన్నుమూసి తెరచేప్పటికి వూరంతా గుమిగూడింది.. ఆవుకి ఎవరోగాని మందుపెట్టారు. లక్షణాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఊళ్ళో అంత పాపపు పనికి ఒడిగట్టే వాళ్ళు ఎవరున్నారు? పొరుగూరువాళ్ళు ఎవరైనా వచ్చారా అంటే అదీలేదు! పోనీ హోరీకి ఎవరైనా శత్రువులున్నారా అంటే అంత పగపట్టేవాళ్లూ లేరు. అన్నదమ్ములు పోట్లాడు కున్నారు; కాని అయినవాళ్ళు యింత అఘాయిత్యానికి వడిగడతారా? అదీగాక అందరికంటే ఎక్కువగా కారాలూ, మిరియాలూ హీరా నూరుతున్నాడు. ఈ పనిచేసినవాడు దొరికితే వాడి పచ్చిరక్తం త్రాగుతానని కేకలేస్తున్నాడు. అవటాని కతను ముక్కోపేగాని యింత నీచపు పనిచచ్చినా చెయ్యడు.

ఊరంతా అక్కడే ఉంది అర్థరాత్రివరకూ. అందరూ హోరీని ఓదార్చారు; ఆ నీచపు పని చేసినవాడిని తిట్టారు. కర్మంజాలక ఆ మనిషే దొరికివుంటే ఎగనొక పిర్రా, దిగనొక పిర్రా కోసి, ఉప్పు పాతరేసేవారే. ఇట్లాగైతే పశువుల్ని బయటకట్టేసేందుకు వీల్లేదు. ఎంత చక్కటి ఆవు; పూజ

చెయ్యొచ్చును. ఐదుసేర్ల పాలిచ్చేది. దూడ ఒక్కొక్కటీ వందకు తక్కువచేసేదికాదు. ఇట్లా దొడ్లో అడుగుపెట్టిందో లేదో, యీ పిడుగు పడింది.

అందరూ యిళ్ళకి వెళ్ళిపోయిన తర్వాత ధనియా భర్త మీద లేచింది. "నీకెన్నిజెప్పినా యింతేగా; నీకెంతతోస్తే అంతేగాని. ఆవుని బయటకట్టేస్తాంటే వద్దంటేవిన్నావా? వేడెక్కిందంట వేడి. ఇంకేం ఇప్పుడు చల్లబడిపోయిందిగా. నీకళ్ళు గూడా చల్లబడ్డయ్యా? మనరోజులు బాగాలేవు; వద్దు అంటే విన్నా? సింగుగారడగ్గానే ఆయనకీ యివ్వకపోతివి. యిచ్చేస్తే ఒకపీడొదిలి పోయేదిగా? అవునులే. ఇట్లా జరగాల్సివుంటే చెప్పినమాట చెవికెక్కుతుందా? వున్నమతికాస్తా అసలే లేకండా పోతంది. ఇన్నిరోజులింట్లో ఉంటే వుక్కబోసిందీ? ఎంతమంచిదీ, బంగారం! పిల్లవెళ్ళి కొమ్ములు పట్టుకుంటే తలన్నావూపేదిగాదు. గుగ్గిలబుట్టలో ఏంవేసిపెట్టినా శుభ్రంగా నాకి తినేసేది. దిగొచ్చిన దేవతకిమల్లేఉండేది; మనలాంటివాళ్ళిళ్ళల్లో ఎందుకుంటుంది?"

అమ్మచేసే అల్లరికి పిల్లలిద్దరూ లేచి కూర్చునారు. లేచింతర్వాత ఒకటే ఏడుపు. వాళ్ళు ఆవునొదిలిపెట్టి వుండేవారుకాదు. అన్నం తిన్నతర్వాత తలొక రొట్టె పట్టుకెళ్ళి పెట్టేవారు. చక్కగా నాలుకజాపి, అందుకొని తినేది. వాళ్ళు వేళకి వెళ్ళకపోతే అట్లాగే నిలబడి దారులు చూస్తుండేది. ఇవ్వాల్టికీ శని యిట్లా దాపురించింది.

గోవర్, ఆడపిల్ల లిద్దరూ ఏడ్చి, ఏడ్చి నిద్రపోయారు. హోరీకూడ పండుకున్నాడు. అతని మంచంక్రింద నీళ్లచెంబు

పెట్టేందుకని ధనియాతలగడ దగ్గరకెళ్ళింది. భార్యనిచూచి "నీకే దన్నమాట చెప్పటమే భయం! విన్నదానివి కడుపులో పెట్టుకుని వూరుకోవాయె. వూరంతా డప్పేసి వస్తావు!" అన్నాడు హోరీ.

"అసలు చెప్పకుండానే మొదలుపెట్టావాయె. ఎప్పుడన్నా ఎవరికన్నా చెప్పానా? వూరికే నోరు పారేసుకుంటావు గాని" అని విసురుకుంది భార్య.

"సరేగాని నీ కెవరంటేనూ అనుమానం?"

"ఏవోఁ! నాకేం తెలుసు? ఎవరన్నా బయటోడేమో!"

"ఎవర్తోనూ చెప్పవుగదా."

"అవున్లే. చెప్పకపోతే నాకెవ్వరు చీరలూ, నగలూ పెట్టరుగా! అందుకనీ ..."

"మాట పొక్కిందంటే నీప్రాణం తీసేస్తా."

"నన్ను చంపి నువ్వేం సుఖపడ్తావులే. మారుమనువు చేసుకుందాఁ వఁనుకుంటున్నావేమో. నేను చచ్చిన మర్నాడు యిన్ని బియ్యం గూడ పోంగించేవాళ్ళుండరు. ఇప్పుడంటే మాట్లాడితే తిట్తావుగాని చచ్చిన మర్నాడు నెత్తిన కుండెట్టుకు నేడుస్తావు.

"నాకు హీరా అంటే అనుమానంగా ఉందే."

"ఛ ఛ. హీరా అట్టాంటిపని చెయ్యడు; ఆ యబ్బాయికి కాస్త నోటిదురుసేగాని యీ ఛండాలప్పని చచ్చినా చెయ్యడు."

"నేను కళ్లారా చూచానే; నిన్ను చంపుకుతిన్నంతొట్టు."

"కళ్ళారా చూచా! ఎప్పుడు?"

"అదేనే నేనట్లా శేఖరింటికెళ్ళొచ్చానా? హీరా ఆవు దగ్గర నుంచునున్నాడు. ఎవర్రా అంటే నేనేనన్నయ్యా; హీరా నన్నాడు. కావులో నుప్పుకోసం వచ్చానన్నాడు. వచ్చి చుట్ట కాల్చుకుని కాస్సేపుకూర్చుని వాడట్లా వెళ్ళిపోయాడు. నేనిట్లా యింట్లోకొచ్చాను; ఇంతలో గోవరొచ్చాడు గాభ రాగా. ఎడం ఏదీ? ఆవుని కట్టేసి నేనట్లా శేఖరింటికెళ్ళగానే వీడొచ్చి మందుపెట్టాడు. తర్వాత చచ్చిందో లేదోనని చూట్టానికొచ్చాడనుకుంటా."

ధనియా ఒక దీర్ఘ నిశ్వాసం విడిచింది. "అన్నమెడ గోసి ఆనందపడే తమ్ముళ్ళుగూడా ఉంటారన్నమాట. అబ్బబ్బ ఇంతచెండాలుడని కల్లోగూడా అనుకోలా; ఎద్దుల్ని పెంచినట్టు పెంచాకదా !"

"సరేగానీపో. పోయినిద్రపో. నువుడన్నవాడికి తెలియ గూడ దీసంగతి."

"ఎవరూ? నేనేనా! పొద్దు పొడిచేప్పటికీణ్ణి జైలుకి పంపకపోతే నాపేరు మారుపేరుపెట్టు. ఈ ఖూనీకోరు తమ్ముడా? కాదు పగాడు. పగాళ్ళనేంచేసినా పాపంలేదు; వదిలేస్తేనే వస్తుంది పాపం."

"చెబుతున్నా; నీకుమూడింది." అని కసురుకుని విది లించాడు హోరీ.

"మూడినా అంతే, గిడినా అంతే. నేచెప్పింది చెయ్యక మాన్ను. ఆ దరిద్రుడు జైలుకెళ్ళేదే నిజం. మూడేళ్ళక్కడే పడిచస్తాడు. బయట పడింతర్వాత యాత్రకెళ్తాడో! బాతులే పెడతాడో. ఏంవనుకుంటన్నావో నీతోనే యిప్పిస్తా

సాక్ష్యం; నీ కొడుకు నెత్తిమీద చెయ్యిపెట్టించి మరీ ప్రమాణం చేయిస్తా'' అని గడగడా అనేసింది ధనియా.

అని యింట్లోకెళ్ళి, తలుపు గడియవేసుకుని పడుకుంది. హోరీ బయట పడుకుని పాపం! తన్ను తానే తిట్టుకున్నాడు. తన పొట్టలోనే నిలవలేదు మాట; యింకా ధనియా మాత్రం ఎట్లా దాస్తుంది? ఇక యీ రాక్షసి చచ్చినా ఒప్పుకోదు. పట్టుపట్టిందంటే చచ్చి, గీపెట్టినా వదలదు. తన జీవితంలో యింతగొప్ప తప్పు యెప్పుడూ చేయలేదు.

ఎటుచూచినా చీకటిదట్టంగా వుంది; నిబిడాంధకారం. అప్పుడప్పుడూ ఎద్దులమెడల్లో గంటలు మ్రోగుతున్నాయి. పది అడుగుల దూరంలో చనిపోయిన ఆవు పడివుంది. హోరీ పశ్చాత్తాపంతో దగ్ధం ఔతున్నాడు; నిద్ర పట్టటంలేదు. ఆకారు చీకటిలో, కన్ను పొడుచుకున్నా కాంతిరేఖ కన్పించటంలేదు.

# 7

తెల్లవారేప్పటికి హోరీయిల్లంతా గందరగోళంగావుంది. హోరీ భార్యని చావగొడుతున్నాడు. భార్య నోటికొచ్చినట్లు తిడుతూంది. ఆడపిల్లలిద్దరూ తండ్రికాళ్ళకు అడ్డంపడి యిల్లు ఎగిరిపోయేట్లేడుస్తున్నారు. గోవర్ తల్లికి దెబ్బలు తగలకుండా తండ్రిని పట్టుకునేందుకు విశ్వప్రయత్నం చేస్తున్నాడు. కాని ఆ ముసలికోపం కట్టలుత్రెంచుకుని బయటపడుతోంది. కొడుకును తప్పించుకుంటూ అందినదానిని అందినట్లు చేతుల్తో కొడుతు న్నాడు; కాళ్ళతో తన్నుతున్నాడు; ఊళ్ళో వాళ్ళందరూ నాలుగు చెప్పిచూద్దామనే వంకతోవచ్చి, తమాషా చూస్తు న్నారు. శేఖర్ కర్రపట్టుకుని నడవలేక, నడవలేక వచ్చాడు. "హోరీ! నీకేమైనా పిచ్చిగాని ఎత్తలేదుగదా! గృహలక్ష్మి నిట్లా చావబాదుతారయ్యా ఎవరైనా? ఇంత అధ్వాన్నం ఇది వరకెప్పుడూలేదే? హీరానిచూచి నేర్చుకు పోతున్నావా ఏమిటీ?" అంటూ కూకలేశాడు శాస్త్రి.

"మీకు తెలవదుబాబూ. నేను మెత్తమెత్తగా వుంటు న్నానుగదా అని యింకాయింకా వత్తబోతాందియిది. ఇవ్వాళ

దీనిచర్మం వలిచి, రక్తంకళ్ళజూస్తా" అన్నాడు హోరీ అతివినయంగానే.

ధనియా ముక్కుచీదుకుంటూ "నువ్వుచూస్తన్నావుగా బాబూ. ఇవ్వాళ యీ రాక్షసుల్నందర్నీ, అన్ననీ, తమ్ముళ్నీ జైలుకి పంపకపోతే అప్పుడడుగు. తమ్ముండేవోఁ మందుపెట్టి ఆవుని చంపుకుతిన్నాడు. యీయనేవోఁ నన్ను చావబాత్తున్నాడు. కచ్చేరీకివెళ్ళి చెబుతా వీళ్ళపని" అంటూ రాద్ధాంతం చేసింది.

"మళ్లీ ఆమాటే అంటావ్? నువ్వు చూచావే వాడు మందు పెట్తాండగా?" అంటూ పళ్ళునూరి, కళ్లురిమాడు హోరీ.

"హీరా ఆవు దగ్గిర నిలబడుండగా చూళ్లేదని నువ్వు ప్రమాణం చెయ్యి."

"ఒట్టు; ఒట్టేసుకుంటా; నేచూళ్ళేదు!"

"నీ కొడుకుమీద ఒట్టేనా? కొడుకునెత్తిమీద చెయ్యెట్టి ఒట్టు పెట్టుకో!"

హోరీ కొడుకు నెత్తిమీద చెయ్యి పెట్టాడు; కాని అతని చేయి గజగజ వణికింది. "హీరాని నేను చూడనే లేదని ప్రమాణం చేస్తున్నా" అన్నాడు వణికే కంఠంతో.

ధనియా కాండ్రించి వుమ్మేసింది. "ఛూఁ ఎంత అబద్ధాలకూడు; ఆకూడు తినకపోతే ఎవళ్ళేడ్చారు. నువ్వేగా చెప్పింది కళ్ళారా చూచానని. తమ్ముడుకోసమని నాకొడుకు మీదగూడా అబద్ధపొట్టుపెట్టుకుంటా? ఛూ! నాకొడుక్కేఏమన్నారావాలీ యీ యింటికే నుప్పెడతా."

"ఇంకా అదేపనిగా వాగావంటే..." అంటూ కోపంతో పరవళ్ళు త్రొక్కాడు హోరీ.

"కొడ్తానే వున్నావ్‌గా, చంపేసెయ్యి. కీళ్ళకీళ్ళిరగ్గొట్టావే. ఇంకా నీకు కుతి తీర్లా? ఆడదాన్ని కొట్టడంగూడా గొప్ప తనంవేంనా? ముండమోపి గొప్పదనం. నామీదైతే ఒంటికాలుమీదెగురుతా? తమ్ముడిపేరు చెబితే తడిసిన పిల్లివౌతావేం?"

అని, తర్వాత నైనంచెప్పి ఏడ్చింది ధనియా. ఈ యింట్లో అడుగుపెట్టిం తర్వాత తానెన్ని కష్టాలు పడలేదు? ఒక్క బియ్యపుగింజపోతే ప్రాణం పోయినట్లనుకుని సంసారం నిబాయించుకొచ్చింది. ఇంటెల్ల పాదికీపెట్టి, తాను మంచినీళ్ళు త్రాగి, పస్తులు పడుకుంది. ఇంతచేస్తే యీనాటికిదా ప్రతిఫలం? భగవంతుడు ద్రౌపదికి వలువలిచ్చేందుకూ, గజప్రాణ సంరక్షణ చేసేందుకు వైకుంఠం వదలి పరుగెత్తుకొచ్చాడు. తనకి జరిగే యీ అన్యాయం అంతాచూచి ఎందుకు వూరుకుంటున్నాడో! ఇవ్వాళ హాయిగా, గుండెమీద చేయేసుకుని నిద్రపోతున్నాడో ఏమో!

ప్రజాభిప్రాయం క్రమక్రమంగా ధనియావైపుకే మొగ్గుతోంది. హీరా ఆవుకి మందు పెట్టాడనడంలో సందేహంలేదు. హోరీ తప్పుడు ప్రమాణాలు చేస్తున్నాడు; కన్పిస్తూనేవుంది. గోవర్ కూడా తండ్రికి వ్యతిరేకమే. దీనికితోడు శాస్త్రిగారు కూడా హోరీని ముదలకించారు. హోరీ ఓడిపోయాడు. తల వంచుకుని బయటికి వెళ్ళిపోయాడు; సత్యమే జయించింది.

"ఈ గొడవేమన్నా నీకు తెలుసునటయ్యా?" అనడి గాడు శాస్త్రి, శేఖర్‌ని.

"నేనొక వారం అయిందిబాబూ బయటడుగుపెట్టి. అప్పుడప్పుడూ అన్నయ్యేవచ్చి మంచీ చెడ్డా చూస్తున్నాడు. అన్నయ్య రాత్రిగూడా మాయింటికొచ్చాడు. నిన్న దీపాలు పెట్టేటప్పుడు హీరా మాయింటి కొచ్చాడు ఏదో మూలిక తవ్వాలి; తవ్వగోలిమ్మంటా" అన్నాడు శేఖర్.

ధనియా అందుకుంది. "శాస్త్రుల్లుగారూ! విన్నారుగా? ఆ అబ్బాయే చేశాడు యిదంతా. ఆతవ్వగోలతో మూలిక తవ్వకొచ్చి ఆవుకు పెట్టాడు. ఆ కిందటినాడేగా అన్నయ్యతో పోట్లాడాడు; అప్పుడ్నుంచీ కాచుకూర్చున్నాడు గాంవంన్న!"

"అంతేమరి! ఋజువై పోయిందిగా. వాడికీ గోహత్య పాతకం తగులుతుంది తప్పకుండా. పోలీసువాళ్ళు ఏంచేసినా ఒకటే. ధర్మం ఎక్కడికిపోతుంది? ఇటు చూడమ్మా రూపా! వెళ్ళి మీ చిన్నాన్నని నేను రమ్మంటున్నానని చెప్పి పిలుచుకు రామ్మా. హత్య చెయ్యకపోతే వచ్చి, గంగాజలం చేత్తో పుచ్చుకుని ప్రమాణం చెయ్యమందాం" అన్నాడు శాస్త్రి.

"ఒట్టంటే లెక్కా? ఇంత పెద్దమనిషినని చెప్పేయిాయనే అంత తేలిగ్గా కొడుకుమీద ఒట్టుపెట్టుకున్నాడే! ఆ యబ్బాయి దేముంది?" అన్నది ధనియా.

"అంతేలే! పెట్టుకోనీ ఒట్లు. పోతేవంశమే పోతంది కట్టగట్టుకొని. ముసలాళ్ళు బతికేవుంటారుగా. మేముంటేఎంత; వూడితే యెంత?" అన్నాడు గోవర్.

రూప ఒక్క క్షణంలో వెళ్ళివచ్చింది. "బాబాయింటిలో లేడంట. యింటో లేడంటూంది పిన్ని" అని వార్త తెచ్చింది.

"ఎక్కడికెళ్లాడని అడగరశే. ఇంట్లోనే దాక్కుని కూచ్చున్నాడేమో! సోనా, నువ్వెళ్ళి చూచిరామ్మా!" అని శాస్త్రి గారంటూంటే "దాన్ని పంపొద్దుబాబూ, ఖూనీకో రేఁనైఁనా చేస్తాడు" అని అడ్డంవచ్చింది ధనియా.

శాస్త్రిగారు స్వయంగా వెళ్ళివచ్చారు. హీరా నిజంగానే యింట్లో లేడు. పైపంచె వేసుకునీ, కర్రపుచ్చుకునీ వెళ్లిపోయాడంటూంది పున్ని. ఎక్కడికని పున్ని అడిగినా సమాధానం చెప్పలేదట. పున్ని గూట్లోపెట్టుకున్న డబ్బుగూడా కన్పించటం లేదట.

ధనియా హృదయం శాంతించింది. "మొఖం ఎత్తుకోలేక ఎక్కడికన్నా పారిపోయాడేఁవోఁ!"

"ఎక్కడికి పారిపోతాడు? గంగా స్నానాని కెళ్ళాడేఁవోఁ" అన్నాడు శేఖర్.

గంగా స్నానానికి వెళ్ళేవాడికి డబ్బెందుకు? ఇప్పుడంత గొప్పపండగ మాత్రమేఁ వొఁచ్చింది? అని ధనియా సందేహం వెలిబుచ్చింది.

ఈ సందేహానికి సమాధానం దొరకలేదు; అనుమానం మరింత దృఢమైంది.

ఇవ్వాళ హోరీ యింట్లో పొయ్యిమీదకుండ ఎక్కలేదు. ఎడ్లనుగూడ నీళ్లకు వదలలేదు. ఊరంతా మాటుమణగివుంది. నలుగురుకూడితేచాలు, ఇదే చర్చ. హీరా ఎక్కడికో పారిపోయాడు. రహస్యం కాస్తాపొక్కిపోతుందని పసి కట్టాడు;

జైలుకు వెళ్ళవలసి వస్తుందని భయపడిపోయాడు; అందుకనే భార్యాకిగూడా చెప్పకుండా వుడాయించాడు. ఎక్కడికి వెళ్ళాడో? ఏమో !

ఇంకా కాస్తో, కూస్తో మిగిలితే సాయంత్రానికి సబిన స్పెక్టర్ వచ్చి ఆకాస్తా పూర్తి చేశాడు. ఊరి మున్సిఫ్ రిపోర్టు చేశాడు తన వుద్యోగధర్మానికి తగినట్లు. సబినస్పెక్టర్ గారు మాత్రం తన కర్తవ్య నిర్వహణ చెయ్యకుండా ఎట్లా వుంటారు? ఆయన గ్రామంలోకివస్తే తగిన మన్నన, మర్యాదలు చేసి గ్రామస్థులుగూడా తమ ధర్మాన్ని నిర్వర్తించుకోవాలి. శాస్త్రి గారూ, ఝింగురుసింగూ, నోఖేరాం, నలుగురుబంట్లూ, మంగ్రూ సాహుకారూ, లాలాపటేశ్వరీ—అందరూ—వచ్చి, చేతులు కట్టు కుని నిలబడ్డారు. హోరీకి కబురుపంపారు. హోరీ వచ్చాడు. వచ్చి తాబేలులా ముడుచుకుని నిలబడ్డాడు. ఇనస్పెక్టర్ గారు పసికట్టేశారు. ఇలాంటి లౌకిక వ్యవహారాల్లో ఆరి తేరినవా డాయన. ఇవ్వాళ నక్కనితొక్కి వచ్చాడు. హోరీ మొహం చూస్తేనే తెలుస్తోంది. ఒక్క చిన్న బెదరింపు బెదరించితే సరి అంతా సవ్యంగా నడిచిపోతుందని.

“ఎవరంటేనూ నీకు అనుమానం?” అనడిగాడు ఇన స్పెక్టరు.

హోరీ వంగి, చేతులు కట్టుకుని “నా కెవరిమీందా అను మానంలేదు బాబూ. చచ్చిపోయే రోజొచ్చింది; చచ్చి పోయింది. ముసల్దిగూడా బాబూ!” అన్నాడు.

ధనియా అతని వెనకనే వుంది. “నా ఆవుని చంపింది నీ తమ్ముడు. నువ్వు చెప్పిందల్లా నమ్మటానికి దొరగా రేమన్నా

పిచ్చోడనుకున్నావా! అంతా తెలుసుకోటానికనే వచ్చా రాయన'' అన్నది.

"ఈ అమ్మాయెవరు?'' అనడిగాడు యినస్పెక్టర్.

ఇనస్పెక్టరుగారితో మాట్లాడేందుకని తహతహలాడు తున్న జనానికి ఒక్క అవకాశం కలిగింది. ఎవరికివారు ముందు చెప్పాలని "హోరీ భార్యండీ'' అని అందరూ ఒకేసారన్నారు.

"అయితేసరే. ఇటురమ్మనండి; సాక్ష్యం వ్రాసుకోవాలి. హీరా ఏమయ్యాడు?''

"ఇవ్వాళ ప్రొద్దుట్నుంచీ కనబట్టంలేదండీ'' అన్నారు మళ్ళీ అందరూ ఏక కంఠంతో.

"అయితే అతనియిల్లు సోదా చెయ్యాలి!''

సోదా చేస్తారా? హోరీ ప్రైప్రాణాలుప్పైనే పోయినయి. తమ్ముడు యింట్లో లేనప్పుడు తమ్ముడియిల్లు సోదాచేస్తారా? తాను బ్రతికివుండగా తనతమ్ముడి గౌరవం పొయ్యేందుకు వీలు లేదు. ధనియా యేమైపోయినాసరే! తన కుటుంబగౌరవం పొయ్యేందుకు వీల్లేదు!

గ్రామపెద్దలందరూ యీ అవమానాన్ని ఎట్లాతప్పించు కోవాలా? అని చెవులు కొరుక్కున్నారు.

"నాలుగు డబ్బులు రాల్చుకోవాలని ఎత్తు! లేకుంటే హీరా యింట్లో ఏముంటుందని?'' అని నెరసిన తలవూపాడు శాస్త్రి.

పటేశ్వరీలాల్ పొడుగైనవాడే అయినా పుట్టెడు బుద్ధు లున్నమనిషి. "మరి వూరికేవస్తాడా? వచ్చింతర్వాత వూరికే ఎందుకెళ్తాడూ?'' అన్నాడు.

ఝింగురుసింగు హోరీని ప్రక్కకిపిలిచి "కొద్దో, గొప్పో ముట్టజెప్పకపోతే కదలడు మరి. ఎంతో కొంత చూడు; చూట్టమే మంచిది" అని సలహా చెప్పాడు చెవిలో.

ఇనస్పెక్టరు మళ్ళీ ఒకసారి గర్జించాడు: "హీరా యిల్లు సోదా చెయ్యాలి!"

హోరీ తెల్లపోయాడు; కత్తివ్రేటు వేసినా నెత్తురుచుక్క లేకుండా పోయింది అతని మొహంలో. తన తమ్ముడియిల్లుసోదా చేస్తే ఒకటీ, తన యిల్లు సోదాచేస్తే ఒకటేనా? వేస్లుపడితే మాత్రం లోకానికి తెలియదూ హీరా తన తమ్ముడేనని; ఇవ్వాళ త్రెంచుకుంటే పోతుందా? తనదగ్గిరే డబ్బు మెదుల్తూంటే, యాభైయైనాసరే యినస్పెక్టరుగారి కాళ్ళకిమ్రొక్కి, యిచ్చి, 'నన్నవమానం చెయ్యొద్దు బాబూ' అని వేడుకునేవాడే. కాని విషం కొనుక్కుందామన్నా కానీ డబ్బు లేదు దగ్గర. ధనియా దగ్గర రెండు, మూడు రూపాయలున్నా ఆ బ్రహ్మరాక్షసి చచ్చి, గీపెట్టినా యివ్వదు. ఉరిశిక్ష పడిన మనిషిలా తల వంచుకుని అవమానభారంతో కృంగిపోయాడు హోరీ.

"నిలబడివుంటే పనెలా జరుగుతుందయ్యా, లేచి ఎక్కడన్నా ఏర్పాటు చేసుకోవాలిగాని" అని హెచ్చరించాడు శాస్త్రి.

"ఎట్లాగో గట్టెక్కించండి బాబూ! మీరు తప్పితే యింకెవ్వరున్నారు. నేను చచ్చిపోయినా గోవరున్నాడు మీ రుణం తీర్చుకోటానికి" అని బావురుమన్నాడు హోరీ.

గ్రామ పెద్దలు నలుగురూ కూర్చున్నారు. ఇనస్పెక్టరు

గారికి ఎంత అర్పించుకోవాలి? శాస్త్రిగారు యాభైయిస్తే సరి పోతుందన్నాడు. ఝింగురుసింగు వందన్నా యివ్వాందే లాభం లేదన్నాడు. నోఖేరాం గూడా అదేమాట అన్నాడు. హోరీ కేముంది? యాభై ఐనా ఒకటే; వందైనా ఒకటే. ఎంతో కొంత యిచ్చి యీ సోదా జరగకుండా చూడాలి. చనిపోయిన వాడిని ఎన్ని కట్టెల్తో దహనంచేస్తేమాత్రం అతని కేం విచారం? మణుగు కట్టెలైనా ఒకటే; పది మణుగులైనా ఒకటే!

కాని పటేశ్వరీలాల్ అంగీకరించలేదు. ఇంత అన్యాయమా? ఏంఖూనీలు జరిగాయని అంత యిచ్చేందుకు? సోదా చెయ్యొద్దనేగా. ఇరవైయిస్తే ఎక్కువతక్కువ.

పెద్దలకు కోపంవచ్చింది. "అయితే నువ్వేవెళ్లి మాట్లాడు యినస్పెక్టర్ గారితో. మేం వెళ్ళంబాబూ, తిట్లెవడు తింటాడు?"

హోరీ, పటేశ్వరీలాల్ చేతులు పట్టుకున్నాడు. "ఇవి చేతులుకాదు బాబూ! ఎట్లాగోట్లా నన్ను రక్షించు నీకుపుణ్యముంటుంది. బ్రతికినంతకాలం నీకు పాలేరుతనంచేస్తా."

ఇనస్పెక్టర్ మళ్ళీ ఒకమారు త్రాొమ్ములువిరుచుకున్నాడు. "హీరా యిల్లెక్కడ? సోదా చెయ్యాలని చెప్పటంలా?"

పటేశ్వరీలాల్ యినస్పెక్టర్ దగ్గరకు వెళ్ళాడు. "సోదా చేస్తే యేంవస్తుందండీ? వాళ్ళ అన్నయ్య ఏదోయిచ్చుకుంటానంటున్నాడుగా!"

ఇద్దరూ కలిసి ఎడంగా వెళ్ళారు.

"వున్నవాడేనా?"

"ఆఁ! ఏంవుందిబాబూ? తిండిగ్గతిలేదు!"

"నిజంగా!"

"నిజంగానే బాబూ; ఒకపూటతింటే ఒకపూటకుండదు."

"ఏమిటీ? యాభయ్యన్నా యివ్వలేమూ?"

"ఎక్కడిమాట బాబూ. పదిచ్చేప్పటికి తాతలు దిగొస్తారు. పుట్టింతర్వాత అసలు యాభై రూపాయ లొక్కసారి చూచాడో లేదో!"

ఇనస్పెక్టరొక నిమిషం ఆలోచించాడు, "అయితే బాధ పెట్టడం ఎందుకులే పోనీ. అట్టాంటి వాళ్లని ఇబ్బంది పెట్ట గూడదు!"

పటేశ్వరి అనుకున్నదానికంటే అధికమై పోయింది మోతాదు. కథ అసలే అడ్డంతిరుగుతున్నట్లుంది. "అదికాదండీ, తమరే అట్లా అంటే యింక మా గతేమిటి? మా కింకేమైనా వ్యవసాయం వుంది గనకనా?"

"నువ్వీయిలాకాకి పట్వారీవిగదా! అవేంమాటలు?"

"ఏదో ఇట్లాంటిసమయం వచ్చినప్పుడే గదాండీ. ఏదో మీాచలవవల్ల. అంతేగాని లేకపోతే మాముఖం ఎవరు చూస్తారండీ?"

"సరే, వెళ్ళు. ముప్ఫయ్యడుగు. ఇరవై మావి పది మీావి."

"కాస్తకనిపెట్టాలిబాబూ! నలుగురు వున్నాంపెద్దలం!"

"సరేలే సగానికిసగం. తొందరగాకానీ, మళ్ళీ ప్రొద్దెక్కుతోంది."

పటేశ్వరి వెళ్లి ఝింగురుసింగుకు చెప్పాడు. ఝింగురు సింగు హోరీని యింటికి పిలుచుకుని వెళ్ళాడు. లెక్కపెట్టి ముప్ఫయి రూపాయలిచ్చి, 'ఏదో పెద్దమనిషివిగదా అని

యిస్తున్నా, తీసికెళ్లి సాయంత్రంరా. రాతకోతలు చూసు కొందాం' అన్నాడు.

హోరీ డబ్బు తీసుకొని పైపంచె కొంగుకి ముడేసి, సంతోషిస్తూ ఇనస్పెక్టరుగారి దగ్గరకు వచ్చేడు.

ఇంతలోనే ఎక్కడినుంచో వూడిపడ్డట్లొచ్చింది ధనియా. వచ్చీరావడంతోనే ఒక్క గుంజు గుంజింది హోరీ పైపంచె పట్టుకొని. మూట వదులుగావున్నదేమో డబ్బంతా నేలమీద చిందర వందరగా పడిపోయింది. "ఈ డబ్బెక్కణ్ణుంచి తెచ్చావో చెప్పు. ఎవర్నడిగి తెచ్చావో పట్టికెళ్లి యిచ్చేసిరా. ఇంటో ర్రాత్రిం బగళ్లెముక లిరగ్గొట్టుకున్నా తాగటానికి గంజినీళ్లుగూడా దొరకటంలేదు. మర్యాదంట మర్యాద! పొయ్యిలో పిల్లి లెగవని వాడికీమర్యాదేంటి? సోదాచేసుకోమను! ఎవళ్లొద్దన్నారు? ఒకేపున వందరూపాయల ఆవుచచ్చింది, చాల్లా? ఇంకా యీ డబ్బుగూడ తగలెయ్యడఁవెందుకు?" అంటూ తోక తొక్కిన త్రాచులా లేచింది ధనియా.

పాపం! హోరీ కిక్కురుమనలేదు. ప్రోగయిన వూళ్లో వాళ్లందరూ నిశ్చేష్టులయ్యారు. గ్రామపెద్దలు తలలు వంచుకున్నారు. ఇనస్పెక్టరు తెల్లబోయాడు; అతను వుద్యోగంలో ప్రవేశించిం తర్వాత యిట్లాంటి చెప్పుదెబ్బలు ఎప్పుడూ తినలేదు.

హోరీకి ఏమీపాలుపోలేదు. ఇంతమందిలో, యిట్లా, అవమానం చేస్తుంది ధనియా అని కలలోగూడ అనుకోలేదు.

ఇనస్పెక్టరు యింతత్వరగా ఓడిపోయే మనిషిగాదు. "చూడగా, చూడగా అసలు హీరాని యిరికించుదామని యీ మనిషే ఆవుకిమందు పెట్టినట్లుగావుంది." అన్నాడు.

"ఆ! పెట్టాను; పెట్టేనేం? నాఆవు; నేను చంపుకున్నా నువ్వెవరివి అడగటానికి? నేను పరాయివాళ్ళ సొత్తుముట్టుకో లేదే? నీరాజ్యంలో ఇదిగూడాతప్పేనా? ఇంకేం బేడీలు తొడుగు. పద నీతో పాటొస్తాజైలుకి? ఇదేనా నువ్వుచేసేన్యాయం? బీద వాళ్ళని కాళ్ళారాయటంవేంనా మీరుచేసేపని? అంటూ చేతులు తిప్పుకుంటూ పైపైకి వెళ్ళబోయింది ధనియా.

హోరీ సిప్పులుకుసుస్తూ ధనియామీదికిదూకబోయాడు; ఇంతలో కొడుకు గోవర్ వచ్చి అడ్డంతగిలాడు. "ఇక వెనక్కి పోనాన్నా. అయిందిచాల్లే. నీమీద చెయ్యిచేసుకునే వెధవని కాదుగాని నువ్విప్పుడు నామాటినకపోతే వురిపోసుకు చచ్చి పోతా!" అన్నాడు.

హోరీ వెనకడుగు వేశాడు. ధనియా సింహిణిలా లేచింది. "నువ్వు తప్పుకోరా గోవర్. ఏంచేస్తాడో చూస్తాను. ఇనస్పెక్టరిక్కడే వున్నాడుగా. చూస్తా యీాయన ప్రతాపం. సోదాచేస్తే పోతందంట యీాయన గౌరవం! భార్యని పట్టుకుని పదిమందిలోనూ బాదితే పోదంట! అంత ధైర్యంవుంటే మొగాళ్ళ తోనే పోట్లాడలేకపోయాడూ? అన్నం పెడ్తన్నానను కుంటన్నా వేంమో! నీ యిల్లు నువ్వు చక్కబెట్టుకోయిక. నేపోతన్నా. అదీ చూస్తాగా! నీతిప్పలు కుక్కలుగూడా చూడవ్!"

హోరీ ఓడిపోయాడు. స్త్రీముందు పురుషుడెందుకూ కొరగాడని, యీానాటికిగాని అతనికి తెలిసిరాలేదు.

గ్రామపెద్దలు క్రిందపడ్డ డబ్బుఏరుకుని ఇనస్పెక్టర్ని ప్రక్కకి రమ్మని సైగలు చేస్తున్నారు. ధనియా మళ్ళీఅందుకుంది. "ఎవళ్లదగ్గర తెచ్చావో పట్టికెళ్లి యిచ్చెయ్యక యింకా అట్టా

చూస్తా నుంచుంటావేఁ? మనకెవళ్ళూ అప్పివ్వనవసరంలా. రమ్మంటే కచ్చేరీకన్నా వెళ్తాగాని, దమ్మిడీగూడ యివ్వన్నేను. యాభైరూపాయలప్పివ్వండంటే యిచ్చేదాత లేకపోయాడు మాక్కావాలిసినప్పుడు. ఇప్పుడెక్కణ్నుంచొచ్చిందో. అంతా తెలుసునాకు. వాటాలేసుకుందామని యిచ్చారు; వూరికే యిచ్చారూ? బీదాళ్ళనెత్తురు తాగే వాళ్ళందరూ వూరిపెద్దలే! వడ్డీకావాలి, నజ్రానా కావాలి, లంచాలు కావాలి! అన్నిటికీ బీదాళ్ళేనా అలుసుగావుంది. ఇంకా సొరాజ్జం కావాలంట సొరాజ్యం! జైళ్ళల్లోకెళ్తే వస్తుందా సొరాజ్జం? న్యాయంగా వుంటేనూ, ధర్మంగా వుంటేనూ వస్తుందిగాని.''

పాపం! వూరు పెద్దలు పెదవి కదిపితే ఒట్టు; ఇనస్పెక్టరు మొహం మాడిపోయింది. గౌరవం దక్కించుకోవాల్నని, అందరూ కలిసి, హీరా యింటివైపుకు కదిలారు.

దారిలో ఇనస్పెక్టరు ''మంచి గుండెగల ఆడది!'' అని అంగీకరించాడు.

''గుండేముందిలెండి; ఒళిగయ్యాళి'' అని సవరణ తెచ్చాడు పటేశ్వరీలాల్.

'' మొత్తంమీద మీ దుంప తెంచింది. లేకుంటే తలకు నాలుగేసి పంచుకునేవారు.''

''మీ పదిహేనూ దక్కలేదు కదండీ.''

''నా డబ్బెక్కడికెళ్తుంది? వాళ్లివ్వకపోతే గ్రామ పెద్దలిస్తారు. అయినా పదిహేనేఁవిటి? యాభై చూడండి; మళ్ళీ నావు ఆలిస్యమౌతుంది.''

"ఇనస్పెక్టరుగా రెద్దేవా జేస్తున్నారు!" అన్నాడు పటేశ్వరీలాల్.

"గొప్పవారంతా అంతే. హాస్యప్రియులు. అలాంటి వారి దర్శనం దొరకటంవే దుర్లభం!" అన్నాడు శాస్త్రి.

ఇనస్పెక్టరుగారికి కోపం వచ్చింది. "ఆ భట్రాజు పొగడ్తలన్నీ తర్వాత చేద్దురుగానిలే. ముందు లెక్కం చూడండి; యాభైకి దమ్మిడి తక్కువైతే వూరుకోను. గుయ్ గుయ్ లాడారంటే మీ యిళ్ళు సోదా చెయ్యాల్సి వస్తుంది. హాలీనీ, హారీనీ యిరికించి, మధ్య డబ్బు కొట్టెయొచ్చుగదా అని మీరే పన్నారేమో యీ పన్నాగం అంతా?"

వూరి పెద్దలంతా, యింకా, యినస్పెక్టరుగారు హాస్యాలాడుతున్నారనే అనుకుంటున్నారు.

"ఏమండోయ్ పట్వారీగారూ! యాభయ్యా కక్కాలిసిందే నండోయ్." అన్నాడు ఝింగురసింగు.

"అవునుమరి. ఈ యిలాకా అంతా ఆయనదేనాయె. ఆయనే చూడాలి!" అని సమర్థించాడు నోఖేరాం.

ఇంతలో నోఖేరాంగారి రచ్చచావిడిదగ్గరకొచ్చారు అందరూ. ఇనస్పెక్టరు మంచంమీద కూర్చుని "మరేవిటి ఆలస్యం? డబ్బిస్తారా? సోదా చెయ్యవలసిందేనా?" అనడిగాడు.

"కాని బాబూ!..." అని ఏదో చెప్పబోయాడు శాస్త్రి.

"కానీ లేదు; గీనీ లేదు!"

"తమరు కాస్త మంచీ..." అని అనబోయాడు ఝింగురసింగు.

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు. (కృష్ణా జిల్లా.)

"పదిహేను నిమిషాల్లోపల యాభయ్యో తీసుకువస్తే సరేసరి; లేకుంటే మీ నలుగురియిళ్లూ సోదా చెయ్యవలసి వస్తుంది. మీకు గండాసింగు సంగతి తెలుసుగా; ఇక మళ్ళీ దిక్కంటూ వుండదు."

పటేశ్వరీలాల్‌కి కోపంవచ్చింది. "తమరి చిత్తం వచ్చి నట్లు సోదా చేసుకోండి; అంతేగాని మా బాగావుంది! చేసిం దెవరో అయితే మమ్మల్ని పట్టుకోవటమా?"

"నాకు పాతికేళ్ళ సర్వీసుంది తెలుసా?"

"ఐనా-ఇంత అడ్డగోలు చూచెరగం."

"నువ్వేం చూశావయ్యా అడ్డగోలు! చూపిస్తాగా. అప్పుడే యేం చూశావు; ఒక్కొక్కళ్ళనీ అయిదేసేళ్ళు పంపితేగాని! తలుచుకొంటే రేపేపాటికి ద్వీపాంతరవాసం వేయిస్తా ఏమనుకుంటున్నావో!"

పెద్దలు నలుగురూ చావడిలోపలికి వెళ్ళారు. ఏం కుంభకోణం జరిగిందో భగవంతుడికే తెలియాలి. ఇనస్పెక్టరు గారుమాత్రం సంతోషంగా వున్నారు. పెద్దలు నలుగురూ చీకాకుపడుతున్నారు.

ఇనస్పెక్టరు గుఱ్ఱమెక్కగానే, నలుగురూ శాస్త్రదూరం వెంట పరుగెత్తారు. గుఱ్ఱం బాగా దూరం వెళ్ళినతర్వాత నలుగురూ తిరిగి వచ్చారు; ఆత్మీయుడి నెవరినో దహన సంస్కారంచేసి తిరిగి వచ్చినట్లు.

"ఛ. ఛ. మొహం ఎత్తుకునే పనేలేకుండా పోయింది!" అన్నాడు శాస్త్రి.

"డబ్బంటే చెట్లమీద కాయలు కాసినట్లే" అన్నాడు నోఖేరాం.

"ఎట్లా వచ్చినడబ్బు అట్లాగే పోతుందిలే!" అని జోస్యం చెప్పాడు పటేశ్వరీలాల్.

న్యాయాన్యాయ విచక్షణచేసే జగదీశ్వరుడేమై పొయ్యాడా అని ఝింగురసింగుకి సందేహం కలిగింది. ఇంత అడ్డగోలు జరుగుతున్నా చూస్తూవూరుకుంటాడేం ఆ భగవంతుడు? పాపుల్ని దండించడేం?!

అప్పుడా పెద్దల ముఖాల్ని చూస్తేనేగాని తనివితీరదు! చూచి తీరవలసిందే!!

# 8

రోజులు గడచినయి; హీరాజాడ తెలియలేదు. హోరీ వెదకి, వెదకి, వేసారిపోయాడు. వ్యవసాయంగూడా చూసుకోవాలి. ఒంటరిగాడు; ఎన్నని చేస్తాడు? తన పొలంమాట అట్లావుంచి, పున్ని పొలంగూడా చూడాలి. పున్ని ఒంటరిగా వున్నదేమో, మరింత ప్రచండరూపం దాల్చింది. ఆవిడగారిని సవర దీసేప్పటికి హోరీతలప్రాణం తోకకు వచ్చేది. హీరా వుంటే కాలిక్రింది చెప్పులా పడి వుండేది పున్నీ; ఇప్పుడంటే అణచే అంకుశంలేదు. అయినా పున్ని ఆడది; ఏం చేసుకోగలదు? అందుకని ఆ వ్యవసాయం గూడా హోరీయే చూచేవాడు. బావ మంచితనంచూచి మరీ తలకెక్కి కూర్చునేది పున్ని. జమీందారుగారి ఏజెంటు పుణ్యామాఅంటూ ఏదోకాస్త మేత తిని వూరుకున్నాడు గాని, లేకపోతే తన బాకీతోపాటు పున్ని బాకీగూడ తీర్చాలంటే హోరీ అప్పుజెయ్యక తప్పేదిగాదు. శ్రావణమాసం వచ్చింది; ఎక్కడ చూచినా మాసూళ్ళే. కూలిజనం దొరకనేలేదు. అయినా అర్ధరాత్రిళ్ళదాకా పొలాల్లోనే వుండి ముందు పున్ని కుప్పలు నూర్పించాడు హోరీ. పున్ని పొలంవదలి, తనపని చూసుకుంటే లోకం ఏమంటుంది?

ఏమైతేనేం, పున్ని పనులన్నీ అదనులో జరిగాయి. పంట బాగానే పండింది; గాదెలు నిండాయి. కాని పాపం! హోరీ పని ఒక్కటీ అదనులో జరగలేదు; మొత్తంమీద కొంత నష్టం గూడ పడ్డాడు...

ఆ గల్లంతు జరిగిననాటినుండీ హోరీ, ధనియాలు సరిగా మాటాడుకోనేలేదు; కొడుకు, గోవర్ కూడా మాటలు మానేశాడు. తల్లీ, కొడుకులు కలిసి, కూడబలుకుకొని, వెలి వేశారా? అన్నట్లుంది. తన యింట్లోనే పరాయివాడిగా బ్రదకవలసి వచ్చినట్లుంది. అతని జీవితం అంతా రెండు నావల లోనూ చెరివకకాలూపెట్టి ప్రయాణం చేసేవాడి బ్రతుకులా వుంది. గ్రామంలోగూడ అతనంటే యిదివరకున్న గౌరవం లేదు. ధనియా ఇప్పుడు స్త్రీలకే కాకుండా, పురుషులకిగూడ నాయకత్వం వహిస్తూంది. ఆ నాటికాండ చుట్టుప్రక్కల గ్రామాల కన్నిటికీ తెలిసింది; యథాశక్త్యనుసారం చిలవలు పలవలు చేసి చెప్పుకుంటున్నారు: ఆవిడపేరు ధనియాటండీ! భవానీదేవికి భక్తురాలట. ఇనస్పెక్టరు వెళ్ళి ఆవిడ భర్త చేతు లకి సంకెళ్ళు వేశాట్ట. ఆవిడ భవానీని తలచుకున్నదట. ఇంకే ముంది! భవానీదేవి ఆవేశించిందట. ఆవిడ వెళ్ళి చెయ్యి వెయ్య గానే ఎక్కడి సంకెళ్ళక్కడ పటాపంచలైపోయాయి. వెళ్ళి యినస్పెక్టర్ని క్రింద పడదోసి, రొమ్మెక్కి కూర్చుని, మీసా లకి మీసాలు పీకివేసింది! ఆయనకాళ్ళా, వేళ్ళాబడి ఎంతో బ్రదిమాలుకుంటేగాని వదల్లేదట.

కొన్నిరోజుల వరకూ ధనియాదర్శనం చేసుకునేందుకని చుట్టుప్రక్కల గ్రామస్తులుకూడా వచ్చేవారు. ఇప్పుడదంతా

పాతబడిపోయింది. అయినా ఆ వూళ్లో ఆవిడంటే, ఇంకా, అపరిమితమైన గౌరవం. ఆవిడలో అద్భుతమైన సాహసంవుంది; అవసరంవస్తే మగవాళ్ళ తలలు తన్నగల శక్తివుంది ధనియాకు.

కాని రానురాను ధనియాలోగూడ పరివర్తనం కలిగింది. హోరీ పున్నికెంత సహాయం చేస్తూన్నా చూస్తూ వూరుకునేది;, అదేమని అనేదిగాదు. పున్ని అంటే ధనియాకు గూడ సానుభూతి, జాలి, వుంది. హీరా యిల్లొదలి పారిపోయిం తర్వాత ఆవిడకోపం వుపశమించింది.

ఇట్లా వుంటూండగానే హోరీకి జ్వరం వచ్చింది. ఊరంతా ఒకటే జ్వరాలు; విషజ్వరాలు. హోరీ మంచం ఎక్కాడు; ఒక నెల రోజులపాటు కదలనే లేకపోయాడు పాపం. ఈ జ్వరం హోరీని హతమార్చింది; అంతేకాదు, ధనియా మనసుగూడ మార్చివేసింది. భర్త మంచమెక్కింతర్వాత ఇంకా పోట్లాటలేమిటి? యెందుకు? అతనితోపాటు ఇరవై అయిదు సంవత్సరాలు కాపరం చేసింది. మంచైనా, చెడ్డయినా అన్నిటికీ-అండదండలుగా, ఒక్కటై, నిలబడ్డారు. నిజమే! ఆనాడు పదిమందిలోనూ పడేసి బాదాడు; తన్నాడు. అయినా భర్త భర్తే. జబ్బొస్తే పగవాళ్లైనా వెళ్ళి పలకరించి వస్తాం. పాపం! ఎంత సిగ్గుపడ్డాడు తర్వాత? అన్నానికి వస్తే, తలవంచుకుని, నాలుగు ముద్దలు తిని, వెళ్ళి చెయ్యి కడుక్కునేవాడు. తన్నేక్కడేమంటుందోనని భయపడిపోయేవాడు; అప్పట్నుంచీ సరిగ్గా తలెత్తుకుని చూడనేలేదు.

హోరీ బ్రతికి, బయట పడింతర్వాత భార్యాభర్తలలో తిరిగి సఖ్యం కుదిరింది.

ఒకనాడు "నీ కింత కోపం ఎట్టా వొచ్చిందో గాని, నాకు నీమీాదింత కోపంవచ్చినా చెయ్యి మాత్రం చేసుకోలేను బాబూ" అని అంది ధనియా.

హోరీ సిగ్గుపడుతూ "ఇప్పుడదంతా ఎందుకులేవే? ఆ క్షణంలో నాతల తిరిగిపోయిందనుకో. తర్వాత ఎంత తపన పడ్డానో నాకే తెలుసు" అన్నాడు.

"ఆ దెబ్బలు తినలేక అక్కడే ప్రాణాలిడిస్తే ఏం చేసే వాడివి?"

"నేను మాత్రం బ్రదికేడ్చేవాడినా యేంటి? నీ శవం తోపాటు నాశవమూ మోసుకెళ్ళేవారు."

"సరేలే! ఇక వూరుకో పాడుమాటలూ; నువ్వూను."

"ఆవుపోతే పోయింది గాని యిదంతా యెందుకొచ్చి నట్లు? పున్ని నేంచెయ్యాలో అర్థంగాక చస్తున్నా నేను."

"అందుకనే యింటికి పెద్ద కాకూడదంటారు. చిన్న వాళ్ళ నెవళ్ళూ ఏఁవీఁ అనరు. మంచొచ్చినా, చెడ్డొచ్చినా, అంతా పెద్దతలనే చుట్టుకుంటుంది."

మాఘమాసం వచ్చింది. ఆకాశమంతా మసక మస కగావుంది. ఒక నైపున ఎముకలు కొరికే చలి; మరోనైపున మాఘమాసం ముసురు. లోకమంతా చచ్చిపోయినట్లు నిశ్శ బ్దంగా వుంది. హోరీ భోజనం చేసి పున్నిగారి పొలంలోకి వెళ్ళాడు పండుకుందామని. నిద్రపోదామని ఎంత ప్రయత్నిం చినా నిద్ర రావటంలేదు. చిరిగి, పీలికలైపోయిన చొక్కా; మంచుతో తడిసిపోయిన ఎండుగడ్డి! ఇంక నిద్ర ఎట్లావస్తుంది? కాస్సేపు చుట్ట కాల్చుకుందామా అంటే పుగాకులేదు; అదీ

గాక తెచ్చుకున్న పిడకనిప్పు మంచారి, ఎప్పుడో ఆరిపోయింది. పగిలినకాళ్ళు ముడుచుకుని, పొట్టలోపెట్టుకుని, మూడంకె వేశాడు. రెండు చేతులూ కలిపి, కాళ్ళమధ్య పెట్టుకున్నాడు. కంబళితీసి తలగూడా కప్పుకున్నాడు. చొక్కా-కుట్టించుకుని ఐదే ళ్ళయింది; కాబూలీవాడి దగ్గర అప్పుగా తీసుకున్నాడు గుడ్డలు. దానికీ ఎంతో తతంగమూ, గొడవా జరిగాయి. ఇక కంబళి! అతను పుట్టకముందునుంచీ వున్నది. చిన్నప్పుడు అతనూ, అతనితండ్రీ కలిసి కప్పుకునేవారు; తర్వాత అతనూ, గోవర్ కలసి కప్పుకుంటూ, శీతకాలాలు నెట్టుకుంటూ వచ్చారు. అతను ముసలివాడయ్యాడు; ఈనాటికీ ఆ ముసలి కంబళే అతన్ని చలినుంచి కాపాడుతోంది. ఇన్నేళ్ళు గడచినా ఒక్క-కాసీకూడా వెనక వేసుకోలేక పోయాడు. దీనికితోడు యిప్పుడీ చిక్కొ-కటి వచ్చిపడింది: పున్నిగారి పొలం చూస్తే ఒకతంటా, చూడకపోతే అదొకతంటా. చూడకపోతే చూశావా పాపం ఆ ఆడకూతుర్ని అజైనా కనుక్కో-కుండా, వదలిపెట్టేశా డంటారు. చూస్తూంటే చూశావా ఆడకూతుర్ని చేసి అంతా దోచుకుతింటున్నాడు; ఆ అమ్మాయి పంటంతా పురులు కట్టు కుంటున్నాడంటారు. ఎట్లా చచ్చేది? మంచికిపోతే చెడ్డ ఎదు రౌతోంది. అటుచూస్తే మనువుసంగతి యేంచేశావ్ అని అడు గుతున్నాడు భోలా; ఇక ఆలస్యంచేస్తే పసువు దక్కేట్లులేదు. శేఖర్ రోజూ వచ్చి చెబుతూంటాడు పున్ని చాటునా మాటునా నిన్ను నానామాటలూ అంటూందని. అన్నా తప్పదుమరి! ధనియాగూడ తానంటే పెద్దయిష్టంగా వుంటం లేదు. నిజంగానె అంతమందిలో పడేసి కొట్టడం తప్పే. ఇరవై

యైదేళ్ళు కాపరం చేసింతర్వాత, అందులోనూ వూరంతా చూస్తుండగా, చేయి చేసుకోగూడదు; కాని అది మాత్రం తన గౌరవం ఎక్కడ దక్కించింది? తాను కూర్చునివున్నా తనవంక కన్నెత్తికూడా చూడదు. ఏమైనా చెప్పవలసివస్తే, సోనాతోనో, రూపతోనో చెప్పిస్తుంది. పాపం! దాని చీర పీలికలు పీలికలై పోయింది. అయినా ఆ సంగతే ఎత్తదు; ఎంతసేపు చెప్పినా సోనా చీర చిరిగిపోయిందనే అంటుందిగాని. అట్లాగే అతుకులూ, మాసికలూ వేసుకుంటే సోనాచీర యింకా రెండేళ్ళదాకా ఫర్వాలేదు; ఎట్లాగో ఒకలా యీడవ్వొచ్చును. మరి దాని చీర దాగాలు దారాలుగా పిగిలిపోతుంది. నేను మాత్రం నాలుగు మంచి మాటలాడగూడదూ. నానోటి బంగారం ఏం రాలిపోయేది? దాని పుణ్యమా అని జ్వరం రాబట్టిగాని లేకపోతే ఇట్లాగే ఎడమొగంపెడమొగంగా ఎన్నాళ్ళుండేవాళ్ళమో. ఇన్నేళ్ళు వచ్చినయి, ఇంత ముసలివాడినయ్యాను; నేనే కాదనుకుంటే ఎట్లా; మహాఅంటే నాలుగు సూటీపోటీ మాటలనేది. అంతేగా!

ఇవ్వాళ ధనియా మాట్లాడింది. మనస్సు విచ్చి మాట్లాడింది. హోరీ అన్నాతురుడికి అన్నం దొరికినంతగా సంతోషించాడు. భార్య కాళ్ళమీద తలవాల్చి "నే నివాళ నిన్ను కొట్టటం తప్పే. నీ కింకా కసితీరకపోతే ఇదిగో నా తల. నీయిష్టం వచ్చినట్లు కొట్టుకో!" అనబుద్ధయింది...

ఇంతలోనే గాజుల చప్పుడయింది. హోరీ చెవులు రెండూ రిక్కించుకున్నాడు. ఎవరో వచ్చారు. బహుశ పట్వారీ కూతురేమో, లేకపోతే శాస్త్రి పెళ్ళామా? చిలగడ దుంపలు

తప్పుకెళ్దామని వచ్చారేమో యేమో వీళ్ళదుంపతెగ, వీళ్ళకి నీతంటూ లేకుండాపోయింది. ఊళ్లోవారందరికంటే బాగా తింటారు; కట్టుకుంటారు. వందలకి వందలు పాతర్లేస్తారు. వడ్డీల కిస్తారు. వెట్టిచాకిరీ చేయించుకుంటారు. లంచాలు తీసుకుంటారు, ఏదో ఒక మడతపేచీపెట్టి డబ్బులు గుంజుకుంటారు. అయినా వీళ్ళ దాహం తీరదు. అంతేలే. ఆవు చేలో మేస్తూంటే దూడ గట్టున మేస్తూందా? మగవాళ్ళలాగానే ఆడవాళ్ళూనూ. అబ్బ, ఛీ, గొప్పవాళ్ళ మనస్సులు నీచులకంటే కనాకష్టం. వెళ్ళి చెయ్యి పట్టుకొని ఏవిటీ దొంగగడ్డి అనడిగితే? ఆడవాళ్ళ చెయ్యి పట్టుకోవడం అదొక మహాపాపం! రెండు కళ్ళూ అప్పగించి చూస్తూ వూరుకోవాలిక! తప్పుకోఅమ్మా! తప్పుకో! మీ యిష్టంవచ్చినన్ని తప్పుకో! నేనిక్కడలేన్లే. గొప్ప గొప్ప వాళ్ళు గౌరవం ఎట్లాగూ దక్కించుకోలేరు; వాళ్ళకి అన్నీ పేర్చిపెట్టినట్లుగానే యీ గౌరవంగూడా మాలాంటి వాళ్ళే దక్కించి పెట్టాలి.

అరే! కాదు; ఈ మనిషి ధనియాలాగుంది. ఏమిటో అంటోందిగూడాను.

"నిద్రపోయ్యావా? మేల్కునేవున్నావా?" అంటోంది ధనియా.

హోరీ గబుక్కున లేచి నిలబడ్డాడు. ఇవ్వాళ దేవి ప్రసన్నం అయినట్లుంది; వరాలిచ్చేందుకు వచ్చినట్లుంది! అయినా యింత చలిలో, యీ ముసుకులో, యీ అర్ధరాత్రి, ఒంటరిగా ఎందుకు వచ్చినట్లు? ఏదో జరిగివుండాలి. ఏమీ జరక్కపోతే ఎందుకొస్తుంది?

"ఇంత చలిలో ఏం నిద్రొస్తుందిగాని, ఏవిటి యిట్లా వచ్చావ్ ! అంతా బాగానేవున్నారా ?" అని అడిగాడు హోరీ.

"ఆ అంతా బాగానేవున్నారు."

"గోవర్‌ని పంపకపోయా ? నేనే వచ్చేవాడ్నిగా."

ధనియా బదులు పలుకలేదు. దగ్గరకువచ్చి కూర్చుని "అబ్బాయి అనుకున్నంతా చేసేశాడు. ఇక తలెత్తుకు తిరిగే పనిలేదు. అనుకున్నంతా అయ్యింది" అంది.

"ఏం చేశాడు ? ఎవరితోనైనా పోట్లాటకెళ్ళాడా ?"

"ఏం చేశాడని నన్నడుగుతావేం ? వెళ్ళి ఆ లంజనే అడుగు !"

"లంజేంవిటే ? ఎవరే ? ఏంమిటే నువ్వనేదీ. పిచ్చేం వన్నా ఎక్కిందా ?"

"పిచ్చెక్కదూ మరి ! కొడుకింత ఘనకార్యం చేసిం తర్వాత ?"

హోరీ కొంత కుదుటబడ్డాడు. పడి "చెప్పేదేదో సరిగ్గా చెప్పరాదంటే ! ఎవర్ని లంజ అనేది ?" అన్నాడు.

"ఇంకా ఎవరున్నారు ? అదే ? ఝునియా."

"ఝునియా యిక్కడకొచ్చిందా యిపుడు ?"

"ఇక్కడికి రాక ఎక్కడికెళ్తుంది ?"

"అబ్బాయి యింట్లో లేడూ ?"

"ఏంవయ్యాడో ఎవరికి తెలుసు ! ఎక్కడికి పారిపోయాడో యేమో. దీనికిపుడు ఐదునెల్ల కడుపు."

అంతా అర్థమైపోయింది హోరీకి. గోవర్ యీ మధ్య తరచుగా వెళ్తూవచ్చాడు గొల్లపల్లెకు; కాని యింత వ్యవహారం

నడుపుతున్నాడని కలలోకూడా అనుకోలేదు. పడుచువాడు; కాగేకాగే పాలు. ఇందులో వింతేమీలేదు. కాని ఆకాశంలో తేలిపోయే దూదిపింజల్లాంటి మేఘాల్ని చూచి, చిరునవ్వు నవ్వుకున్నాడు హోరీ; కాని ఆ మబ్బుతునక పెరిగి పెద్దదై తన దారినంతా చీకటిమయం జేస్తుందని అనుకోలేదు. గోవర్ మరీ యింత బరితెగుతా డనుకోలేదు. ఏమయ్యాడో ? ఇంకా కుర్ర వాడు! పంచాయతీ అంటేనూ భయంలేదు. ఝునియాని తెచ్చి యింట్లో యెట్లావుంచుకోగలం అనికూడ బాధపడలేదు హోరీ. అబ్బాయి యింకా పసివాడు; సిగ్గుపడతాడు; అందు లోనూ ఆత్మాభిమానం యెక్కువ వాడికి. ఏమైనా పిచ్చిపని చేస్తాడో ఏమో!

హోరీ గాభరా పడిపోయాడు. "ఝునియా ఏంచీ చెప్పలా మరి? దాంతో చెప్పకుండా ఎక్కడికెళ్తాడు?" అని అడిగాడు భార్యని.

ధనియా విసుక్కుంది. "అయ్యో, నీ తెలివి దొంగలు తోలా! వాడు కావాలనుకున్న ఆడది యింట్లోనేవుండె; వా డెక్కడికి పారిపోతాడు? పాలు తాగుతున్నానా, ఏంచున్నానా మారిపోతాడేమో అనుకోడానికి? ఎక్కడదాక్కొన్నాడో. ఈ బుద్ధిలేనిదాన్నింటో ఎట్లాపెట్టుకోనా అని నే నేడుస్తున్నా. నాయింటో ఒక్క నిమిషంసేపుగూడా వుండనివ్వను బాబూ. ఏంవంటూ వెళ్ళాడో ఆ ఆవుని తోలుకొనిరావటానికి; అప్పట్నుంచీ ఒకటే గొడవ. కడుపురాకపోతే యీమాట యిప్పుడప్పుడే పొక్కేదిగాదు. కడుపు చూచుకొని గాబరాపడింది. అది ఎక్కడకన్నా పారిపోదాం పదమంది. అబ్బాయేమో టలా

యించాడు. చివరి కది తీసుకెళ్తావా? ఎందుట్నోనన్నా పడి చావ మంటావా? అని వెంటపడింది. సరేలే! నువ్వు మాయింటికెళ్లు, ఏఁవీఁ ఫర్వాలేదులే. అమ్మ నెట్టాగోట్టా బతిమాలుకుంటాను అన్నాడు అబ్బాయి. సరే! ఆ గాడిద, యీ గాడిద కలసి బయల్దేరారు. ఎక్కడో దారిలో కన్ను మరగయ్యాడు. ఇది పిలిచి పిలిచి అలసిపోయింది. అప్పటికే బాగా పొద్దుపోయిం దేమో, ఇక యింటికి పరుగోస్తుకొచ్చింది. నా ఇంట్లో వుంటానికి వీల్లేదు. నీ తిప్పలు నువ్వు పడు. చేసేప్పుడేమైంది యీ బుద్ధి? అన్నా నేను. నావల్ల కాదమ్మ అని చెప్పేశా. అది కదిల్తేనా; కూర్చుని ఒకటే యేడవటం. మాయింటి కెట్టా యెళ్ళేది అని ఒకటే ఏడుపు. ఏఁవోఁనమ్మా, నే పడలేను. ఈబిడ్డలు పుట్టక పోయినా బాగుండేది. తెల్లారితే ఏఁవఁన్నావుందా? వూరంతా కాకులికిమల్లే పొడుచుకుతిన్రూ? నే యీదలేను బాబూ యీ సంసారం. అది ఇంటో వుంటానికి వీల్లేదు. వాడికావాలను కుంటే నెత్తిమీదెక్కించుకొని వూరేగించుకోమను. మధ్య నువ్వేమన్నా కలుగ జేసుకున్నావంటే మర్యాదక్కాదు.

"అంత వద్దనుకున్నదానివి యింట్లోకెందుకు రానిచ్చావు మరి?" అనడిగాడు హోరీ.

"చెప్పి, చెప్పి నానోరు పడిపోయింది. కదిల్తేనా?"

"కదలకేంజేస్తుంది? పద బయటికీడిస్తేసరి."

"ఆ తలకి మాసినాడు, భోలా, కళ్ళప్పజెప్పి చూస్తూ కూర్చున్నాడు. మరి ఆ కన్నకడుపేఁవఁయ్యిందో."

"వీళ్ళు నడిపే వ్యవహారం అతనికి మాత్రం తెలిసి చచ్చిందంటలే."

"తెలవకేం తీసిడాయి! అబ్బాయి రోజూ వెళ్తాంటే చూడలా? ఇంత పురుకులూ, పరుగులూ మీద ఎందుకొస్తన్నాడా అని ఆలోచించుకో అక్కర్లా? కళ్ళేంవన్నా పూడిపొయ్నయ్యా?"

"పద! ఝునియా నడుగుదాంగా."

ఇద్దరూ వూళ్ళోకి బయల్దేరారు. "అయిదు ఝామలు పైనే అయిందనుకుంటా" అన్నాడు హోరీ.

"అవ్వదూ మరి. చూచావా. వూరంతా ఎట్టా గురకలు కొడతాందో. దొంగలుపడితే యింకేంవన్నా వుందా? వూరంతా దోచుకుపోవచ్చు!"

"దొంగలు మనూళ్లో ఎందుకుపడతార్లే. వున్నవాళ్ళిళ్ళకి కన్నా లేస్తారుగాని."

నడుస్తూన్న ధనియా ఠక్కున ఆగి, భర్తచేయి పట్టుకుని ఆపి, "నువ్వేమీ గల్లంతు చెయ్యబాక. వూళ్ళోవాళ్ళందరికీ తెలిసిపోతుంది." అంది.

"నా కదంతా ఏంవీం తెలవదు. చెయ్యిపట్టుకుని చిరబరాలాగి బయట పడేస్తా. వూళ్లోవాళ్ళ కివ్వాళ తెలవకపోతే, రేపైనా తెలవదూ? మూకుడుతో మూస్తావా? గోవర్ధనోనే వెళ్ళిపోక పోయింది? నా యింటి కెందుకొచ్చింది. వాడితో తిరిగేప్పుడు నాతో చెప్పి, నన్నడిగీ తిరిగిందా!" అన్నాడు కతోతంగా.

"నువ్వు దాని చెయ్యిపట్టుకుంటే కేక వేసి ఏడవదూ!" అని అడిగింది మెల్లగానే.

"ఏడిస్తే ఏడవనీ."

"పాపం ! ఇంత చీకట్లో ఎక్కడికి కెళ్తుందనన్నా తోచదేఁ నీకు ?"

"ఏఁవోఁ ఎక్కడికి పోతందో. నా కెందుకు ? నాయింట్లో మాత్రం వుంటానికి వీల్లేదు."

"సజఁవేఁ ననుకో. మరి వట్టిమనిషి కాదుగా. నిండు మనిషాయె. చీకట్లో ఏ ఎదురుదెబ్బన్నా తగుల్తుందనుకో; కాలు జార్తుందనుకో, ఏఁవఁన్నా వుందా ?"

"అయితే మనకేఁ ? చస్తేచస్తంది. మనకెందుకు యీ నామర్దా అంతా ? నేను గోవర్ని యింట్లోకి రానివ్వను."

"వచ్చే నామర్దా అంతా ఎట్టాగో రానేవచ్చింది. ఇప్పుడు కడిగేసుకుంటే పోతుందా ? వీడి దుంపదెగ. నావ నట్టేట్లో ముంచి కూర్చునె."

"వాడేంచేశాడు ? చేసిందంతా యిదే చేసింది. వాడికేం తెలుసు నిన్నగాక మొన్న పుట్టాడు. ఇదే వలేసింది."

ఇద్దరూ యింటిదగ్గరకు వచ్చారు. మళ్ళీ ఒకసారి భర్తను ఆపి, "నన్ను చంపుకుతిన్నట్టు. దానిమీద చెయ్యి చేసుకోవద్దు. అసలే కుళ్ళి కుళ్ళి ఏడుస్తాంది. దాని అదృష్టం తిన్నగావుంటే యిదంతా ఎందుకు జరిగేదిలే !" అని బ్రతిమాలుతూ భర్తని వాటేసుకుంది ధనియా.

హోరీ కళ్ళు చెమ్మగిల్లినయి. అంత వార్ధక్యంలోనూ, చీకటింట్లో దీపం పెట్టినట్లు, ఆవిడ ముఖమంతా మాతృవాత్సల్యంతో కళకళలాడింది. ఇద్దరూ కలిసి, పాతిక సంవత్సరాలు వెనక్కిపోయి పడుచువాళ్ళయినట్లయింది. తనముందు నిలబడ్డ వయసువుడిగిన ధనియాలో యిరవై ఐదు సంవత్సరాల క్రితం

తన జీవితంలో అడుగుపెట్టిన పడుచుపిల్ల కోమలహృదయం యింకా దోబూచులాడుతున్నదా అనిపించింది హోరీకి. ఆ ఆలింగనంలో ఎంత వాత్సల్యం దాగివుందో, అన్ని కష్టాలనీ, బాధ లన్నిటినీ తనలో పొదువుకుని, దాచుకుంది!

ఇద్దరూ తలుపు సగుల్లోనుంచి లోపలికితొంగిచూచారు. ఇంట్లో దిమ్మెసమీద పెట్టిన కిరసీనుబుడ్డి వెలుగుతోంది. ఝునియా తలుపువైపుకు తిరిగి కూర్చునివుంది మోకాళ్ళమీద మొహం పెట్టుకుని. ఒకక్షణం క్రిందటివరకూ, తన సుందర రూపం చూసి, తన్నాకర్షించి, యిప్పుడు తనకు కనపడకుండా పోయిన ఆనందాన్ని వెదుకుకుంటోంది రెప్పలచాటున దాక్కున్న చీకట్లల్లో. ఆపదల ఎడారుల్లో, నడచి, నడచి; జీవితం వీచే వడదెబ్బలింక సహించలేక, ఏ చెట్టునీడనైనా తల దాచుకుందామని తపించిపోయింది. ఇంతలోనే ఆవిడకొక విశాలభవనం కన్పించింది. ఆ భవనంలోకి వెళ్ళి కష్టాలన్నీ మరచి, సుఖంగా, భద్రంగా వుందామని ఆశించింది. కాని ఆ భవనమూ, తానాశించిన సుఖమూ, ఆనందమూ అన్నీ కలసి అల్లావుద్దీన్ రాజమహలులా కన్నుమూసి తెరచేటప్పటికి అంతర్థానం అయిపోయ్యాయి. ఇప్పుడు భవిష్యత్తు వికృత దానవుడిలా కట్టెదుట నిలబడి కరాళ అట్టహాసం చేస్తూ తనను మింగబోయేందుకు సిద్ధంగా వుంది ......

గభాలున తలుపు తెరచుకుని, లోపలికొచ్చే హోరీని చూచి, ఝునియా, గడగడ వణకిపోయింది. వెళ్ళి హోరీ కాళ్ళ మీద పడింది. "మీరు తప్పితే యిక నాకు దిక్కులేదు. నన్ను కొట్టినాసరే, చంపినాసరే. ఇక నన్నాలించేవాళ్లూ, పాలించే

వాళ్లూలేరు. నన్నెళ్ళగొట్టొద్దు!" అంటూ వెక్కి, వెక్కి ఏడ్చింది.

హోరీ వంగాడు; ఆవిడవీపు నిమిరాడు. "భయపడ బోకమ్మా. ఇది నీ యిల్లేనమ్మా. మేమూ నీవాళ్లమే. నేనొకటీ, మీ నాన్నొకటీనా తల్లీ, మేం బ్రదికున్నంతవరకూ నీకేమీ ఫర్వాలేదమ్మా. నిన్నెవళ్లూ, ఏఁవీఁ,అనరు తల్లీ. మాతోనే వుందూగాని; మాకు కలిగిందేదో తిందూగాని, వూరుకోతల్లీ!" అని ఎంతో ప్రేమతో సముదాయించాడు.

ఈ ఓదార్పులువిన్న ఝునియా కాళ్ళని మరింత కఱచుకు పోయింది. "నాకికెవ్వరూ దిక్కులేరు. నువ్వే నాతండ్రివి; యీ అమ్మే మా అమ్మ. మీరే నన్ను కాపాడాలి. లేకపోతే నన్ను మా నాన్నా, అన్నయ్యలు బ్రదకనివ్వరు; చంపేసేస్తారు."

ఇంతవరకూ బిగబట్టుకుని కూర్చున్న ధనియా మరి వూరుకోలేక పోయింది. "నువ్వు నా యింట్లోనే వుండమ్మా. మీ నాన్నేంచేస్తాడో, అన్నయ్యలేం చేస్తారో నే చూస్తాగా. ఈ దేశం అంతా వాళ్ళదేనా యేంటి? అంతగా ఐతే నగలు వల్చుకు పోతారు; అంతేగా? తీసి వాళ్ళమొఖాన పారెయ్."

ఇంతకుముందే ఝునియాని నానామాటలూ అన్నది ధనియా. కులట వన్నది. కళంకిణి వన్నది. పరువున్న ఆడదానివి కావన్నది. అనవలసిన వన్నీ అన్నది. చీపురుకట్టతో సింగారించి, బయటికి వెళ్లగొడతానన్నది. ఆ మాటలన్నీ అని, అంత హంగామా చేసిన ధనియా యిప్పుడు ఝునియాని కన్నబిడ్డని ఓదార్చినట్లు ఓదారుస్తుంటే ఝునియా తనకళ్ళని తానే నమ్మ లేక పోయింది. హోరీ కాళ్లువదలిపెట్టి, వెళ్ళి, ధనియా కాళ్ళకి

అడ్డంపడింది; కాళ్ళుపట్టుకుని వదలటంలేదు. భర్తని తప్పితే యింకొకర్ని కన్నెత్తిచూచి యెరగని ధనియా, యీ పాపిష్ఠి ఝునియాని చేతుల్లో పట్టుకొని, లేపి, కౌగలించుకొని, కన్నీరు తుడిచింది. తల్లిపక్షి పిల్లల్ని రెక్కలమాటున పొదువుకుని సంరంక్షించినట్లు, ఝునియాని తన సానుభూతితో, ఆశ్వాస నతో, సాంత్వన పరిచింది; ఓదార్చింది.

తీసుకెళ్ళి అన్నం అవీ పెట్టమని భార్యకి సౌజ్ఞచేసి, "ఏం తల్లీ. గోవర్ ఎక్కడికెళ్ళాడో నీకేమైనా తెలుసా?" ఝునియాని అడిగాడు.

ఝునియా వెక్కి, వెక్కి ఏడ్చింది. "నాకేఁవీఁ చెప్ప లేదు. నామూలాన మీరందరూ ......" అంటూ యిక మాట్లాడలేకపోయింది ఝునియా.

హోరీగూడ తన వ్యాకులతని దాచుకోలేక పోయాడు.

"అదికాదు తల్లీ. ఇవ్వాళ వాడు నీదగ్గరకు వచ్చాడుగా. ఏఁవన్నా విచారంగా వున్నాడా?

"లోపల్లోపల ఎంత కుళ్ళుతున్నారో, ఏఁవోఁ. పైకి మాత్రం నవ్వుతూ, పేలుతూనే మాట్లాడారు."

"నువ్వేం అనుకుంటున్నా. వూళ్ళోనే వున్నాడంటావా? ఇంకెక్కడికన్నా వెళ్ళాడంటావా?"

"ఎక్కడికన్నా వెళ్ళిపొయ్యారేమో!"

"నేనూ అదే అనుకుంటున్నా. ఎంత తెలివితక్కువ పని చేశాడూ; ఎంత పిచ్చిపని. మాకు వాడంటే పగా? అట్లా పారిపోవటం దేనికి? ఏదో కాలు జారిందనుకుంటే నిభాయించు

కోవాలిగాని యిట్లా పారిపోతారా ఎక్కడన్నా. పిచ్చిమొద్దు! ఇప్పుడు మా గతేంకాను?"

ఝునియా చేయి పుచ్చుకుని, లోపలికి తీసుకెళ్తూ, "పిరికి మొద్దు కాకపోతే నమ్ముకున్న ఆడదాన్నొదిలిపెట్టి పారిపోతాడూ? ఈ సారి యింటికి రానీ, చెబుతా" అంది ధనియా.

తర్వాత హోరీ నడుం వాల్చాడు; కాని నిద్రపట్టలేదు. గోవర్ ఎక్కడికెళ్ళాడు? అనే ప్రశ్న అతని హృదయాకాశంలో పక్షిలా గింగిరాలు తిరుగుతోంది.

# 9

ఈ అసాధారణకాండని గురించి జరగవలసిన గల్లంతు అంతా జరిగింది; నెలల తరబడి జరుగుతూనే వుంది గల్లంతు. గోవర్ కోసమని ఝునియా అన్నలిద్దరూ కర్రలుపట్టుకుని వూరూ, నాడూ గాలించి వదలిపెట్టారు. తాను చచ్చినా కూతురు మొహం చూడనని ఒట్టుపెట్టుకున్నాడు తండ్రి భోలా. అతను హోరీతో చెప్పి అట్టిపెట్టిన మనువు వ్యవహారం ముగిసి పోయింది. ఆవుకయ్యే ఖరీదు అణాపైసలతో వసూలు చేయ వలసిందే; వసూలు కాకపోతే దావావేసి, వున్నదంతా అయినకాడికి వేలంవేయించి, రావలసినడబ్బు రాబట్టుకుంటాడు. ఊళ్ళోవాళ్ళందరూ కలిసి హోరీని వెలివేశారు. వాళ్ళింట్లో నిప్పుకాని, నీరుకాని ఎవ్వరూ తీసుకెళ్ళేందుకు వీలులేదు. నూతి దగ్గరకుకూడ రానివ్వవద్దని అనుకున్నారు; కాని ధనియా ప్రచండరూపం తలచుకుని హడలుకున్నారు. "నన్ను రానివ్వ ద్దన్న వాళ్ళ నెత్తురు కళ్ళజూస్తా" అని అందరకూ వినిపించేట్టు గద్దించింది ధనియా. ఆ కబురు విన్నవాళ్లూ, తెలిసినవాళ్ళూ తుక్కిన పేనుల్లా వూరుకున్నారు.

పాపం! ఝునియా మరీ మరీ కుమిలిపోతోంది. ఈ ఉపద్రవాని కంతటికీ ఆవిడేగదా కారణం. దీనికి తోడు గోవర్ ఏమయ్యిందీ తెలియటంలేదు. గోరుచుట్టుమీద రోకటిపోటు. ఇల్లువదలి బయట అడుగుపెట్టటంలేదు; అడుగుపెడితే లోకులు కాకుల్లా పొడుచుకు తింటారు. పగలల్లా ఏదోఒక పనిచేస్తూనే వుంటుంది. ఎప్పుడైనా వీలుదొరికితే హృదయం పగిలేట్టు ఏడ్చుకుంటుంది. ధనియా ఎప్పుడేమనేస్తుందోనని ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుంటుంది. వంటపనిగూడా తానే చేద్దామంటే అందరూ తింటారో, తినరో! అంచేత వంటను తప్పించి, మిగతా పనులన్నీ తనే చేస్తూంది.

ఒక పర్యాయం ధనియా కోమటింటికి వెళ్ళి, వస్తూంటే శాస్త్రి ఎదురు బడ్డాడు. ధనియా మొహం చాటుపెట్టి తప్పించుకోవాలని చూచింది; కాని శాస్త్రి సామాన్యుడు కాదుగదా?

"ఏంవమ్మా గోవర్ సంగతేమైనా తెలిసిందా! కులం చెడబుట్టాడమ్మా! వంశమర్యాద నట్టేట కలిపేశాడు" అన్నాడు.

ధనియా కూడ అదే అనుకుంటోంది. అందుకని, సగం చచ్చి "అంతేబాబూ. రోజులట్టాంటియి. రోజుల్నిబట్టి బుద్ధులూనూ. ఏం చేస్తాం?" అంది.

"నిజంవేం కాని, ఆ ముండని యింట్లో వుంచుకోగూడదమ్మా. చూడు! పాలల్లో యీగ పడితే, యీగని తీసి పారేస్తాం; పాలు త్రాగేస్తాం. ఎంత అప్రదిష్ట! ఎంత తల

వంపులు? అదింట్లో లేకుండాపోతే యేగోడవా ఉండదు. కుర్రవాళ్ళున్న తర్వాత అప్పుడప్పుడు కాలు జారతారుమరి. కాని ఆడదా? సరేకాని అదింట్లో లేకుండాపోతే యీ వెలీ వుండదు; యేమీ వుండదు. సరే! హోరీ అంటావూ! అవూయ కుడు! నీకైనా తెలియకపోతే యెట్లా?" అన్నాడు శాస్త్రి.

శాస్త్రికొడుకు ఒక మాదిగదానిని వుంచుకున్నాడన్న విషయం వూరందరికీ తెలుసు. "ఐతే ఏం? చక్కగా పీభూతి పెట్టుకుంటాడు, గీతాపారాయణం చేస్తాడు; పురాణ పఠనం జరుపుతాడు, సంధ్యావందనాలు చేస్తాడు. రోజూ పూజా పునస్కారాలుచేసి ప్రాయశ్చిత్తం చేసుకుంటాడు. అతని ప్రతిష్ఠ కేమీ లోటురాలేదు!

ఝునియాని తెచ్చి యింట్లోపెట్టుకుని ఆశ్రయం యిచ్చి నందువల్లనే యీ తిప్పలన్నీ వచ్చిపడ్డాయని ధనియాకి తెలుసు. ఆవిడ కానాడంత దయ ఎందుకు కలిగిందో? అప్పుడే వెళ్ళ గొడితే ఝునియా ఎక్కడికని వెళ్ళేది? ఏనుయ్యో, గోయ్యో చూచుకునేది; అంతేగా? ఒకజీవాన్ని బలి - కాదు, కాదు; రెండుజీవాల్ని బలిచేసి తన మర్యాదని రక్షించుకోంటుందా? ఝునియా కడుపులోవున్న బిడ్డలో ధనియా రక్తం మాత్రం లేదూ? లోకులు నవ్విపోతారని ఆ బిడ్డని చంపుకుతింటుందా! అదీకాక పాపం! ఝునియా ఎంత వొదిగీ, బొదిగీ వుంటుంది? దిక్కులేని ఆ ఆడది. ఎంతకోపం వచ్చినా, ఝునియా నీళ్ళ చెంబు తెచ్చి, మంచంక్రిందపెట్టి, కాళ్ళు పిసకటం మొదలు పెట్టేటప్పటికి ధనియా కోపం అంతా పటాపంచలైపోయేది; అసలే సిగ్గుతో చచ్చిపోతున్నదానిని, దుఃఖభారంతో క్రుంగి,

కృశించిపోతూన్నదానిని, ఇంకెట్లా కృంగదీయగలం? వచ్చిన పాముని కొట్టటమంతనీచం వుందా?

ధనియాకి కోపం వచ్చింది. "ఏమో బాబూ మా వంశ మర్యాదంటే మాకంత మక్కువేమీలేదు. ఉంటేమాత్రం ఒక ప్రాణం నిలువునాతీసి మర్యాద కాపాడుకోటం మాచేతకాదు! నా కొడుకు దాన్ని పెళ్ళిచేసుకోకపోతేమాత్రమేం? తన మనిషనుకున్నాడంతేచాలు! దాన్నేం నెళ్ళగొట్టను? ఆ పనే పెద్దాళ్ళుచేస్తే ఎవళ్ళూ నోరెత్తరు. వాళ్ళమర్యాద పోదు? ఆపనే మావంటోళ్లు చేస్తే మా మర్యాద పోతంది; మా తల కొట్టేసుకోవాలి. పెద్దాళ్ళకి యింకొకళ్ళ ప్రాణాలు పోయినా ఫర్వాలేదు; వాళ్ళమర్యాద మాత్రం వుంటే చాలు; మాకంత మర్యాదొద్దులే!" అని తీవ్రంగానే అంది ధనియా.

ఈ మాత్రానికే వూరుకునే ఘటంకాదు శాస్త్రి. ఆయన యీ గ్రామానికి నారదు డంతటివాడు. అక్కడి దిక్కడా; ఇక్కడి దక్కడా!; ఇదే ఆయన వృత్తి. దొంగతనం మాత్రం చెయ్యడు; చేస్తే యెట్లా? ప్రాణభయమాయె! అందుకని దొంగలు సొమ్ము పంచుకునే సమయానికిమాత్రం అందుకునేవాడు. చచ్చినా చేతికందదు. ఇంతవరకూ జమీం దారుకి పన్ను కట్టినపాపానపోలేదు; జప్తులొస్తే నూతిలోపడి చచ్చిపోతానని పరుగెత్తేవాడు; నోఖేరాం చెప్పినా వినేవాడు కాదు. మళ్ళీ ఆసాములకు అప్పలిస్తానేవుంటాడు వడ్డీలకని. ఆడవాళ్లెవరైనా నగలు చేయించుకోవాలని అనుకుంటూన్నట్టు తెలిస్తే అక్కడికి శాస్త్రిగారు హాజరు, తమ అమూల్య సలహాల నిచ్చేందుకు. పెళ్ళి సంబంధాల విషయం వస్తే యింక చెప్ప

వలసిన అవసరమే లేదు. సంతోషానికి సంతోషం; కీర్తికి కీర్తి; దక్షిణకు దక్షిణ! జబ్బులొస్తే రోగికిష్టమైన మందులన్నీ యిచ్చేస్తాడు. మాటల్లో ఆయన్నిమించే వాళ్ళసలు లేనేలేరు; కుర్రవాళ్ళల్లో కుర్రాడు; వ్యవహార్తల్లో వ్యవహార్త. దొంగకీ స్నేహితుడే; దొరకీ కావలసినవాడే, అతనంటే వూళ్ళోవాళ్ళ కెవ్వరికీ నమ్మకం లేదు. కాని ఆయన వాక్చాతుర్యంవల్లనే అనండి, ఆయనమాటల్లో ఉన్న ఆకర్షణవల్లనేననండి, అన్నిసార్లు మోసపడ్డా, ఏదైనా కష్టంవచ్చిందంటే, అందరూ ఆయన దగ్గరకే వెళతారు సలహాకని.

"నువ్వు చెప్పేదీ నిజమేలే! ధర్మాత్ము లంతేననుకో. అయినా సాంప్రదాయంగూడా వదిలిపెట్టుకోలేంగా మరి మనం" అంటూ తల వూపాడు.

ఇట్లాగే యింకోసారి పట్వారీలాల్, హారీసి పట్టుకున్నాడు. ఆయనగూడా గొప్ప పుణ్యాత్ముడే! నిత్యమూ సత్యనారాయణవ్రతం చేస్తాడు. ఊరికి పట్వారీకాబట్టి ఆయన పొలంలో వూడ్పులూ, కలుపుతీతలూ, నూర్పిళ్ళూ కూలీలు లేకుండానే జరిగిపోతాయి. తనకేమీ పనిలేకపోతే రైతుల్లో రైతులికి పోట్లాటలు పెట్టి, తను కోర్టులచుట్టూ తిరుగుతాడు. వూరందరికీ ఆయనంటే హడల్. బీదవాళ్ళందరికీ అయిదూ, పదీ అప్పిచ్చి, ఈనాటి కాయన వేలు ప్రోగుజేసుకున్నాడు. ఆసామీలందరి దగ్గరా అపరాలూ అవీ ప్రోగుచేసి అధికారులకి కానుకలిస్తాడు; అంచేత ఆ యిలాకాలో ఆయనిపేరు తెలియని అధికారంటూ లేడు. ఇంతవరకూ ఆయన చేతి కందకుండా పోయింది ఆ సబిన్‌స్పెక్టరొక్కడే! పట్వారీ ఏదో చేతనైనంత

పరమార్థంకూడా చేస్తూనేవుంటాడు; వూళ్లోవాళ్ళకి జ్వరంవస్తే గవర్నమెంటువారి క్వైనైన్ వుచితంగా పంచిపెట్టాడు. ఎవరైనా జబ్బుపడితే ఒకటికి నాలుగుసార్లు వెళ్ళి మంచీచెడ్డా కనుక్కుంటాడు. పెళ్ళిలాంటి శుభకార్యమేదైనా వస్తే పల్లకీ, పంక్తి చాపలు, గంగాళాలు లాంటివి యిచ్చి, వాళ్ళని గట్టెక్కించుతాడు. వీలుంటే నాలుగు జేబులో వేసుకుంటాడన్న మాటే గాని, తానొకళ్ళ దగ్గర తిన్నాడంటే, వాళ్ళకి పనులుగూడా చేసిపెట్టే మనిషి.

"నీకిదేం పొయ్యేకాలం?" అన్నాడు పట్వారీ.

హోరీ వెనక్కి తిరిగి "ఏమిటీ అన్నది? నేను విన్లా" అన్నాడు.

పటేశ్వరి దగ్గరకివచ్చి "అదికాదు, ధనియాకి బుద్ధిలేకపోతే నీ బుద్ధెక్కడికి పోయిందని అన్నానే. ఒకేపున లోకం అంతా నవ్వుతావుంటే యింకా ఆ ఝునియాని యింటోపెట్టుకున్నావెందుకు దాని కన్నారింటికి దాన్ని పంపించక? ఆ ముండ నీ కొడుకునే నమ్ముకుందని నమ్మకమేంవిటి? ఇంకా పెళ్ళి కావాలిసిన ఆడపిల్లలు యిద్దరున్నారాయె నీకు; అదైనా ఆలోచించుకోక్కర్లా?"

ఇట్లా తనమంచి కోరివచ్చి, చెప్పేవాళ్ళ మాటలు విని, విని, విసిగి పోయాడు హోరీ. "నువ్వు చెప్పేదంతా నాకూ తెలుసు. అయితే లాభంవేంటి? నువ్వేచెప్పు. నేను ఝునియాని బయటికి కెళ్ళగొడతా బాగానేవుంది. మరి దానితండ్రి రానిస్తాడా దాన్ని? ఆయనొప్పుకుంటే యివ్వాళ్లే తీసికెళ్ళి వాళ్లింటికాడప్పగించొస్తా. ఆయనొప్పించావంటే బతికినంత

కాలం నీమేలు మరిచిపోను. అక్కడేవో అన్నలిద్దరూ కత్తులు నూరతా కూర్చుండిరి. అట్లాంటప్పుడు నేనెట్లా వెళ్ళగొట్టను? మావాడంటావూ; వట్టి వెధవ. నమ్మిందాన్ని మోసంచేసి పారిపోయాడు. ఇప్పుడు నేనెళ్ళగొడితే కూలీ, నాలీగూడా చేసుకో లేదాయె అది. అదెక్కడన్నా పడిచస్తే ఆపాపం ఎవరికొక్కడ తంది? ఆడపిల్లల పెళ్ళంటావూ? పైన ఆదేవుడే వున్నాడు. ఆరోజు కలిసొస్తే ఏదీఆగదు. మనవూళ్ళో పెళ్ళిగాని పిల్ల లెవరున్నారు? వూరుకి జడిసి ప్రాణం తియ్యమంటావా?" అని అన్నాడు కళ్ళనీళ్ళు బెట్టుకుంటూ.

హోరీ ఒకళ్ళ జోలికి పొయ్యేమనిషిగాదు. తన దారిన తాను తలవంచుకుని వెళ్ళేరకం. తమ్ముడు, హీరా, ఒకణ్ణే మినహాయిస్తే అతనంటే గిట్టనివాళ్ళెవళ్ళూలేరు. అయితే మాత్రం సంఘం యిలాంటి అనర్థాన్ని సహిస్తుందా? ఒకళ్ళు చెప్పినా వినని గడుసుదనాన్నిచూస్తూ వూరుకుంటుందా? భార్యాభర్తలిద్దరూ కలిసి మమ్మల్నేవరేంజేస్తారని అంటూంటే సంఘమేనా అంత తక్కువ తిన్నది? సంఘమర్యాద పాటించని వాళ్ళని, కాపాడనివాళ్ళని ఏంచెయ్యాలో సంఘానికి తెలుసు!

ఆ రాత్రే గ్రామ విధాతలందరూ కచ్చేరీ దీర్చారు.

"నే నెవళ్ళనీ నిందించే మనిషినికాదు. ఈ లోకంలో ఎన్ని చెడ్డపనులు జరగటంలేదు? అన్నిటినీ పూనుకుని తిరుగు తున్నామా? ఆముండ, ధనియా నామీద ఒంటికాలుమీద లేచింది. అవున్లే. తమ్ముళ్ళ భాగాలన్నీ తిని, నాలుగు డబ్బులు వెనకేసుకునేటప్పటికి కళ్ళు నెత్తిమీదకొచ్చాయి. నీచజాతి కాదూ మరి? కాస్త కడుపునిండా దొరికితే చాలు; యిష్ట

మెచ్చిన వెధవపనులన్నీ చేస్తారు. నీచుల్ని కాళ్ళక్రింద చెప్పుల్లా వుంచమని వూరికేనే అన్నారూ పెద్దలు?" అన్నాడు శాస్త్రి.

పటేశ్వరీలాల్ ఒక దమ్ములాగి, "అంతేనండీ యీజాతే అంత. నాలుగు డబ్బులు కళ్ళజూస్తే చాలు, ఎవడిమాటా వినరు. ఇవ్వాళిమట్టు కివ్వాళ హోరీ నాతో ఎంత అడ్డగోలుగా మాట్లాడాడని? నేను నోరుమూసుకునొచ్చానంటే నమ్మండి? ఇట్లా నీతంటూ లేకండాపోతే యింకేమున్నావుందా? మీరే ఆలోచించండి! ఝునియాని చూచిన విధవ ఆడవాళ్ళింకా వూరుకుంటారా? ఇవ్వాళ భోలా యిల్లొంది; రేపు మనిళ్లోతయి. భయంలేంది సంఘం నడుస్తుందా? అబ్బో, మనం చూడలేం!" అన్నాడు.

ఝింగురసింగు ఇద్దరి భార్యల భర్త. మొదటిభార్య ఐదుగురు పిల్లల్నికని, చనిపోయింది. అప్పటి కాయనకు నలభై ఐదేళ్లు వుంటాయి; రెండోపెళ్ళి చేసుకున్నాడు. రెండోభార్యకు పిల్లలు కలగలేదని మూడో వివాహం చేసుకున్నాడు. ఈయన కిప్పుడు యాభై ఏళ్ళ పైచిల్లరే వుంటాయి; ఇంట్లో యిద్దరు పడుచుపెళ్ళాలు. వాళ్ళిద్దర్నీ గురించి రకరకాలుగా చెప్పుకుంటారు వూళ్ళో. కాని సింగుగారంటే వున్న భయంవల్ల పైకనే సాహసం లేదు ఎవ్వరికీ. ఐనా అనవలసిన అవసరం మాత్రం ఏంవుంది? భర్తని చాటుబెట్టుకుని ఏంచేసినా చెల్లుబాటౌతుంది; చాటులేకపోతే వస్తుందిగాని యిబ్బంది! సింగుగారు ఆడవాళ్ళంటే చాలా జాగ్రత్తగా వుంటాడు; అందుకని వాళ్ళ ముసుగుకూడా ఎవళ్ళూ చూచివుండరని ఆయన విశ్వాసం.

కాని ముసుగులో జరిగే గుద్దులాటలు పాపం! ఆయనకి తెలియవు.

"ఇలాంటి ఆడదాన్ని బ్రతికుండగానే పాతిపెట్టాలి. దాన్నింటో పెట్టుకుని హోరీ వూళ్లో విషంకలిపాడు. ఇలాంటి వాడ్ని వూళ్లో వుండనిస్తే వూరంతా భ్రష్టయిపోతుంది. జమీందారుగారికూ డా చెప్పేస్తేనే మంచిది. ఇట్లా చూస్తూ వూరుకుంటే వూరంతా బరితెగిపోతుంది" అన్నాడు ఝింగురసింగు.

నోఖేరాం పండితుడు గొప్ప కులీన బ్రాహ్మణుడు. ఆయన తాతగారు దివాంగిరీ చేశాడు; సంపాయించిందంతా భగవదర్పితంచేసి సన్యాసైపోయాడు. ఈయన తండ్రిగూడా రామకోటివ్రాస్తూ కాలంగడిపాడు. వంశపారంపర్యా వచ్చే యీ భక్తి నోఖేరాంకిగూడా లబ్ధమైంది. ప్రాతఃకాలమే లేచి పూజకని కూర్చుని, పది పదకొండయ్యేవరకూ శ్రీరామకోటి వ్రాస్తాడు; పూజామందిరం బయట అడుగుపెట్టిం దగ్గర్నుంచీ మనోవాక్కాయకర్మల్తో భగవంతుడిని పూర్తిగా మరచిపోతాడు !" దీనిలో జమీందారుగారితో చెప్పవలసిందేముంది. నేనంటే కాదంటారా జమీందారుగారు? వెయ్యండి ఒక వంద రూపాయల జరిమానా? వాడే వూరొదిలిపెట్టి పారిపోతాడు! నేనిక్కడ జప్తుచేయించేస్తాను" అన్నాడు.

"శిస్తు బకాయిలేకుండానే తీర్చేశాడుగా?" అన్నాడు పట్వారీ.

"అందుకనేగా మరి నా దగ్గర ముప్ఫై రూపాయలు అప్పు పట్టుకెళ్ళాడు" అన్నాడు ఝింగురసింగు.

"అయితేమాత్రం ఏం? ఇంకా నేను రశీదివ్వలేదులే.

బాకీ సుస్తాగా యిచ్చాడని బుజువెక్కడుందీ?" అన్నాడు నోఖేరాం.

అందరూ కలసి వందరూపాయల 'తప్పు' వేయాలని నిర్ణయించారు; కాకపోతే ఒకనాడు వూళ్ళోవాళ్ళందర్నీ పిలిచి, వాళ్ళతోగూడా మాకూ యిష్టమే అనిపించడం మంచిది; ఇదంతా జరిగేప్పటికి నాలుగైదు రోజులు ఆలస్యం కావచ్చు. కాని యివ్వాళ రాత్రే ఝునియా ప్రసవించింది, మగబిడ్డను కన్నది. మర్నాడే గ్రామస్థులంతా పంచాయితీ తీర్చారు. భార్యా, భర్తల్ని - ధనియా, హోరీ - ఇద్దర్నీ పిలిపించారు. రచ్చచావిడి దగ్గర యిసుకేస్తే రాలకుండా మూగారు జనం. వందరూపాయలూ, ముప్పై మణుగుల ధాన్యమూ 'తప్పు' వేశామని చెప్పేసింది పంచాయితీ.

నిండుసభలో నిండారు లయ్యింది ధనియా. "బీదా బిక్కీని ఏడ్పించి మీరుమాత్రం ఏంసుఖపడ్తారు? మేం యెట్లాగో నాశనమైపోతాం; ఈ వూళ్లోవుంటాం; వుండకపోతాం. ఏం దేమైనా మా వుసురు మీకు తప్పకుండా కొడ్తుంది. నా కోడల్ని నా యింటోకి తెచ్చుకుని వుంచుకున్నందుకేగా మీరీ జుల్మానా యేసేది? దాన్నెళ్ళగొట్టి దానుసురు పోసుకోలేదనేగా మీ కింత కోపం? ఇదేంన్యాయం!" అన్నది ధనియా.

"అది నీ కోడలెట్లా గాతుంది? దిమ్మరి ముండగాని!" అన్నాడు పట్వారీ.

"నీ కెందుకే యీ గోలంతా?" అంటూ లేచాడు హోరీ భార్యమీదకు. "నీ కెందుకే యీగోల? పంచాయితీలో పరమేశ్వరు డుంటాడు. వాళ్ళేదిజెప్పితే అది కళ్ళకద్దుకుని చెయ్యాలి

సిందే. మనం యీవూరొదిలిపెట్టి వెళ్ళిపోవటంవేఁ యిష్టం వేఁవో దేవుఁడికి" అని, పంచాయితీ దారుల్తో "అయ్యా నాకున్న దేంటో కల్లంలోనేవుంది; ఒక్కగింజకూడా యింటికి జేరెయ్యలేదింకా. ఎంతకావాలంటే అంతతీసుకోండి. అంతా కావాలంటే అంతాతీసుకోండి. యింకా కావాలంటే యెడ్లని గూడా తీసుకోండి. పైన దేఁవుఁడే వున్నాడు!" అన్నాడు.

ధనియా పళ్ళుకొరికింది. "నేనొక్క గింజంటే ఒక్క గింజకూడా యివ్వను. రాగిదమ్మిడీ కూడా తప్పివ్వను; యివ్వ నంటే యివ్వను. గుండున్నాడెవడో వచ్చి పట్టికెళ్ళండి; చూస్తా! మా బాగావుంది. ఆపేరూ, యీపేరూ జెప్పి అంతా కాజేద్దామనుకున్నారల్లే వుంది; ఆ పప్పులేఁవీఁ వుడకవ్. నాకంతంలో వూపిరుండగా మీరు నాసొత్తుమీద చెయ్యెయ్య లేరు. వూరుంటే నాకేం! వూడితే నాకేం! అప్పుడూ మా రెక్కలిరుచుకుని పనిచేసుకోబట్టే దొరికింది యింతన్నం; ఇప్పుడూ మా రెక్కలే మా కన్నం పెడతయ్" అంది.

హోరీ రెండుచేతులూ కలిపి, దణ్ణంపెట్టి "నువ్వూరుకోవే! నీకు దణ్ణంపెడతా. ఊరుకుని కాదని ఏమైపోతావే? వాళ్ళేసిన తప్పు యిచ్చుకోకపోతే యెట్లాగే? ఊరంతా ఒకదారైతే, మనమేఁ వఁన్నా వులిపికట్టలమంటే! అట్లా వుండేకంటే యెందుట్లో నన్నా పడి చావటంవేఁ మెరుగు! రేపు మనం చస్తే మన్నెవరు మట్టిచేస్తారే ఊళ్ళోవాళ్ళుగాక?" అని భార్యని బ్రతిమాలు కున్నాడు. తర్వాత "అయ్యా, మీ యిష్టంవచ్చినట్టు కానీండి. కల్లంలోవున్నది తప్పితే నా దగ్గిరింకేఁవీఁ లేదు. నేను మీతో అబద్ధం ఆడితే నాబిడ్డని చంపుకుతిన్నట్టు. నాబిడ్డల్ని చూచి,

మీకు దయపుట్టే మీయిష్టం. ముంచినా తేల్చినా మీరే!" అన్నాడు పంచాయితీదార్లతో.

ధనియా విసురుకుంటూ వెళ్ళిపోయింది. హోరీ అర్థ రాత్రిదాకా మోస్తూనే వున్నాడు కళ్ళంలోనుంచి ఝింగుర సింగు చావిట్లోకి. ఐదు మణుగుల గోధుమలు, ఐదు మణుగుల బఠాణీలు, కొద్దిపాటి శనగలు, నువ్వులు, ఇరవై మణుగుల యవలు. ఒక్కడూ ఎంతసేపని మోస్తాడు? ఝునియాకి యింటి పని అప్పగించి ధనియా కూతుళ్ళిద్దరినీ వెంటబెట్టుకుని వచ్చింది. గోధుమలూ, నువ్వులూ అమ్మేస్తే శిస్తు ఒక కిస్తీ తీరిపోతుం దను కున్నారు పాపం! ఇంకా యేమైనా మిగిలితే అప్పులు తీర్చేసి, నాలుగైదు నెలలు అట్లాగే, కళ్ళుమూసుకుని యవలు తింటూంటే యింతలో రెండోపంట వస్తుంది; ఏమీ కటకట వుండదు లే అనుకున్నారు. తా మొకటి తలుస్తే దైవమొకటి తలచాడు. పంటకు పంటా పోతోంది; పైన యింకో వంద రూపాయలు. అన్నంగూడ దొరికేపారం లేకుండాపోయింది. గోవర్ ఏమైపోయ్యాడో దేవుడికే తెలియాలి; పత్తాలేదు. అంత భయం వున్నవాడు ఆ వెధవపని ఎందుకు చెయ్యాలి? వూరుకోసమని ధాన్యం నెత్తిన బెట్టుక మోస్తున్నాడు; తన గొయ్యి తానే తవ్వుకుంటున్నాడు! రేపట్నుంచీ పిల్లల్ని ఎట్లా సాకాలి అని సతమత మాతూన్నాడు ఒక నైపున. మరో నైపున సంఘం నెత్తిమీద కూర్చుని అంకుశంతో పొడుస్తోంది. వూరును కాదని తాను ఏం చేయగలడు? పుట్టినా, గిట్టినా; పెళ్ళిళ్ళకీ, తద్దినాలకీ; మంచికీ, చెడ్డకీ; అంతటికీ వూరే శరణం. వూరు ఒక వటవృక్షంలా వేళ్ళు తన్ని వుంది అతనిహృదయంలో.

అతని రోమరోమమూ ఆ వృత్తంమీదనే ఆధారపడి వుంది. వూగు వదలితే అతని బ్రదుకేముంది? బ్రద్దలై పోతుంది; భిన్నా భిన్నా మౌతుంది; వ్రక్కలైపోతుంది.

ఇక కళ్ళంలో యింకో మణుగో, రెండు మణుగులో యవలున్నవనగా ధనియా వెళ్ళి, హోరీ చెయ్యి పట్టుకుని బ్రతిమలాడింది. "ఇకచాల్లే నామాటిను, వూరుకోసం మోసిం దికచాల్లే. పిల్లల్నిమాత్రం ఒకకంట కనిపెట్టుకోవద్దూ? అంతా ఆళ్ళవిదానే యేస్తే ఎట్టా? ఏంకర్మ చేసుకున్నానో నీలాంటి అమాయకుణ్ణి చేసుకుంటిని!"

హోరీ చెయ్యి వదలించుకున్నాడు. మిగిలిన ధాన్యం గూడా బుట్టలో కెత్తుతూ "అట్లాచేస్తే యెట్లాగే! పంచాయితీ దార్ల కళ్ళుకప్పి కుంచెడుగూడా దాచెయ్యన్నేను. అంతా పట్టుకెళ్ళి అక్కడే రాసిపోస్తాను. వాళ్ళవి జాలిగుండెలైతే నా కెంతో కొంత వదిలిపెడ్తారు. లేకపోతే దేవుడి దయ!" అన్నాడు.

ధనియాకి మంటెత్తింది. "వాళ్ళవా జాలిగుండెలు? రాక్షసులువాళ్ళు; మనుషులు కాదు. ఎట్టాగోట్టా మన ఆస్తంతా కాజెయ్యాలని చూస్తున్నారు వాళ్ళు. ఈ జుల్మానా, యీ తప్పూ అంతా, వట్టివంక! ఎంతచెప్పినా నీబుర్రకి ఎక్కనే ఎక్కదేం? వాళ్ళు పది పదిహేను మణుగు లిస్తారుగదా అను కుంటున్నా వేమో. అట్టాగే అనుకుంటావుండు!" అన్నది.

హోరీ అంగీకరించలేదు. తట్ట నెత్తికెత్తుకున్నాడు. ధనియా వెళ్ళి, రెండు చేతుల్తోనూ పట్టుకుని ఆపింది. "చచ్చినా యీ తట్ట పట్టికెళ్ళనివ్వను; నా ప్రాణాలు నిలువునా తీసేసినా

సరే. వల్లు హూనాం చేసుకుని, రాత్రనక, పగలనక, అన్న మనక, దప్పికనక, యింతకష్టపడి పనిచేసింది, ఆ పంచాయితీ దార్ల పొట్టనిపెట్టటానికేనా? ఇది నీసొమ్మేనా యేంటి నీ యిష్టం వొచ్చినట్టు చెయ్యటానికి? నాపిల్లలూ, నేనూ మాత్రం కష్టం చెయ్యాలా? చెప్తున్నా నామాటిని తట్టికక్కడ పెట్టావా పెట్టావు; లేకపోతే నీకూ నాకూ యిక యింతే" అన్నది గుక్కత్రిప్పుకోకుండా.

హోరీ గూడా ఆలోచనలో పడ్డాడు. ధనియా నిజమే చెబుతూంది. బిడ్డల కడుపుకొట్టి పంచాయితీదార్ల కిచ్చే అధికారం అతనికి లేదు! అతను యింటికి యజమానైతే పిల్లల్ని పోషించి, పెద్దవాళ్ళని చెయ్యాలిగాని, వాళ్ళని కాదని వూళ్లో వాళ్ళకి ఎట్లా పంచిపెడతాడు? "సరే! నీ యిష్టం వచ్చినట్లే కానీ. వాళ్ళ భాగం యివ్వటానికి నాకు మాత్రం ఏం హక్కుందిలే. మిగిలిందేదో యింటికే ఎత్తికెళ్ళు" అన్నాడు మెల్లగా.

ధాన్యం యింటికి ఎత్తుకెళ్ళింది ధనియా. మనమడు పుట్టాడుగదా అని కూతుళ్లిద్దరితో కలిసి, యిల్లెగిరి పోయేట్లు మంగళ గీతాలు పాడటం ప్రారంభించింది. ఇట్లాంటి శుభ దినాన పొరుగిళ్ళ వాళ్ళెవళ్లూ రాకుండా వుంటానికిదే మొదలు. ఝునియా పురిటిగదిలోనుంచి కబురు పంపింది పాటలూవద్దు; గీటలూవద్దని. కాని ధనియా వింటేనా? గ్రామానికి ఆవిడంటే లక్ష్యంలేదు; ఆవిడకే లక్ష్యంలేదు గ్రామం అంటే!

అప్పుడే హోరీ ఝింగురసింగుగారింటికి వెళ్ళాడు. ఇల్లు తాకట్టుపెట్టి ఎనభైరూపాయలు తీసుకున్నాడు. నువ్వులూ, గోధుమలూ, బఠాణీలు అమ్మితే ఒక యిరవయ్యైనా వస్తాయి.

ఎడ్లని గూడా అమ్మించివేస్తే బాగుంటుందనుకున్నాడు నోఖేరాం; కాని శాస్త్రి, పట్వారీలు ఒప్పుకోలేదు. ఎడ్లనమ్మించేస్తే హోరీ వ్యవసాయం ఎట్లా చేస్తాడు? అతని ఆ స్తిమీద వసూలు చేయ్యాలికాని, అసలతను వూళ్ళోనే వుండేందుకు ఆస్కారం లేకుండా చెయ్యగూడదు. మొత్తంమీద ఎద్దులు మాత్రం మిగిలినయి.

తాకట్టు పత్రం వ్రాసి, హోరీ యింటికి వచ్చేప్పటికి, పదకొండు కొట్టారు. "ఇంత పొద్దుపోయేదాకా ఏంచేస్తన్నా?" అని అడిగింది ధనియా.

కంచెమీద కోపం మంచంమీద చూపాడు హోరీ. "ఏం చేస్తున్నానా? నీ కొడుకు చేసిన ఘనకార్యానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటూ వున్నా! వాడేమో వూరికి నిప్పుపెట్టి వెళ్ళాడు; అది ఆర్పలేక నే చస్తున్నా. ఇల్లు ఎనభైకి తాకట్టు పెట్టొచ్చా. ఏం చెయ్యను మరి? వాళ్ల పుణ్యమాఅంటూ వెలి తీసేశారిప్పుడు" అన్నాడు.

ధనియా నెత్తీ, నోరూ కొట్టుకుంది. "అయ్యో, నీ తెలివి తెల్లారా. వాళ్ళేలేస్తేనే చచ్చిపోతాంవాం మనం? నా దగ్గిరిన్ని కబుర్లు చెబుతావు, వాళ్ళదగ్గిరి కెళ్ళినప్పు డేమౌతుంది యిదంతా? ఏదో తాతలు సంపాదించింది యిల్లొకటుందనుకుంటే అదిగూడా తాకట్టు పెట్టొచ్చా?! ఇంకేం ఆ అయిదు కుంటలూ అట్లాగే అమ్మేసెయ్యి; గడపగడపకీ తిరిగి బిచ్చమెత్తుకు తిందాం. అదిగాదు; నీ నోట్లో నాలిక ఏమయ్యిందీ అంట? మీరుమాత్రం ఏమంత గొప్పోళ్ళు? నామీద జుల్మానా

వెయ్యటానికని కడిగిరాలేకపోయా? ఛీఛీ! వాళ్ళమొహం చూస్తేనే అంటుకుంటయి పంచ మహాపాతకాలూనూ."

"ఛా. నోరుముయ్యి. వెలంటే యేమిటో యింకా తెలవదునీకు. ఇక ఆక్కేవాక్క."

"నేనేం చేశానని జడవాలి? ఎవళ్ళదన్నా ఎత్తుకొచ్చానా? ఎవళ్లింటోనన్నా కన్నంవేశానా? నే నెందుకు జడవాలీఅంట. గొల్లపిల్లని యింటోపెట్టుకుంటే తప్పా? ఇంటో కొచ్చిందాన్నెళ్ళగొడ్తే తప్పు! ఈ రోజుల్లో మంచిగావుంటేనే తప్పుకిమల్లేవుంది. మంచిగావుండేవాళ్ళ తిప్పలు కుక్కలుగూడా చూట్టంలేదు. మాలావు జుల్మానాకట్టి మర్యాద దక్కించ్చుకున్నావని వాళ్ళేఁవఁన్నా సంతోషిస్తున్నారేమో! ఇక్కడ నా ప్రాణాలు పోతున్నాయి. ఏఖర్మచేసుకున్నానో నిన్ను కట్టుకున్నాను. ఒక్కనాడన్నా సుఖపెట్టా?"

"నేనేమీ నీ బాబుకాళ్ళమీద పడలా నిన్ను నాకిచ్చి చెయ్యమని. ఆయనేవచ్చి నా మెడకట్టి పోయాడు."

"ఆయనకే అంత తెలివివుంటే నిన్ననేం లాభంలే. ఏంచూసిచ్చాడోమరి; ఇక యింతందగాడు దొరకడనుకున్నాడు కాఁవన్ను."

వివాదం, వినోదంగా మారింది! ఎనభై రూపాయలు పోతేపోయినయి; లక్షరూపాయల బిడ్డదొరికాడు! ఈ బిడ్డని మాత్రం ఎవ్వరూ లాక్కెళ్ళలేరు. గోవర్ రాగానే ఝునియా వేరేయింట్లో కాపురంపెట్టుకుని, సుఖంగా బ్రదుకుతుంది.

"ఎవరికిమల్లే వుంటాడు?" అని అడిగాడు హోరీ.

"మూడు మూర్తులా అబ్బాయికి మల్లేనే వుంటాడు.

అన్నీ అబ్బాయి పోలికలే !" అంటూ మురుసుకుంటూ చెప్పింది ధనియా.

"కంటినిండా వుంటాడా ".

"ఆ ! బంగారం సుద్దకాదూ ! !"

# 10

గోవర్ ఝునియాని వెంటబెట్టుకుని బయలుదేరా డన్నమాటేకాని, తల కొట్టేసినట్లు బాధపడ్డాడు. ఝునియాని చూడగానే వూరంతా గుప్పుమంటుంది; నలుగురూ, నాలుగు వైపులనుంచీ వచ్చి, నానా మాటలూ అంటారు. ధనియా ఎన్ని తిట్లు తిడ్తుందో వూహించేందుకుగూడా అలవికాదు. ఇవన్నీ ఆలోచిస్తూంటే అతని కాళ్ళాడటంలేదు. హోరీ అంటే అతని కేమంత భయంలేదు; ఒకసారి గదురుకుని వూరుకుం టాడు. కాని ధనియా? విషం తింటాననీ, యింటికి నిప్పెడతా ననీ గల్లంతు చేస్తే? ఝునియాని యింటికి వెంటబెట్టుకుని తీసి కెళ్ళకుండావుంటేనే మంచిదేమో!

కాని, యింటికి ఝునియా వంటరిగా వెళ్తే ధనియా చీపురుకట్ట పుచ్చుకుంటుందేమో? పాపం! ఝునియా ఏమౌతుంది మరి? కన్నవారింటి కెట్లాగూ వెళ్ళలేదు. ఇక ఎందుట్లోనైనాపడి చావాలి! అతనొక దీర్ఘనిశ్వాసం విడిచాడు. దిక్కెవరు?

అమ్మ అట్లా కన్పిస్తుందికాని అంత కనికరంలేని మనిషి గాదు. కోపం వచ్చి, రెండు మూడు తిట్టినా, ఝునియా వెళ్లి

కాళ్ళమీదపడి, బ్రదిమాలుకుంటే ఆవిడ మనసు కరిగిపోతుంది. అంతవరకూ తానెక్కడో ఒకచోట దాక్కుంటే పోతుంది. ఈ వుపద్రవం అంతా గడచింతర్వాత, ఒకనాడు, నెమ్మదిగా వెళ్ళి, తల్లి దగ్గరకు వెళ్లి వుపశమింపజేస్తాడు. అదీగాక యీ లోపుగా యెక్కడైనా ఐదారు రూపాయలు కూలిచేసి, కూడ బెట్ట గలిగితే యింకామంచిది; తల్లి అసలు మాట్లాడనే మాట్లాడదు.

"ఏఁవోఁబాబూ! నాగుండె కొట్టుకుంటాంది. ఇదంతా యెందుకొచ్చిందోగాని ... నువ్వావుకోసమని రాకుండావుంటే యీ యిబ్బందులన్నీ వచ్చేయేగాదు. నువ్వు ముందెళ్ళరాదూ? వాళ్ళనాల్సినమాటలన్నీ అనేసింతర్వాత, నెమ్మదిగా వస్తాగా నేను?" అన్నది ఝునియా.

"కాదులే! నువ్వే ముందెళ్ళు. వెళ్ళి, 'బజారునుంచి తిరిగి వచ్చేప్పటికి చీకటిపడింది, అందుకనొచ్చా' అని అంటూ వుండు. అంతలోకే నేనొచ్చేస్తా" అని గోవర్ అన్నాడు.

"మీ అమ్మకసలేకోపం ఎక్కువ; నాకు భయమేస్తాంది బాబూ; పట్టుకుని కొట్టినా కొట్టొచ్చు!" అంటూ భయపడింది ఝునియా.

గోవర్ ధైర్యంచెప్పాడు. "అమ్మట్టాంటిది కాదులే. మమ్మల్నే యెప్పుడూ కొట్టెరగదు; నిన్నేం కొడతందిలే! ఏఁవఁన్నా అంటే నన్నేఅంటంది; నిన్నేఁవీఁ అనదు."

ఊరు దగ్గరకొచ్చింది; గోవర్ తటాలున ఆగిపోయి, "ఇక నువ్వెళ్ళు" అన్నాడు.

"నువ్వుగూడా దబ్బునేరావాలి" అంటూ పట్టుబట్టింది ఝునియా.

"కాదులే. నువ్వుపద. నే దబ్బునే వస్తాగా!"

"ఏంవోనబ్బా. నీమీద కోపంగూడా వస్తాంది. ఇదంతా ఎందుకొచ్చిందోగాని."

"నీ కంతభయం వెందుకు? నేనూ వస్తన్నా నంట న్నాగా?"

"ఇంతకంటే - యింకా యెక్కడికన్నా వెళ్ళిపోతేనే బాగుండేది."

"మన యిల్లుండగా, యింకా యెక్కడికో వెళ్ళటం యెందుకులే; నీ భయంవేఁగాని."

"ఇక్కడున్నట్టొస్తావా మరి?"

"ఓ. ఇప్పుడే వచ్చేస్తాగా!"

"వస్తావా, దగాచేస్తావా! నన్నింటికి పంపి నీదారినినువ్వు పోతావా?"

"నువ్వు నాదానివని ఒకసారన్న తర్వాత, కంఠంలో వూపిరుండగా మాటతప్పను. నే నంత పనికిమాలినాణ్ణిగాదు."

ఝునియా యింటివైపుకు సాగింది. క్షణంసేపు ఎటూ తోచలేదు గోబర్‌కి. నలుగురిలోనూ నగుబాటు తప్పదు; ఈ నగ్నసత్యం పగబట్టిన పాములా, తోకమీద నిలబడి, బుసలు కొట్టూంది. నిజంగానే అమ్మ ఝునియాని వెళ్ళగొడితే? అత నక్కడే విగ్రహంలా నిలబడిపోయాడు; కాళ్ళాడటంలేదు. అతనికీ, యింటికీ మధ్య ఒక చిన్న మామిడితోపుమాత్రం వుంది. ఝునియానీడ నల్లగా, మెల్లగా, నడిచి వెళ్తోంది.

అతను జ్ఞానేంద్రియాలూ, చెవులూ రిక్కించుకున్నాడు. అమ ఝునియాని తిడుతూన్నట్లుంది. అతను కంపించి పోయాడు; నెత్తిమీద పిడుగుపడుతూన్నట్లుంది. శరీరంలోవున్న రక్తంఅంతా ఎక్కడి దక్కడ గడ్డకట్టుకు పోయినట్లుంది. ఇంకో నిమిషం గడిచింది! అమ్మ బయటికి వచ్చినట్లుంది. నాన్న దగ్గర కని బయలుదేరినట్లుంది. నాన్న పొలం వెళ్లివుంటాడు. అతనుగూడా వెళ్దామని బయల్దేరాడు; వెనకనుం చెవరో తరుముకొస్తున్నట్లు చేలకడ్డాంపడి పరుగెత్తాడు. చేనుదగ్గర కొచ్చింది. ఆగి, చప్పుడు కాకుండా, అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్లి, మంచెచాటున నక్కాడు. అతననుకున్నది నిజమే. అమ్మ మాట్లాడుతోంది. అమ్మ యింత కఠినంగా మాట్లాడగలదని అతను కలలోగూడా అనుకోలేదు; ఆ దిక్కు లేని ఆడపిల్లంటే అంత కనికరంలేకుండా మాట్లాడుతోంది! తానుగూడా, ఇప్పుడే వెళ్లి 'ఝునియాని అట్లా ఆడిపోసుకుంటా వెందుకు? అని ఎదటబడి అడిగేస్తే? జలుబు వదలిపోతుంది! నాన్నగూడా కోప్పడుతూన్నాడు. ఏదో తల్లిదండ్రులు గదా అని గౌరవిస్తూ వచ్చినందుకు యిదీ ఫలితం! అదేం నాన్న గూడా యింటికెళ్తున్నాడు. ఈయనెళ్లి ఝునియామీద చెయ్యి చేసుకుంటే, చూస్తూ వూరుకోవడం అతని వల్లగానిపని. ఓరి భగవంతుడా! ఎంతపని జరిగింది? ఇదింత పీకెమీదకి వస్తుందను కుంటే...ఝునియా ఏమనుకుంటుంది? తనంత ధూర్తుడూ, మోసగాడూ, నీచుడూ, పిరికివాడూ లేడనుకుంటుంది. అయినా దానిమీద చెయ్యెందుకు చేసుకుంటారు? బయటికి మాత్రం ఎందుకు వెళ్లగొడతారేమిటి? తనకు మాత్రం ఆ యింట్లో

భాగంలేదూ? ఝునియా మీదెవళ్ళన్నా చెయ్యి లేపారూ అంటే రామ రావణయుద్ధం జరగాల్సిందే! బిడ్డలంటే బాగా చూస్తూంటేనే తల్లితండ్రుల్ని గౌరవించేది; ఆమమత వాళ్ళల్లో లేకపోతే యింకా తల్లిదండ్రులేమిటి, గిల్లిదండ్రులేమిటి!

తల్లి, దండ్రుల వెనకే, అడుగులో అడుగు వేసుకుంటూ, మెల్లగా గోవర్ కూడా వెళ్ళాడు. ఇంట్లో దీపం చూచేప్పటికి వెనక్కు తగ్గాడు. ముందుకడుగు వేసేందుకు ధైర్యం లేక పోయింది. వీళ్ళందరూ అనవసరంగా ఝునియామీదికి దండెత్తు తున్నారు. తానేమో చేతులు ముడుచుకుని కూర్చున్నాడు. తానాడుకుంటూ, ఆడుకుంటూ, విసరేసిన నిప్పుకణం యిట్లా వాడవాడంతా తగలబెడుతుందని అతనికి మాత్రమేం తెలుసు? ఇప్పుడు ముందుకొచ్చి, 'ఆ నిప్పుకణాన్ని విసిరేసింది నేనే' అని చెప్పుకోగల ధైర్యమూ లేదు. ఈ భూకంపం వచ్చి అతనికున్న ఆత్మవిశ్వాసాన్ని పునాదుల్తో కదిల్చివేసింది; అతను కట్టుకున్న ఆశాసౌధం అతని కళ్ళముందే కూలిపోతోంది. అతను వెనక్కి తిరిగాడు; ఇంక ఝునియా నేముఖంపెట్టుకుని చూస్తాడు?

యుద్ధరంగంనుంచి పారిపోయే సైనికుడిలా వెనక్కి తిరిగాడు. ఝునియాతో ఆడిన ప్రేమసల్లాపాలూ, చేసిన వాగ్దానాలు జ్ఞాపకం వచ్చాయి. ఆ ప్రేమోన్మత్తతలో, ఆ ఐహికానందపు వూపుల్లో తనప్రాణం తీసి, కానుకగా అర్పిస్తా నన్నాడు. ఇప్పుడో? ఝునియా పోతును వదలిన పెంటిలా, ఏకాంతంగా, తన గూటిలో బ్రతుకు వెళ్ళబోస్తోంది. ఇప్పుడక్కడ ప్రేమసల్లాపాలు లేవు, ప్రణయకోపాలు లేవు, ఆహ్లాద వినో

దాలు లేవు; బిడ్డల కేరింతలు లేవు; అతనావిడ ఏకాంత జీవితంలోకి అడుగుపెట్టి, ఆవిడను ఆనందపరచాడో, లేదో ఎవరికి తెలుసు; ఆవిడకు కొత్త ఆపదలుమాత్రం పేర్చిపెట్టాడు. పారిపోయే సైనికుడు తనపక్షానికి జయం కలిగేట్లుందని తెలిసిం తర్వాత మళ్ళీ వెనక్కి తిరిగినట్లు - వెనక్కి తిరిగిన గోవర్ మళ్ళీ సంబాళించుకుని వెనక్కితిరిగాడు.

ఇంటితలుపు వేసివుంది. తలుపుల పగుళ్ళలోనుంచి దీపంవెలుగు కనిపిస్తోంది. ఒక పగుల్లో కన్నుపెట్టి చూచాడు. ధనియా, ఝునియా కూర్చుని వున్నారు; హోరీ దగ్గరనే నిలబడి వున్నాడు. ఝునియా వెక్కి, వెక్కి ఏడుస్తూంది. "ఇక వూరు కోమ్మా! నీకేం ఫర్వాలేదంటన్నాగా. మేం బ్రదికున్నంత మట్టుకు నీ కేలోటూ రాకుండా చూస్తాం అంటన్నాగా. ఇక వూరుకోతల్లీ" అని ధనియా సముదాయించుతోంది. గోవర్ సంతోషం పట్టలేకపోయాడు. అమ్మా, నాన్నా యెంతమంచి వాళ్లు! అల్లాంటి తల్లిదండ్రుల్ని బంగారంపెట్టి పూజించుకోవాలి. 'ఇక మీరు పనిచెయ్యొద్దులే. మీరు కాలుమీద కాలేసుకుని, దానధర్మాలు చేసుకుంటూ కూర్చోండి. నేనున్నాగా సంపాదించ టానికి!' అనబుద్ధయ్యింది; ఇక ఝునియాకేమీ ఫర్వాలేదు; ఆశ్రయం దొరికింది. తా నొట్టి దగాకోరని అనుకున్నా యిబ్బంది లేదు. ఇక వెళ్ళి డబ్బు సంపాయించాలి; డబ్బు సంపాయించి గాని మళ్ళీ గడప తొక్కకూడదు. ఆ డబ్బుచూస్తే వూళ్ళో వాళ్ళ నోళ్ళకి తాళాలుపడతాయి; తల్లిదండ్రులప్పుడు తాను కులంలో చెడబుట్టాడని అనుకోరు, కులాన్ని వుద్ధరించేవాడని సంతోషిస్తారు.

అంతకంటె ఎంతో ఎక్కువ, కాకపోతే కూలిపని చేస్తున్నాడం టారేమో; అంటేమాత్రం ఏం? కూలిచెయ్యటం ఏమైనా మహాపాపమా? అదీగాక పనిలో అనుభవం సంపాయించిన కొద్దీ, కూలికూడా ఎక్కువౌతుంది. అప్పుడు తండ్రితో, "ఇక నువ్వుకూర్చుని పూజలూ, పునస్కారాలూ చేసుకో. ఈ పొలంపనితో యేం హతమైపోతావులే!" అనవచ్చును. అంతకంటే ఒక మంచి ఆవుని కొని, "నువ్వీ ఆవుని చూసుకొంటూ వుండు; ఇహానికి యిహమూ; పరానికి పరమూ!" అంటే తండ్రి అపరిమితంగా సంతోషిస్తాడు.

ఐతే, రోజు కొక్క అణాఖర్చు చేస్తేచాలదూ? ఇల్లూ గిల్లూ అవసరం లేదుగదా. ఎవళ్ళ వసారాలో పడుకున్నా నెళ్ళమారిపోతుంది. ఓ! పట్టణంలో సత్రవలూ, ధర్మశాలలూ కావలసినన్ని వుంటాయి. అయినా రోజూ పని చేస్తూంటే, అ ఆసామీ వుండేందుకు చోటే చూపించకుండా వుంటాడా? రూపాయకు పదిశేర్ల పిండి; అయితే అణాకు అర్థశేరు పైచిల్లర వస్తుంది. అయితే మరి అణా పిండికే ఐపోతూందే; పూటకి అర్థశేరు పిండి వెధవ లెఖని తింటాడు తాను. పుల్లలు, పప్పు, వుప్పు, కూరగాయలు, ఇవన్నీ, ఎక్కడనుంచి వస్తాయి? రోజుకి శేరు పిండే కావాలి! ఆఁ, తిండిదేముందిలే! గుప్పెడు శనగలు తిన్నా గడచిపోతుంది; హల్వా, పూరీలు తిన్నా అట్లాగే గడుస్తుంది. అర్థశేరుంటే ఎక్కువ, తక్కువగా సరి పోతుంది. నాలుగడుగులటూ, యిటూ వేస్తే కావలసినన్ని పుల్లలు ఏరుకుతెచ్చుకోవచ్చు. ఎప్పుడైనా ఒక కానీపెట్టి, పప్పో, బంగాళాదుంపలో కొనుక్కుంటేసరి. బంగాళాదుంపలు

దెబ్బకొద్దీ బొప్పె. ఈ అపవాదుని గురించీ, ఈ అపకీర్తిని గురించీ గోవర్ ఎంత మధనపడ్డాడో, అంతమంచి జరిగింది. అతనికీనాటికి తన కర్తవ్యం ఎంత బాధ్యతాయుతమైందో తెలిసివచ్చింది. ఇంతవరకూ యింట్లోతినేవాడు; పొలంలో పనిచేసేవాడు. కాని యీనాడు పొలంలో కొంతపనిచేసి, యింటికొచ్చి యింతతిని పోవటమే తన కర్తవ్యం గాదనీ, తల్లి దండ్రుల్ని సుఖపెట్టవలసిన బాధ్యత వుందనీ తెలిసి వచ్చింది అతనికి ఈ రోజున అతని తల్లిదండ్రులు చూపిన యీ వుదాత్త మైన క్షమను గురించి ఆలోచించినకొద్దీ; అతని మనసు ఒక వింతవెలుగుతోనూ, భక్తిశ్రద్ధలతోనూ నిండిపోయింది.

వెనక్కి తిరిగి, పొలం వెళ్ళి, తన తండ్రి యింతవరకూ పడుకున్న చోటనే పండుకుని, భవిష్యత్తుని గురించి ఆలోచించటం మొదలు పెట్టాడు.

పట్టణం వెళ్ళి వళ్లొంచి పనిచేస్తే ఎట్లాలేదన్నా రోజుకు ఆరణాలు గిట్టుబాటౌతాయని విన్నాడిదివరకు. తాను రోజు కొక అణా ఖర్చుపెట్టుకుంటే అయిదణాలు మిగులుతాయి. నెలకి పది; ఏడాదికి నూటపాతిక! నూటపాతిక రూపాయలు సంచిలో వేసుకుని, వూళ్ళోకి వచ్చాడంటే నోరెత్తి మాట్లాడ గలవాడెవడుంటాడు? ఈ శాస్త్రి, ఈ పట్వారీ, - అందరూ - తా నౌనంటే ఔనంటారు; కాదంటే కాదంటారు. ఝునియాని పట్టేందుకు పగ్గాలే వుండవు. రెండు మూడు సంవత్సరా లట్లా సంపాయించాడంటే దరిద్రమంతా వూడ్చుపెట్టుకుపోతుంది. ఇప్పుడు, ఇంట్లో వాళ్ళందరూ కష్టపడుతూన్నా సంవత్సరానికి నూటయిరవై మిగలటంలేదు. తానొంటరిగానే సంపాయిస్తాడు.

వుడ కేసుకుని తింటే అన్నంకంటే మజాగా వుంటుంది. అక్క-డేమైనా పండగని వెళ్తున్నాడా? ఎట్లాగోట్లా డబ్బు సంపాయించాలని వెళ్తున్నాడుగాని! ఇంటిదగ్గరమాత్రం రెండు పూటలూ అన్నం తింటున్నాడా? ఇక్క-డగూడా? తినేది ఒకపూట గుగ్గిళ్ళేనాయె.

అయితే గోవర్‌కు యింకో సందేహం వచ్చింది. ఎప్పుడైనా కూలి దొరక్క-పోతే? కూలి దొరక్క-పోవడమేమిటి? దగాచేస్తే, ఒళ్ళు దాచుకుని పనిచేస్తే పిలవరుగాని, వళ్ళువంచి పనిచేస్తే వందమంది వస్తారు మా పని చెయ్యి, మా పని చెయ్యంటూ. పగలు కూలీ, నాలీ; రాత్రిపూట కాపలా పనికిగూడా ఒప్పుకుని, ఎక్క-డో ఒకచోట కుదిరితే యింకా బాగుంటుంది; రాత్రికి రెండణాలచొప్పున పడినా చాలు. ఇంటికి వచ్చేప్పుడందరికీ చీరలు పట్టుకురావచ్చు. ఝునియాకు మురుగులు చేయించి తీసుకురావాలి; నాన్నకి ఒక తలపాగాకూడా కొనుక్కు-రావాలి...

ఇట్లాగే కలలుకంటూ గోవర్ కన్నుమూస్తాడు; కాని నరాలు కొరుక్కు-తినే చలి, నిద్రేంపడుతుంది? ఎట్లాగో రాత్రి గడచింది. తెల్లవారుఝామునే లేచి, లక్నో వెళ్ళే రోడ్డు పట్టాడు. ఇరవై కోసులేగా! సాయంత్రానికల్లా చేరుకోవచ్చు. ఊళ్ళోవాళ్ళెవళ్ళూ రారుగూడాను అక్క-డికి. తనుగూడా తనెక్క-డుండేదీ వ్రాయడు. అమ్మో; నాన్నకే తెలిస్తే వచ్చి నెత్తిమీద కూర్చోడూ? నిజమే! ఝునియాకి చేప్తేనే బావుండేదికాని, "నేనట్టావెళ్ళి నాలుగుడబ్బులు సంపాదించుకొస్తాగాని నువ్వింటికెళ్ళు" అంటే యింటికివెళ్ళేదా? వెళ్ళకే?

"నేనూవస్తా నీవెంట" అని వెంటబడేది. ఆడదాన్ని మెడకట్టుకుని తిరగటం అంటే మాటలా ?

ప్రొద్దెక్కుతోంది. రాత్రిగూడా అన్నం తినలేదు. ఆకలి వేస్తోంది. కాళ్ళు తేలిపోతున్నయి. ఎక్కడైనా కాస్సేపు కూర్చుంటే బాగుండుననిపిస్తోంది. పొట్టలో ఏదోవకటి వెయ్యకపోతే నడవడంగూడా కష్టమే! చేతిలో కాండబ్బుగూడా లేదు, రోడ్డుప్రక్కన రేగుచెట్లున్నయి. రేగుపళ్ళు కోసుకుతింటూ నడుస్తున్నాడు. ఏదో వూరొచ్చింది; బెల్లంపాకం పడ్తూన్న వాసనవేసింది. మనసాగలేదు. వెళ్లి మంచినీళ్ళడిగి, మంచినీళ్ళు తాగబోయాడు. 'అబ్బే, అదేవిఁటి బాబూ, వఠి మంచినీళ్ళు తాగుతావేఁ? ఏఁవఁన్నా బెల్లం తింటే యిక యీ యేడేలే. ముందునాటికి మిల్లు కడతారంట; మిల్లు. బెల్లఁవూఁ, పంచదారా ఒకటే ధరైతే యింకా బెల్లఁ నెఁవడు తింటాడు! కాస్త బెల్లప్పాకవేఁ తాగుబాబూ' అంటూ బెల్లపుపాకం యిచ్చాడు ఒక ముసలిరైతు. గోవర్ పానకం త్రాగాడు. 'పుగాక్కావాలా?' ఇంకా అలవాటు కాలేదన్నాడు గోవర్. రైతు సంతోషించాడు. "మంచిదేలే బాబూ, ఒకసారి పట్టుకుందీ అంటే చచ్చేదాకా వదల్దు!"

ఇంజనుకి నీళ్ళూ, బొగ్గూ దొరికాయి; నడక బాగానే సాగింది. శీతకాలం; తెలియకుండానే మధ్యాహ్నం ఐపోయింది. ఒకచోట ఎవరో స్త్రీ, చెట్టుక్రింద కూర్చొని సత్యాగ్రహం చేస్తూంది; భర్త ప్రక్కనే వున్నాడు; భార్యని బతిమాలుకుంటున్నాడు. దారేపొయ్యేవాళ్ళు,నలుగురూ నిలబడి తమాషా

"పెళ్లాం వొ స్తేమాత్రం? జుట్టుపట్టుకుని లాగుతానా!"

"సరేలే! సంతోషించాంగాని నీ దారి న్నువ్వుపద. నా పెళ్లాం; నేను కొట్టుకుంటా, తిట్టుకుంటా. నువ్వెవడివి అడగటానికి మధ్య? ఇకచాల్లే. నడువు!"

అసలే కాగేపాలేమో! గోవర్‌కి కోపంవచ్చింది. ఏం? ఎందుకెళ్ళిపోవాలి? దారినేమన్నా కొనేశాడా యీఅబ్బాయి? దారి గవర్నమెంటుది! తనిష్టం వొచ్చినంతసేపు నించొంటాడు రోడ్డుమీద; వద్దనటానికి వీడెవడు?

"అయితే నువ్వు కదలవన్నమాట. రమ్మంటావా అయితే?" అన్నాడు భర్త క్రింది పెదవి కొరుక్కుంటూ.

పైపంచె తీసి, నడుంకట్టి, యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు గోవర్. "వస్తే, రా! నాయిష్టంవొచ్చినప్పుడెళ్తా నేను; అంతే!" అన్నాడు.

"అయితే చెయ్యో, కాలో యిరగ్గొట్టిచ్చుకుని గాని యెళ్ళవన్నమాట?"

"ఎవరి కాళ్ళూ, చేతులూ యిరుగుతయ్యో అదీ చూద్దాంగా!"

"ఇంతకీ కదలవన్నమాట?"

"ఉఁహుఁ."

పిడికిలి బిగించి, ఒక్కదూకు దూకబోయాడు భర్త. ఇంతలో భార్య, భర్త పంచెపట్టుకుని వెనక్కిలాగింది. లాగి, గోవర్‌తో "ఎందుకయ్యా నీకీ పోట్లాట? ఇదేంవన్నా తమాషా అనుకున్నావా? నాకోపంవస్తే నామొగుణ్ణి నేన్నాలుగు అను

కుంటా; ఆయన కోపంవస్తే నన్ను నాలుకోస్తాడు. నీకెందుకు మధ్య ?" అంది.

గాలి ఎదురు తిరిగింది. "ఇట్లాంటిదాన్ని నాలుగుతకాలి సిందేలే !" అనుకుంటూ దారిపట్టాడు గోవర్.

గోవర్ కాస్తదూరం వెళ్ళింతర్వాత, భార్య భర్తని అదమాయించింది; "అయినా నువ్వట్టా అందర్తోనూ పోట్లాడతా వెందుకంట ? ఆ యబ్బాయిమాత్రం వేంవన్నాడూ నీకంత తుస్సు రావటానికి ? అయినా మంచి కుటుంబంలో పుట్టినాడేనల్లే వుంది. మీ చెల్లెలికి యీడూ, జోడూ గూడానూ !" అంటూ.

"ఇప్పుడుదాకా పెళ్ళికాకుండా వుందంటా ?" అని, వెనకా, ముందూ ఆడాడు భర్త.

"అడగరాదూ ?"

భర్త పదడుగులు పసుగెత్తి గోవర్ని కేకేసి, చేత్తో సంజ్ఞచేశాడు ఆగమని. 'మళ్ళీ వీడికి తలముదిరిందేమో ! రానీ, వస్తే వాడికే తెలుస్తుంది మనతడాఖా; సొంతూరుగదా అనుకుంటన్నాడేంవో !' అనుకున్నాడు గోవర్.

కాని అతను పోట్లాడేందుకు వస్తూన్నట్లులేదు మొహం చూస్తే. వచ్చి, ఏవూరు ? ఏంకులం ? అంటూ అడిగాడు. గోవర్ అంతా చెప్పాడు. 'భర్త' పేరు కోదయీ అట.

"బలేవాళ్ళం; ఇంకాస్తుంటే పోట్లాడుకునేవాళ్ళంవేం ! నువ్వొచ్చేసింతర్వాత, ఆలోచిస్తే, నువ్వన్నమాటా నిజవేంనని పించింది. నీతోపిలిచి తగూపెట్టుకున్నానయ్యో నేను. సరేకాని యింటికాడ ఏంవంన్నా భూంవీం, పుట్రా వుందా ?" అన్నాడు కోదయీ నవ్వుతూ.

ఏదో తాతలనాటిఆస్థి నాలుగైదు కుంటలుందని చెప్పాడు గోవర్.

"ఊం. ఏదో కోపంవొచ్చి అన్నాగాని, ఏంవీం అనుకోబాకు. కోపంవస్తే యెనకా, ముందూ తెలవదుగామరి! మా ఆడదిగూడా మంచిదే. ఎందుకనోగాని అప్పుడప్పుడూ, యిట్టాగే, తిక్క రేగుతూ వుంటంది దానికి. నువ్వేచెప్పు మా అమ్మని నేనేంవంనగల్నుచెప్పు. నవమాసాలూ మోసి కందిగదా, యివ్వాళ కాదనుకుంటే పోతంవా పిచ్చిగాని? ఏదన్నా పోట్టాటొస్తే యింటిదానిమీందే నాలుక్కేకలేస్తాననుకో. ఎన్ని చెప్పినా దీనిమీదుండే స్వాతంత్రంవేరు. కాదూ? నిజంవేననుకో. అట్టా జుట్టుపట్టుకుని లాగ్గూడదనుకో. అయినా యీ ఆడజాతి అట్టా చెయ్యకపోతే చచ్చినా మాటినదనుకో. యేన్లపడమంటందిది. ఎట్టాపడేది? నువ్వేచెప్పు!"

గోవర్కూడా తన అభిప్రాయం మార్చుకున్నాడు. "నిజంవేంలే! అమ్మని కాదను కుంటాం వంటలే" అన్నాడు.

ఇంటికి రమ్మని ఆహ్వానించాడు కోదయీ. ఎట్లాగో సాయంత్రం అయ్యేలోపుగా లక్నో వెళ్ళలేదు. ఇంకొక క్రోసో రెండు క్రోసులో నడచింతర్వాత ఆగవలసిందే గదా.

"మీవాళ్ళొప్పుకున్నారా?" అన్నాడు గోవర్.

"ఒప్పుకోకేం చేస్తందిలే!"

"ఇందాకా మాటనేప్పటికి యిక మళ్ళీ మాట్లాడలేక పోయాననుకో."

"అదీ అందుకనే సిగ్గు పడతాందిలే. ఇంటికెళ్ళిం తర్వాత శాస్త్రి నువ్వుగూడా చెప్పాలి అమ్మకి. కోడల్నీ, కోడలి కన్నా రినీ తిడ్తే అమ్మకి మాత్రఁవేఁవొరుగుతుంది ? ఎందుకట్టా నోరు పారేసుకుంటం ? మాకూ ఒక చెల్లెలుంది. రేపో, మాపో దానికీ పెళ్ళౌతుంది, దానత్త దాన్నేఁవఁన్నా అంటే అది మాత్రఁ వూరుకుంటందా ? అంతా దీండే తప్పంటానికీ యీల్లేదు మరి. అమ్మమాత్రం ఎప్పుడూ కూతుర్నే యెనకేసు కొస్తాందంటే బాగుంటందా మరి ? ఏమాట కామాటే చెప్పు కోవాలి; యిది యింటిదగ్గర మాత్రం చచ్చినా నోరెత్తదు; కాకపోతే కోపం వచ్చినప్పుడల్లా యిట్టా అలిగి పారిపోతా వుంటుంది. అదీ ఒకిందాన మంచిదేగా మరి ?"

ఎక్కడో ఒకచోట రాత్రి గడపాలిగదా! గోవర్, కోదయిూ యిద్దరూ కలిసి, భార్య వున్నచోటుకి వచ్చారు వెనక్కితిరిగి. ఇప్పుడావిడ అత్తింటి కొత్తకోడల్లా సిగ్గుపడుతూ, తోలుగేసింది.

"ఈయన రానంటే రానన్నాడు. అట్టాంటి బెదిరింపు విన్నతర్వాత మీయింటికెట్టా రానంటన్నాడు" అన్నాడు కోదయిూ నవ్వుతూ.

"ఇంతమాత్రానికే జడుసుకుంటే రేప్పొద్దున్నే పెళ్ళి చేసుకుంతర్వాత ఏం చేస్తాడూ ?" అంది భార్య.

ఊరు దగ్గరకొచ్చింది. అది వూరూ కాదు ; పల్లే కాదు. పది పన్నెండు పాకలున్నాయి. ఇంటికి వెళ్లింతర్వాత కోదయిూ

కాళ్ళకు నీళ్లిచ్చి, మంచం వాల్చాడు. మంచంమీద ఒక జంబుఖానావేసి అతిథిని కూర్చోబెట్టి యింట్లోకి వెళ్ళాడు. ఇంతలోనే యిందాకటి పడచు మంచినీళ్ళు తీసుకొచ్చి యిచ్చి, వరసలాడింది. ఇక మరి తనకు వరసకు ఆడబిడ్డ మొగుడౌతాడాయె ; వరసలాడకపోతే యెట్లా ?

# 11

గోవర్ చీకటితోనే లేచి; 'ఇక బయల్దేరతా' అన్నాడు. అతనికి వివాహమైపోయిందని అందరికీ తెలిసింది; అంచేతనే ఎవ్వరూ పెళ్ళి ప్రస్తావనే తేలేదు. అతని సద్గుణాల్ని చూచి అందరూ సంతోషించారు. కోదయీ తల్లి అతని మాటలు విని, ఉబ్బితబ్బిబ్బైపోయింది; సంతోషించి ఆశీర్వదించింది. "అమ్మా! నువ్వు పెద్దదానివి; గొప్పదానివి. కొడుకులు వందన్నమాటేఁవిఁటి? లక్షజన్మలు, కోటి జన్మలెత్తినా తల్లి ఋణం తీర్చుకోలేరు!" అని గోవరంటూంటే ఆవిడ గర్వపడింది.

గోవర్ చెప్పేదంతా అక్షరాలా సత్యమనిపించింది. వైద్యుడి మందుతిని, ఒకసారి బాగుపడింతర్వాత, వైద్యుడు విషమిచ్చినా గడగడ త్రాఁగేస్తాడు రోగి! "ఇవ్వాళ నీ కోడ లిట్టా పారిపోయిందంటే ఎవరికీ తంలాఫ్రలు? నీ కోడలెవరింటి ఆడబడుచో ఎవరికి తెలుసు? ఏ గడ్డమ్ముకునేవాడి కూతురైతే మాత్రం ఎవరికిపట్టింది? ..." అని గోవర్ అంటే "అంతే బాబూ! గడ్డమ్ముకునేవాడే! తెల్లారిలేచి వాడి మొఖం చూస్తే పచ్చి మంచినీళ్ళుగూడా పుట్టవ్" అని బాగా బలపరచింది ముసలమ్మ!

"అయితే యింకా అట్టాంటి కుటుంబానికేంపోతంది. వచ్చే అప్రదిష్టంతా నీకే వస్తంది. అంతేగా? ఫలానివాళ్ళ కోడలంట అంటారు ఎవళ్ళన్నా. అయినా మీ కోడలు మంచిదైతేగా! నెమ్మదిగా చిలక్కి చెప్పినట్టు చెప్పుకోవాలి గాని, దాంతో పోట్లాడితే దానికేంపోతంది. నలుగురూ నిన్నే అంటారు!" అన్నాడు గోవర్.

గోవర్ బయల్దేరుతుంటే నాలుగు సున్నివుండలిచ్చి, దార్లో తిన్నాయనా!" అని, సాగనంపింది ముసలమ్మ. ఆ వూళ్ళోవాళ్ళు గూడా నలుగురైదుగురు బయల్దేరారు పట్టణంలో కూలికని. అందరూ కలిసి తొమ్మిది గంటలకల్లా అమీనాబాద్ చేరుకున్నారు. పట్టణంలోవున్న జనాన్నిచూస్తే గోవర్కి ఆశ్చర్యంవేసింది. ఏవిఁటీ, ఇంతమంది జనం ఎందుకు చేరినట్టు?

బజార్లో ఐదారువందలమందికి తక్కువలేకుండా వున్నారు కూలీలు. తాపీ పనివాళ్ళు, వడ్రంగులు, కమ్మరులు, వుప్పరులు, మంచాలు నేసేవాళ్ళు, బుట్టలూ తట్టలూ మోసేవాళ్ళు, రాళ్ళు చెక్కేవాళ్ళు. వీళ్ళందరినీ చూచింతర్వాత వున్న ఆశ కాస్తా అడుగంటిపోయింది గోవర్కి. ఇంతమందికి దొరికింతర్వాతగదా తనకు కూలిదొరికేది. వాళ్ళందరికీ చేతిలో ఏదో ఒక పనిముట్టుంది పని చేసేందుకు; ఫలానా పని చేస్తాడని యితర్లకు తెలిసేందుకూ. గోవర్ చేతులు వూగించుకొంటూ వచ్చాడు. అతన్నెవరడుగుతారు పనికిరమ్మని?

నెమ్మది నెమ్మదిగా ఒక్కొక్కడికీ కూలిదొరికింది. కొంతమంది నిరాశపడి వెళ్ళిపోయారు. ఎక్కువమంది అక్కడే నిలబడి 'ఎవరు పిలుస్తారా?' అని కాచుకూర్చున్నారు. గోవర్కూడా

అట్లాగేవున్నాడు. ఇవ్వాళ్ళికిమట్టుకు కడుపుకాల్చుకోవలసిన అవసరంలేదు; ఈపూట ఆ ముసలమ్మ యిచ్చిన నాలుగు వుండలూతిని మంచినీళ్ళుత్రాగి పండుకోవచ్చును.

ఇంతలోనే మీర్జాఖుర్షేద్ వచ్చాడు.వచ్చి, "సాయంత్రం ఐదుగంటలదాకా పనిచేస్తే అరణాలిస్తా. ఇష్టమైనాళ్లందరూ నాతోరండి!" అంటూ, అందరికీ వినపడేట్టు ఎలుగెత్తి అరిచాడు.

ఐదారుగురు వడ్రంగులూ, తాపీపనివాళ్ళూ తప్ప, అందరూ బయల్దేరారు. దగ్గర దగ్గర మూడువందలమంది మహా సైన్యంలా బారులు తీర్చారు. భుజంమీద లావాటి కర్రపెట్టుకుని అందరిముందూ నిలబడి వున్నాడు మీర్జా. కూలీలందరూ గొఱ్ఱెలమందలా గుమిగూడారు.

"పనేంవిఁటి బాబూ!" అనడిగాడు అందులో ఒక కూలి.

మీర్జా సాహేబు చెప్పిన జవాబువిని అందరూ ఆశ్చర్యపోయారు. చెడుగుడు ఆడాలట! బలేవాడే; చెడుగుడు ఆడినందుకు అరణాలా కూలి? పిచ్చేమైనా ఎక్కలేదుగద? కొంతమందికి డబ్బెక్కువైతే పిచ్చెక్కుతుంది; అదేపనిగా చదువుకున్నా పిచ్చెక్కుతుంది. ఇదంతా వఠి గమ్మత్తేనేమో అన్న అనుమానంగూడా కలిగింది కొందరికి. తీరా యింటిదాకా తీసికెళ్లి "పనీలేదు, గినీలేదు. పొండి!" అంటే? ఎవళ్ళుమాత్రం ఏం చేయగల్రు? 'ఆ కూలి కాస్తా యిచ్చేస్తే ఏమి ఆడించుకున్నా యిబ్బందిలేదు; చెడుగుడూ ఆడొచ్చు,

గోడుంబిళ్ళా ఆడొచ్చు, దాగుడుమూతాలాడి గప్‌చుప్ సంబారుబుడ్డి !' అనీ అనొచ్చు.

"మా దగ్గర తింటానికి కాండబ్బులేదు; మీరు కూలి స్తే కొనుక్కుతింటా !" అన్నాడు గోవర్ సాహసం చేసి.

"అక్కడి కెళ్ళగానే అందరికీ కూలిచ్చేస్తాగాని గల్లంతు చెయ్యొద్దు." అంటూ ఆరణాలుతీసి గోవర్ కిచ్చాడు మీర్జా సాహెబు.

పట్టణంబయట కొంత స్థలం వుంది మీర్జా సాహేబుకి. ఆ స్థలంచుట్టూ తడికలు కట్టి వున్నాయి. లోపల ఒక చిన్న గుడిసె వుంది. ఆ గుడిసెలో మూడు నాలుగు కుర్చీలూ, ఒక మేజాబల్లా వున్నయి. ఆ మేజాబల్లమీద నాలుగైదు పుస్తకాలున్నయి. లతలూ, పూలూ కలిసి గుడిసెచుట్టూ అల్లిబిల్లిగా అల్లుకుని వున్నయి. స్థలాని కొకప్రక్క మామిడి, నిమ్మ, జామచెట్లున్నయి; ఇంకోనైపున పూలమొక్కలున్నయి. మధ్య కావలసినంత ఖాళీస్థలం వుంది. అందరినీ వరసగా నిల బెట్టి కూలీ పంచిపెట్టేశాడు మీర్జా. మీర్జా పిచ్చివాడా ? అన్న సందేహం ఎవరికీ లేకుండా పోయింది.

గోవర్‌కు కూలి అందరికంటే ముందే ముట్టింది. 'నువ్వెళ్ళి మొక్కలికి నీళ్లు పొయ్యి !' అన్నాడు మీర్జా. చెడుగుడు ఆడేందుకు వీల్లేదన్నమాట అనుకున్నాడు. గోవర్ అతనే ఆడితే ముసలివాళ్ళ నందరినీ యెత్తి పడేసేవాడు. అయినా పర్వాలేదు; కూలి ముట్టింది !

ఎన్ని సంవత్సరాలైందో యీ ముసలి ప్రాణాలు చెడుగుడాడి ? అసలెప్పుడైనా ఆడారో, లేదోగూడ గుర్తు

లేదు అందులో చాలామందికి. పగలల్లా పట్టణంలోపడి కొట్టు కునేవారు. ఝాం ప్రొద్దు పొయ్యింతర్వాత యింటికెళ్ళి, కలిగిందేదో తిని, పొట్టలో కాళ్ళు పెట్టుకుని పండుకునేవారు. మళ్ళీ తెల్లవారితే మళ్ళీ అదే వరుస! ఒక సుఖంకాని, సరదాగాని లేని బ్రతుకు యంత్రంలాంటి బ్రతుకు. ఇవ్వాళ్టి అవకాశం దొరికేప్పటికి అందరూ నవయువకుల్లా పొంగి పొయ్యారు. చచ్చేందుకు సిద్ధంగా వున్నవాళ్ళుగూడ, పంచలు త్రిప్పి మోకాళ్ళపైకి దోపుకుని, తొడలు చరుస్తున్నారు, వాళ్ళ ముసలి బొమికల్లో యౌవనం పరుగెత్తుతున్నట్లు. టీములు వేసుకున్నారు; నాయకుల్ని యెన్నుకన్నారు; జట్లు కట్టుకున్నారు; పన్నెండయ్యేప్పటికి ఆట ప్రారంభమయింది. శీతాకాలపు ఎండ చల్లగా, ఆటలకి అనుకూలంగా కాస్తూంది.

ఆవరణబయట ప్రేక్షకులికి టిక్కెట్లమ్ముతున్నాడు మిర్జా. ఆయన యెప్పుడూ యిట్లాంటి పనేదో ఒకటి చేస్తూనే వుంటాడు. వున్నవాళ్ళదగ్గర వసూలు చేస్తాడు; లేని వాళ్ళకిస్తూ వుంటాడు. ఈ చెడుగుడు పోటీలను గురించిన విజ్ఞాపన వారం పది రోజుల్నుంచీ జరుగుతూంది. పెద్ద పెద్ద పోస్టర్లంటించారు గోడలికి. నోటీసులు అచ్చొత్తించి పంచి పెట్టారు! ఇట్లాంటి ఆట యింతకు ముందెప్పుడూ ఎవరూ కని, విని యెరుగరు. బ్రహ్మాండమైన ఆట. ఇదివరకెప్పుడూ జరగ లేదు; ఇకముందెప్పుడూ జరగదు. మన దేశంలో వృద్ధులకి కూడా ఎంత శక్తి సామర్థ్యాలుంటాయో వచ్చి, ఒక్కసారి మీరే చూడండి! కన్నులవిందుగా చూడండి! చూడనివారు

పశ్చాత్తాప్పడతారు? చూచినవారు సంతోషిస్తారు. మంచి తరుణము? మించిపోవును. ఆలసించిన ఆశాభంగం.

రెండణాల దగ్గర్నుంచీ, పదిరూపాయలవరకూ వున్నవి టికెట్లు. మూడయ్యేప్పటికి ఆవరణంతా కిటకిట లాడుతోంది. బయట జట్కాలూ, కార్లూ ఒకదాని వెనకొకటి పంక్తులుతీరి వున్నయి. రెండువేలకి తక్కువ లేకుండా వున్నారు జనం. ధన వంతులు బల్లలమీదా, కుర్చీలమీదా కూర్చున్నారు. సాధా రణులందరూ శుభ్రమైన నేలమీద కూర్చున్నారు.

మిస్ మాలతి, మెహతా, ఖన్నా, తంఖా, జమీం దారుగారు - అందరూ - సుఖాసీను లయ్యారు.

"రండి! డాక్టరుగారూ, మీరూ నేనూ చెరొకకొమ్ముగా కాద్దాం!" అన్నాడు మీర్జా, మెహతాతో.

"అదేమన్నమాట! తత్వవేత్తలూ, తత్వవేత్తలూ ఆడవలసిందే!" అన్నది మిస్. మాలతి.

మీర్జా మీసాలు మెలివేస్తూ "అయితే నేను తత్వ వేత్తని కాదనుకుంటున్నారా? నాకు తోక లేకపోవచ్చునుకోండి! ఐనా తత్వవేత్తనే!! కావాలనంటే మెహతాగారూ! మీ యిష్టంవచ్చినట్లు పరీక్షచేసుకోండి" అన్నాడు.

"సరే! మీరు ఆదర్శవాదులా, భౌతిక వాదులా? అది గూడా సెలవియ్యండి మరి?" అన్నది మిస్. మాలతి.

"రెండూనూ."

"అదేమిటండోయ్?"

"అంతేమరి. ఎట్లావీలుగావుంటే అట్లా."

"అయితే యింకా మీరు నిశ్చయించుకోలేదన్నమాట?"

"ఇంతవరకూ యెవళ్ళూ నిశ్చయించుకోలేదు; నిశ్చయించుకోబోరు. ఇక నేనేం నిశ్చయిస్తాను? మీరే చెప్పండి! అందరూ పుస్తకాలను చెదల్లా కొరుక్కుతినీ, తలలు బద్దలు కొట్టుకునీ నేర్చుకున్న విషయాలు, నేనా శ్రమేమీ పడకుండానే నేర్చుకున్నాను. మీరేచెప్పండి యింతవరకూ యే తత్వవేత్త యే విషయంలో యేం పొడిచేశాడో నేనూ వింటాను?"

డాక్టరు మెహతా కోటు బొత్తాలు విప్పుతూ "సరే, కానివ్వండి! ఒకళ్ళతో నాకెందుకు? నేను మాత్రం మీరు తత్వవేత్తలనే అంగీకరిస్తాను" అన్నాడు.

"మీకూ్కడా ఎవరైనా చూడనా!" అని, ఖన్నా నడిగాడు మీర్జా.

"ఆహా, తప్పకుండాను. మిస్టర్ తంఖానూ, వీరినీ కలపండి" అని సలహా యిచ్చింది మిస్. మాలతి.

"ఆఁ ఎందుకులెండి. నన్ను వదిలేయండి" అంటూ సిగ్గు పడ్డాడు ఖన్నా.

"మరి తమరు?" అని జమీందారుగారిని అడిగాడు మీర్జా.

"ఓంకారనాథుడుంటే నాకు వుజ్జీ సరిపోయేదే, కాని వచ్చినట్లు లేదే!" అన్నారు జమీందారుగారు. మీర్జా, మెహతా-యిద్దరూ లంగోటీలు కట్టుకుని, ఆటలో జోరబడి చెరోవైపునా కాసారు. ఆట ప్రారంభమయింది.

ప్రేక్షకులు ఆటగాళ్ళలో ముసలివాళ్ళని చూచి నవ్వుతున్నారు, చప్పట్లు కొడుతున్నారు, గేలిచేస్తున్నారు, పందేలు వేస్తున్నారు, హుషారిస్తున్నారు. "ఒహోహో! కాస్త

యీ ముసలివాణ్ణి చూడండిగా, ఆహా! ఎంత గొప్పగా నడుస్తు న్నాడురా. ఈ దెబ్బతో అందర్నీ కొట్టి వెళ్ళేట్టుగా వున్నాడే. ఓహోహో! ఏమి ఠీవి! ఏమి దర్పం! ఉహ్హాం! అవతలి వాళ్ళేనేమిటి తక్కువ తిన్నది. బలే వుజ్జీలే! అబ్బో, ముసలి వాడిలో యింకా పలుకువుందిరోయి; పులుపు చావలేదు కాదు మరీ, వాళ్ళు బ్రదికున్న రోజుల్లో, మనం త్రాగే మంచి నీళ్ళకంటే ఎక్కువగా త్రాగేవారంట నెయ్యి. పలుకున్నదంటే వుండదూ మరి! మనదేశంలో సిరిసంపదలు పెరుగుతున్నా యట, ఏమో. ఏం పెరుగుతున్నాయో? ఈ ముసలివాళ్ళ కున్న బలంకూడా లేదు మనకాలం పడుచువాళ్ళకి. ఓహ్హోహో! చూశారా? ఆ ముసలివాణ్ణి పట్టేశారోయ్. బలేగా గింజుకుంటున్నాడులే. ఏమీ లాభంలేదు లేవయ్యా, యిక పప్పులుడకవ్లే. ఒకళ్ళకి నలుగురొచ్చి మీదబడితే యింకేం గెలుస్తావుగాని యిక కూతొదిలిపెట్టు" అంటూ గల్లంతు చేస్తూన్నారు. కూతని చూచీ, తన్నులు చూచీ, పట్లు చూచీ, కవ్వింతలు చూచీ తన్మయులై పోతున్నారు జనం అంతా. అప్పుడప్పుడూ అన్యాయం జరిగిపోతూన్నట్లు, 'ఇక చాల్లే వద లండి!' అంటూ కేకలేస్తారు. ఒకోసారి పరుగెత్తికెళ్లి గెలిచిన వాడి వీపుచరచివస్తారు కొందరు. కాని హైక్లాసు టిక్కెట్లు కొను క్కుని, కుర్చీలమీద కూర్చున్నవారి కివేమీ పట్టినట్లులేదు. ఈ ఆటలకంటే మహోన్నతమైన విషయాలను చర్చిస్తున్నారు వాళ్ళు.

ఖన్నా జింజరుగ్లాసు ఖాళీచేసి, సిగార్ ముట్టించాడు. "లాభం లేదండి జమీందారుగారూ. అంతకంటే తక్కువవడ్డీ

అంటే బ్యాంక్ అప్పివ్వదు. అదిగూడా మనమంతరమూ వొకటే కాబట్టి, నేను చెబితే విన్నారుగాని" అన్నాడు.

"కాదటలెండి మరి! అంతా ఒకటి కాబట్టే మొండి కత్తితో అయినవాళ్ళని చిత్రవధ చేస్తారు. కాదూ?" అంటూ ముసిముసి నవ్వులు మీసాల్లోపలికి నెట్టుకున్నాడు జమీందారు.

"ఛ. ఛ. అదేమిటండీ."

"నిజమేనండీ! సూర్యప్రతాపసింహ్ దగ్గర యేడణాలు పుచ్చుకున్నారు. నన్నేమో తొమ్మిదణాలిమ్మంటున్నారు. నిజమేగదండి. మీరు నాకు సహాయం చేస్తూనే వున్నారుగా!"

ఖన్నా పగలబడి నవ్వాడు.

"బాగుంది; బాగుంది! సరే, ఆయన కేసరతులమీద యిచ్చామో తెలిస్తే మీరామాట అనరు. ఆయన ఆస్థంతా తాకట్టు పెట్టించుకున్నామండీ. ఇక ఆ ఆస్థి ఆయన విడిపించు కుంటాడు గనుకనా."

"అయితే నేనూ యేదో వొకటి వొదిలించుకుంటాను. తొమ్మిదణాలిచ్చేకంటే వొదిలించుకోడమే మెరుగు. ఆ జంక్షను రోడ్డుదగ్గరున్న బంగళాతీసుకోండి; నే నెలాగూ వుపయోగించడంలేదు. చూడండిమరి. మీ కమిషన్ మీకిచ్చేస్తాను."

"ఆ బంగళా పట్టణానికి చాలా దూరంగా వుంటుంది గదండీ. కష్టమేమరి. సరే, చెబుతున్నారుగా. ప్రయత్నిస్తాలెండి. ఖరీదెంత చేస్తుందంటారు?"

లక్షాపాతిక వేలుంటుందన్నాడు జమీందారు. ఆ బంగళాచుట్టూ యేడెనిమి దెకరాల పొలంగూడా వుండె. ఖన్నా ఆశ్చర్యపోయాడు. "మీరింకా పది పదిహేను సంవత్స

రాల క్రితం సంగతి చెబుతూన్నారు జమీందారుగారూ. నూటికి యాభై తగ్గిపోయిందని మీకు తెలిసినట్లు లేదు" అన్నాడు ఖన్నా.

"అదేమీకాదులెండి. పదిపదిహేను సంవత్సరాల క్రితం అయితే లక్షన్నర చేసేది!"

"సరే. ఎట్లాగో ఒకలా చూస్తాన్లెండి. నా కమిషన్ మీకు తెలుసుగా 5%."

"ఇతరుల దగ్గరైతే 10% తీసుకునేవారా యేమిటి కొంప దీసి? ఏం చేస్తారండీ యీ సంపాదనంతా?"

"మీయిష్టం వచ్చినంత యివ్వండి; సరేనా! మీరు షుగర్‌లో వాటాలు తీసుకోలేదు; ఇన్స్యూరెన్సు పాలసీలు కట్ట మంటే కట్టలేదు. మీ మంచికి చెబితేనే టలాయిస్తారాయె. ఇంక మామంచేమి చూస్తారులెండి. నేనైతేనా; తాలూకా దార్ల ఆస్తులన్నీ జప్తుచేయించేసేవాడినిసుమండీ!"

మాలతిమీదికి వలలు విసురుతున్నాడు మిస్టర్ తంఖా. ఎలక్షన్లలో పోటీ చేయాల్ననే వుద్దేశం తన కేకోశానా లేదని ఖండితంగానే చెప్పింది మాలతి; కాని తంఖా అంతమాత్రాన వూరుకునే ఘటంకాదు. దగ్గరకొచ్చి, మేజాబల్లమీద మోచేతులానించి "మీరా విషయం మళ్ళీ వోకసారాలోచించి చూడాలి. మళ్ళీ యిలాంటి, చక్కటి అవకాశం దొరకటం అంటే మాటలుగాదు. మీరు నిలబడితే, చందారాణి గారికి రూపాయ కణాఘాన్సుగూడా వుండదు. చూశారూ! జీవితంలో అనుభవం సంపాయించినవారూ, ప్రజాసేవ చేసిన వారూ కౌన్సిల్లోకి వెళ్ళడం మంచిది. ఆవిడకు భోగవిలాసాలు

తప్ప యింకేమీ అవసరంలేదు; ప్రజల్ని, తన కారుకక్కావలసిన పెట్రోలు అని అనుకుంటుందావిడ; మెదిత్తే, కదిత్తే గవర్నర్లకీ, సెక్రటరీలకీ పార్టీ లివ్వడం తప్పితే యింకేమీ చేతగాదావిడకి. అలాంటివాళ్ళకి కౌన్సిల్లో స్థానం లేదు. ఈ కొత్త కౌన్సిల్లో ప్రతినిధులకి చాలా అధికారాలుంటాయి. ఆ అధికారాల్ని సద్వినియోగం చెయ్యడంమాట అట్లావుంచి, దుర్వినియోగం చేస్తారని మనకు బాగా తెలిసింతర్వాత, యింకా చందా రాణిలాంటివాళ్ళ నెన్నుకోవడం యెందుకు చెప్పండి?"

నిజమే ననుకోండి! అయినా ఎలెక్షన్లలో ఖర్చుంటుందిగదా. పాతిక, యిరవై వేలెక్కడ్నుంచి తేగలనండీ నేను? రాణీగారంటే రెండు మూడు లక్షలైనా ఖర్చు చేస్తారు. అదీగాక యిప్పుడు రాణీగారిచ్చే పది, పదిహేనువందలు గూడ వదులుకోవలసొస్తుంది" అన్నది మాలతి. అట్లా అంటే నన్నా కనీసం వదలిపెడ్తాడేమోనని.

"అదంతా కాదండీ. మీరు వెళ్ళదలచుకున్నారా లేదా? అది చెప్పండి నాకు."

"వెళ్ళాలనే వుందనుకోండి; 'ఫ్రీపాస్' దొరకాలిగదా మరి!"

"అయితే యిక ఆ భారమంతా నామీద పెట్టండి. ఫ్రీపాస్ వచ్చేట్లు చేచూస్తాగా."

"వద్దులెండి; క్షమించండి బాబూ! ఓడిపోతే తలవంపులెవరు పడతారు? రాణీగారు సంచులు విప్పేస్తుంది. ఓటుకి వరహా యిచ్చిందంటే మీరుగూడా మీ వోటావిడకే యిచ్చేస్తారు?"

"ఏమిటీ? డబ్బున్నంతమాత్రాన ఎలక్షన్లలో గెలవటం అంత తేలికనుకుంటున్నారా మీరు?"

"కాదనుకోండి. నిలబడే వ్యక్తిని బట్టిగూడ వుంటుందనుకోండి. అయినా నేను మాత్రమేం ప్రజాసేవ చేశానండీ? ఒక్కసారి జైలు కెళ్ళాననుకోండి. అదిగూడా స్వార్థం కోసమే; జమీందారుగారూ, ఖన్నాగారూ వెళ్ళినట్లు. ఈ నవనాగరికతకి డబ్బుండాలండీ. చదువూ, సేవ, కులమూ, జాతీ-అన్నీ-డబ్బు తర్వాతనే! అప్పుడప్పుడూ చరిత్రలో డబ్బు, ఆందోళనముందు తల వంచినా, అది తాత్కాలికంగానే. యెవరిమాటో ఎందుకు? నా విషయం చూడండి. యెవరైనా బీదలొస్తే గంటల తరబడి పడిగాపులు కాస్తూవుంటారు. కాని యెవరైనా కారుమీద వస్తే గేటుదాకా యెదురెళ్లి, చేతులు జోడించి, ఒక మహాదేవిని పూజించి, ఆహ్వానించినట్లాహ్వానిస్తాను. నాకూ రాణీగారికి, పోటీ యేమిటండీ మీ పిచ్చిగాని? ఇప్పుడున్న కౌన్సిల్‌లాంటి కౌన్సిళ్ళలో రాణీగారి లాంటి వాళ్ళుండటమే మంచిది!"

అక్కడ ఆటలో మెహతాగారి టీం చేయి క్రిందా తోంది? సగంపైగా ఆటగాళ్లు మురిగిపోయారు. మెహతా యింతకుపూర్వం యెప్పుడూ చెడుగుడాడి యెరగడు. మీర్జాఅంటే యిట్లాంటి ఆటలకి పెట్టిందిపేరు. మెహతా అంటే వీలుదొరికినప్పుడల్లా అభినయం అభ్యాసం చేస్తూండేవాడు; వేషంవేస్తే గొప్ప గొప్ప వాళ్ళుగూడా తల లూపేవారు.

మాలతి ధ్యానమంతా ఆటమీద నేవుంది. లేచివెళ్ళి,

జమీందారుతో "చూశారా! మెహతా ఓడిపోయేట్లున్నారు" అన్నది.

జమీందారూ, ఖన్నా యిన్స్యూరెన్సును గురించి మాట్లాడుకుంటున్నారు. జమీందారా సంభాషణతో యిది వరకే విసిగిపోయి వున్నాడేమో, మాలతి మాట్లాడడమే తడవుగా లేచి "నిజమే! ఓడిపోయేట్లే వున్నాడు. మీర్జా మంచి ఆటగాడుగదా మరి" అన్నాడు.

"ఏమిటీ యీ అవమానం? మెహతాకి పిచ్చెక్కటం లేదుగద!"

"ఇందులో అవమానమేంవుంది? యేదో హుషారుగా ఆడుకుంటూంటే!"

"మెహతా పార్టీనుంచి కూతకెళ్ళిన వాళ్ళందరూ మురిగి పోతూంటే!"

ఇంకో క్షణం ఆగి "ఏమండీ! యీ ఆటకు హాఫ్‌టైం అంటూ వుండదా?" అని అడిగింది మాలతి.

ఖన్నా గమ్మత్తు చేద్దామనుకున్నాడు. "మీరు మీర్జాతో పోటీ అన్నారుగా? ఇదేమైనా తత్వశాస్త్రం అనుకున్నారా?" అన్నాడు.

"అది కాదండీ. ఈ ఆటలో హాఫ్‌టైమ్ వుండదా? అని అడుగుతున్నా నేను."

"ఇంకే ముందిలే. ఆట అయిపోతోంది. మీర్జా, మెహతాని ముప్పు తిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగిస్తాడు. అప్పుడుగాని ఆట రంజు కట్టదు" అని మళ్ళీ కదలించాడు ఖన్నా.

"నేను మీతో మాట్లాట్టం లేదు; జమీాందారుగారి నడుగుతూన్నా."

"ఈ ఆటకు హాఫ్‌టైం ఏముంది; ఒక్కొక్క మనిషేగా కలబడేది." అన్నాడు జమీాందారు.

"ఓహో. అదిగో మెహతా టీం; అతను యింకొకతను మురిగి పోయాడు."

"అట్లాగే చూస్తూ వుండండి మీారు. అందరూ మురిగి పోతారు; చివరికి మెహతాగూడా మురిగి పోతాడు!"

మాలతికి కోపం వచ్చింది. "ఆటకి వెళ్ళమంటే మీాకా మాత్రం గుండెలుకూడ లేకపోయినయ్యా!"

"ఆడి, ఆడి యీా గబ్బిలాయిల ఆటే ఆడాల్నా? నేనూ ఆడతాను - టెన్నిస్."

"టెన్నిస్‌లో గూడా మిమ్మల్ని చాలాసార్లు, వోడించానుగా నేను!"

"మిమ్మల్ని జయించగలనని యెప్పుడన్నాను నేను?"

"ఇప్పుడనండి పోనీ. నేను సిద్ధంగానే వున్నా."

ఖన్నాను చీవాట్లు పెట్టి, వెళ్ళి, మళ్ళీ తన కుర్చీలో కూర్చుంది మాలతి. మెహతా అంటే యెవరికీ సానుభూతి లేకుండావుంది. ఆ టైపోతే బాగుంటుందని యెవరూ అనుకోవటం లేదు. మెహతాగూడా ఏమీా తెలివిలేనట్లు - యేదో వొక కిటుకో, పేచీయో పెట్టుకోగూడదూ? ఆటలోనేనా తన న్యాయం అంతా చూపించుకోవలసింది. కాస్సేపున్న తర్వాత- ఓడిపోతే - తెలిసొస్తుంది! నాలుగు వైపుల్నించి హేకిలిచేసి, చప్పట్లుకొడ్తే. ఆయనవైపున యింకో యిరవైమందున్నారేమో.

ఆట అయిపోవస్తూంది. జనం త్రొక్కిసలాడుతూన్నారు; ఆటస్థలంచుట్టూ కట్టిన త్రాడుగూడ తెగిపోయింది. ఆ త్రొక్కిడిలో వలంటీర్లు జనాన్ని వెనక్కి నెట్టాలని చూస్తూన్నారు. గాని ఆ పిచ్చిఉత్సాహంలో వాళ్ళమాట వినిపించుకోవటంలేదు జనం. ఆట ఐపోయ్యేంది. ఇక మెహతా వొక్కడే మిగిలాడు. ఇక ఆయన మూగవాడిఆట ఆడాలి. ఆటంతా ఆయన చేతుల మీదవుంది. ఎట్లాగోట్లా మళ్ళీతిరిగి తనవైపుకి వస్తేనే ఆట దక్కుతుంది; లేకుంటే సిగ్గుతో తలవంచుకుని, బయటికి నడ వ్వాలసిందే. వెళ్ళి, కూతయిస్తూ, యెదిరిపక్షంవాళ్ళని యెంత మందిని అంటుకుంటే అంతమందీ మురిగిపోతారు; అంతమందీ మళ్ళీ తన పక్షంలో బ్రదుకుతారు. అందరికళ్ళూ మెహతా మీదనే వున్నయి. మెహతా కూతకని బయల్దేరాడు. జనం అంతా వూపిరిబిగబట్టుకు చూస్తున్నారు తదేక దృష్టితో. ఎంతో శాంతంగా, యేమీ వులకకుండా వెళ్తున్నాడు మెహతా. కొందరు ముందుకువంగీ, కొందరు మెడలువంచీ, చూస్తున్నారు యేమౌతుందోనని. ఆట మంచి రక్తిలోవుంది. మెహతా మధ్యగీత దాటాడు. ఎదురుపార్టీ వెనక్కెనక్కి జరుగుతోంది. వాళ్ళందరూ మంచి పకడ్బందీగా వున్నారు; ఎవ్వరూ మెహతాకి అందటంలేదు. ఎట్లాలేదన్నా పదిమంది నైనా అంటుకొని వస్తాడని, యింతవరకూ అనుకున్న జనం నిరుత్సాహ పడిపోతున్నారు.

ఇంతలోనే మీర్జా వొక్కడు యెగురుయెగిరి, కన్ను మూసి తెరిచేప్పటికి, మెహతా నడుం గట్టిగా పట్టుకున్నాడు. విడి పించుకోవాలని జోరు చూపించుతున్నాడు మెహతా;

మిర్జాను మధ్య గీత దగ్గరకు లాక్కొస్తున్నాడు. జనం కేరింతలు కొడుతోంది; ఆటాడుతున్నదెవరో, చూస్తూన్నదెవరో తెలీకుండా, అంతా గజిబిజిగా వుంది. మిర్జా, మెహతాలు మల్ల యుద్ధం చేస్తున్నారు; యింతలో మిర్జా కొమ్ముగాసిన ముసలి వాళ్ళందరూ వచ్చి మీదపడ్డారు. మెహతా క్రింద పడి పోయాడు; కిక్కురుమనటంలేదు పాపం. కాస్త వూపిరి తెచ్చుకుని, యింకో బార చాస్తే మధ్యగీత అందుకోగలిగేవాడే మెహతా. అందుకుంటే అతనినైపువాళ్లొకయాభైమందైనా మళ్ళీ బ్రదికేవాళ్ళు! కాని యింకో అంగుళంగూడ పిక్కలేశక్తి లేదు మెహతాకి. మిర్జా, మెహతా మెడమీద కూచ్చు న్నున్నాడు. మెహతా మొహం యెర్రబారుతోంది, గుడ్లు మిటకరిస్తున్నాడు, చెమటలు కక్కుతున్నాడు. మిర్జా పట్టు వదలటంలేదు.

మాలతి గబగబావెళ్లి "మిర్జాగారూ! యిది ఫెయిర్ ప్లేగాదు. ఆట డ్రా అయ్యినట్లే" అన్నది.

మిర్జా, మెహతామెడని మళ్ళీ వొక నొక్కు నొక్కి, "అదేం కుదరదు. ఈయన 'చీః' అంటేగాని వదలను. 'చీః' అనమనండి!" అన్నాడు.

" 'చీః' అనలేదని మీరింత జబర్దస్తీ చేస్తారా?" అంటూ మరొకడుగు ముందుకు వేసింది మాలతి.

"అనమనండి, అంటే యిప్పుడే వదిలేస్తాగా?" అని మళ్ళీ యింకో నొక్కు నొక్కాడు మిర్జా.

మెహతా లేవాలని చూశాడుగాని వల్లకాలేదు.

"ఇదేమీ ఆటలాగా కన్పించటంలేదే; పగపట్టినట్లుంది గాని" అంటూ మిర్జా చేయిపట్టుకొని లాగాలని చూచింది మాలతి.

"పగపట్టామనే అనుకోండి !"

"మీరు వద్దన్నమాట ?"

వీళ్లిద్దరూ యిట్లా మాట్లాడుతూండగానే యేదో భూకంపం జరిగినట్లయ్యింది; మిర్జా నేలమీద పడిపోయాడు. మెహతా మధ్యగీత వేపుకు పరుగెత్తుతున్నాడు. జనం అంతా తలపాగాలు, టోపీలు, పైకెగురవేస్తున్నారు. పిచ్చివాళ్ళలా, ఆట యిట్లా తలక్రిందులెందుకు, యెట్లా అయ్యిందో యెవ్వరికీ తెలియలేదు.

మెహతాని భుజాలమీద యెక్కించుకుని గుడారం వైపుకు నడచాడు మిర్జా. డాక్టరుగారు పందెం కొట్టేశారు! అని అందరూ వొకటేమాట, వొకటేమోత. అందరూ మెహతా ధైర్యాన్ని పొగడేవాళ్లే; అందరూ మెహతా 'గుక్క'ని మెచ్చుకునేవాళ్ళే !

కూలీలకోసమని మొదటనే నారింజకాయలు తెప్పించారు; తలకొకటిచ్చి వాళ్ళందరినీ పంపించివేశారు. అతిథుల కందరికీ టీపార్టీవుంది. మెహతా, మిర్జాలు యెదురు బొదురుగా కూర్చున్నారు. మాలతి, మెహతా ప్రక్కనే కూర్చున్నది.

"ఇవ్వాళ నాకో వింత అనుభవం కలిగింది. మహిళల సానుభూతి అపజయాన్ని, విజయంగా మార్చేస్తుంది" అన్నాడు మెహతా.

"ఓహో! అదా సంగతి! అందుకనే వున్నట్లుండొక్క సారి పైకెట్లా యెగిరిపోయూరా అని ఆశ్చర్యపోయూ నేను!" అన్నాడు మాలతివంక చూస్తూ మీర్జా.

మాలతి సిగ్గుపడింది. "ఇవ్వాళ్టిగ్గాని తెలియు లేదండీ మీర్జాగారూ, మీరింత నిర్మొగమాటస్థులని."

"వారిదీ తప్పు. 'ఛీః' అంటే పోయేదిగా?"

"మీరు నా ప్రాణంతీసినా అనేవాడినిగాదు" అన్నాడు మెహతా.

ఇట్లాగే అందరూ కలిసి పిచ్చా - పాటీ మాట్లాడుకున్నారు. కాస్సేపున్నతర్వాత అతిథులందరూ ధన్యవాదాలూ, కృతజ్ఞతలూ చెప్పుకుని, శలవు తీసుకున్నారు. మాలతిగూడ యెవర్నో కలిసికోవాల్నని చెప్పి వెళ్ళిపోయింది. మెహతా, మీర్జాలు మిగిలారు. వళ్ళంతా మట్టయింది; స్నానం చేస్తేగాని బట్టలు వేసుకునేందుకు వీలులేదు. గోవర్ నీళ్ళుతోడాడు. ఇద్దరూ స్నానం ప్రారంభించారు.

"పెళ్ళెప్పుడు?" అనడిగాడు మీర్జా.

"ఎవరిది?" అన్నాడు మెహతా ఆశ్చర్యంతో.

"మీదే!"

"నా వివాహమా? ఎవరితో!"

"బలేవారే! యెంతకాలమని దాస్తారు?"

"నిజంగానండీ. నాకు తెలియనే తెలియదు. అయితే నా వివాహం కాబోతూందన్నమాట!"

"కాకంటే మరేమనుకుంటున్నారు? మిస్. మాలతి కలకాలం మీ స్నేహితురాలుగానే వుండిపోతుందను కుంటున్నారా!"

"మీ వూహ చాల తప్పండీ, మీర్జాగారూ! మిస్. మాలతి అందమైనది, తెలివితేటలు గలది, హుషారుగా వుంటుంది, చక్కని భావాలున్నవి. ఆవిడలో యింకా సద్గుణాలు చాలా వున్నవి. నిజమే! కాని నా అర్థాంగికి కావలసిన లక్షణాలు ఆవిడలో లేవు. నా వుద్దేశంలో స్త్రీ త్యాగమూర్తి గానూ, పతివ్రతగానూ వుండాలి. తన వ్యక్తిత్వాన్నంతా వదలేసి, భర్త ఆత్మకూ, వుద్దేశాలకూ అర్థాంగి కావాలి. మన వాళ్ళంటారు చూశారూ; పురుషుడు శరీరం, స్త్రీ ఆత్మ; అలావుండాలి. పురుషుడే తన వ్యక్తిత్వాన్నెందుకు వదలి పెట్టుకోగూడదు? స్త్రీయే యెందుకు వదలిపెట్టాలి? అని అడగవచ్చు మీరు! పురుషుడికంత శక్తి లేదనంటాను నేను. పురుషుడు తన వ్యక్తిత్వాన్ని వదులుకున్నాడంటే సర్వనాశనం అయిపోయాడన్నమాటే. అత నేనిర్జనప్రదేశానికో, గుహలోకో, లోయలోకో, వెళ్లి సర్వాత్మలో కలిసిపోవాల్నని కలలు కంటాడు. పురుషుడు తేజో ప్రధానుడు; తానొక జ్ఞానమూర్తినని అతని అహంకారం; అంచేతనే యీశ్వరుడిలో తల్లీనమై పోవాలని భావిస్తాడు. స్త్రీ అలాకాదు. పృథ్విలా శాంతిసంపన్న; సహిష్ణువు; ధైర్యశీల. ఈ గుణాలు పురుషుడిలో ప్రవేశిస్తే, అతను మహాత్ముడౌతాడు. కాని పురుషుడి గుణాలు స్త్రీలో ప్రవేశిస్తాయనుకోండి; కులట అయి పోతుంది. పురుషుడు స్త్రీవైపుకు ఆకర్షింపబడాలంటే, ఆ స్త్రీ

అన్నివిధాలా స్త్రీ ఐవుండాలి; నే పై చెప్పిన లక్షణాలన్నీ వుండాలి. ఇంతవరకూ మాలతి నన్నాకర్షించలేదు. స్త్రీ అంటే నా భావమేమిటో మీకెలా తెలియజెప్పాలో అర్థం కాకుండా వుంది నాకు. ప్రపంచంలో వున్న సౌందర్యం అంతా మూర్తీభవిస్తే, అదే స్త్రీ. నేనామూర్తిని ముక్కలు చెక్కలు చేసినాసరే, ఆ మూర్తికి కోపం రాకూడదు.; ప్రతిహింసా భావం కలగకూడదు. ఆ మూర్తి కళ్ళెదుటనే నేనింకో స్త్రీని ప్రేమిస్తే ఆ మూర్తికి యీర్ష్య కలగకూడదు. అలాంటి స్త్రీ దొరికితే, నేనావిడ చరణపద్మాలను కళ్ళకద్దుకుంటాను; నా సర్వస్వమూ అర్పిస్తానావిడకు!" అన్నాడు మెహతా యెంతో గంభీరంగా.

"మీకీ ప్రపంచంలో అట్లాంటి స్త్రీ దొరకటం దుర్లభం" అన్నాడు మీర్జా తలపంకిస్తూ.

"ఒకళ్ళుకాదు; వేలమంది వున్నారు. లేకుంటే ప్రపంచం యీ సరికి పాడుబడిపోయేదికాదూ ?" అన్నాడు మెహతా.

"ఉదాహరణకి వొక్కళ్ళపేరు చెప్పండి."

"యేం ! మిసెస్ ఖన్నానే చూడండి."

"అయితే ఖన్నా ?"

"ఖన్నా దురదృష్టవంతుడు; బంగారాన్ని చూస్తూ గూడా యిత్తడి ముక్కనుకుంటున్నాడు. యెంత త్యాగమూర్తి' యెంత ప్రేమాసక్త ! మీరే ఆలోచించండి. ఖన్నా అందాన్ని అందలా లెక్కించే మనిషికాబట్టి అతని హృదయంలో ఆవిడకు స్థానంలేదేమోకాని – ఖన్నా కేఆపగదలిగినా ఆవిడ తన సర్వస్వమూ త్యాగంచేసేందుకు సంసిద్ధంగావుంది. ఈనాడతను

గ్రుడ్డివాడుగానో, కుష్ఠురోగిగానో మారిపోయినా, ఆవిడ యింత వరకూ పూజిస్తూవచ్చినట్లే పూజిస్తుందాతన్ని. ఆమెనిప్పుడు గౌరవించుతూండక పోవచ్చు ఖన్నా; కాని యీ ఖన్నాయే ఆవిడకాళ్ళు కడిగి, నీళ్ళు నోట్లోపోసుకునే రోజు వస్తుంది. చూస్తూండండి! నేను వివాహం చేసుకునేది నా భార్యతో ఐన్‌స్టీన్ సిద్ధాంతాలనిగురించి చర్చించేందుకు గాదు; నా వ్రాత ప్రతుల ప్రూఫుల్ని సరిదిద్దించుకునేందుకూ గాదు. తన త్యాగ నిరతితోనూ, ప్రేమజ్యోతితోనూ నా జీవితాన్నంతా పవిత్రం గానూ, ఉజ్వలంగానూ మార్చి వేయగల స్త్రీ కావాలి నాకు."

మీర్జా గడ్డం సవరించుకుంటూ, మరచిన మాటేదో జ్ఞప్తికి వచ్చినట్లు "మీరు చెప్పేది చాలా గొప్పగా వుందండీ మెహతాగారూ! అట్లాంటి స్త్రీ దొరికితే నేనూ పెళ్ళిచేసుకుంటాను. కానీ దొరుకుతుందనేఆశమాత్రంలేదు నాకు" అన్నాడు.

"మీరుగూడా వెదకుతూండండి; నేనూ వెదకుతూంటాను. యెప్పుడో వొకసారి అదృష్టం పండకపోతుందా!" అన్నాడు మెహతా నవ్వుతూ.

"అయినా మిస్. మాలతిమాత్రం మిమ్మల్నొదిలి పెట్టదు. కావాలంటే వ్రాసిస్తాను."

"అలాంటి స్త్రీలతో వూరికే కాలంగడిపేందుకు నాకేం అభ్యంతరంలేదు. కాని వివాహం మాత్రం చేసుకోను. వివాహమంటే మాటలా? ఆత్మ సమర్పణ చెయ్యాలి!"

"వివాహంఅంటే ఆత్మసమార్పణా? సరే; మరి ప్రేమంటే—?"

"ప్రేమ ఆత్మసమర్పణంగా పరిణామం చెందితేనే వివాహం అంటాం. ఆ పరిణామం పూర్తయ్యేవరకూ దానిని లంపటత్వం అనే అనాలి."

మెహతా బట్టలువేసుకుని, వెళ్లిపోయాడు. సాయంకాల మయింది. మీర్జా అటూ, యిటూ తిరుగుతున్నాడు. గోవర్ యింకా చెట్లకి నీళ్ళు పోస్తూనే వున్నాడు. చూచి, మీర్జా సంతోషించాడు. దగ్గరకెళ్లి, "ఇవ్వాల్టికిక చాల్లే. వెళ్ళు. మళ్ళీ రేపొస్తావా?" అనడిగాడు గోవర్‌ని.

"యెక్కడన్నా పని దొరుకుతుందేమోనని చూస్తన్నా బాబుగారూ."

"మాదగ్గరే చెయ్యి పని, చేయదల్చుకుంటే."

"యేమిస్తారు బాబూ!"

"నువ్వెంత కావాలంటే అంత."

"నాకేం తెలుసు బాబూ. మీ యిష్టమొచ్చినంత యివ్వండి."

"పదిహేను రూపాయలిస్తా. పని మాత్రం బాగా చెయ్యాలి మరి."

గోవర్‌కి పనంటే భయంలేదు; ఉచ్చిచ్చి, యిరవై నాలుగుఘంటలూ పనిచెయ్యమన్నా చేస్తాడు. పదిహేను రూపాయలిస్తే యింకా కావలిసిందేముంది? ప్రాణాలిమ్మన్నా యిస్తాడు.

"ఏదో యిక్కడే వొక గుడిసుంటే అందులోనే తల్దాచుకుంటా బాబుగారూ ?"

"సరేలే! యీ గుడిసెలోనే వొక మూలని పండు కుందూగాని."

గోవర్‌కు స్వర్గం దొరికినట్లయ్యింది.

# 12

పండిన పంటంతాపెట్టి జుల్మానా తీర్చాడు హాకీ. వైశాఖమాసం యెట్లాగోట్లా గడిచిపోయింది. కాని జ్యేష్ఠం వచ్చేటప్పటికి, ఇంట్లో పుచ్చినగింజకూడా లేకుండా పోయింది. ఇంట్లో ఐదుగురి పొట్టలు నిండాలి; చూస్తే ధాన్యం నిండుకుంది. రెండు పూటలకు లేకపోతే మానె, వొక పూటకైనా వుండాలిగదా. పొట్టనిండా దొరక్కపోతే మానె, అర్థాకలైనా తీరాలిగదా. పస్తులుంటూ యెంతకాలమని బ్రదకటం? అప్పు పుట్టదాయె; అప్పిచ్చిన వాళ్ళకే మొహం చాటువేయవలసి వస్తూండె. కూలి చేసుకుందామన్నా దారిలేకపోయె. జ్యేష్ఠ మాసమంతా స్వంతపనుల్తోనే సరిపోయె. ఇప్పుడు చెఱకుతోటలకు నీరు తోడుతున్నారు గాని—పస్తులుండేవాడు కాయకష్టం యెట్లా చేయగలడు?

సాయంకాలం ఐయింది. పసిపిల్లడు యేడుస్తున్నాడు; తల్లికి తిండిలేదు, పాలెట్లా వుంటయి? పెద్దమ్మాయి సోనా అంటే అన్నీ తెలుసును[illegible]ట్టి వూరుకుంటుంది; [illegible]ది, రూపకేం తెలుస్తుంది? [illegible] స్తుంది;

పగలల్లా యేదో మామిడిపింద లేరుకుతిన్నది; కనీసం రోజుకొక్క పూటైనా అన్నం తినందే యెట్లా వూరుకుంటుంది పసిప్రాణం. కోమటమ్మ దగ్గర అప్పుతెద్దామని వెళ్ళాడు హోరీ. కోమటమ్మ కొట్టు మూసేసుకుంది. మంగ్రూసావుకారు అప్పివ్వటం మాటట్లావుంచి, చెడామడా యిష్టం వొచ్చినట్లన్నాడు: అప్పివ్వాలంట, అప్పు. అప్పు తీసుకుని మూడేళ్ళైనా యింతవరకూ వడ్డీకూడా వసూలెయ్యలేదు. మళ్ళీ అప్పుకని బయల్దేరాడు. ఇక చచ్చింతర్వాత గాని తీర్చడనుకుంటూ. లోకంవేం అట్లా వుంది; వరిపట్టపగలు. ఇదంతా దేవుడూ చూస్తానేవున్నాడు. అందుకనే కాలం యిట్లావుంది. జమీందారుగారనేటప్పటికి, కుక్కిన పేనుకిమల్లే బాకీ అంతా జమెయ్యాలా? నాది మాత్రం సొమ్ముగాదూ? పెళ్ళాన్ని చూద్దామంటే మాటంటేనే యెగిరి పడ్తంది!...

హోరీ ఆమాటలన్నీ వినలేక, మొహం చెల్లక యింటి కొచ్చాడు; కూర్చుని విచారించుతున్నాడు. ఇంతలోనే నిప్పుకనొచ్చింది తమ్ముడి భార్య పున్ని. వంటింటి గుమ్మంలోకి వెళ్ళి తొంగి చూచింది; ఇంట్లో దీపంలేదు, అలికిడి లేదు. "ఎసళ్ళెళయ్యిందిగా అక్కా! ఇంకా అన్నం వంట్టంలేదా?" అనడిగింది.

గోవర్ పారిపోయిందగ్గర్నుంచీ, తోడుకోడళ్ళకి మాటలు కలిసాయి. బావ, హోరీ, చేసిన సహాయం చూచి, పున్ని సంతోషించింది. ఈ మధ్య భర్తనిగూడా, బయటపడి తిడుతూంది; ఖూనీకోరు ఆవునిచం[illegible] పారిపోయాడు. ఇంత పాప[illegible] [illegible]డో చూస్తాగా.

ఇంటో అడుగు పెట్టనిస్తానూ! సిగ్గన్నా లేదు సిగ్గులేని మొహానికి. పోలీసాళ్ళు పట్టుకెళ్ళిరగొట్టినా బాగుండేది!"

ధనియా యేదో వొకసాకు చెప్పి, తప్పించుకోనేందుకు వీలులేకపోయింది. "ఇంట్లో గింజన్నమాట లేకపోతే యింకా వంటేంవండుతానూ! మీ బావ వూళ్ళోళ్ళవాళ్ళకే కట్టబెట్టాడుగా పండిందంతా. ఇప్పుడింటో బిడ్డలు చచ్చినా తొంగిచూచే వాళ్ళుగూడా లేకపోయారు" అన్నది.

ఈ యేడు పున్ని పొలం బాగానే పండింది. ఇదంతా బావ చలవవల్లనేనని పున్నికిగూడా తెలుసు. హీరా వుండగా యింతపంట యెప్పుడూ యింటికి తెచ్చిన పాపాన పోలేదు.

"మా యింటికి పంపితే యిచ్చేదాన్నిగా. అదీ బావ సంపాదించిందేగా! బాగా వుండప్పుడు పోట్లాడుకోవచ్చులే పోట్లాటలు; కలిసి రానప్పుడు, అందరంవూం కలిసేడిస్తేనేగాని గడవదు. నాకేంవీం తెలవదనుకుంటున్నావేమో; బావ లేక పోతే నాగతి కుక్కలుగూడా చూచేయికాదని తెలుసు నాకూనూ" అన్నది పున్ని.

వచ్చింది వచ్చినట్లు, సోనాని వెంటబెట్టుకొని వెళ్ళింది పున్ని. వెళ్ళి ఒక్కనిమిషంలో రెండు పళ్లెకల ధాన్యం పట్టు కొచ్చి వాకిట్లోపెట్టింది. ధనియా యేమందామూఅని ఆలో చిస్తూండగానే మళ్లీవెళ్లి యింకో బుట్టెడు కందిపప్పు పట్టు కొచ్చింది. "నేను పొయ్యిరాజేస్తాలే పద !" అంటూ వంటింట్లో కెళ్లింది.

ధనియా దగ్గరకెళ్లి బుట్టలు చూసింది. ధాన్యంమీద నాలుగైదు సేర్ల పిండిగూడావుంది వొక పెద్ద పళ్లెంలో. ఇప్పటికి

తెలిసివచ్చింది ధనియాకి. కృతజ్ఞత, ప్రేమ నిండిపోయినయి ఆవిడ హృదయంలో. "అంతా యిక్కడికే యెత్తుకొచ్చావా, యింకా యింట్లో యేవఁన్నా వుంచావా? యేవంత ముంచుకు పోయిందనీ..." అంటూ నిందాకులయ్యింది.

వాకిట్లో, వుయ్యాల మంచంలో పండుకున్న బిడ్డ గుక్క పెట్టి యేడుస్తున్నాడు. వెళ్ళి బిడ్డని వళ్ళోకెత్తుకుని, వోదారుస్తూ "యేదోలే అక్కయ్యా. నీ పుణ్యావాఁ అంటూ బాగానే పండిం దిగా యీ యేడు. రొండిళ్ళూ గడుస్తన్నొ. నీకు తెలవందేఁవుంది. అంతాగ్గాకపోతే దేఁవుఁడే వుండాడు పైన!" అన్నది పున్ని.

ఝునియావచ్చి, పిన్నత్త కాళ్ళు తాకింది; పిన్నత్త ఆశీర్వదించింది. పొయ్యి రాజేసేందుకని సోనా వెళ్ళింది; రూప నీళ్ళు తెచ్చేందుకు బొక్కెన పట్టుకుంది. ఆగిపోయిన బండి మళ్ళీ బయల్దేరింది.

"అయితే బావయ్య ఆ 'తప్పు' యివ్వటఁవెందుకూ?" అనడిగింది పున్ని.

"ఇరుగూ పొరుగూఅని వుందగా మరి!" అన్నది ధనియా.

"వొక మాటంటాగాని, యేఁవీ అనుకోకుండా వుంటావా అక్కయ్యా."

"అదేఁవిఁటే? చెప్పు!"

"ఎందుకులెద్దూ, నీకోపం వస్తందేఁవోఁ!"

"రాదంటన్నాగా, చెప్పు."

"ఏఁవఁన్నా అను. ఝునియాని యింట్లోపెట్టుకోకుండా వుండాల్సింది."

"ఏం చెయ్యాఁవన్నావే?" లేకపోతే యెందుట్టోనన్నా పడి చచ్చిపోయ్యేదే."

"నాయింటో పెట్టుకుంటే నన్నెవ్వరూ యేఁవీఁ అనే వారుకాదుగా?"

"ఆఁ! ఆమాట యివ్వాళంటన్నావుగాని అప్పుడే పంపిస్తే చీపురుకట్ట పుచ్చుకునే దానివి."

"అది గాదు. ఈ 'తప్పు'కిచ్చినదంతా పెడ్తే గోవర్ పెళ్లే అయ్యేదిగా అంటా."

"కర్మ నెవళ్ళు తప్పిస్తారే పిచ్చిదానా? అంతట్తో ఐపోయిందనుకున్నావా? భోలా ఆవు డబ్బిమ్మంటన్నాడు. అప్పుడేఁవోఁ మనువు చూడు; డబ్బు సంగతి తర్వాత చూద్దాంలే అన్నాడు. ఇప్పుడేఁవోఁ మనువూవద్దు గినువూవద్దు. డబ్బు తెమ్మంటన్నాడు. కొడుకులిద్దరూ కర్రలు బుజానపెట్టుకుని తిరుగుతున్నారంట. యేఁవంటూ వచ్చిందోకాని ఆ పాడు ఆవు కొంపంతా గుణ్ణఁవేఁసి పోయింది."

ఇంకో నాలుగు మాటలాడి, నిప్పట్టుకుని, వెళ్లిపోయింది పున్ని. హోరీ యింట్లోకొచ్చి "యెన్ని చెప్పినా పున్ని మంచిదేనే!" అన్నాడు.

"హీరామాత్రం మంచాడు కాదేంటి?"

ధనియా, పున్ని తెచ్చినవన్నీ యింట్లో పెట్టుకోవటం అయితే పెట్టుకుందిగాని దుగ్ధపడుతూనే వుంది యీ నాటికిట్లా తన చేయి క్రిందయిందిగదాఅని.

"ఎంత సహాయం చేసిందనైనా ఆలోచించవేమే!"

"ఏం? యేం సాయం చేసింది. నా మొగుడు కష్ట పడ్డాడేవో పట్టుకొచ్చిచ్చింది. అయినా నేనేవన్నా వూరికినే తీసుకున్నానా. దాంది దానికి గింజల్లెక్క పెట్టి తీర్చెయ్యనూ?"

పున్నికీ తెలుసు తోడుకోడలు ఆలోచనలు. అయినా బావ మొహంచూచి, వీళ్లింటికేమీ లోటులేకుండా జరుపు కొస్తూనేవుంది. ఇచ్చినవి ఐపోగానే మళ్ళీ రెండు పల్లికెలు తెచ్చి యిచ్చింది. కాలం గడచింది. వర్షాలు పడలేదు. శ్రావణమాసం వచ్చింది. ఎండ మండిపోతోంది. నూతుల్లో నీరుగూడ యింకిపోయింది. చెఱకు పొలాలు యెండి, మాడి పోతున్నాయి. నదిలో కొద్దిగా నీళ్ళున్నాయిగాని, ఆ నీళ్ళ కోసం మెదిత్తే కర్రలు లేస్తున్నాయి. చివరికి నదిలో నీళ్ళు గూడా ఐపోయినయి. ఎక్కడ చూచినా దొంగతనాలు యెక్కువైనవి. దేశంఅంతా హాహాకారాలు చేస్తోంది. ఎట్లాగో భాద్రపదం వచ్చింది. వర్షాలు కురిసినయి. రైతుల ప్రాణాలు పచ్చబడినయి. ఆనాటి ఆనందాన్ని వర్ణించలేం. నేల నోరు నిండింది. రైతులు మొహరీలు కురిసినట్లు యెగిరి గంతేశారు. ఎండి బీటలువారిన పొలాలన్నీ నీటితో నిండినయి. ఎక్కడ చూచినా వొకటే నాగళ్ళు. పిల్లలు జట్లు జట్లుగా బయల్దేరారు చెరువుల్నీ, నూతుల్నీ తనిఖీ చేసేందుకు. చెరువు సగంపైగా నిండిపోయింది.

కాని వర్షం యెంతకురిస్తేమాత్రం యేంలాభం. చెఱకు పంట యెట్లాగో పాడైపోయింది. మిగతా చిల్లరపంటలు పండినా వొకటే; లేకపోయినా వొకటే. ఆ పంటల్తో తిండే తింటారా; అప్పులే తీరుస్తారా? ఏదోకాస్త పశువులకు

మాత్రం యిబ్బంది లేకుండా పోయింది. గ్రుడ్డిలో మేలన్నట్లు పశువులకుమాత్రం కావలసినంత గ్రాసం దొరికింది.

మాఘమాసం వచ్చింది; వెళ్లింది. భోలాకివ్వవలసిన మొత్తం యింకా చెల్లించలేదు హోరీ. ఒకనాడు భోలా సరాసరి హోరీయింటికి వచ్చాడు. వచ్చి, "యిదేం బుద్ధయ్యా నీకు? పంటొచ్చింతర్వాత జమకడ్తానన్నావుగా బాకీ. పంట రానూవచ్చింది; అయ్యాపోయింది. తే, నా డబ్బు నాకు పడెయ్యి" అని కేకలేశాడు.

తన కష్టాలన్నీ చెప్పుకున్నాడు హోరీ. బ్రతిమలాడాడు. ససేమిరా అన్నాడు భోలా; ఇంటిముందునుండి కదలనేలేదు. హోరీకిగూడ విసుగెత్తింది. "సరేనయ్యా నా దగ్గిర కాండబ్బు కూడాలేదు. అప్పాపుట్టదు నేనడిగినాగూడా. ఏంచెయ్య మంటావన్నా? నమ్మకం కలక్కపోతే వచ్చి యిల్లంతా వెదుక్కో. యేంవుంటే అది పట్టికెళ్ళు" అంటూ కసురుకున్నాడు.

"నే నెందుకు జొరబడతాను నీ యింటోకి? నా కదంతా యెందుకు? పంటందింతర్వాత డబ్బిస్తానన్నావు. పంటొచ్చింది; నా డబ్బు నాకిట్టాపడేస్తే నాదారి న్నేపోతా."

"సరే. నీ యిష్టం యేంచెయ్యమంటావో నువ్వేచెప్పు."

"నేను చెప్పటంవేంటి?"

"నీ యిష్టం!"

"అయితే ఆ యెద్దుని రొంటినీ తోలిపెట్టు."

తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు హోరీ. ఆశ్చర్యంగా చూశాడు భోలావంక. ఏమీ అనలేక తల వంచుకుని

కూర్చున్నాడు. తనని అన్నివిధాలా సర్వనాశనం చేసి, బికారిని చేసిగాని, వదలడా యేమిటి యీ భోలా? రెండెడ్లూ వెళ్లిపోతే యింకా అతను చేసేదేముంది? రెండు చేతులూ విరగ్గొట్టుకున్నట్లే.

"ఎడ్లని రెంటినీ తోలికెళ్లితే నేనేంగాను; సర్వనాశనంవేఁ; న్యాయంవఁనుకుంటే అట్లాగే నీయిష్టం వొచ్చినట్లేకానీ."

"నువ్వేఁవైతే యెవడి క్కావాలి? నా డబ్బు నా క్కావాలి."

"నీ డబ్బు నీకిచ్చేశానంటే యేంచేస్తా?"

ఇప్పుడు భోలా నమ్మలేకపోయాడు తన చెవుల్ని తాను. హోరీ యింత మోసం చేయగలడని కలలోగూడ అనుకోలేదతను.

"సరే నువ్వు చెరువులో దిగి, అట్టాగే ప్రమాణం చెయ్యి నే నొప్పుకుంటా" అన్నాడు భోలా కోపంవచ్చి.

"అట్లా చెయ్యాలనే అనిపిస్తాంది. చెయ్యకపోతే చస్తానాయె...అయినా నేనట్లా మోసం చెయ్యదల్చుకోలేదు."

"నువ్వు చచ్చినా చెప్పలేవామాట."

"నిజంవేఁ బాబూ. చచ్చినా చెప్పలేను. నా వల్లగాదు. నిజంవేఁ! వూరికే, గమ్మత్తుగా అన్నా."

కాస్సేపిలాగా, వెనకాముందూ ఆడాడు హోరీ. "నేనంటే యింత పగెందుకు చెప్పు నీకు? ఝునియాని నాయింట్లో పెట్టుకుంటేమాత్రం నాకు వొరిగిందేఁవుంది చెప్పు. చెట్టంత కొడుకు దేశాలపాలాయె; రెండొందలపైగా జుల్మానా చెల్లించాల్సొచ్చె. మా అబ్బాయి మీవూరొచ్చి చేసినపని

నాకు తెలుసో, లేదో, భగవంతుడికే తెలుసు. వాడక్కడ కొచ్చి పాటలూ, బూటలూ నేర్చుకుంటన్నాడేమో ననుకున్నా నేను. ఝునియా యింటికొచ్చేదాకా నాకు వాడింత కాండ జరుపుతున్నాడని తెలియనేలేదు. అర్థరాత్రికాడ వచ్చిందాన్ని నేను కాదంటే యేమైపొయ్యేదో నువ్వే ఆలోచించు. ఎందుకూ పనికిరాకుండా పోయేది" అన్నాడు హోరీ.

తలుపుచాటున నిలబడి, యీ సంభాషణంతా వింటూనే వుంది ఝునియా. తండ్రి, తండ్రిగాలేడు; శత్రువులాగున్నాడు. ఎడ్లని యిచ్చేస్తాడేమో హోరీ అని భయపడింది. లోపలికి వెళ్లి రూపని పిలిచి, "అమ్మని యిక్కడున్నట్టు రమ్మనిచెప్పు. తొందర పనుందనిచెప్పు. వెళ్ళమ్మా, తొందరగా రావాలి మళ్ళీ" అని పంపింది.

పొలంలో పేడవేసేందుకని వెళ్లింది ధనియా. కోడలు పెట్టిన కబురందగానే యింటికి వచ్చింది. "ఏంవిఁటే? అంత గాబరా పెట్టావు? ఎందుకూ పిలిచావంట?" అనడిగింది కోడలిని.

"మా అయ్యొచ్చాడు, చూచావా?"

"చూడకేఁ? వాకిట్లో కూచ్చునున్నాడుగా యములా డికిమల్లే. నేను పలుకరించలేదులే."

"మనెడ్లని తోలిపెట్టాలంట అప్పుతీర్చటానికి!"

ప్రేవులు తోడినట్లయ్యింది ధనియాకి.

"యెడ్లు రెండూ కావాలంటన్నాడా?"

"ఊఁ. యిస్తే డబ్బియ్యి; లేకపోతే యెడ్లని తోలికెళ్తా నంటన్నాడు."

"మీ మామేం ఏమన్నాడు ?"

"నీకు న్యాయమనుకుంటే అట్లాగే తోలుకెళ్లు అన్నాడు."

"తోలికెళ్లమను. మళ్లీ వచ్చి నా గుమ్మం దగ్గిరే బిచ్చం వడుక్కోపోతే నా పేరు మారుపేరుపెట్టు. మా వుసురు పోసుకుని యెంతకాలం బ్రదుకుతాడో అది చూస్తాగా" అంటూ ఆ ఆవేశంలోనే బయటికివచ్చింది.

వచ్చి, హోరీమీద లేచింది. "ఎడ్లని తోలిపెట్ట మంటాంటే ఇంకా చూస్తావెందుకు తోలిపెట్టక. ఆయన కడుపు చల్లబడనీ; మన తిప్పలు మనంపడదాం. దేవుడిచ్చిన కాళ్ళూ, చేతులూ వున్నెగా, యేం ఫర్వాలేదు. ఇప్పట్దాకా మన పొలంలో చాకిరి, చేసుకుంటన్నాం. రేపట్నుంచీ వాళ్ళోళ్ళ పొలాల్లోకెళ్దాం కూలికి. అదృష్టం బాగా వుంటే మళ్ళీ కొను క్కుందాం యెడ్లు. కూలిచేస్తే నామోషీ యేంవుందిలే. ఆదికున్మా మాలినావు యేవంటా అడుగుపెట్టిందో దొడ్లో; కొంపంతా గుణ్ణం వేసిపోయింది."

ఇంతవరకూ దాచివుంచిన అస్త్రాన్ని బయటికి తీసేం దుకు ఝోలా కవకాశం చిక్కింది. ఎడ్లు తప్పితే, వీళ్ళకిక ఆధారం యేమీ లేదు; ఆ యెడ్లని రక్షించుకునేందుకేమైనా చేస్తుంది యిప్పుడీ కుటుంబం. "మాకింత తలొంపులు తెచ్చిం తర్వాత మీరుమాత్రం సుఖంగా యెట్లావుంటారు ? రొండొందలు జుల్మానా చెల్లించాంవంటారు మీరు. మా మర్యా దంతా పోలా ? లక్షరూపాయల మర్యాదా మట్టిలో గలిపారు మీరు. ఇప్పుడైనాసరే మీరు ఝునియాని వెళ్ళగొడ్తే సెయ్యండి, నేను యిక ఆవుమాటా యెత్తను. నాకు యెడ్లూ

వద్దు; డబ్బూ వద్దు; అది నాకొంప నిలువునాకూల్చింది. అది గూడా చెట్టునా, పుట్టాబడి తిప్పలుబడతాంటే చూస్తేగాని నాగుండె చల్లబడదు. అది నేకన్నకూతురు. దానికేవీఁ లోపం చెయ్యకుండా, మొగబిడ్డలకంటే యెక్కువగా చూచుకుంటూ వచ్చా. ఏం లాభం? అటేడుతరాలూ, యిటేడుతరాలూ తలెత్తుకునేపారం లేకుండాచేసింది. అదట్టా దిక్కులేకుండా పోతేనే నాకూ యేఁవన్నా శాంతి. కన్నకడుపుని నేనే యింతింత మాటలంటూంటే, మీరే ఆలోచించుకోండి నాకెంత కష్టం కలిగితే యింత మాటలంటానో. మీరు దాన్ని యింటో పెట్టుకుంటే నారొమ్ముల్లో చిచ్చు పెట్టినట్టుంది" అన్నాడు భోలా.

ధనియా కుండపగలగొట్టినట్లు చెప్పింది. "అయితే నామాటగూడా వినవయ్యా. నువ్వు చెప్పేమాట చచ్చినా వినం మేం. నువ్వు నూరు జన్మలెత్తినా వినం. ఎందుకొచ్చిన మాటలుగాని యెడ్లని తోలికెళ్ళిపో. నిన్నొద్దంటం లేదుగా; ఎడ్లని తోలికెళ్తే నాశనమైన గౌరవం మళ్ళీ నీకెట్లావస్తుందో నేనూ చూస్తాగా; ఏడుతరాలూ బాగుపడ్డాగాన్లే; తోలి కెళ్ళు. ఝునియా చేసింది తప్పని నాకూ తెల్సు. ఆ వాళింటి కొస్తే చీపురుకట్ట పుచ్చుకున్నా నేనూనూ; దాని కళ్ళల్లో నీళ్ళు చూచేప్పటికి నీరు నీరైపొయ్యాగాని. ఇన్నేళ్ళొచ్చినై. తల ముగ్గు బుట్టింది; నీకే కావాలే మారుమనువు; అదింకా పసి బిడ్డేగా? దానికి పెళ్ళిగావాలంటే వచ్చింది యెక్కల్లేని తలొంపు!"

"వింటన్నావా బాబూ మాటలు? ఇక నాతప్పేంవీఁ లేదు. ఎడ్లని తోలుకెళ్ళక తప్పదు!" అన్నాడు భోలా, హోరీతో.

"తోలుకెళ్ళు" అన్నాడు హోరీ, వెనుదీయకుండా.

"మళ్ళీ తర్వాత తోలుకెళ్ళాడని నన్నంటే లాభంలేదు. ఇప్పుడే చెబుతున్నా."

"నిన్నెందుకంటాను."

భోలా వెళ్ళి యెడ్లపలుపు(త్రాడులు విప్పాడో లేదో, ఝునియా బిడ్డని చంకనెత్తుకునీ బైటకొచ్చింది. వచ్చి, తండ్రి దగ్గరకెళ్ళి "నేనే పోతాలే యీ యింటోనుంచి. నువ్వన్నట్టు నేనే అడుక్కుతింటాలే. అంతగా బతకలేకపోతే నేనూ, యీ పసిగుడ్డూ కలిసి యెందుట్లోనన్నాపడి చస్తాం. నీకూ అదేగా కావాల్సింది!" అన్నది.

"ఛా! ఫో! అవతలికి. నీ మొఖంచూస్తేనే పట్టుకుంటంది శని. ఫో! ఎందుట్లోనన్నా పడిచస్తే పీడన్నావొదిలిపోతంది" అన్నాడు భోలా అంటరానివాళ్లని చూచినట్లు చూస్తూ.

అంతే, అతన్ని కన్నెత్తిగూడా చూడలేదు ఝునియా. కోపంతో వుడికి పోయింది. ఆ కోపంలో పగలేదు; ద్వేషంలేదు. ఆ కోపానికి తన ఆత్మనే ఆహుతి చేసుకోదలచుకుంది. అప్పుడే గనక భూమి బ్రద్దలై, దారినిస్తే, సంతోషంగా ప్రవేశించేది భూగర్భంలోకి. ఝునియా ముందుకు నడచింది.

రెండడుగులు వేసిందో లేదో, పరుగెత్తికెళ్ళి, ఝునియాని పట్టుకుని ఆపింది ధనియా. "అెకెక్కడికి? యింటోకి పదవేఁ? ఈ యిల్లు నీది. మేం బ్రదికున్నంత కాలంవూఁ నీదే యీయిల్లు;

మేం చచ్చింతర్వాతా యీ యిల్లు నీదే. నువ్వెందుకూ మునిగి చావటం? నా బిడ్డల్తో వైరంపెట్టుకున్నాడే చస్తాడ్లే యెందుట్లో నన్నాపడి! తోలుకెళ్లమను యెడ్లని; తోలుకెళ్లి యెదానేసుకోమను..."

"నన్ను కన్నతండ్రే ఆ మాటలన్న తర్వాత నేను బ్రదికి మాత్రం యేంలాభంమ్మా! నా మూలానేగా మీకీ యిబ్బందులన్నీ. పాపిష్ఠిదాన్ని యేమంటూ అడుగుపెట్టానో మీకన్నీ కష్టాలే. నా కన్నతల్లిగూడా చూచేదిగాదు మీరీ నాలుగు రోజుల్నుంచీ నన్నుచూచినట్లు. దేవుడు మళ్లీ జన్మయిస్తే నీ కడుపునే పుట్టాలని కోరుకుంటూ నేను" అంటూ యేడ్చింది ఝునియా.

"నిన్ను కన్నతండ్రా? కాదమ్మా! కాదు. వఠి కర్కోటకుడు. నీ మీద పగపట్టాడమ్మా పాపిష్ఠిమల్లే. మీ అమ్మంటే, కన్నకడుపుకాబట్టి తరుక్కుపోయేదేమో. మారు మనువు చేసుకోమను; వచ్చింది, వంగదీసి గుద్దితేనేగాని తెలవదులే" అంటూ యింట్లోకి రమ్మంటూ ఝునియాని లాగింది ధనియా.

అత్త వెనకేబడి, యింట్లోకి వెళ్ళిపోయింది ఝునియా. భోలా వెళ్లి, ఎడ్లని రెంటినీ విప్పి, పలుపుత్రాళ్లు చేత్తో పట్టుకుని, యింటిముఖంపట్టాడు; కాని హుషారుగా లేడు. విందుకని వెళ్లి, లడ్డూలకి బదులు చెప్పుదెబ్బలు తిని వచ్చినట్లుంది. సరే యిక చెయ్యమను వ్యవసాయం; తెలిసొస్తుంది; ఎందుకు పట్టాడో నామీదింత పగ? ఎందుకు నన్నిట్లా అవమానించటం? లేకపోతే అట్లాంటి ఆడదాన్ని యీ పెద్దమనిషైనా యింట్లోకి రానిస్తాడా? ఛీ! ఛీ! సిగ్గంటూ లేకుండాపోయింది.

కొడుక్కేకక్కడా పెళ్ళిగాలేదుగాదూ? అందుకని! ఈ లంజని ఝునియానే చూడరాదూ! సిగ్గన్నా లేకుండా వచ్చి నాముందు నుంచోంది; ఇంకోళ్ళైతే యింత తతంగం జరిగింతర్వాత వచ్చి మొకం చూపించేదేనా? వీళ్ళకుక్కాడా బుద్ధిలేకండా పోయిందేఁ? అది కన్నతండ్రింట్లోంచే లేచిపోయొచ్చిందే, వీళ్ళింట్లో వుంటుందా? కాలఁవేఁ అట్లావుంది; గాని లేకపోతే ఆ ధనియా కొప్పు పట్టుకొని, నడిబజార్లో పడేసి, బరబరా లాగే వాడినిగాదూ? ఎన్ని మాటలంది! ఎన్ని మాటలంది!

వెనబడి వచ్చే యెడ్లని చూచాడు భోలా. మంచి జత. ఎట్లా లేదన్నా వందరూపాయల కమ్ముకోవచ్చు. హోరీ యివ్వ వలసింది యెనభయ్యేగా!

ఇంకా వూరిపొలిమేరగూడ దాటలేదు భోలా. ఇంతలోనే పటేశ్వరి, శేఖర్ యింకా వొక యిరవైమంది పైచిల్లర వెనక పరుగెత్తుకురావటం చూచాడు. భోలాకు భయంవేసింది. ఇదేదో దాడి జరిగేట్లుంది. యెడ్లకి యెడ్లూ దక్కేట్లు లేవు; వీపూ చదునయ్యేట్లుంది. ఆగి, నడుం బిగించాడు. అంత చచ్చేరోజే వస్తే, వూపిరున్నంతసేపూ పోట్లాడే చావవచ్చు.

శాస్త్రిగారు దగ్గరకొచ్చాడు. "ఏవిఁటోయ్ భోలా? ఆఁ! ఈ అనర్థప్పనులేవిఁటంట? మాలావు నువ్వుకాబట్టి యెడ్లని తోలుకురాగలిగావ్ అనుకుంటున్నావా యేవిఁటి? యెవళ్ళ పనుల్లో వాళ్ళుండబట్టి సరిపోయిందిగాని, లేకపోతే హోరీ వూఁ అని వొక్కసారంటే సున్నంలోకి యెముకలేకండా తన్నేవారు నిన్ను; తెలుసునా? ఇప్పటికైనా బాగుపడదలచు

కుంటే, వెనక్కి తోలుకెళ్ళి, మళ్ళీ ఆవాళ్ళోనే కట్టేసెయ్యి" అన్నాడు.

"హోరీ మంచాడనేగదయ్యా నువ్వింతపని చేసింది? నీకు డబ్బివ్వాలిసుంటే కోర్టులో దావావెయ్; డిక్రీపొందు. అంతేగాని యెడ్లని తోలుకురావటానికి నీకు హక్కేవుంది. ఇప్పుడు నీ మీద కేసుపెడ్తే యేంవౌతుందో తెలుసా?" అన్నాడు పటేశ్వరీలాల్.

"అదికాదు బాబుల్లారా! నేనుమాత్రం వేంజబర్దస్తీ చేశాను? హోరీ సొంతంగా తోలుకెళ్ళమని అన్న తర్వాతేగా నే తోలుకొచ్చింది?" అన్నాడు భోలా యెంతో వినయంగా.

"శేఖర్! యెడ్లని తోలుకెళ్ళు నువ్వు. ఎడ్లని తోలు కెళ్ళమంటూ రైతే చేతులారా అప్పజెప్పితే యింకా వ్యవసాయం యేంసాగుతుంది" అన్నాడు పటేశ్వరి.

భోలా యెడ్లకి అడ్డంవచ్చి, ఎడ్లముందు నిలబడి "నా డబ్బు నాకిప్పించండి; యెడ్లనేంచేసుకుంటా న్నేను?" అన్నాడు.

"మేం యెడ్లని తోలికెళ్ళేనిమిట్టుకు ఖాయం. డబ్బు కావాలంటే దావావేసుకో. అంతేగాని యింకేంవన్నా పిచ్చే పాలు వేశావంటే దెబ్బలు తినగలవు. నువ్వేంవన్నా రొఖం యిచ్చావంటయ్యా డబ్బు కావాలంటానికి? ఎందుకూ పనికి రాని ఆవు నాయనకంటగట్టి, ఇప్పుడెడ్లని తోలుకెళ్ళటాని ?"

భోలా కదల్లేదు; మాట్లాడకుండా, నిబ్బరంగా నిలబడ్డాడు, స్తేనే గాని కదలనుఅంటూన్నట్టు.

ఇంతలో శాస్త్రి వొకడుగు ముందుకువేసి, వంగిన నడుము కాస్త నిటారుగాచేసి, గద్దించాడు: "యింకా అట్లా కళ్ళప్పజెప్పి చూస్తూ నిలబడ్డావెందుకు! నాలుగు తన్నక! మన వూళ్ళో అడుగుపెట్టి యెడ్లని విప్పుకుపోతాడూ?"

వంశి, మంచి బలమైన పడుచువాడు. అతను ముందుకు వచ్చి, భోలాని వొక తోపుతోశాడు. భోలా నిభాయించుకో లేకపోయాడు; క్రిందపడిపోయాడు. మళ్ళీ లేవబోయేప్పటికి వంశీ వీపుమీద వొక గ్రుద్దు గ్రుద్దాడు.

హోరీ పరుగెత్తుకొచ్చాడు. భోలా హోరీని చూస్తూ "నిజం చెప్పు బాబూ! నీయెడ్లని బలవంతంగా తోలుకొచ్చానా నేను?" అనడిగాడు.

భోలా మాటలకు శాస్త్రి తాత్పర్యం చెప్పాడు. "హోరీ యిష్టపడి తోలిపెడ్తేనే తోలుకొచ్చాటట్ట యీ పెద్దమనిషి! మమ్మల్నే గాడిదల్ని చెయ్యాలని చూస్తున్నాడులావుంది."

హోరీ సందేహించాడు. "ఝునియా నింట్లోనుంచెళ్ళ గొట్టావా? నాడబ్బు నా కిస్తావా? అంటూ వచ్చాడు. లేకపోతే యెడ్లని తోలికెళ్తానన్నాడు. నేను అమ్మాయిని చచ్చినా వెళ గొట్టనన్నాను. నాదగ్గర డబ్బు లేదన్నాను. నీకు న్యాయం అను కుంటే యెడ్లని తోలుకెళ్ళమన్నాను. నీకు న్యాయం అనుకుంటే అన్నాను; యెడ్లని తోలుకొచ్చేశాడు" అని అన్నాడు హోరీ.

పటేశ్వరి మొహం వ్రేలాడవేశాడు. "నువ్వు న్యాయానికి వదలిపెట్టేశావుగా. ఇంకా ఇందులో జబర్దస్తీ యేముంది?

న్యాయం అనుకున్నాడు; తోలుకెళ్తన్నాడు. కాదని యెట్లా అనగలం? తోలుకెళ్ళు బాబూ! ఎడ్లు నీవేలే."

శాస్త్రికూడ పటేశ్వరీని బలపరచాడు. "అంతే మరి! న్యాయానికి వదిలిపెట్టేసింతర్వాత మనమేం మాట్లాడగలం?" అన్నాడు.

వూళ్లో వాళ్ళందరూ 'యెంత తెలివితక్కువ్వాడవోయ్' అన్నట్లు చూశారు హోరీవంక. ఎవరి దారిని వారు వెళ్ళిపోయారు వూళ్లోకి; భోలా గెలిచాడు. వీరుడిలా రొమ్ము విరుచుకుంటూ తోలుకెళ్లిపోయాడు యెడ్లని!

# 13

తన యిలాకాలో గల్లంతు జరిగిందనీ, నలుగురు పెద్దలూ కలిసి హోరీకి జరిమానా వేశారనీ జమీందారుగారి చెవిలోగూడ పడింది. విషయం తెలియగానే నోఖేరాంకు కబురుపెట్టాడు జమీందారు; పిలిపించి యెడాపెడా నాలుగు చీవాట్లు పెట్టాడు—తన కీవిషయం యెందుకని తెలియజెయ్యలేదు! ఇట్లాంటి మోసగాళ్ళకీ, కృతఘ్నులకీ, తన దర్బారులో వుండేందుకు అర్హతలేదు.

ఈ చీవాట్లు వింటూంటే నోఖేరాంకుగూడ మండెత్తింది—నేనొక్కడ్నే కాదుగా, వూళ్లో పెద్దలుగూడ వున్నారుగా, నా వొక్కడివల్లా యేమవుతుంది?

జమీందారు నోఖేరాం బొజ్జవంక చూచాడు; బల్లెంతో పొడుస్తాడా అన్నట్లు చూచాడు—ఇక చాల్లేవయ్యా! వదర బోకు. సర్కారుకి తెలియజెయ్యకుండా జరిమానా వసూలు చేసేందుకు వీల్లేదని, ఆనాడే యెందుకు చెప్పలేదు వాళ్ళతో? వూళ్లో పెద్దలకైతేమాత్రం నాకు తెలియకుండా నా రైతుల దగ్గర జరిమానాలు వసూలుచేసే హక్కెక్కడనుంచి వచ్చింది? ఈ జరిమానాలను మినహాయిస్తే యింక నాకుమాత్రం వచ్చే

రాబడి యేముంది? వసూళ్ళు ప్రభుత్వం పట్టుకుపోతుంది; రైతులు బాకీలు తీర్చరు. నేనేమైపోను? నేనేం తినను నీ తల కాయ! ఖర్చుకవ్వే లక్షల్లక్షలు యెక్కడనుండి తేను? ఇంతకాలంనుండి చేస్తున్నావీ నౌకరీ, నీకుగూడ చెప్పవలసి వస్తూంది. సరే, యెంత వసూలు చేశావేమిటి హోరీదగ్గర!

"ఎనభైరూపాయలు!" అన్నాడు నోఖేరాం చేతులు నలుపుకుంటూ.

"రొఖ్ఖమేనా?"

"అతనిదగ్గిర రొక్కం నెక్కడిదిలెండి బాబుగారూ. ఏదో కొంత పంటయిచ్చాడు; మిగతా దానికింద యిల్లు రాయించుకున్నాం."

జమీందారుగారిప్పుడు స్వార్థం వదలేశారు; హోరీ పక్షాన మాట్లాడారు—"ఉహుం! అదా సంగతి! ఐతే తమరూ, వూళ్లో పెద్దలూ కలసి, దొంగలు కలిసి వూళ్లు పంచుకున్నట్లు, నా జమీందారీలో వొక నమ్మకస్థుడైన ఆసామీని దోచుకున్నారన్నమాట. మీా కీఅధికారం యెవరిచ్చారట? తమర్నీ, ఆ దొంగపట్వారీని, ఆ వేషాలువేసే శాస్త్రిని, నేను తలచుకుంటే యేడేసి సంవత్సరాలు జైలుకు పంపించగలను. తెలుసా? ఇది చిన్నవిషయం అనుకుంటున్నారేమో. ఈ యిలాకాకి పాదుషాలంఐపోయాం అనుకుంటున్నారా మీారు? ఈ రోజు సాయంత్రం అయ్యేలోపుగా మీారు హోరీ దగ్గర వసూలు చేసిందంతా తీసుకొచ్చి యిక్కడ జమకడ్తే సరేసరి; లేకుంటే మిమ్మల్నందర్నీ జైళ్ళల్లో క్రుక్కించుతా. ఇక వెళ్లు. వెళ్లి హోరీనీ, హోరీ కొడుకునీ పంపు."

"హోరీ కోడుకూరాదిలి పారిపోయాడండీ. ఈ గల్లం తంత్రా జరిగిన్నాడే పారిపోయాడు" అన్నాడు నోఖేరాం భయపడుతూనే.

జమీందారుకి కోపంవచ్చింది. "నా ముందబద్ధం ఆడకు. అబద్ధాలంటే నాకు మంటని తెలియదూ నీకు? కోరినస్త్రీని యింటినుంచి లేవగొట్టుకొచ్చి, దారిమధ్యలో వదిలి పారిపోయే పడుచువాడుంటాడని నే నింతవరకెప్పుడూ వినలేదు. పారిపోవాలనుకున్నవాడా అమ్మాయి నెందుకు లేవదీసుకువస్తాడు? అతనట్లా పోయేందుకు మీరుగూడా యేదో వొకటి చేసివుంటారు; మీరు మేమేమీ యెరగమని ప్రమాణంచేసి చెప్పినా నమ్మేదిలేదు. మీరు మీ సంఘాన్ని రక్షించుకోవాల్నని అతన్ని బెదరించి వుంటారు. అందుకనే అతను పారిపోయి వుంటాడు. పాపం!"

నోఖేరాం కాదనలేకపోయాడు. యజమాని యేది చెబితే అదే రైటు. తమరు ఖుద్దున వచ్చి తెలుసుకోండి యేది నిజమో, యేది అబద్ధమోఅనిగూడ అనలేకపోయాడు. గొప్పవారికి కోపంవస్తే అంతేమరి. ఆ కోపానికి పూర్ణాహుతి కావలసిందే; ఎదురు పల్లెత్తుమాటగూడ అనేందుకు వీల్లేదు.

వూళ్లో పెద్దలకు వెళ్ళి చెప్పాడు నోఖేరాం. పాపం మానవులు తల్లడిల్లిపోయారు. ధాన్యంఅంటే వుందిగాని, వసూలుచేసిన డబ్బంతా అప్పుడే ఐపోయింది. హోరీ యిల్లు తాకట్టు వ్రాయించుకున్నమాట నిజమేగాని ఆ పల్లెటూళ్ళో ఆయిల్లు కొనుక్కునే వాళ్లెవరుంటారు? ఆ ఇల్లు హిందూ స్త్రీలాంటిది. భర్తతో వుంటే గృహలక్ష్మిలా, యజమానురాలిలా వుంటుంది హిందూ స్త్రీ. భర్తవదిలేస్తే యెందుకూ

కొరగానిదై పోతుంది. ఈ యిల్లూ అంతే. హోరీకైతే - యీ యిల్లే అతని సర్వస్వమూనూ, ఆ యింట్లోనుంచి హోరీ బయటకు నడిస్తే కాండబ్బుకుగూడ కొనేవాడుండడు. ఇక అటు చూస్తే డబ్బివ్వకపోతే వూరుకొనేట్లు లేడు జమీందారు. బహుశయీ హోరీయేవెళ్ళి జమీందారుగారిదగ్గర యేడ్చి వచ్చాడేమో. అందరికంటే యెక్కువగా పటేశ్వరీ భయపడిపోయాడు; అతని వుద్యోగం వూడినా వూడవచ్చును. నలుగురూ కూర్చొని ఆలోచించారు. ఈ విషమ సమస్య నెట్లాపరిష్కరించాలా అని; లాభం లేకపోయింది. నీది తప్పంటే నీది తప్పను కోవటంతోనే సరిపోయింది; ఒకటే పోట్లాట.

"నేను మొదటేచెప్పా మీ కందరికీ హోరీ విషయంలో మనం ఏమీ జోక్యం కలగజేసుకో వద్దని. ఇదెందుకు వచ్చిందో గాని వూరికేమాత్రం పోయేట్టులేదు. ఉద్యోగంకాస్తా వూడి వూరుకుంటుంది. తియ్యండి తలకొక యిరవై రూపాయీలు; ఇప్పుడన్నా గట్టెక్కుదాం. జమీందారేగనక రిపోర్టుచేస్తే మనపుట్టికాస్తా మునిగూరుకుంటుంది" అన్నాడు పటేశ్వరి.

శాస్త్రి బ్రహ్మతేజం వుట్టిపడేట్లు మాట్లాడాడు; "నా దగ్గర యిరవై రూపాయల మాటట్లావుంచి యిరవై దమ్మిడీలుగూడలేవు. బ్రాహ్మణులకు సంతర్పణ చేయించాను, హోమం అయిపోయింది. ఇదంతా ఖర్చుకాదూ! నన్ను జైలుకు పంపించుతారూ జమీందారుగారు? బ్రాహ్మణ్ణి; జమీందారు యిల్లు నాశనం చేయనూ? ఇంకా జమీందారు గారికి బ్రాహ్మల మజాఖా తెలియదులాగుంది."

ఝింగురసింగుకూడా యిదే ధోరణిలో మాట్లాడాడు. అతను జమీందారుకేమీ నౌకరుగాదు. హోరీని కొట్టలేదు, తిట్టలేదు, బలవంతం చెయ్యలేదు. హోరీ ప్రాయశ్చిత్తం చేసుకో దలచుకున్నాడు: అతనికా అవకాశం కలగజేశారు. ఇందులో తప్పేముంది?

కాని నోఖేరాంకు ఈ బెడద అంత తేలికగా తప్పేట్లు లేదు. ఇక్కడ కాలుమీద కాలు వేసుకుని కూర్చొని రాజ్యం చేస్తున్నాడు. జీతమంటే పదిరూపాయలుగాని, సంవత్సరానికి వెయ్యిపైగా పైపై రాబడి వుంటుంది. మరి యింతమంది మీద అధికారం. ఎప్పుడు చూచినా నలుగురు బంట్లు, పనిపాటలన్నీ 'వెట్టి'తో అయిపోయేవి. ఠాణేదారుగూడ కుర్చీయిస్తాడు. పాపం! మరి యిదంతాపోతే!

పటేశ్వరిని గురించి చెప్పే అవసరమేలేదు. ఏదో జమీందారుగారి ధర్మమా అంటూ యీమాత్రం వుద్యోగం దొరికింది. అదిగూడాపోతే అడిగేవాడు వుండడు. ఈ బాధ యెలా తప్పుతుందిరా భగవంతుడా అని రెండు మూడు రోజులు ఆలోచించాడు. చివరకొకదారి దొరికింది. అప్పుడప్పుడూ కచ్చేరీలో 'బిజలీ' అనే దినపత్రిక చూస్తూండేవాడు; ఆ పత్రికా సంపాదకుడికి జమీందారు తన యిలాకాలో రైతుల మీద జరిపే ఘోరఅత్యాచారాల్ని వర్ణిస్తూ వ్రాస్తే బాగుంటుందనుకున్నాడు; నోఖేరాంగూడ యిందుకు అంగీకరించాడు. ఇద్దరూకలిసి ఒక లేఖవ్రాసి, రెజిష్టర్ చేయించి, పంపివేశారు.

ఆ పత్రికకు సంపాదకుడు ఓంకారనాథ్. ఇట్లాంటి వుత్తరాలువెప్పుడువస్తాయాఅనికాచుకుకూర్చుంటాడాయన. లేఖ అందగానే జమీందారుకు తెలియజేశాడు; ఆయనకొక సంగతి తెలియవచ్చింది. నమ్మగూడదని అనుకొన్నాడు గాని ఆ లేఖ కుడు చూపే నిదర్శనాలను చూస్తే నమ్మకుండా వుండేందుకు వీల్లేకుండావుంది. ఎవరో ఒక రైతుకొడుకు ఒక వెధవ పిల్లను ప్రేమించి యింటికి తీసుకొచ్చాడని చెప్పి, జమీందారు ఆ రైతుకు జరిమానావేసినమాట వాస్తవమేనా? ఈ విషయం లోని నిజానిజాలు తెలుసుకొని, ప్రజాహితార్థం, ఆ లేఖను ప్రచురించి తన సంపాదక ధర్మాన్ని నిర్వర్తించుకోవలసి వుంటుంది; లేకుంటే కర్తవ్యాన్ని మరచిపోయినట్లౌతుంది. జమీందారుగారుగూడ ఆ విషయంలో యింకేమైనా చెప్ప దలచుకుంటే, ఆ జవాబునుకూడ ప్రచురించేందు కెట్లాంటి అభ్యంతరమూ లేదు. ఇదంతా అబద్ధం కావాల్ననే సంపాద కుని కోరిక; కాని అందులో యేమాత్రం సత్యమున్నా ప్రచు రించకతప్పదు; అది అతని ధర్మం. స్నేహం యిట్లాంటి సత్కార్యాలకి అడ్డురాగూడదు.

జమీందారుగారి కీసూచన అందింది; నెత్తీ నోరూ కొట్టుకున్నాడు. కోపంగూడ వచ్చింది. వెళ్ళి ఒక యాభై దెబ్బలు లెక్కపెట్టి, హంటరుతో కొట్టి, 'ఆ వుత్తరంతో పాటు యీ దెబ్బలవార్తగూడ అచ్చువేసుకో' అని అందామని పించింది; కాని రాగల పరిణామాన్ని వూహించుకుని ఆగి పోయాడు. ఆయన్ని కలుసుకునేందుకని వెంటనే బయల్దేరాడు

జమీందారు; కాస్త ఆలస్యమైతే, ఆ వృత్తం అచ్చైపోతే, గౌరవరంఅంతా గంగపాలైపోతుంది!

సైరుకువెళ్ళి, తిరిగివచ్చాడు ఓంకారనాథ్. సంపాదకీయం వ్రాద్దామని కూర్చున్నాడుగాని, మనస్సు పక్షిలా, గిరగిరా తిరుగుతోంది. గడచినరాత్రి భార్య అన్నమాటలు యింకా బల్లెల్లా గ్రుచ్చుకొంటున్నయి. 'దరిద్రుడనీ, దురదృష్టవంతుడనీ, నరితెలివితక్కువవాడనీ అంటే అతనికేమీ బాధ వుండేదికాదు. 'నువ్వు మగవాడివికాదు!' అంటే సహించటం కష్టమే నిజంగా మరి. అందులోనూ భర్త నామాటనేందుకు భార్యకేం హక్కుంది? పొరపాటున యెవరైనా ఆమాటంటే, భార్య వెళ్ళి ఆ మాటలన్నవాళ్ళనోరు మూయించాలి. నిజమే; నెత్తిమీదికి ఆపద కొనితెచ్చుకునే వార్తలు ప్రచురించడు; వాఖ్యాలు వ్రాయడు. ప్రతి అడుగూ వూది వూది, చాలా జాగ్రత్తగా వేస్తాడు. ఈ నెధవచట్టాల రోజుల్లో అంతకంటె ఎవరుమాత్రం ఏం చేస్తారు? ఐనా తెలిసి, తెలిసి పాముపుట్టలో చేతులు పెట్టేవాళ్ళెవరుంటారు? ఎంత జాగ్రత్తగా వున్నా, యింట్లోవాళ్ళకు బాధ కలగకూడదనేగదా! ఇంత జాగ్రత్తగా, ఓపికగా వున్నందుకు యిదా పురస్కారం? ఏమోనబ్బా! అంతా అంధకారంగావుంది. దగ్గర డబ్బులేదు; బనారస్ చీరలు కావాలంటే యెక్కడినుంచి వస్తవి? డాక్టరుగారి భార్య, ప్రొఫెసర్‌గారి భార్య, యింకెవళ్లెవళ్ల భార్యలో బనారసు చీరలు కట్టుకుంటే తనేం చెయ్యగలడు. ఖద్దరు చీర కట్టుకొని వాళ్ళందరికంటే గొప్పదాన్నని అనుకుంటే పోదూ? తానుమట్టుకు తాను యెంతగొప్పవాళ్ళ

దగ్గరకు వెళ్తూన్నా యిరవై నంబరు ఖద్దరు కట్టుకొని వెళ్తాడు; ఎవరైనా యేమైనాఅంటే, మొహం మాడేట్లు జవాబు చెప్పేందుకు సిద్ధంగావుంటాడు. భార్యలోగూడ ఆ ఆత్మాభిమానం యెందుకుండగూడదు? ఇతరుల ఆడంబరం చూచి అట్లా చలించిపోతే యెట్లా? 'నేనొక దేశభక్తుడి భార్యను' అని గర్వపడగూడదూ? దేశభక్తుడికున్న సంపదంతా ఆ భక్తేగదా! ఆ భక్తి మినహాయించితే అతనికింకా సంపద యేముంటుంది? ఇదే విషయాన్నిగురించి యివ్వాళ సంపాదకీయం వ్రాస్తే బాగుండును అనుకుంటూండగానే జమీందారు గారిని గురించి వచ్చిన లేఖవైపుకు మళ్లింది సంపాదక మహాశయుని దృష్టి.

జమీందారుగారేమని జవాబిస్తారో చూడాలి. ఆ వార్తలో సత్యంలేదని ఆయన ఋజువుచేసుకోగలిగితే సరేసరి; అట్లా కాకుండా వాత్తిడిపెట్టీ, భయపెట్టీ బెదరించీ ఓంకారనాథుణ్ని కర్తవ్య నిర్వహణాపథంనుంచి మళ్లించగలడని అనుకుంటే మాత్రం అది వాళ్లభ్రమ. ఇంత తపస్సు, సాధనచేసేది దేనికి? అవకాశం దొరికినప్పుడు యిట్లా చట్టుషిక్కరణ చేసేవాళ్ళ రహస్యాలన్నీ బయట పెట్టేందుకేగదా? జమీందారు గొప్ప యిన్ఫ్లుయెన్స్ వున్నవాడని తెలుసును: కౌన్సిల్లో మెంబరుగూడాను, అధికారులందరితోనూ పరిచయంవుంది. అనుకుంటే దొంగ సాక్ష్యాలు సృష్టించి, దొంగ కేసులు బనాయించ గలడుగూడ; రౌడీలకు చెప్పి, యే చీకటిమాటునో నాలుగు తన్నించనూగలడు. కాని ఓంకారనాథ్ యిట్లాంటివాటికి జడిసేమనిషి కాదు; కంఠంలో వూపిరి వున్నంతకాలం, అన్యాయాన్నీ, అధర్మాన్నీ తప్పక యెదుర్కుంటాడు.

ఇంతలోనే మోటరుకారు ధ్వని వినవచ్చింది. వెంటనే కాగితాలు ముందుకులాక్కొని సంపాదకీయం వ్రాయటం ప్రారంభించాడో లేదో, యింతలోనే జమీందారు గదిలో కాలుపెట్టాడు.

ఓంకారనాథ్ జమీందారుని ఆహ్వానించలేదు; కుశల ప్రశ్నలు వేయలేదు; కుర్చీ చూపించలేదు; ఒక నేరస్థుడు తన ముందుకొచ్చినట్లు చూచాడు జమీందారుని. "నా వుత్తరం అందిందా మీకు? అది వ్రాయవలసిన బాధ్యత నాకు లేక పోయినా వ్రాశాను. న్యాయంగా ఐతే నేనే విచారణ జరప వలసింది. కాని మొహమోటం వున్నప్పుడలాంటి సిద్ధాంతాలు యెంతోకొంత సడలించాల్సొస్తూవుంటుంది. సరే. ఆ వార్త నిజమైందేనా?" అని అధికారయుతంగానే అడిగాడు.

ఆ జాబు వాస్తవమేనని అంగీకరించకుండా వుండలేక పోయాడు జమీందారు. న్యాయాని కాసొమ్ము యింతవరకూ జమీందారుకు అందలేదు; నే నాసొమ్ము ముట్టుకోనంటూ యిప్పుడైనా జమీందారననవచ్చును; కాని అనలేదు. ఈ సంపాదక మహాశయుడి వ్యవహారంగూడా ఏమిటోచూస్తే బాగుంటుందనుకున్నాడు జమీందారు.

"ఐతే, చూచారూ, ఆ లేఖను ప్రకటించక తప్పదు. నా ప్రియమిత్రుల నొకర్నిలా దుయ్యబట్టటంఅంటే నాకూ మనస్కరించటంలేదు; ఐనా తప్పదు; నా కర్తవ్యం నేను చేయ వలసిందే. సంపాదకుడినయ్యీగూడ, నేనీకర్తవ్యాన్ని నిర్వహించక పోతే, యీ కుర్చీమీద కూర్చునే హక్కుని పోగొట్టుకున్నవాడి

నాతాను నేను" అంటూ తన విచారాన్ని తెలియజేశాడు ఓంకారనాథ్.

జమీందారు కుర్చీలో కూర్చుని, కాలుమీద కాలు వేసుకున్నాడు. తమలం నముల్తూ "మీరు చేయబోయే పని మీకు శ్రేయస్కరంకాదు. నాకయ్యే నష్టమేదో తర్వాతౌతుంది గానీ, మిమ్మల్ని తక్షణమే శిక్షిస్తారు. మీ మిత్రుల్ని మీరు గౌరవించకపోతే నేనూ అదేరకం మనిషినే. నా మిత్రుల్ని నేనూ కాపాడను!" అన్నాడు.

ఓంకారనాథ్ మృతవీరుడి పోజుపెట్టాడు: "నే నలాంటి వాటికెప్పుడూ జడవను. నేనీ పత్రిక్కి సంపాదకుణ్ణైనప్పుడే ప్రాణాలంటే వున్న వ్యామోహం వదలేశాను. అదీగాక సత్యం కోసమూ, న్యాయంకోసమూ ఆత్మబలిదానం చేయటంకంటే యింకా కావలసిందేముంది? అదే ప్రతి సంపాదకుడూ చేయాల్సని నా దృఢ విశ్వాసం!"

"సరే. మీ సవాలును నేనూ స్వీకరిస్తాను. ఇంతవరకూ మీరు నా మిత్రులనుకుంటూ వచ్చాను నేను. మీరు కయ్యానికి కాలుదువ్వుతున్నారు; నేనూ సిద్ధమే; మీ పత్రిక్కి ఐదు రెట్లు చందా దేసకిస్తూన్నాను నేను? నేను చెప్పినమాట వింటారనికాదూ? నేను జమీందారుగానూ, భాగ్యవంతుడ్ని గానూ వుండేందుకుకారణం భగవంతుడు; మీరుకాదు! అసలు చందా పదిహేనైతే నేను యాభై యిస్తున్నాను. దేనికి? మీరు నోరుకట్టుకుని కూర్చుంటారుగదాఅని. మీ రెప్పుడు వచ్చినా, దేనికని అడిగినా, చందాలకు చందాలు గుప్పిస్తున్నాను. సంవత్సరానికొక పాతిక సార్లైనా మిమ్మల్ని

విందుల కాహ్వానిస్తున్నాను. దేనికనుకుంటున్నారు? ఔనులెండి. మీకు లంచం పుచ్చుకుని, కర్తవ్య నిర్వహణ చేయటం తెలిసి వుండక పోవచ్చు."

"నే నెప్పుడూ లంచం పుచ్చుకోలేదు" అన్నాడు ఓంకార నాథ్ కోపంగా.

జమీందారు గద్దించి మరీ అన్నాడు: "ఇది లంచం కాకపోతే, యింకేది లంచం? తమరే తెలియజెప్పండి. మీరు తప్ప మిగతావారంతా గాడిదలనుకుంటున్నారా మీరు? మేం అందరం మీ పత్రికకయ్యే జమాఖర్చుల్లో లోట్లు భరించటం లేదూ? తియ్యండి మీ ఖాతా; నా యిలాకానుండి యెంత సొమ్ము జమైయ్యిందో లెఖ్ఖ చూడండి. వేలకువేలు వుంటుంది. స్వదేశీ, స్వదేశీ అని అరుస్తారు మీరు. మీ పేపరునిండా విదేశీ వస్తువుల యెడ్వర్ టైజ్‌మెంట్లు వేస్తారు దేనికి? సిగ్గు లేదూ! మీకు సిగ్గులేదుగాని, నా రైతుల దగ్గర సొమ్ము వసూలుచేసి నందుకు నేను సిగ్గుపడాల్నా? మీరొక్కరే రైతులకి న్యాయం జరిగేట్లు చూస్తున్నామని అనుకుంటున్నారులాగుంది. నాచావు బ్రతుకులన్నీ రైతులమీద ఆధారపడివున్నాయి. అలాంటప్పుడు వాళ్ళహితం నాకంటె యెక్కువగా కోరేవాళ్లెవరుంటారు? నేనూ బ్రదకాలిగదా! ఆఫీసర్లకు డిన్నర్లివ్వాలి. మా కుటుంబంలో వున్నవాళ్ళందరినీ - వందలమందిని - పోషించాలి. మాయింట్లో ఖర్చు యెంతవౌతుందో మీకు తెలుసు. ఇదంతా యెక్కడ్నుంచివస్తుంది? మాయింట్లో ఏమైనా చెట్టుందా డబ్బుకాసేందుకు? ఆసామీల దగ్గర్నుంచే రావాలిగదా? జమీందార్లూ, తాలూకాదార్లూ మహా

సుఖంగా బ్రతుకుతున్నారనుకుంటున్నారేమో మీరు. వాళ్ళ అసలు బ్రతుకు తెలియదు మీకు. మేం ధర్మాత్ముల్లా వుంటే వొక్కరోజుగూడా గడవదు. ఆఫీసర్లకు కానుక లీయక పోతే మా గౌరవం మర్నాడే వీధినిబడుతుంది. ఆసామీలని కష్టపెడితే మాకేం వొరుగుతుంది? మే మేమైనా తేళ్ళమా ఐన దానికీ, కానిదానికీ అందరినీ వడ్డిస్తూ కూర్చునేందుకు? మా మర్యాదల్నీ, సంప్రదాయాలనీ నిలబెట్టుకోవలసినబాధ్యత మాకుగూడా వుందంటారా, లేదంటారా? మా ధనంలో భాగం పంచుకోవాల్నని మీరు చూస్తున్నట్లే, మేం బంగారు గుడ్లనిపెడతామని కాచుకుకూర్చునేవాళ్ళు చాలామం దున్నారు. నా బంగళాకు రండి; మీకు చూపిస్తాను. ఒకడు కాశ్మీరు శాలువలూ, దుశ్శాలువలూ తీసుకోస్తాడు. ఒకడు భీమా కట్టమంటాడు. ఒకడు గ్రామఫోన్లు తీసుకోమంటాడు. ఇంకొకడు పుస్తకాలు కొనమంటాడు; పేపర్లకు చందాలు కట్ట మంటాడు. ఇక ధర్మాలూ, చందాలూ...చెప్పలేం. ఎంతమంది వస్తారో. వకుసబెట్టి పిళ్ళందరికీ నా కష్టగాథలు చెబుతూ కూర్చో మంటారా? నా గాథలు వినేందుకా వాళ్ళు వస్తూన్నది? ఎట్లా గోట్లా నన్ను వెధవనిచేసి డబ్బుగుంజుకోవాల్నని! పరం పరానుగతంగా వచ్చే సాంప్రదాయాల్ని వదలేస్తే, నలుగురూ కలిసి గేలిచేస్తారు; ఆఫీసర్లను డిన్నర్లకు పిలవకపోతే యెటి కెట్ తెలియదంటారు. అప్పుడు మీరు సంపాదకీయాలు వ్రాసి నన్ను సమర్థించగలరా? కాంగ్రెసులో ప్రవేశించాను; ఇంకా అందుకు శిక్ష అనుభవిస్తూనేవున్నాను. నా పేరుగూడా బ్లాక్లిస్టులో యెక్కింది! నే నెన్నిఅప్పుల్లో మునిగివున్నానో

యేమైనా తెలుసునా మీకు? అప్పుల వాళ్ళందరూ ఒకేసారి దండెత్తితే, నా చేతినివున్న ఈ వుంగరంకూడా మిగలదు! అయితే ఈ ఆడంబరంఅంతా దేనికి మీకని అంటారు మీరు. మీరే చెప్పండి. ఏడు తరాలనుండీ పెరిగానుగదా ఈ వాతావరణంలో; ఈనాడు వదలెయ్యాలంటే మాటలా? ఈనాడు వెళ్ళి నడుంవంచి పనిచెయ్యటం అసంభవం గాదూ? మీకంటే భూమిలేదు, ఆస్థిలేదు, మర్యాద మన్ననల్ని గురించి ఆలోచించవలసిన అవసరంలేదు; గనుక మీరు నిర్భయంగా వుండగలరు. ఇన్ని అవకాశా లున్నప్పటికీ మీరుగూడ నోరు నొక్కుకునే కూర్చుంటున్నారు. కోర్టుల్లో యెన్ని అన్యాయాలు జరుగుతున్నాయో, యెన్ని లంచాలు పుచ్చుకుంటున్నారో, ఎంతమంది బీదలు బాధలు పడుతున్నారో, యెంతమంది స్త్రీలు భ్రష్టలౌతున్నారో మీకు మాత్రం తెలీదూ? వీటినన్నిటినిగురించీ మీరు సంపాద కీయాలు వ్రాయరేఁ? ప్రమాణాలూ, సాక్ష్యమూ నేనిస్తానుగా."

ఓంకారనాథ్ కొద్దిగా మెత్తబడ్డాడు. "అవకాశం వున్నప్పుడు నేను మాత్రం యెప్పుడు వెనుకంజవేశాను?" అన్నాడు.

జమీందారుగూడా కొంచెం మెత్తబడ్డాడు; "ఒకటి రెండుసార్లు మీరు మగవాడిలా నిలబడ్డారని నేనూ అంగీక రిస్తున్నాను. కాని మీరు యెక్కువగా మీ లాభాన్నే చూచు కుంటున్నారుగాని ప్రజాహితాన్నిగాదు. మీరు కోపంతెచ్చు కున్నందువల్లా, కళ్ళురిమితేనూ వచ్చేలాభం యేమీలేదు. మీ రెప్పుడు రంగంలోకిదిగినా, జరిగింది వొకటే ఫలితం.

మీ గౌరవమూ, పేరుప్రతిష్ఠలూ యినుమడించాయి; మీ ఆదాయంగూడ పెరిగిందనే చెప్పవచ్చు. నా పట్లగూడా. మీ రలాగే ప్రవర్తించేట్లయితే మిమ్మల్ని గౌరవించేందుకు సిద్ధమే నేను. ధనరూపంగామాత్రం మీ కేమీ యివ్వను. డబ్బిస్తే లంచంపౌతుంది. మీ భార్యగారికి యేదో వొక ఆభూషణం చేయించిపెడతాను. మీ కిష్టమేనా? కాని నేను మీకో విషయం చెప్పదల్చుకున్నాను. మీ కందిన వార్త వాస్తవంగాదు. మిగతా జమీందార్లలాగా నేను గూడా ఆసామీలమీద జరిమానాలువేసి, వసూలు చేయడం లేదాఅంటే చేస్తూనేవున్నాను. సంవత్సరానికి పది, పదిహేనువేలు చేతికివస్తాయి. నా కిది దక్క కుండా చెయ్యాల్నని మీరు చూశారంటే, మీకూ నష్టమే. బ్రతికిన నాలుగురోజులూ సుఖంగా వుండాల్నని మీరూ అభిలషిస్తారు; నాకూ అదే అభిలాషవున్నది. న్యాయమనీ, కర్తవ్యమనీ, మోసపు మాటలు చెప్పి, నన్ను వంచించుతూ, మిమ్మల్నిమీరే వంచించుకోవటం యేమంత బాగుందో మీరే ఆలోచించుకోండి. హృదయం విప్పి చెప్పండి; మీకేమైనా శత్రువునా నేను? మీరూ నేనూకలసి యెన్నిసార్లు విందు లారగించామో సహపంక్తిని, జ్ఞప్తికి తెచ్చుకోండి. మీరు కష్టాల్లో వున్నారని నాకూ తెలుసును. బహుశ నాకంటే గూడా యెక్కువ కష్టాల్లో వున్నారేమోగూడ మీరు. ఐనా హరిశ్చంద్రుడిలా కావాలని మీరనుకుంటే నేనేమీ చెప్ప లేను. సరే! వస్తా."

జమీందారు కుర్చీ వెనక్కి తోసి, లేచి, నిలబడ్డాడు. ఓంకారనాథ్ లేచి, జమీందారు చేయి పట్టుకుని, "అట్లా అంటే గాదు. మీరు కూర్చోవాలి. నన్ను గూడా నా పోజిషన్ను గురించి చెప్పనీయాలి మరి, మీరు. ఇంతవరకూ మీరు నాపట్ల చూపించిన ప్రేమకూ, ఔదార్యానికీ నేను సదా కృతజ్ఞుడ్నే. అయితే యిదంతా సిద్ధాంతాలకు సంబంధించిన విషయం. సిద్ధాంతాలు ప్రాణాలకంటేగూడా తీపిగా వుంటాయనేవిషయం మీకు తెలుసు..." అంటూ సంధి చేసుకుంటూన్నట్లు మాట్లాడాడు.

మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు జమీందారు. సాధ్యమైనంత సౌమ్యంగా "సరేబాబూ నీ యిష్టం వచ్చినట్లే వ్రాసుకో. నీ సిద్ధాంతాలను వదలిపెట్టుకోనమని నేనూ అనను. కాకుంటే నా పేరు చెడిపోతుంది. అయినా ఈ పేరుకోసమని ఎన్ని బాధలని పడగలను? ఆసామీలను కొంచెమో, గొప్పో బాధించని జమీందారు మాత్రం యెవడున్నాడులే. బీమికలకి గూడా కాపలాకాస్తూ కూర్చుంటే, కుక్క కడుపెలా నిండుతుంది! ఐతే ఒకటి. ఇకముందిలాంటివి జరగవని మాత్రం హామీయిస్తాను. ఈ వొక్కసారికీ వదలేసెయ్యండి. ఇంకో సంపాదకుడైతే నేనిలా అర్థించేవాడినేకాదు. నడివీధిలో పెట్టి, నాలుగు వుతికించేవాడిని. మీరూ నేనూ స్నేహితులమూ, ఎవరో ఒకరు లొంగకతప్పదు! అసలు ఇది పత్రికల కాలమండీ, నేనేనన్న మాటేమిటి; గవర్నమెంటే హడలుకుంటోంది పత్రికల్ని చూచి. ఈ పోట్లాటని ఇంతటితో ముగించి, మీ యిష్టంవచ్చినట్లు కానీండి. ఆఁ. అయితే

పత్రిక బాగా పోతూందా ? సర్క్యులేషన్ యేమైనా పెరిగిందా !" అంటూ మాట్లాడాడు.

జవాబు చెప్పేందుకు యిష్టంలేదా అన్నట్లు "యేదో లెండి. అట్లాగేవుంది. ఈ రోజుల్లో యింతకంటే యెక్కువగా మాత్ర మేంవుంటుందిలెండి. డబ్బు దొరుకుతుందనీ, కాలు మీద కాలు వేసుక్కూర్చోవచ్చుననీ కాదుగదా నేనీ బాధ్యత స్వీకరించింది. ఐనప్పుడు అసంతృప్తి పడవలసిన అవసరమూ లేదు. ఏదో ప్రజాసేవ చేద్దామని వచ్చాను; యథాశక్తి చేస్తూనే వున్నాను. దేశం బాగుపట్టమే నాకు కావలసింది; వ్యక్తుల సుఖదుఃఖాల కేముందిలెండి" అన్నాడు ఓంకారనాథ్.

జమీందారుగారు మరింత సహృదయత కనబరచారు. "అదంతా నిజమే ననుకోండి ! సేవ చేసేందుకైనా బ్రతికి వుండాలిగదా. ఆర్థిక చిక్కుల్తో బాధపడుతూంటే, సేవ చేసేందు క్కావలసిన ఏకాగ్రతవుండదుగదా. అయితే సర్క్యులేషన్ యేమీ పెరగటంలేదా యేమండీ."

"నా పత్రికకు ఒక ఆదర్శం వుందండీ. ఆ ఆదర్శాన్ని వదిలిపెట్ట దలుచుకో లేదునేను. లేకపోతే సినిమాస్టార్లఫోటోలూ, అవ్వీ అచ్చువేస్తే, నా పత్రికగూడా బాగానే పోతుందిమరి. నా సంగతి మీకు తెలుసుగదా. ఇంకా అట్లాంటివే ఇంకా కొన్నిస్తంభాలువేస్తే పత్రిక ఇంకా వృద్ధౌతుందనుకోండి. అయినా అట్లాంటి విధానాలద్వారా డబ్బు చేసుకోవడం అంటే నాకు గిట్టదు."

"ఔనులెండి. అందుకనేగదా మీరంటే అంత గౌరవం అందరికీని. నే నొకమాట చెబుతాను. మీకు అభ్యంతరం

చెబుతారో యేమో. మీ రొక వందమంది పేరిట పత్రికలు పంపండి; చందాలు నే నిచ్చేస్తాను."

ఓంకారనాథ్ తన కృతజ్ఞతని తెలియజేస్తూ తల వంచాడు; మీరిచ్చే దానానికి అభివందనాలర్పిస్తూ, స్వీకరిస్తూన్నాను. ఈ రోజుల్లో పత్రికలంటే పట్టించుకునే మనుషులే కన్పించటంలేదు. స్కూళ్ళంటేనూ, కాలేజీ లంటేనూ, దేవాలయా లంటేనూ కావలసినంత మంది చందాలు వేస్తారు. కాని ఈనాటివరకూ పత్రికలకంటే చందా లెవ్వరూ ఇవ్వరు. నే ననేది సామాన్య ప్రజలకు విద్యని అందించేందుకు పత్రికలను మించిన సాధనం యేముందీ అని. విద్యాలయాల్ని నడుపుతూన్నట్లుగానే, పత్రికల్ని గూడా కమిటీలే నడుపుతాయనుకోండి, అప్పుడు మేం విజ్ఞాపనలకనీ, మరింకా దేనికోసనీ, యింత స్థలమూ, సమయమూ దుర్వినియోగం చేయం చూడండి! మీరు చేసిన సహాయానికి, జీవితాంతంవరకూ కృతజ్ఞునిగా వుంటాను తమరికి నేను."

జమీందారు శలవు తీసుకున్నాడు. ఓంకారనాథ్ కేమంత సంతోషంగా లేదు. జమీందా రేమీ షరతులు పెట్టలేదు; వాగ్దానం పుచ్చుకోలేదు. ఈ దానాన్ని కాదనేందుకు వీలులేకపోయింది. ప్రెస్సుకార్మికులకి మూడు మాసాల నుండి జీతాలు ఇవ్వడంలేదు. కాగితానికే దగ్గర దగ్గర వెయ్యిరూపాయలు బాకీవున్నది. ఈ దెబ్బతో అందులో కొంతబాధ తీరిపోతుంది; చేయి చాచవలసిన గతికూడా పట్టలేదు!

ఇంతలోనే గోమతి— సంపాదకుని భార్య—వచ్చింది. వచ్చి, ఘూంధాం లాడింది. "ఏం, ఇంకా అన్నానికి వేళ కాలే? వొంటిగంట ఐతేనేగాని అన్నం తినకూడదని ఎక్కడైనా రాసిపెట్టిందా? ఎంతసేపని వంటకాలు వేడిచేస్తూ కూర్చోను?"

భార్యవంక దీనంగా, దుఃఖంతో, చూచాడు ఓంకారనాథ్. గోమతి కోపం చల్లారిపోయింది. ఆవిడకూ తెలుసును అతని కష్టాలు. ఇతరుల భార్యలు వేసుకునే నగలూ, కట్టుకునే చీరలూ చూస్తూంటే ఆవిడకు కష్టంవేసేది నాకన్ని నగలూ, చీరెలూ లేవేఅని కోపం వచ్చేది; భర్తమీద రుఘ్యమని లేచేది. కాని నిజానికా కోపం భర్తమీదకాదు; తన దురదృష్టంమీద. అతని నిరాడంబర జీవితాన్ని చూచి లోలోపల కుళ్ళుతూండేది; అయినా అతనంటే సానుభూతి వుంది ఆవిడకు. 'కాస్త తలతిక్క మనిషి; అంతే!' అనుకునేది. భర్త దీనంగా చూడటం చూచి, "యేఁవిఁటి అంత విచారంగా వున్నారు. కడుపులో నొప్పేఁనైఁనా చేసిందా?" అనడిగింది.

ఓంకారనాథ్ వొక చిన్న చిరునవ్వు విసరవలసి వచ్చింది. "యెవరూ విచారంగా వుంది! నేనా? నా పెండ్లి నాడుగూడా నాకింత సంతోషం కలగలేదు; ఇవ్వాళ లేచీ లేవడంతోనే పదిహేనువందలు బోణీఐంది. ఎవరో అదృష్టవంతుడి మొహం చూచాను."

గోమతి నమ్మలేకపోయింది. "వారి అబద్ధాలూ, మీరూను. పదిహేను రూపాయలంటే నమ్మొచ్చుగాని, పదిహేనువంద లెవళ్ళిస్తారూ మీకు?"

"నిజమే! నీమీద వట్టంటున్నాగా. పదిహేనువందలూ కొట్టేశాను. ఇప్పుడే వచ్చి వెళ్ళారు జమీందారుగారు. వందమంది చందాదారుల డబ్బిస్తానని వాగ్దానంచేసి మరీవెళ్ళే."

గోమతి క్రుంగిపోయింది; "అయితే దొరికినట్లే."

"కాదులే! ఆయన అన్నమాట తప్పే మనిషిగాదు."

"చాల్లే వూరుకోండి. అన్నమాటమీద నిలబడ్డ జమీందారుని, ఒక్కణ్నిగూడా చూళ్లేదు నేను. మా నాన్నగారొక జమీందారుదగ్గర వుద్యోగం చేశారు; సంవత్సరజీతం బకాయీ పడ్డాడు జమీందారు. తర్వాత యింకొక జమీందారుదగ్గర కెళ్లారు; ఆయన రెండుసంవత్సరాల జీతం బకాయీపెట్టాడు. నాన్నగారికి కోపం వచ్చింది. జీతం డబ్బు లివ్వటం మాటట్లా వుంచి, తన్ని బయటికిగెంటారు. వీళ్ల మాటల్నిమట్టుకు నమ్మగూడదు."

"నేనివ్వాళ్నే పంపుతానుగా బిల్లు."

"పంపండి. రేపు రమ్మంటారు. రేపు యిలాకా కెల్తారు. మూడ్నెల్లతర్వాతగాని మళ్లీరారు."

ఓంకారనాథ్‌కికూడా సందేహం కలిగింది. జమీందారు అన్నమాటను తప్పిపోతే? తనేం చెయ్యగలడు? ఐనా గుండె దిటవుచేసుకొని, "అదేమన్నమాటలే. జమీందారుకి నేనేం

బాకీలేనుగా. ఐనా ఈయనమాత్రం అట్లాంటివాడుకాదులే” అని అన్నాడు పైకి నిబ్బరంగా.

“అందుకనేగా మీకొట్టిఅమాయకులని నే ననేది. యెవళ్లైనా కాస్తమెత్తగా మాట్లాడితేచాలు; మీ రూరికేనే వుబ్బిపోతారు. వీళ్ళంతా పెద్ద పెద్ద పావుకాన్లు; ఇట్లాంటి మాటల్ని, చాలావాటిని జీర్ణంచేసుకుంటారు వాళ్ళు. వాళ్లిచ్చిన వాగ్దానాలన్నీ పూర్తిచేస్తూ కూర్చుంటే, వాళ్లింకేం అడుక్కు తినక్కర్లా. మావూరు ఠాకూరు కోమటిళ్ళల్లో అప్పులుపెట్టి, మూడేళ్ళు, నాలుగేళ్లైనా తీర్చేవాడుకాదు. నౌకర్లకి జీతాలు చచ్చినా కొలిచేవాడుకాదు. ఏడాదిపొడుగూనా చాకిరీ చేయించుకునేవాడు; చివరికి జీతం అడిగితే వెళ్లగొట్టేసేవాడు. చివరికి చచ్చుకునే కొడుకుల జీతాలుగూడా కట్టేవాడుగాదు; అందుకనే వాళ్ల పేర్లుగూడ కొట్టేస్తే యేఁవీఁ చెయ్యలేక ఇంట్లో కూర్చోబెట్టుకున్నాడు. ఒకసారి రైలుస్టేషన్ కెళ్ళి టికట్టిప్పిస్తారా అని అడిగాట్ట. ఈ జమీందారూ, ఆయనా బంధువులే లే! సరేలే! పదండి భోజనానికి. మన నొష్ట నేంరాసుంటే అదే జరుగుతుంది. ఈ గొప్పగొప్పోళ్లంతా తిడుతూంటేనే మంచిది. మీ కొక్క రూపాయిచ్చారంటే, ఆసామీల దగ్గర అంతకంటే నాలుగురెట్లెక్కువ వసూలుచేస్తారు. ఇప్పుడే నయం; మీ యిష్టం వచ్చినట్లు రాసుకోనన్నా రాసుకోవచ్చు. వాళ్ళదగ్గర డబ్బుపుచ్చుకుంటే వాళ్లకి నచ్చిందే రాయాలి సొస్తుంది.”

ఓంకారనాథ్ భోజనం చేస్తూన్నాడుగాని, ముద్ద గొంతు దిగలేదు. గుండెమీాద వున్న బరువుకాస్తా దింపుకుంటేనేగాని, భోజనం సహించేట్లులేదు.

"ఇదిగో చూడు. ఆయన డబ్బేగనక యివ్వక పోతే ముప్పతిప్పలుబెట్టి మూడుచెరువులనీళ్ళు తాగిస్తా. ఇప్పు డాయనసిగ నా గుప్పెట్లోవుంది. గ్రామస్థులు చచ్చినా అబద్ధం వ్రాయరు నాకు. నిజం వ్రాస్తేనే వాళ్ళు బ్రదకటం కష్టం; అబద్ధా లెందుకు వ్రాస్తారు? జమీాందారుమీాద వొక రిపోర్టు వచ్చింది నాకు. అది అచ్చువేస్తే ఇక ఆ మానవుడు తలెత్తుకుని తిరగలేడు. నా కాయన ఆ సొమ్ము దయదల్చి యిస్తున్నా డనుకొన్నావా? మొట్టమొదట డబాయించాలనే చూచాడుగాని, ఆ పప్పులేమీా వుడకవని తెలుసుకుని, ఇంక దారికొచ్చాడన్నమాట. నేను వొకటాలోచించానులే. ఈ ఒక్క జమీాందారూ బాగుపడినంత మాత్రాన, ఈ దేశంలో నుంచి అన్యాయం యెట్లాగూ మాయమవ్వదు. అయినప్పు డింక ఈ బహుమానం వద్దనటమెందుకు? నేను నా ఆదర్శాన్ని వదలేశాను; నిజమే. ఇప్పుడైనా జమీాందారన్నమాట చెల్లించుకుంటే సరేసరి; మంచిదే. ఇంకా యేమైనా దగా చేశాడూ అంటే నేనూ అన్నింటికీ తెగించేశేస్తాను. బీదవాళ్ళని దోచేవాళ్ళని దోచటం మంచిదేనని అనుకునేందుకు ఏమంత పెద్దగాకష్టపడను నేనూను "అన్నాడు భార్యతో ఓంకారనాథ్.

225

# 14

ఊరంతా వొకటే పుకారుగా వుంది: జమీందారుగారు పెద్దల్నయిదుగురినీ పిలిపించారట. బాగా కోప్పడ్డాడట. వీళ్ళు షావుకారిదగ్గర వసూలుచేసిందంతా కక్కించాడట. అసలాయన వీళ్ళందర్నీ జైల్లో పెట్టించుదామనుకున్నాడట. కాని వీళ్ళందరూ కాళ్ళమీదపడి బ్రతిమాలుకునేప్పటికి దయదలచి వదలిపెట్టేశాడట.

ధనియా గుండెగూడ చల్లబడింది. ఇంటింటికీ వెళ్ళి, చూచారామ్మా! దేవుఁడు లేడూ? మనిషినకపోయినా మాధవుడు లేడమ్మా బీదాళ్ళ సొదవినటానికి? మా దగ్గర తప్పు వసూలుచేసి గారెలూ బూరెలూ తిందామనుకున్నారీపెద్దలు. దేవుఁడు నాలుగు లెంపకాయలు కొట్టి తిందంతా కక్కేట్టు చేశాడు. చేసుకున్నాళ్ళకీ చేసుకున్నంతే తల్లీ! ఇల్లు తాకట్టు పెట్టుకుని ఏం బావుకుంటారో, అదీ చూస్తాగా" అంటూ ప్రచారం చేసి వచ్చింది.

ఎడ్లు లేకుండా వ్యవసాయం ఎట్లా నడుస్తుంది? పూళ్ళో పూడ్పులు ప్రారంభించారు. కార్తీకమాసంలో రైతుల ఎడ్లు

లేకుండాపోతే చేతులు రెండూ విరగకొట్టుకున్నట్లే. హోరీకి చేతులు రెండూ పడిపోయినట్లుంది. ఊళ్ళోవాళ్ళందరూ పొలాలు దున్నుకుంటున్నారు; విత్తనాలు విత్తుతున్నారు. అక్కడక్కడా పాటలుగూడ వినవస్తూన్నాయి. మగదిక్కులేని ఆడదాని సంసారంలా బిక్కు, బిక్కు మంటూంది హోరీ పొలం. పున్ని పనులూ ఐపోతూన్నయి; శేఖర్ పనులూ ఐపోతున్నాయి. పాపం; వాళ్ళ వాళ్ళ పనుల్లోనే మునగానాం, తేలానాంగా వున్నారు. హోరీ కేంసహాయం చేయగలరు? హోరీ పిచ్చెత్తిన వాడిలా ఇటూ అటూ తిరిగాడు. కాస్సేపు వాళ్ళపొలంలో కూర్చునీ, కాస్సేపు వీళ్లగట్టుమీద పండుకునీ ప్రొద్దుపుచ్చాడు. వీలున్నప్పుడు వాళ్ళపనిలోకీ, వీళ్ళపనిలోకీ, వెళ్లేవాడు. పనిచేసినప్పుడు కూలి దొరికేది. ధనియా రూపనీ, సోనానీ వెంటబెట్టుకుని కూలికివెళ్లేది. ఊడ్పులు జరుగుతూన్నంత కాలమూ కడుపుకోసం కక్కుర్తి పడవలసిన అగత్యం లేకుండాపోయింది; పెద్ద యిబ్బంది లేకుండా పోయింది. లోపల ఎంతవిచారంగా వున్నా, మనసెంత వెలితిగావున్నా, కడుపుమాత్రం కాలేదిగాదు. రాత్రిళ్లుమాత్రం ఆడా, మగా చిలిపికయ్యాలు పెట్టుకునేవారు.

కార్తీకమాసం గడచింది; కూలి దొరకటం కష్టమైపోయింది.

ఒకనాటిరాత్రి బాగా చలివేస్తూంది. హోరీ యింట్లో పొయ్యిలో పిల్లి లేవలేదానాడు. పగలేదో కాస్త శనగపప్పు తిని, మంచినీళ్లుత్రాగి వూరుకున్నారు. రూపకు ఆకలి దహించుకుపోతోంది. ఇంటి గడపమీద కూర్చుని యేడ్చింది. ఇంట్లో

ఒక్క బియ్యపు గింజగూడా లేదని రూపక్కూడా తెలుసు; అన్నం పెట్టమని అడిగినా లాభం లేదు.

పాపం! ఎంత వూరుకుందామని అనుకున్నా వూరుకో లేక పోయింది రూప; కడుపు కాలిపోతోంది. నిప్పుకనే వంకతో పున్ని ఇంటికి వెళ్ళింది. జొన్నరొట్టెలు కాల్చి, బంగాళాదుంపల వేపుడు వేయించుతోంది పున్ని. ఆ వాసన చూచేప్పటికి, రూపనోట్లో నీళ్లూరినై.

"ఏంవేం. యింకా మీ ఇంట్లో నుప్పు రాజెయ్యలే దంటే" అనడిగింది పున్ని.

"ఇంట్లో ఏంవీం లేదుగా. ఇంకా పొయ్యి రాజెయ్యటం ఎందుకూ" అన్నది రూప దీనంగా.

"మరి నీకు నుప్పెందుకు?"

"నాన్న చుట్ట కాల్చుకుంటాడంట."

పొయ్యిలోనుంచి రెండు బొగ్గులు పైకిలాగి, రూప ముందుకు తోసింది పున్ని. రూప నిప్పు ముట్టుకోలేదు. పున్నికి మరింత దగ్గరగా వెళ్లి "మీ రొట్లు బలేగా వుండయ్ పిన్నీ. నాకేం, జొన్నరొట్లంటేనేం, బలేయిష్టం" అంది.

"కావాలా? తింటావా?" అనడిగింది పున్ని నవ్వుతూ.

"అమ్మేం కోప్పడతంది."

"అమ్మతో ఎవళ్లు చెప్పొచ్చారే."

పొట్టనిండేట్టు తిని, మూతిగూడా కడుగుకోకుండా ఇంటికి లగెత్తింది రూప.

ఇంటిదగ్గర హోరీకి ఏమీతోచక, నిట్టూరుస్తూ కూర్చున్నాడు. ఇంతలోనే శాస్త్రివచ్చి పిలిచాడు. హోరీ గుండె గుబుక్కుమంది. మళ్లీ కొత్త ఆపదలేమీ రావటంలేదు గదా! బయటికివచ్చి, నమస్కారంపెట్టి, మంచంవేసి మర్యాద చేశాడు.

శాస్త్రి మంచంమీద కూర్చున్నాడు: "ఏఁవిఁటి హోరీ! ఈ సంవత్సరం వ్యవసాయమే చెయ్యవా ఏఁవిఁటి? ఇక ఆ పొలాలు అట్టా బీళ్లుగా వుండిపోవలసిందేనా? నువ్వు మాటవరస కన్నా ఎవర్నోనూ అడగకపోతివి. మాటేగనక అంటే భోలా ఎడ్ల నెన్నిగుండెల్లో తోలుకెళ్లేవాడంటావ్? వాడిశవం వెళ్లేది గాదూ ఆ పూట. హోరీ! నా మాట నమ్ముతావో, నమ్మవో గాని; ఈ గాయత్రిసాక్షిగా చెబుతున్నా నీ మీద జరిమానా వేసింది నేను కానేకాదు. నామీదనవసరంగా అపవాదు వేస్తోంది ధనియా. ఇదంతా ఆ పటేశ్వరి, ఝింగురసింగూ చేశారంటే నమ్ము. నేనంటే గ్రామస్థులమాట తీసెయ్యలేక కూర్చున్నా. అప్పటికీ వాళ్లతో ఎంతపోట్లాడానని? వాళ్లా జరిమానాగూడా చాలదు; ఇంకా ఎక్కువెయ్యాలని మహాఁ పోట్లాడారు. నేను చెప్పింతర్వాత విన్నారనుకో. మేఁవేఁ రాజులం అనుకున్నారప్పుడు. వీళ్ల తాత ఇంకొకడున్నాడని మర్చిపొయ్యారు. ఇప్పుడందరూ నెత్తిమీద చేతులు పెట్టుకొని, అలోమని ఏడుస్తున్నార్లే. సరేగాని మరి, వ్యవసాయాని కేఁవన్నా ఏర్పాట్లుచేస్తూన్నావా?" అన్నాడు దయదలుస్తూన్నట్లు.

"ఏంచెయ్యను బాబూ! బీడు బీడుగానే వుంటుంది." అన్నాడు హోరీ దీనంగా.

"బీడుగానా? ఇంతకంటే అనర్థం వుంటుందా?"

"దేవుడి దయట్లావుంటే మనం యేంచేస్తాం?"

"నేనుండగానే నీ పొలం బీడుగా వదుల్తావుగా? బాగానే వుంది! నీ వ్యవసాయం అంతా నేను చేయిస్తా. ఇంకా తరేమీ తప్పలేదులే. కాకపోతే నాలుగు రోజు లాలస్యంగానే కోసుకుందాం. చెరుసగం పాలు తీసుకుందాం. ఆఁ, యివ్వాళట్లా కూర్చుంటే మనసూరికే ఇకై పోయిందనుకో; అరె! చూస్తూ, చూస్తూ హోరీ పొలాన్ని అట్లాబీడుగా వదిలిపెట్టెయ్యాటం వేఁనా అని."

హోరీ ఆలోచనలో పడ్డాడు. ఈ పొలంకోసమని నాలుగు నెలలు కష్టపడ్డాడు. గట్లువేశాడు; దున్నేడు. ఇవ్వాళ వూడ్పు వూడ్చినందుకు పంటలో సగంపాలు ఇవ్వాల్సివస్తోంది. పైగా యెంతో మేలు చేస్తూన్నట్లు మాట్లాడుతున్నాడు శాస్త్రి. ఇంతకంటె పొలం బీడుగా వదిలిపెట్టేస్తేనే మంచిదేమో. ఏమో. ఈ సారిగూడ శిస్తుబకాయి పడితే, భూమినుంచి తొలగించేసి, జప్తుగూడా జరిపించేస్తాడేమో జమీందారు.

చివరికి శాస్త్రిచెప్పినమాట ఒప్పుకోక తప్పలేదు. శాస్త్రి సంతోషించాడు. "మరైతే ఇంకా ఆలస్యం యెందుకు? పద విత్తనాలు తెచ్చుకుందూగాని. భోంచేశావుగా?" అన్నాడు.

హోరీ, సిగ్గుపడుతూ, ఇవ్వాళ పొయ్యిమీద కుండ ఎక్కలేదని, చెప్పేశాడు.

శాస్త్రి నాలుగు చీవాట్లు పెట్టాడు. తియ్యా తిడు—

"అదేవిఁటయ్యా. నాతో మాటవరసకు

నే నేమైనా పరాయివాణ్ణా, ఏమన్నానా. అందుకే నువ్వంటే నాకు మంట. ఈ మాత్రానికి సిగ్గుపడతారటయ్యా నీ కడుపు బంగారంగాను. నువ్వు శూద్రుడివైనా, నేను బ్రాహ్మణ్ణయినా, అందరమూ ఒకే యింటివాళ్ళమయ్యె. అందరి రోజులూ ఒకమాదిరిగా గడుస్తవటయ్యా పిచ్చివాడా. రేపు నాకే ఏదైనా కష్టం వస్తుందనుకో, నేను నీతో చెప్పకోనూ. సరే, అయిందేదో అయింది కాని రా. ఆ విత్తనాలతోపాటు ఇంకో ఇరసో, తూ(వుం)డో, భోజనానికూడా తెచ్చుకుందూగాని."

ఇంకో అరఘంటలో, ధాన్యంమూట నెత్తిమీద పెట్టు కొచ్చాడు హోరీ. ఇంట్లో మళ్ళీకాస్త సందడి. ధనియా పాపం ముక్కు చీదేస్తోంది. 'ఈనాటి కీ గతిపట్టె మరి!'

మర్నాటినుండి పొలంపనులు ప్రారంభమైనయి. కుటుం బానికి కుటుంబం వళ్ళువంచి పనిచేసింది పంటఅంతా తమ వాళ్ళోనే పడబోతూన్నట్లు. కూలీ, నాలీ అడగని కూలివాళ్లు దొరికారు శాస్త్రికి. అప్పుడప్పుడు శాస్త్రికొడుకు, మాతాదీన్ గూడ హోరీ ఇంటికి వస్తూ, పోతూ వున్నాడు. పడుచువాడు, రసికుడు, మాటకారి. వాళ్ళనోళ్ళూ, వీళ్ళనోళ్ళూ కొట్టి శాస్త్రిగారు సంపాదించిన డబ్బు, ఈ సుపుత్రుడు గంజాయికనీ, జూదానికనీ, ఖర్చుపెట్టేసేవాడు. ఆ మధ్య ఒక మాదిగమ్మా యికి ఇలాకా పడ్డాడు; అంచేత ఇంతవరకూ, ఇంకా పెండ్లి చేసుకోలేదు. ఆ యమ్మాయిని వుంచుకున్నాడని వూరందరికీ తెలుసు; ఐనా తెలియనట్లే నోళ్ళుకట్టుకుని కూర్చున్నారు. ~శే మరి! మన ధర్మమే మన భోజనం; మన మతమైనా కాస్తా పదిలంగావుంటే, మన ధర్మానికీ,

మతానికీ, అడ్డుపుల్లలు వేసేవాళ్ళుండరు. కాలుజారి, బుద్ధి గడ్డితిని, మనం ఎప్పుడైనా ధర్మచ్యుతులంఐనా, మతానికి వ్యతిరేకమైన పనులుచేసినా, మన డబ్బు, ఆ తప్పుడు పనులన్నిటినీ కప్పివేస్తుంది; కాపాడుతుంది !

ఉమ్మడి వ్యవసాయం కావటంచేత, అప్పుడప్పుడూ, ఝునియాతో మాట్లాడేందుకూడా వీలు చిక్కుతూనే వుండేది మాతాదీన్‌కి. ఏదో ఒక వంకతో, ఇంట్లో ఝునియా తప్పితే ఇంకెవ్వరూ లేనప్పుడు, పసిగట్టినట్టు పరుగెత్తుకొచ్చే వాడు. ఝునియా ఎంత అంతగత్తె కాకపోయినా, వయసులో వుంది. అదీగాక పట్టణంలో వుండివచ్చింది కావటంచేత, కాస్త కట్టూ, బొట్టూ, మాటా, మంతీ తెలిసిన మనిషి. ఆడవాళ్ళకు మరింత ఆకర్షణతెచ్చిపెట్టే నునుసిగ్గు ఇంకా ఆవిడని వదల్లేదు. కాగా మొత్తంమీద అతను వుంచుకున్న మాదిగమ్మాయికంటే ఎక్కువగా, ఆకర్షవంతంగావుండే మనిషి ఝునియా. ఝునియా కొడుకునెత్తుకుని, బుజ్జగించే వాడుకూడాను మాతాదీన్. ఇదంతా చూస్తూ, ఝునియా గూడ సంతోషిస్తూ వుండేది.

ఒకనాడు "ఝూనా! యేం చూచొచ్చావే గోవరెంట పడి ?" అనడిగాడు శాస్త్రికొడుకు.

"ఏంచెప్పను బాబుగారూ! కూడా లాక్కొచ్చేశాడు" అని జవాబుచెప్పింది సిగ్గుపడుతూ ఝునియా.

జాలిపడుతూన్నట్లు, "అదేవిఁటే! అంత విశ్వాసం లేకుండా యెట్టాపొయ్యాడే? లక్ష్మిలాంటిదా[illegible] నిన్నొదిలిపెట్టి పోవటానికి యెలా మనసొ[illegible]

నిలకడలేని మనిషివాడు; మళ్లీ యెవరివలలో పడ్డాడో. అల్లాంటి వాళ్లని చంపినా పాపంలేదనుకో. మగవాడన్న తర్వాత, ఒకసారి ఔననుకుంతర్వాత, మాటమీద నిలబడకపోతే యెల్లా? నీ బ్రదుకు పాడుచేసింది చాలక, మళ్ళీ యింకొకళ్ల వెంటబడతాడూ? బుద్ధిలేకపోతేసరి!" అన్నాడు మాతాదీన్.

ఝునియా ఏడవడం మొదలెట్టింది. అటూ, ఇటూ చూచి, ఎవరూ చూట్టంలేదనుకున్న తర్వాత ఝునియా చేయి పట్టుకున్నాడు మాతాదీన్. చేయి పట్టుకుని, నీకేఁవీఁ భయంలేదులే. నా మాటవిను. పోతే పొయ్యాడు వెధవ. నేనున్నానుగా: నగలూ, చీరెలు, ఏఁవిఁ కావాలనుకున్నా సరే, నన్నడుగుతూండు" అన్నాడు.

నెమ్మదిగా చేయి విడిపించుకుని, రెండడుగులు వెనక్కివేసి, "అంతా మీ దయండీ, బాబుగారూ! అటు ఇంటికాడా వుండకపోతిని; యిటు యిక్కడా వుండలేనాయె. రెంటికి చెడ్డ రేవడినైపోయా నేను. లోకంసంగతి తెలియకేగా బాబుగారూ, నేనిట్టా ఐపోయింది. తియ్యాటి మాటలుచెప్పి, తీసుకొచ్చి, యిట్టా నట్టేట్లో ముంచాడు" అన్నది ఝునియా.

"వాడా? వట్టి లఫంగి వెధవకాదూ! రోజూ పోట్లాట పెట్టుకునేవాడు అమ్మాబాబుల్తో. నాలుగు డబ్బులు చేతికి చిక్కితే వెళ్లి జూదం ఆడేవాడు. లేకపోతే గాలితిప్పటి. కనపడ్డ ఆడదాన్నల్లా కన్నుగిలిపేవాడు. వట్టి పోకిరీ వెధవకాదూ! [illegible]లి ధాన్యంగూడా యెత్తుకుపోయేవాడు దొంగవెధవ. [illegible]గారు కేసుపెట్టడానికివస్తే మేం బ్రతిమ

లాడి ఎల్లాగైతేనేం తప్పించగలిగాం." అంటూ వున్నవీ, లేనివీ, నాలుగు కల్పించి, కసిదీర్చుకున్నాడు మాతాదీన్.

ఇంతలోనే సోనావచ్చింది. "వదినా, అమ్మ వడ్డించ బెట్టమంది, లేకపోతే దంచినప్పుడంతా నూకౌతుందంట" అంటూ అక్కడికి శాస్త్రి తడిసిన ధాన్యం యిచ్చినట్లు.

"మీరు వర్షమే పడనట్లు మాట్లాడతారేం? నాలుగు నెల్లయ్యిందామరి? ధాన్యమేనన్న మాటేంవిటి, కట్టెలుగూడా నింబుకుంటాయి." అని అంటూ బైట కెళ్ళిపోయాడు మాతా దీన్.

పానకంలో పుడకలా వచ్చిందాయె సోనా! "మాతా దీన్ వచ్చాడెందుకూ?" అనడిగింది సోనా ఝునియాని.

"పలుపుతాడేంవన్నా వుందా అంటూ వచ్చాడు; మాయింటో లేదన్నా" అన్నది ఝునియా నుదురు ముడుస్తూ.

"అదంతా వంక లే. వట్టి పాడాడు."

"ఏంవోంనాకు మంచాడికిమల్లేనే వున్నాడే."

"నీకు తెలవదులే! సిలియా అనే మాదిగమ్మాయిని గూడా వుంచుకున్నాడు."

"వుంచుకుంటే? పాడై పోయినట్టేనా!"

"ఇంకా ఏం చెయ్యాలేంటి పాడౌటానికి?"

"మీ అన్నయ్యమాత్రం నన్ను తీసుకురాలా? మీ అన్నయ్యగూడా పాడై పోయినట్టేనా!"

సోనా ఏమీ జవాబు చెప్పలేదు. "ఈసారి గడప తొక్కితేనా, ఆ నాలుగు చీవాట్లూగూడా పెట్టేస్తా." అని మాత్రం అన్నది.

"ఆ యబ్బాయికే ఇచ్చి నిన్ను పెళ్ళిచేస్తేనో?" అన్నది ఝునియా.

సోనా సిగ్గుపడింది. "అదేఁవిఁటొదినా. వెధవ మాటలు."

"ఇందులో వెధవమాటలేఁ వున్నయ్?"

"ఆ. నాతో మాట్లాడితేనా? వాడి మొఖాన మొద్దులు పెడతా."

"అంతకంటె మంచాడు దొరుకుతాడా ఏంటి నీకు?" ఈ వూళ్ళోనే లేరు అంత అందమైనాళ్ళూ, బలమైఁన వాళ్ళూనూ."

"అయితే నువ్వెళ్ళరాదూ యెంటబడి. మాదిగమ్మాయి కంటే వెయ్యిరెట్లు బాగుంటావుగా."

"నేనెందుకెళ్ళాను? మంచో, చెడ్డో, ఒకణ్ణి నమ్ము కొచ్చాగా?"

"అయితే నేనూ నాకు పెళ్ళైంతర్వాత, పెళ్ళిచేసుకున్నా ఇంటే యెళ్తా."

"ముసలి మొగుడు దొరికితే ఏంచేస్తా?"

సోనా నవ్వింది. అట్లాఐతే మెత్తటిరొట్లు వండిపెడతా; మందూ, గిందూ చూస్తావుంటా; చెయ్యి పట్టుకుని మంచమీద నుంచిలేపి కూర్చోబెట్టా; చచ్చిపోతే, మొహం కప్పుకొని, దేఁవుఁడో, దేఁవుడా! అంటూ ఏడుస్తా!"

"పడుచు మొగుడైతేనో మరి?"

వూరుకో ఇక!"

"సరేగాని నీకు ఎవళ్ళంటే యిష్టం? పడుచాళ్ళంటేనా, ముసలాళ్ళంటేనా!"

నేను కావాలనుకుంటే సరి. ఎవళ్ళైతే ఏం?"

అబ్బ, దేవుడి దయవల్ల నీకే ముసలి మొగుడు దొరికితేనా, అప్పుడు! ఆ ముసలి ముండాకొడుకెప్పుడు చస్తాడా, యింకో పడుచాణ్ణి ఎప్పుడు లేపుకుపోదాంవాం అని, కాచుకూచుంటావ్!"

"అట్లాంటి ముసలాడిని చూస్తేనే చాలు, జాలేస్తుంది నాకు!"

*  *  *

ఈ సంవత్సరం పంచదారమిల్లు కట్టారు. మిల్లు ఏజంట్లు, కమిషన్‌దార్లు వూరూరూ తిరుగుతున్నారు; పొలంలోవున్న చెఱుకకే బేరాలుపెట్తున్నారు; కొనేస్తున్నారు. మిల్లు కట్టింది మిస్టర్. ఖన్నా. ఒకనాడొక కమిషన్‌దారు వచ్చాడు వూళ్లోకి. రైతులందరూ ప్రోగయి ఆలోచించారు. బెల్లంచేసినందువల్ల మిగిలేదేమీ కన్పించలేదు; ఇంకా స్త కష్టంగూడా అదనం ఔతోంది. ఒకవేళ కష్టపడదాం అనుకున్నా, వూళ్లోనే పంచదార దొరుకుతూంటే, బెల్లం యెవళ్లు కొనుక్కుంటారు; ధర తగ్గించాల్సొస్తుంది. అదీగాక, ఇప్పుడే అమ్మేసుకుంటే, నిలుచున్నవాళ్లు నిలుచున్నపళాన నాలుగు డబ్బులు చేతిలో చూసుకోవచ్చు; ఏదోవొక అక్కర తీర్చుకోవచ్చు. ఎడ్లని కొనటమో, అప్పులు తీర్చుకోవటమో, — ఏ
అందుకనే బజాణాలు పుచ్చుకున్నారు అం

యెడ్లని కొనుక్కుంటే బాగుండునని చూస్తున్నాడు. కనీసం ఒక వందరూపాయలైనా చేతిలో పడకపోతవా అని అతని వుద్దేశం. వందరూపాయలైతే యెడ్లకే చాలవు. మరి అప్పుల వాళ్ల సంగతేమిటి? వూరుకుంటారా? ఇప్పటికే ప్రాణాలు కొరుక్కుతింటున్నారు. శాస్త్రి, మంగ్రూ, దులారీ, ఝింగురసింగూ ——. పోనీ అప్పులు తీర్చేద్దామంటే వంద యేమూలకి? వడ్డీగూడా తీరదు! యెవరికీ తెలియకుండా అమ్మేసి, డబ్బు తీసుకోవాలంటే, దారేమీ కన్పించటంలేదు. డబ్బు కాటా దగ్గర తప్పితే ఇవ్వరాయె; యెట్లాగో తెలిసిపోతుంది అందరికీనీ. అందుట్లో శాస్త్రి అక్కడే కూర్చొని వుంటాడాయె మరి. ఈ చేతిలో డబ్బు వేయించుకుంటే, ఆ చేయి శాస్త్రి పట్టుకుంటాడు.

"నీ చెరుకమ్మేశావా బాబాయ్!" అని అడిగాడు గిరిధర్ హోరీని.

హోరీ అబద్ధం ఆడాడు. "ఏంవోంరా! ఇంకా అమ్మలేదు. నువ్వెప్పుడు తోల్తున్నా?" అని అడిగాడు.

గిరిధర్ గూడా తక్కువ తినలేదు. "యేంవోంనేం బాబాయ్! యింకా యేమీ తేలందే." అని తప్పించుకున్నాడు.

ఊళ్లో యెవర్ని చూచినా, ఇట్లా మాట తప్పించి మాట్లాడేవాళ్ళే. ఎవరికీ ఎవ్వరిమీదా నమ్మకం లేకుండా పోయింది. అసలు సంగతేమిటంటే ఝింగురసింగుకి బాకీలేని వాడంటూ లేడు వూళ్ళో. అమ్మేసుకుంటున్నట్లతనికి తెలిస్తే [illegible]క్కారమే! పోనీ అప్పు తీర్చేసి, మళ్లీ అప్పు తెచ్చు[illegible] కాగితాలకూ, స్టాంపులకీ, డబ్బు పెట్టు

కోవాలి; మళ్లీ నజరానాలూ, మామూళ్ళూ యివ్వాలి. మర్నాడు శేఖర్ వచ్చాడు. "అన్నయ్యా! ఈ ఝింగురసింగుకి కలరా వచ్చినా పీడొదిలిపోను. మంచం ఎక్కినాడు ఎక్కినట్లు చచ్చూరుకుంటే సరి!" అన్నాడు హోరీతో.

హోరీకి నవ్వొచ్చింది. "యేంవిట్రా. పాపం ఆయనకి మాత్రం బిడ్డా పాపా లేరూ?" అన్నాడు.

"బిడ్డా, పాపావుంటే? మన పిల్లలసంగతి మనం చూసుకోవద్దూ? వాడికేం! మహారాజు!! ఇద్దరు పెళ్ళాల్ని పెట్టుకూర్చున్నాడు. మనంవేమో ఒక్క పెళ్ళానికే పెట్టలేక చస్తున్నాం. తెలిసిందంటే అంతా జమేంచుకుంటాడు. కాం డబ్బుగూడా మిగల్దు మనకు."

"నా పనింకా ఘోరంరా. డబ్బుచెయ్యి జారిపోయిందీ అంటే, సోదిలోకూడా లేకుండా పోతాననుకో. ఎద్దు లేక పోతే ఇంకా పనేం జరుగుతుంది?"

"ఇంకా రెండుమూడు రోజులు ఎట్లాగో పోతుంది ఆలస్యం. జమాందార్తో చెబుదాం వోరేయ్, బాబూ! ముందు తూకం వేసేసుకో, డబ్బు తర్వాతిద్దూగానిలే అని. ఝింగుర సింగుతోనేమో డబ్బింకా చేతిలో పడలేదని చెబుదాం."

హోరీ ఆలోచించాడు. "ఝింగురసింగు మన తలతన్ని పుట్టాడురా శేఖర్. మనకంటే ముందేవెళ్లి డబ్బు తెచ్చు కుంటాడు. ఇకనువ్వూ, నేనూ ఒకళ్ల మొఖం ఒకళ్లుచూస్తూ కూర్చోవాల్సొస్తుంది. మిల్లు ఖన్నాగారిది; డబ్బు ఇం-- ఇద్దరూ వొకటేగా" అన్నాడు.

శేఖర్‌కున్న ఆశకాస్తా వుడిగిపోయింది. "ఏంవోఁ అన్నయ్యా ఈ వడ్డీ వ్యాపారస్థులు ఎప్పుడొదిలి పోతారోగాని చంపేస్తన్నారు" అన్నాడు.

"యేంవోఁరా శేఖర్. ఈ జన్మకిక ఇంతే అనుకుంటా. మనం రాజ్యం ఏలాలనుకోటంలేదు; భోగాలనుభవించా లనుకోటంలేదు. కట్టుకోటానికింత బట్టా, తింటానికింత అన్నమూ కావాలనుకుంటన్నాం. బ్రతికిన నాలుగురోజులూ కాస్త మర్యాదగా బ్రతికి, చచ్చిపోదాం అనుకుంటన్నాం. అదే పడ్డట్టు లేదాయె" అన్నాడు హోరీ.

"ఈ సారి వీళ్లందర్నీ బోల్తా కొట్టిస్తాగా చూస్తూవుండు అన్నయ్యా. జమాదారుకి నాలుగు డబ్బులిచ్చి, అబ్బాయిస్, పదిసార్లు తిప్పించుకుని గాని యివ్వొద్దు డబ్బు అనంటేసరి! సింగెక్కడ తిరుగుతాడు వాడింటిచుట్టూ?" అన్నాడు శేఖర్.

హోరీ నవ్వాడు. "అదేంవీఁ లాభంలేదులేరా. ఆ ఝింగురసింగు కాళ్ళూ, చేతులే పట్టుకొని బ్రతిమాలుకోటం మంచిది. మనం వుచ్చులో చిక్కివున్నాం. అటూ ఇటూ కొట్టుకున్నాం అంటే ఆ వుచ్చు యింకాస్త బిగుసుకు పోతుంది!" అన్నాడు.

అదేంటన్నయ్యా! నువ్వుగూడా అట్లాగే మాట్లాడతావ్? వుచ్చులో చిక్కాం అంటే చిక్కాం. వూరికినే చేతులు ముడుచుక్కూర్చుంటే బయట పడతామా! అందుకనే నాలుగు విసుళ్లిసురుకుంటే - బయటపడితే పడతాంవేమో; యెవళ్ళకి తెలుసు? సింగుమాత్రం ఏం చేస్తాడంటా? అంతగా ...వేలాం వేస్తాడు; వేసుకోనీ! ఎక్కడా అప్పు దొరగ్గా... మలమల మాడ్తేనే మంచిది; నాలుగు

తాపులు తినాల్సిందే అని కోరుకుంటా నేను. డబ్బున్నవాళ్ళు అప్పు మనకోసం ఇస్తున్నారంటావా? అప్పివ్వకపోతే వడ్డీ పెరగదు గాబట్టి ఇస్తన్నారు; మనమీద దయదల్చిగాదు. యేన్నైనాసరే.సింగు చూస్తాండగా చచ్చినా తేనునేను డబ్బు."

"నిజంవేలే. అదే మంచిదేంగో!"

మర్నాడు వుదయం వూళ్లో వాళ్లందరూ చెఱకు నరుకు తున్నారు. హోరీగూడా కత్తిపుచ్చుకుని వెళ్లాడు పొలంలోకి; సహాయం చేసేందుకని శేఖర్ గూడా వెళ్లాడు. పున్ని ,ఝునియా, ధనియా సోనా - అందరూ-వెళ్లారానాడు చేనులోకి; తలాకపనీ చేస్తున్నారు. అప్పులిచ్చిన వాళ్లందరికీ తెలిసింది ఈనాడు చెఱకు నరుకుతున్నారని. ఒకవైపునుండి కోమటమ్మ, మరోవైపు నుండి మంగ్రూ, యింకోవైపునుండి ఝింగురసింగూ, శాస్త్రి అంతా - పరుగెత్తుకొచ్చారు. కోమటమ్మ కాళ్లకి పాంజేబు పట్టాలు పెట్టుకుని, చేతులకి మోచేతుల్దాక గాజులు వేసుకుని, చెవులకి చెంపస్వారాలు పెట్టుకొని, కళ్లకి కాటుక పెట్టుకుని, వృద్ధవధువులా వచ్చింది. "నా కివ్వాల్సిందక్కడ పెడితేగాని చెరుకు నరకటానికి వీల్లేదు. చూస్తావుంటే మేస్తాపోయిందని రెండేళ్లయ్యింది. కాండబ్బన్నా యిచ్చినపాపాన పోయా? వడ్డీయే అయ్యింది యాభైదాకా అంటూ లేచింది.

"పనికి అడ్డంరాకమ్మా. డబ్బురాగానే నీకూ ఇచ్చేస్తా నన్నాగా. ఇట్లా మెళ్లమీద కూర్చుంటే ఎట్లాచెప్పు. వూరొదిలి పారిపోతున్నానా ఏమన్నానా? ఇంత తొందరగా చావురాదులే. చేలో చెరుకు చేలోనేవుంటే డబ్బెక్కడ్నుంచొ...
అంటూ బ్రతిమాలుకోబోయాడు హోరీ.

హోరీ చేతిలో కత్తి లాక్కుంది కోమటమ్మ. లాక్కుని, "మరీ ఇంత నీతంటూ లేకండా పోయిందేఁ? అందుకనే మీాగతిట్లా వుంది!" అన్నది.

అయిదు సంవత్సరాలైంది కోమటమ్మదగ్గర అప్పు తెచ్చుకుని. తెచ్చుకున్నది ముప్పైఫ రూపాయలు. మూాడు సంవత్సరాల్లో వందఐకూర్చున్నది. తర్వాత నోటు వ్రాశారు. రెండు సంవత్సరాలకూ యాభై అయిపోయింది వడ్డీ.

"అదికాదమ్మా! దేవుఁడిదయే వుండాలిగాని నీతెందుకు తప్పుతాఁవఁమ్మా? అసలు ఫాయిదాల్తో తీర్చేస్తాగానీ అప్పు" అని మాటలుచెప్పి, కోమటమ్మని సాగనంపాడు హోరీ.

ఆవిడ అట్లా వెళ్లిందో, లేదో, మంగ్రూ వచ్చేశాడు; నల్లగా, బొజ్జ వ్రేళ్లాడేసుకుంటూ; కరవబోతున్నాడా అన్నట్లు ముందు రెండు పారపళ్లు పెట్టుకుని; నెత్తిమీద టోపీ, వంటిమీద దుప్పటి; వయసు యాభై వుంటుందేమో; చేతిలో కర్రవుంటేనేగాని నడువలేడు. ఈ మధ్య వాతం గూడా చేసింది; దానికితోడు దగ్గు. "ముందు నా డబ్బిచ్చెయ్యవయ్యా హోరీ! మేం ఇచ్చింది అప్పయ్యా అప్పు; ధర్మంకాదు, తెలిసిందా? మూాడేళ్లయ్యింది వడ్డీలేదు ఏఁవీఁలేదు. నా డబ్బు జీర్ణం అయ్యే డబ్బు కాదయ్యోయ్. నువ్వు చచ్చినా వదిలిపెట్టను ఏమనుకున్నావో."

శేఖర్ కాస్త చిలిపివాడుగూడాను. "ఐతే గాభరా పడతాఁవెందుకయ్యా షావుకారూ? చచ్చినా వదిలిపెట్టనని ...న్నే వుంటివి. కాకపోతే బాగా ఆలస్యం ఐతే రెండు ...లో స్వర్గంలో ఇద్దరూ కలుసుకోటానికి.

దేవుఁడెట్లాగో చూస్తాఁడక్కడ. ఆయనముందే ఫైసల్. చేసుకో వచ్చు బాకీలన్నీ" అన్నాడు.

మంగ్రూకు కోపం వచ్చింది. శేఖర్‌ని నాలుగు తిట్టాడు. "డబ్బు కావాల్సొచ్చినప్పుడొచ్చి కాళ్ళు పట్టుకుంటారూ? ఇవ్వాల్సొస్తేనేఁవో యేడుస్తారా? బలే వాళ్ళయ్యా? ఇల్లంతా వేలాం వేయించకపోతే అప్పుడడగండి నన్ను!" అంటూ లేచాడు.

అంతటితో వదలిపెట్టలేదు శేఖర్. "సరేగాని న్యాయం చెప్పవయ్యా. నువ్విచ్చిందెంత? మూడేళ్ళల్లో వంద్దైందే?" అనడిగాడు.

"వడ్డీ చెల్లకట్టకపోతే పెరక్క కూర్చుంటుందేఁవిఁటీ మరి!"

"అదికాదు. నువ్విచ్చిందెంత? యాభై య్యేగా!"

"ఎన్నిరోజులైందో. అదీ చూడు!"

"ఐదారేళ్ళయ్యిందేఁవోఁ!"

"ఐదారేళ్లా? పదేళ్ళయింది! పదకొండోది దొరబడ తాంది!"

"యాభై ఇచ్చి, మూడొందలు తీసుకోటానికి సిగ్గు గూడా వెయ్యటంలా నీకు?"

"యెందుకు సిగ్గు? డబ్బిచ్చి అడుగుతున్నానా, పూరి కేనా ఇమ్మంటన్నానా!"

మంగ్రూ షావుకారునిగూడా, ఎట్లాగోట్లా ... మాలుకుని, సాగనంపుకున్నాడు హోరీ.

వుమ్మడి వ్యవసాయం చేస్తున్నాడు; విత్తనాలిచ్చి, సగంపాలు తీసుకుంటున్నాడు. ఆయనతో పోట్లాట పెట్టుకోవడం ఏమంత మంచిదిగాదు. మిల్లు మానేజరుతో మొదటే మాట్లాడేశాడు ఝింగురసింగు. కొట్టిన చెఱకు బళ్ళకెత్తుతున్నారతని మనుషులు. బళ్ళు నదివరకూ వెళ్తాయి; అక్కడ పడవల్లో కెక్కిస్తారు చెఱకుని. నది వొక అరమైలు దూరం వుంటుంది. యాభై బళ్ళ చెఱకుని, వొక్కసారే మోసుకుపోగలదు పడవ. ఈ పడవల అరేంజ్‌మెంట్ చేసింది ఝింగురసింగే. అందుకని ఆయన పేరుగూడ అర్థణామందాన పెరిగింది ఆ యిలాకాలో.

'తూకం' ప్రారంభించేప్పటికి, మిల్లుదగ్గరకి వెళ్ళిపోయాడు సింగు. కాటాదగ్గర కుర్చీవేసుకుని కూర్చున్నాడు. తూకంవేసి, ఖరీదు కట్టి, డబ్బు వసూలుచేసి, తన బాకీ జమ కట్టుకొని, ఏమైనా ఇంకా మిగిలిందివుంటే రైతులచేతుల్లో వేస్తున్నాడు. ఆసామీలు ఎంత ఏడ్చినా, ఏమని మొత్తుకున్నా లాభం లేకపోయింది.

హోరీకి నూటయిరవై రూపాయలొచ్చినయి. వడ్డీతో సహా తనకు రావలసిన డబ్బంతా మినహాయించుకుని, పాతిక రూపాయలు హోరీచేతిలో పెట్టాడు సింగు.

"ఈ డబ్బు తీసుకునిమాత్రం ఏంచేస్తాన్నేను. అది గూడా మీరే తీసుకోండి. కూలీ, నాలీ చేసుకుని బ్రతుకుతాలే ఎట్లాగో" అన్నాడు హోరీ, కష్టంవేసి.

ఆ పాతికా నేలమీదకు విసరేసి. "తీసుకుంటే తీసుకో; [illegible]త్తే వూరుకో. నీమూలాన ఇంతవరకూ తిన్నచీవాట్లు [illegible] దయదలచే ఇస్తున్నా నీకు. అక్కడ

జమీందారుగారు కేకలేస్తున్నాడు జుల్మానా జమకట్టమని" అని కసురుకున్నాడు ఝింగురసింగు.

వంగి, క్రిందపడ్డ డబ్బేరుకుని, మిల్లుబయట అడుగు పెట్టాడు హోరీ. ఇంతలోనే యముడిలా ప్రత్యక్షమయ్యాడు నోఖేరాం. ఆ పాతిక రూపాయలూ ఆయనచేతిలోపెట్టి, దారి పట్టాడు హోరీ. పాపం! అతనితల తిరిగిపోయింది.

శేఖర్‌కి గూడా ఒక నూటయిరనై వచ్చినయ్. బయటికి రాగానే పటేశ్వరి పట్టుకున్నాడు. "నాదగ్గర డబ్బులేదు; నీయిష్టం వచ్చింది చేసుకో." అన్నాడు శేఖర్.

"చెరుకమ్మావా, లేదా?" అన్నాడు పటేశ్వరి కోపంగా.

"అమ్మాను."

"చెరుకమ్మి బాకీ తీర్చేస్తానన్నావుగా."

"అన్నాను."

"అయితే మరి ఇవ్వవేఁ? అందరికీ ఇచ్చావా, లేదా?"

"ఇచ్చా."

"అయితే మరి నాకివ్వవేఁ ?"

"నాదగ్గిర మిగిలింది, నా బిడ్డలికే చాలదు."

"ఏఁవఁనుకుంటున్నావోగాని, నాడబ్బు నువ్వే కక్కుతావోయ్. కాళ్ళమీదపడి, బతిమాలుకుని, మరీ ఇస్తావ్. ఇవ్వాళే యిచ్చేస్తావ్. తెలుసా!? ఒక్క రిపోర్టు రాసిపారేశానంటే, ఆరునెల్లాళ్ళు కూర్చుంటావ్. ఒక్కరోజు గూడా అటూ ఇటూ కాకుండా. రోజూ జూదం ఆట్టం అనుకున్నావులా వుంది. ఒక్క రిపోర్టు చాలు నీ బతుక్కి." అని చెక్కే వెళ్ళిపోయాడు పటేశ్వరీలాల్.

శేఖర్ నడచివెళ్ళి, అన్నను కలుసుకున్నాడు. ఇద్దరూ ఏమీ మాట్లాడలేదు కాస్సేపు. పటేశ్వరీలాల్ బెదరింపులు వింటే ఇద్దరికీ నెర్రెత్తింది. "వాడి డబ్బు వాడికిచ్చెయ్యరా శేఖర్. నాఁహూటేను. ఈ ఏడు చెరుకే వెయ్యలేదనుకో. నేనూ అట్టాగే అనుకుని మనసు బిగబట్టుకున్నా" అన్నాడు హోరీ.

" ఇచ్చేస్తాలే అన్నయ్యా. ఇవ్వక నేనుమాత్రం ఏం చెయ్యగల్ను " అన్నాడు శేఖర్ బాధపడుతూనే.

మరికాస్త దూరం నడచేప్పటికి గిరిధర్ ఎదురయ్యాడు. కల్లుత్రాగి, వూగులాడుతున్నాడు. యిద్దర్నీచూచి, "డబ్బంతా కాజేసాడే బాబాయ్, సింగు. కాండబ్బుగూడా తీసుకోనివ్వలా. ఎంతేడ్చినా, ఎంత బతిమాలుకున్నా, పాపిష్టి ముండాకొడుకు మనసు కరగందే" అన్నాడు.

"కాండబ్బుగూడా తీసుకోనివ్వకపోతే కల్లెట్లా తాగావ్" అనడిగాడు శేఖర్.

గిరిధర్ పొట్ట తడుముకుని, "పొద్దుట్నుంచీ పచ్చి మంచి నీళ్ళు ముట్టుకుంటే ఆవుమాంసం తిన్నంత వొట్టు. ఒకణా చెవులో పెట్టుకునొచ్చా. ఆ అణాపెట్టి కల్లుతాగా. ఏటి పొడుగుతా కష్టపడ్డాగదా వొకణా కల్లన్నా తాక్కపోతే ఏం బతుకులే అనుకుని తాగా. అయినా మత్తేఁవీఁ ఎక్కలేదులే. అణా కల్లుతాగితే మత్తేఁవెక్కుతుంది? చూచినాళ్ళందరూ బాగా తాగాడనుకోవాలని వూగుతున్నా; అంతే. బాకీమట్టుకు తీరిపోయింది. బాబాయ్, నమ్ముతావో నమ్మవోగాని, నేను ...రనై; తీర్చింది నూటఅరనై. ఏం కలికాలఁవోఁ"

హోరీ ఇంటికి వెళ్లగానే రూప నీళ్లుపట్టుకొచ్చి యిచ్చింది, సోనా పొగాకుపాయ అందించింది, భార్య వేపుడు శనగలు పళ్లెములో పోసుకొచ్చి ఇచ్చింది. అందరూ హోరీ వంక ఆశగా చూస్తూన్నారు. ఝునియా గూడావచ్చి, మండిగం దగ్గర నిలబడింది. విచారంగా కూర్చున్నాడు హోరీ. కాళ్లు కడుగుకో లేదు; చుట్ట చుట్టుకో లేదు; శనగలు తినబుద్ధి కా లేదు. ఎవర్నో హత్యచేసి, వచ్చిన మనిషిలా సిగ్గుతోనూ దుఃఖం తోనూ క్రుంగిపోతున్నాడు.

"కాటాయేశారా?" అని అడిగింది ధనియా.

"నూటిరవై వచ్చినై. అన్నీ అక్కడే చెల్లగట్టేశా. ఎర్రని ఏగానీగూడా మిగల్లా."

ధనియా చిర్రుమని లేచింది. "అబ్బబ్బ! ఇంత తెలివి తక్కువ దద్దమ్మనెందుకు పుట్టించాడో దేవుడు. పెళ్ళయ్యింది మొదలు, సుఖపడ్డరోజంటూ లేదు. శుబ్బరంగా చచ్చిపోయినా పోయేది ఈ బాధలన్నీ పడకుండా. వచ్చిం డబ్బంతా ఇచ్చొచ్చాడంట, బుద్ధిలేకపోతే సరి. ఇక ఇప్పుడేంపెట్టి కొంటా మెద్దని? నాగలి మెడ నెవళ్ళేసుకుంటారు? నువ్వన్నా ఏసుకోవాలి; లేకపోతే నేనన్నా ఏసుకోవాలి! ఇన్నేళ్ళొచ్చినై నెత్తిమీదకి, ఆమాత్రం ఆలోచనలేకుండా ఎట్టాపోయిందీ అంట? ఆమాత్రం దాచుకోటం గూడా చేతకాకపోయిందీ. ఇంకేం అందరం కలిసెళ్ళి, కట్టగట్టుకుని, నదిలోపడిచద్దాం పద! ఇట్టా కుళ్ళి, కుళ్ళి చావటంకంటే అట్టా ఒక్కసారే యిరగడై పోవటం మెరుగు. ఎంతకాలం అని బతుకు— మేం గడ్డితిని బతకలేం బాబూ, కావాల—

అంటూనే నవ్వింది ధనియా. ఇప్పటికిగాని, తెలిసి రాలేదు ధనియాకు; చేతిలో డబ్బున్నప్పుడు, మన చేతిలో డబ్బున్నదని అప్పులవాళ్ళకు తెలిసినపుడు, తెలిసి వచ్చి నెత్తిమీద కూర్చున్నప్పుడు, ఆ అప్పులవాళ్ళ బారినుండి తప్పించుకోవటం యెంత కష్టమో!

హోరీ తలవంచుకుని తన దురదృష్టాన్ని తలచుకుంటూ, బాధపడుతూన్నాడు. ధనియా నవ్వటం చూడలేదతను. "ఎక్కడో వొకచోట కూలి దొరక్కుండా పోతుందంటలే; కూలి చేసుకునే బ్రదుకుదాం." అన్నాడు.

"యీ వూళ్ళో కూలికి పిలిచేవాళ్ళేవల్లు? ఐనా, ఇంత బ్రదుకూ బ్రదికి..." అని ధనియా అనబోతుంటే, "అదేవింటే కూలి చెయ్యటం యేం తప్పు? కూలివాడదృష్టవంతుడైతే రైతౌతాడు; రైతు దురదృష్టవంతుడైతే కూలివాడౌతాడు! మన నొసట కూలి చెయ్యాలని, రాసివుండకపోతే యీ తిప్పలే వచ్చేయిగాదు; ఆవూ చచ్చిపోయేదిగాదు, చేతికి అక్కర వచ్చిన కొడుకూ దేశాల పాలయ్యేవాడుగాదు" అన్నాడు హోరీ.

ధనియా కూతుళ్ళనీ, కొడల్నీ కసురుకొంది. "మీ కింకేవీం పనుల్లేవంటే, ఇక్కడకొచ్చి కూర్చొన్నారు? పొండి! బజారు కెళ్ళీ, సంతకెళ్ళీ, వచ్చేటప్పుడు పిల్లలకని ఏమన్నా కొనుక్కొచ్చా డనుకుంటన్నారా? అంతగీత మనకెక్కడుందిలే! చేసుకునే వాళ్లకి దొరుకుతుందిగాని డబ్బు, మనలాం ...ఘూ తెలవదు; తినటమూ తెలవదు, కట్టు

కోవటమూ తెలవదు; మనకెందుకు దొరుకుతుందే డబ్బు? పాతేసుకోటానికా?"

"ఎక్కడుందే పాతర!" అంటూ పగలబడి, నవ్వాడు హోరీ.

"పాతరా? పాతేసినకాడే వుంది! ఎక్కడుందో తెలిసినా మానవాయె. డబ్బులేదని వొకటేపడుప్పు ఏం? పిల్లలకి వొక పావలాపెట్టి ఏమన్నా కొనుక్కురాకూడదూ? ఆ ఝింగురసింగు తోనే చెప్పకపోయా, వొక రూపాయియ్యి లేకపోతే నీ బాకీ తీర్చను; కావాలంటే కోర్టుకెళ్లు అని!"

హోరీ సిగ్గుపడ్డాడు. నిజంగానే ఆ పాతికరూపాయలూ, నోఖేరాంకు ఇవ్వకపోతేనే బాగుండేదేమో. అంతగా కోపం వస్తే ఇంకో నాలుగైదణాలు వడ్డీ పెంచేవాడు. అంతేగా. ఇప్పుడేమనకుంటే ఏం లాభం? అంతా ఐపోయింతర్వాత! ఝునియా లోపలికివెళ్లింది. సోనాని పిలిచి "మీ నాన్నని చూస్తే నా కడుపు తరుక్కుపోతాంది. పాపం! తిరిగి, తిరిగి అలసిపోయి, ఇంటికొస్తే అమ్మ కేకలేస్తందయ్యో. అప్పులాళ్లొచ్చి యిస్తావా, చస్తావా అని కూర్చుంటే ఎవళ్లు మాత్రం యేంచేస్తారు?"అన్నది.

"అయితే మరి యెట్లో?"

"అప్పిచ్చినవాడు అప్పు తీర్చమంటాడుగాని నీ కష్టాలన్నీ వింటా కూర్చుంటాడేంవిటి?"

"అమ్మే అక్కడుంటేనా; వెధవల్ని యేడిపించొచ్చేది గాదూ!"

ఝునియా పరాచికం ఆడింది. "ఐతే యిప్పుడు మాత్రం మునుకుపోయిందిదేంవుంది? నువ్వుకాస్త నవ్వుతూ, పేలుతూ

మాట్లాడితే అప్పులవాళ్ళు అప్పుల మాటేయెత్తరు. మీ యింటి దరిద్రమే వదిలిపోతంది!"

రెండు చేతుల్తోనూ వదినె నోరుమూసి, "ఇక చాల్లే. వూరుకో లేకపోతే చెప్పేస్తా యేంవనుకున్నావో. మాతాదీన్ మాటలన్నీ ఇప్పుడే చెప్పేస్తా అమ్మకి" అన్నది సోనా.

"ఏంవని చెప్తావేంటి అమ్మకి? ఏంవన్నా వుంటేనా అసలు చెప్పటానికి? ఏదో వొకవంకబెట్టుకుని ఇంట్లోకొచ్చే వాణ్ణి వద్దనేట్టా అనను? ఐనా వచ్చేం పట్టుకెళ్తన్నాడు గనక! కాస్త తీపిమాటలు చెబుతాను; అంతేగా! వచ్చినప్పుడల్లా ఏదో వొకటి యిచ్చెళ్తన్నాడు. నాలుగు తీపిమాటలు చెప్పి, వదుల్కోవటం బాగా తెలుసునాకు. ఇంకొకళ్ళ మాటల మోసం లోపడి, నా నీతినమ్మకనేంత చెడిపోయిందాన్నిగాదు నేను. ఇట్టాంటి వాళ్ళని చాలామందిని చూశాను. ఆఁ. అక్కడ మీ అన్నయ్యేవర్నన్నా వుంచుకున్నాడని తెలిస్తే మాత్రం ఇక్కడ నన్నెవళ్ళూ ఆపలేరు. ఇంతవరకూ ఆయన అట్టాంటి పనులు చెయ్యరనే నా నమ్మకం. పాపం! నామూలాన్నేగా ఆయనట్టా దేశాల పాలయ్యింది. చచ్చినా ఆయన్ని మోసం చెయ్యన్నేను. నవ్వుతూ మాట్లాడినంత మాత్రాన పోయేదేవుందిగాని, ఒకళ్ళుండగానే, ఇంకొకళ్ళని మరిగితే ఎవరికీ కాకుండా, రెంటికీ చెడ్డరేవళ్ళమై పోతాం."

శేఖర్ వచ్చి హోరీని పిలిచాడు. పటేశ్వరికి ఇవ్వవలసిన బాకీ చేతిలో పెట్టి, "నువ్వెళ్ళి ఈ డబ్బు పటేశ్వరీ కిచ్చేసెయ్యన్నయ్యా! ఇందాక నాకేంవీఁ తోచకుండా పోయింది" అన్నాడు.

డబ్బు తీసుకుని హోరీ లేచాడో లేదో, ఎక్కడినుండో శంఖధ్వని వినవచ్చింది. వూరి చివర ధ్యానసింగనే ఠాకూర్ వున్నాడు. మొన్నటివరకూ మిలిటరీలో వుండేవాడు. పది సంవత్సరాలైంది మిలిటరీలో చేరి. ఈ మధ్యనే శలవు తీసుకుని వచ్చాడు. బాగ్దాడ్, సింగపూర్, బర్మాలన్నీ తిరిగివచ్చాడు. ఇప్పుడు పెళ్లి చేసుకోవాలని మధన పడుతున్నాడు. అంచేతనే పూజాపునస్కారాలుచేస్తూ, బ్రాహ్మణుల్ని సంతృప్తి పరుస్తున్నాడు.

"సప్తాధ్యాయాలూ పూర్తయినై అనుకుంటా; హారతి పడ్తున్నారు" అన్నాడు హోరీ.

"ఆఁ, అంతే ననుకుంటా. పద మనంగూడ కళ్ల కద్దుకుని వద్దాం." అన్నాడు శేఖర్.

ఆలోచిస్తూ "నువ్వుపద, నేనూ ఇప్పుడే వస్తాలే" అన్నాడు హోరీ.

ఊళ్లోకి వచ్చిననాడు ఇంటింటికీ ఒక శేరు మిఠాయి చొప్పున వూరంతా పంచిపెట్టించాడు ధ్యానసింగు. అదీగాక, హోరీ యెక్కడ కన్పించినా, ఆగి, మంచీచెడ్డా మాట్లాడేవాడు. అట్లాంటి మనిషి ఇంటికి, హారతికని వెళ్ళేప్పుడు తృణమో, ఫణమో లేకుండా వెళ్ళడం మంచిదిగాదు.

హారతిపళ్ళెం గూడ ఆయన చేతిలోనే వుంటుంది. అతను చూస్తూండగా, పళ్ళెంలో యేమీ దక్షిణ వుంచకుండా, హారతిని కళ్ళకు అద్దుకోవటం యెట్లా? ఇంతకంటే అసలే వెళ్ళకుండా వుంటే బాగుంటుంది. ఇంతమందిలో హోరీ రాలేదని అజ కనుక్కునేవాళ్ళు మాత్రం యెవరుంటారు. ఎవరొచ్చారో,

యెవరు రాలేదో కనుక్కునేందుకేమైనా రెజిష్టరు పెట్టుకు కూర్చున్నారేమిటి? మంచంమీద నడుం వాల్చాడు హోరీ.

కాని అతని మనసు మెలికలు తిరుగుతోంది. చేతిలో డబ్బులేదు; యెఱ్ఱని యేగాని గూడ లేదు. అతనిప్పుడు హారతిని గురించీ, తద్మాహాత్మ్యాన్ని గురించీ, పుణ్యాన్ని గురించీ కాదు ఆలోచిస్తూన్నది. భగవంతుడి హారతిని భక్తితో, శ్రద్ధతో స్వీకరిస్తే చాలునని అతనికీ తెలుసును. కాని మరి మర్యాద? నలుగురిలో నగుబాటు!?

లేచి కూర్చున్నాడు. మర్యాద అంటే అంత భయపడటం దేనికి? మర్యాద, మర్యాద అనుకుంటూ హారతినీ, పుణ్యాన్నీ వదలుకోవటం యెందుకు? లోకులు నవ్వుతారూ? నవ్వుకోనీ! అతనికేమీ బాధలేదు. పాపపు పనులు చెయ్యనీకుండా భగవంతుడు కాపాడితే, అదే పదివేలు.

లేచి, ధ్యానసింగుగారి యింటికి బయల్దేరాడు.

# 15

మిర్జా ఖుర్షేద్‌గారి కొక క్లబ్ వుంది; కచ్చేరీ వుంది; అఖాడా వుంది. అంచేత ఎప్పుడూ నలుగురు కూడుతూ వుండే వారు. అంత దగ్గరలో యింకో అఖాడా లేకపోవటంచేత, ఎప్పుడూ నలభై, యాభైమంది ఆటగాళ్ళుగూడా చేరుతూండే వారు. మీర్జాగూడ వాళ్ళతో కలిసి, ఆటలవీ ఆడుతుండే వాడు. ఆ పేటలోవాళ్ళందరికీ, ఆయన ఆఫీసే న్యాయస్థానం. పంచాయితీ అక్కడే జరిగేది. చుట్టుప్రక్కలెవళ్ళు పోట్లాడు కున్నా— భార్యా, భర్తలు కానీండి, అత్తా కోడళ్ళుకానీండి, అన్నదమ్ములు కానీండి— అక్కడికే వచ్చేవారు తమ తమ తగవులు తీర్చుకునేందుకు. ఆ పేటలోని సాంఘిక జీవితానికీ, రాజకీయ ఆందోళనకూ అదే కేంద్రం. అప్పుడప్పుడూ బహి రంగసభలుగూడ జరుగుతుండేవి. వలంటీర్లక్కడే సమావేశ మయ్యేవారు; ఇక్కడే తమ కార్యక్రమాన్ని చర్చించుకుని, రూపొందించుకునేవారు. గడచిన సమావేశంలో పట్టణ కాంగ్రెసుకమిటీ కార్యకర్తగా శ్రీమతి మాలతి ఎన్నుకోబడింది. అప్పటినుండి ఈ స్థల ఔన్నత్యం యినుమడించింది కూడాను.

గోవర్ యిక్కడికివచ్చి సంవత్సరం ఐపోయింది. ఇప్పు డతను యిదివరకటిలా అభమూ, శుభమూ తెలియని అమాయకుడుగాడు; పల్లెటూరు మనిషి అసలేకాదు. ప్రపంచం చూచాడు; లోకంపోకడ తెలుసుకున్నాడు. ఐతే ఒకవిధంగా, యింకా అతనిలో పల్లెటూరు లక్షణాలు వున్నయి. ఇప్పటికీ కానీ డబ్బు ఖర్చుపెట్టాలనంటే పదిసార్లు ఆలోచిస్తాడు, స్వార్థం వదలడు, పని అంటే భయపడడు, చిన్న చిన్న విషయాలకు బేజారైపోడు. కాని పట్టణం గాలికూడ సోకింది. మొదటి నెలంతా నౌకరీ చేసుకునే బ్రతికాడు. కడుపుకాల్చుకుంటూనే, కొంతడబ్బు వెనక వేసుకున్నాడు. తర్వాత చిలగడదుంపలూ, బఠాణీలూ, పెరుగుముంతలూ అమ్మటం నేర్చుకున్నాడు. ఇందులో కొంత లాభం కనబడేప్పటికి, ఆ నౌకరీ వదలిపెట్టేశాడు. వేసవికాలం వచ్చేప్పటికి శర్బత్ దుకాణం తెరిచాడు. ఇచ్చి పుచ్చుకోవటంలో నిక్కచ్చి మనిషి కావటంచేత, మంచి పలుకుబడి సంపాదించాడు. శీతాకాలం వచ్చేప్పటికి శర్బత్ దుకాణం యెత్తివేసి, వేడివేడి టీ దుకాణం పెట్టాడు. యెట్లాలేవన్నా కనీసం రోజుకు రెండు మూడు రూపాయలు కళ్ళ జూస్తున్నాడు. తలకు క్రాపింగు పెట్టించుకున్నాడు, కాలరుచొక్కాలు తొడుగుతున్నాడు, తెల్లటి పంచ కట్టుకుంటున్నాడు, బెల్టు చెప్పులు వేసుకుంటున్నాడు. ఒక వున్ని దుప్పటి, యెర్రటిది, కూడా కొనుక్కున్నాడు. కిల్లీలు నమలటం, సిగరెట్లు కాల్చటం గూడా నేర్చుకున్నాడు. అప్పుడప్పుడూ బహిరంగ సభలకు వెళ్లివస్తూ వుండటంవల్ల కొద్దిగా రాజకీయాలుగూడ తెలుసుకోగలిగాడు. దేశం అంటే యేమిటో, వర్గం అంటే యేమిటో తెలుసుకోగలి

గాడు. సంప్రదాయసిద్ధంగావచ్చే ఆచారాలంటే వున్న గౌరవం తగ్గింది; లోకు లేమనుకుంటున్నారోనన్న భయం సన్నగిలింది. ఊరొదిలిపారిపోయిరావటంలోఅర్థంలేదనిఅర్థమైందతనికి. ఇక్కడ తాను చేసిన పనులకంటె ఘోరమైన తప్పిదాలు చేసినవాళ్లు గూడ వున్నారు; ఐనా వాళ్లెక్కడికీ పారిపోలేదు. ఐనప్పుడు లోకానికింతగా భయపడవలసిన అవసరం యేముంది? ముఖం చాటువేయవలసిన అగత్యం యేం వచ్చింది?

ఇన్నిరోజులు జరిగినా, యింతవరకూ; ఒక్క కానీ గూడా యింటికి పంపలేదు అతను. తల్లిదండ్రులు డబ్బును పదిలంగా దాస్తారనే నమ్మకంలేదు అతనికి. వాళ్ళు డబ్బు దొరికితే చాలు, కోతుల్లా కొండెక్కి, కూర్చుంటారు. తండ్రి 'గయ' వెళ్ళివస్తే బాగుంటుందనుకుంటాడు. తల్లి నగలు చేయించేస్తేసరి తీరిపోతుందనుకుంటుంది. ఇలాంటి అర్థంలేని పనులు చేసేందుకుగాదు అతను డబ్బు కూడబెట్టేది. ఇప్పుడతను చిన్న వడ్డీవ్యాపారస్థుడుగూడాను. ఇరుగుపొరుగున వుండే జట్కావాళ్ళకీ, మంగళ్ళకీ, చాకళ్ళకీ అప్పులిస్తున్నాడు. ఈ పది, పదకొండు నెలలనుండీ, కష్టపడి, శ్రమకోర్చి, తెలివితేటల్తో సంపాదించాడు డబ్బు; ఝునియాంనిగూడ తీసుకువచ్చి, ఇక్కడే కాపురంపెట్టేస్తే పోతుందని ఆలోచిస్తున్నాడు.

ప్రొద్దువాలింది. రోడ్డుప్రక్క పంపుక్రింద స్నానంచేసి వచ్చాడు. మాపటికని బంగాళాదుంపలు వుడకేస్తున్నాడు. ఇంతలో మీర్జా ఖుర్షేద్ వచ్చి, గుమ్మంలో నిలుచున్నాడు. గోవర్ యిప్పుడాయనవద్ద నౌకరీ చేయుటంలేదు. ఐనా మీర్జా అంటే అతనికి వల్లమాలిన గౌరవం; ప్రాణాలిచ్చేందుకు గూడ

సంసిద్ధమే. గుమ్మందగ్గరకు వచ్చి "యేం దొరగారూ!" అన్నాడు గోవర్.

మిర్జా నిలబడే వున్నాడు. "నీదగ్గరేమైనా డబ్బువుంటే యియ్యాలోయ్. మూడురోజుల్నుంచీ బుడ్డి ఖాళీగావుంది. మన సంతా చీకాగ్గావుంది" అన్నాడు.

ఇంతకు పూర్వంగూడా, రెండుమూడుసార్లు మిర్జాకు అప్పు ఇచ్చాడుగోవర్. కాని, ఇంతవరకూ, యిచ్చింది తెచ్చుకోలేకపోయాడు. అడగాలంటేభయం. పుచ్చుకున్నది తిరిగియిచ్చే అలవాటు మిర్జాకులేదు. పాపం ఆయనచేతిలో డబ్బు నిలవటంఅంటూ వుండదు; అటునుండివస్తే యిటునుండి మాయం ఐపోతుంది. నేనివ్వననికాని, నాదగ్గరలేదనికాని, అన లేక పోయాడు గోవర్. త్రాగుడును తిట్టడం ప్రారంభించాడు- "యెందుకండీ బాబుగారూ, మీకీపాడలవాటు. వదిలిపెట్టేసెయ్య గూడదండీ. ఏంమిటండీ లాభం ఈ వెధవత్రాగుడువల్ల?"

మిర్జా లోపలికి రెండడుగులువేసి, మంచంమీద కూర్చున్నాడు. "నేనీ అలవాటు మానుకోవటం ఇష్టంలేక, హుషారుపడి త్రాగుతున్నాననుకుంటున్నావు నువ్వు. ఇది లేక పోతే నా ప్రాణాలే నిలవ్వు. నువ్వేం భయపడనద్దు, నీడబ్బు దమ్మిడీలతోసహా యిచ్చేస్తానుగా" అన్నాడు.

గోవర్ లొంగలేదు. "నిజంగానే బాబుగారూ! నా దగ్గ రుంటే తమరి కెప్పుడైనా లేదని అన్నానా?"

"రెండు రూపాయలైనా లేవూ?"

"ఇప్పుడు లేవు బాబుగారూ!"

"సరే. నా వుంగరం తాకట్టుపెట్టుకో" గోవర్‌కు ఆశ కలిగింది; కాని మాట మార్చేదెట్లా?

"అదేమిటండీ బాబుగారూ! వుంటే యివ్వనంటి మీకు? వుంగరం యెందుకండీ" అన్నాడు.

మీర్జా దిగాలుపడిపోయినట్లు కన్పించాడు. "ఇంక నిన్నెప్పుడూ అడగను గోవర్. నాకు నిలబడాలన్నా, కూర్చోవాలన్నా తోచకుండావుంది. ఈ త్రాగుబోతుమూలాన నేనీనాడు బిచ్చగాడిలా బ్రతిమలాడవలసి వచ్చింది; ఐనా వదల్లేకుండా వున్నాను" అంటూ అర్థించాడు.

తనదగ్గర లేదంటే లేదన్నాడు గోవర్. నిరాశతో, వెళ్ళిపోయాడు మీర్జా. ఆ పట్టణంలో, ఎంతోమందితో పరిచయం వుంది మీర్జాకు. ఎంతోమందికి సహాయంచేశాడు. ఐనా వాళ్ళ దగ్గరకు డబ్బుకోసం వెళ్ళడమంటే తలనొప్పి మీర్జాకు. కావాలంటే యిట్లా అని డబ్బుని వర్షంలా కురిపించగలడు. ఐనా డబ్బు అంటే గౌరవం లేదాయనకు. వచ్చిన డబ్బు యేదో వొక విధంగా ఖర్చు పెట్టేసెయ్యడమే ఆయన చరమాశయం.

ఉడికిన బంగాళాదుంపలు దించి, పొట్టు వలుస్తున్నాడు గోవర్. ఒక్క సంవత్సరంలో తలలు మార్చెయ్యగల శక్తి సంపాదించాడతను. డబ్బు కూడబెట్టడంలో మొనగాడై పొయ్యాడు. ఇప్పుడతను వుండే గుడిసె మీర్జాదే. ఎంతలేదనుకున్నా ఐదురూపాయలైనా ఔతుంది అద్దె. మీర్జా అడగనూ లేదు; గోవర్ యివ్వనూ లేదు. ఈ గుడిసెకు అద్దె వసూలు చెయ్యవచ్చుననే వుద్దేశం గూడా కలిగి వుండదు మీర్జాకు.

ఇంకాస్సేపటిలో, యెవరో జట్కా-వాలా వచ్చాడు అప్పడిగేందుకు. పేరు అల్లాదీన్. బోడిగుండు. చిక్కబడ్డ గడ్డం. మెల్లకన్ను. అతని కూతురు అత్తింటికివెళ్తోంది.ఐదురూపాయలు అవసరం. అణా వడ్డీచేసి, యిచ్చాడు గోవర్.

సలాంచేస్తూ " యెంతకాలం అని వుంటా యిట్టా చెయ్యి కాల్చుకుంటా. పిల్లా, జల్లాని పిలిపించుకోరాదూ " అన్నాడు అల్లాదీన్.

పట్టణంలో ఖర్చంటే మాటలా అన్నాడు గోవర్ " వచ్చేది పెట్టే యిల్లేగడవదు !" అన్నాడు.

అల్లాదీన్ బీడీ ముట్టించాడు ; "ఖర్చుమాట అల్లా చూచుకుంటాడు. కావలసినంత తీరిక గూడా వుంటుంది. గోవర్ స్వంతానికి పెట్టే ఖర్చుతోనే గడచిపోతుంది కుటుంబం అంతా. ఆడవాళ్ళ చేతుల్లోనే వున్నది ఆ ఐశ్వర్యం. ఇంతెందుకు ! తానిక్కడ వొంటిరిగావుండి సంపాదించుతూన్నపుడు తింటానికిముట్టుకు సరిపోయేది. చివరికి ఒక కిల్లీ వేసుకుందామన్నా, ఒక కట్ట బీడీలు కొనుక్కుందామన్నా చేతిలో డబ్బుండేది గాదు. ఇంటికి అలసి, సొలసి వచ్చి, గుర్రానికి దాణావేసి, మళ్ళీ నానాభాయి దుకాణానికి పరుగెత్తి...తీరిక దొరికేదేగాదు. కాని భార్యవచ్చిన దగ్గర్నుంచీ, ఆ డబ్బుతోనే అన్ని ఖర్చులూ వెళ్ళబారిపోతున్నై. తీరిక గూడ కావలసినంత దొరుకుతూంది. ఈ సంపాదనంతా దేనికి ? కాస్త గాలిపీల్చుకుంటూ బ్రతుకుదామనేగదా! అదీ గాక ఆదాయంగూడ పెరుగుతుంది భార్యవస్తే. ఈ బంగాళా దుంపలు వుడికించటం, కూరచేసుకోవటంలాంటి బాదరబందీ

లేకపోతే, యింకొక నాలుగైదుకప్పులు టీ అమ్ముకోవచ్చును. రాత్రిపూట కాళ్ళు చాచుకొని, పండుకుంటే, భార్యవచ్చి, కాళ్ళు పిసుకుతుంది; పగలుపడ్డ కష్టం అంతా మరచి పో వచ్చును".

అల్లాదీన్ మాటలు వింటూంటే నిజమే ననిపించింది గోవర్‌కి. వెళ్ళి, ఝునియాని తీసుకు రావలసిందే. కూర వుడుకుతూండగానే, యింటికి వెళ్ళేందుకు కావలసిన సరంజామా అంతా పూర్తిచేసుకున్నాడు. ఇంతలో హోలీపండుగ దగ్గరపడుతోందన్న సంగతి గుర్తుకు వచ్చింది; పండుక్కి కావలసిన సరుకుగూడ తీసుకెళ్ళాలి. పిసినిగొట్టులంతే! ఎంత కూడబెట్టినా, ఏదోవొక వుత్సవానికనో, పండుగకనో, తెగించి ఖర్చుపెట్టేస్తారు. తల్లికీ,ఝునియాకీ, చెల్లెళ్ళకీ తలకొక జతచీరెలు పట్టుకెళ్ళాలి. తండ్రికి వొక ధోవతి, వొక దుప్పటి పట్టుకెళ్ళాలి. పెద్ద చెల్లెలికి వొక తలనూనెసీసా, వొక జత చెప్పులూ తీసుకెళ్ళాలి. చిన్న చెల్లెలికి జపాను బొమ్మలు కొనుక్కుని వెళ్ళాలి. ఝునియాకు చిన్న బొట్టుపెట్టె యివ్వాలి; ఆపెట్టెలో నూనె, కుంకుమ, అద్దం, దువ్వెనలాంటి వన్నీ వుండేట్లు చూడాలి. కొడుక్కి వొకటోపీ, బజార్లోఅమ్మే రెడిమేడ్ సూటు, చిన్నది కొనుక్కోవాలి. డబ్బుతీసుకుని బజారుకు వెళ్ళాడు. ఇంకో రెండు గంటల్లో, అన్నీ కొనుక్కువచ్చాడు. ఆ పేటలో వాళ్ళందరికీ తెలిసింది గోవర్ ఇంటికి వెళ్తున్నాడని. ఆడావుగా వచ్చారు అతన్ని సాగనంపేందుకు. ఇరుగు పొరుగు వాళ్ళకి ఇల్లప్పజెప్పాడు జాగ్రత్తగా చూస్తూండమని. పండుగ వెళ్ళిన మర్నాడు వస్తానని చెప్పాడు వాళ్ళతో.

"పిల్లన్ని తీసుకురావాలి తప్పకుండా. తీసుకురాక పోయావా, యింటో కడుగుపెట్టనియ్యం!" అన్నది వొక పడుచు.

"నిజంగానే మరి. ఇన్నిరోజులు చెయ్యి కాల్చుకున్నావు చాలదూ! ఆయమ్మాయొస్తే కాస్త మంచి అన్నంఅన్నా దొరుకుతుంది!" అన్నదొక యిల్లాలు.

గోవర్ 'వెళ్ళొస్తా' నన్నాడు. సాగనంపేందుకని వచ్చిన వాళ్ళందరికీ నమస్కారం చేశాడు. వాళ్ళల్లో హిందువులూ వున్నారు, ముసల్మానులూ వున్నారు; వొకరి కష్టాల నొకరు ఆదుకుంటూ, వొకరి సుఖంలో వొకరు పాలుపంచుకునే వారే అందరూ. 'రోజా' వుండేవాళ్ళు 'రోజా' వుండేవారు; యేకాదశి చేసేవాళ్ళు యేకాదశి చేసేవాళ్ళు. గోవర్ యింటికి వెళ్తున్నాడు. అతన్ని సంతోషంగా వెళ్ళి రమ్మని చెప్పేందుకు వచ్చారు వాళ్ళందరూ. వాళ్ళకు మత వైషమ్యాలు లేవు; ఆచార రాద్ధాంతాలకు బానిసలుకాదు వాళ్ళు.

ఇంతలో భూరే జట్కాతోలుకొచ్చాడు. ఇప్పటిదాకా కిరాయి పనిచేస్తూనే వున్నాడు. గోవర్ యింటికెళ్తున్నాడని తెలిసింది. జట్కా తోలుకొచ్చేశాడు చకా. గుఱ్ఱంమారాం చేస్తే నాలుగు కొరడాదెబ్బలు కొట్టాడు. జట్కాలో సామానంతా సర్దేశాడు గోవర్. జట్కా బయలుదేరింది. సాగనంపే వాళ్ళు సందు మలుపువరకూ వెళ్ళారు. మళ్ళీ వొకసారి నమస్కారంచేసి, 'వెళ్ళొస్తా'నని చెప్పి, జట్కాయెక్కి కూర్చున్నాడు గోవర్.

జట్కా పరుగెత్తుతోంది. ఇంటికెళ్ళి పోతున్నానన్న సంతోషం పట్టలేకుండా వున్నాడు గోవర్. భూరే నేనే గనక

సాగనంపుతున్నానని గుఱ్ఱాన్ని పరుగెత్తించుతున్నాడు. గుఱ్ఱం నాలుగుకాళ్ళ సవారీ లేపుతోంది. కన్నుమూసి తెరచేప్పటికి కన్పించేసిందా అన్నట్లు స్టేషన్ వచ్చేసింది.

గోవర్ సంతోషంతో, వొక రూపాయితీసి, "మీ ఆవిడకేమన్నా కొనుక్కెళ్ళు!" అని యివ్వబోయాడు భూరేకి.

భూరే కృతజ్ఞతతో తబ్బిబ్బయ్యాడు. కాని, "అదేంటన్నా, నేనేం పరాయాణ్ణా? కాస్సేపు జట్కాయెక్కితే, నీదగ్గర డబ్బులు పుచ్చుకుంటా ననుకున్నావా! నేనంత తేలికమనిషి ననుకున్నావా? నీ చెమటొలికినచోట నా నెత్తురొలికిస్తా యేవంకున్నావో! నేను పట్టుకెళ్ళినా, యింటిదసలూరుకోదు!" అన్నాడు.

గోవర్ సిగ్గుపడ్డాడు; మళ్ళీ మాటాడితేవొట్టు. సామాను దించుకుని, టిక్కెట్టు కొనుక్కునేందుకు వెళ్ళిపోయాడు.

# 16

ఫాల్గుణమాసం వచ్చింది. వస్తూ, వస్తూ వాడిలో నవ జీవన వికాసం పోసుకుని వచ్చింది. మామిడికొమ్మలు వుయ్యాల లూగుతూ, సౌరభాన్ని వెదజల్లుతూన్నయి. మామిడికొమ్మల మాటున దాగి, కోకిల కుహూ, కుహూ మని సంగీతాన్ని సృష్టిస్తోంది.

పొలాల్లో చెఱకు నాటుతున్నారు. ఇంకా యెండ యెక్కనేలేదు; అప్పుడే హోరీ పొలంలోకి వెళ్ళిపోయాడు. ధనియా, సోనా, రూప గూడ వెళ్ళారు హోరీకి సహాయం చేసేందుకు. ఇప్పుడు హోరీ, శాస్త్రిగారికి కూలి చేస్తున్నాడు. ఇక అతడు రైతుకాడు; కూలివాడు. ఇంతవరకూ శాస్త్రి పురోహితుడు; హోరీ యజమాని. ఇప్పటినుండి శాస్త్రి యజమాని; హోరీ కూలివాడు.

"కాస్త నడుంవంచి పనిచేయ్యవేం హోరీ. ఆహా. ఇట్లా చేస్తేపనైనట్లే" అని అదమాయించాడు శాస్త్రి వచ్చి.

హోరీకి తలకొట్టేసినట్లైంది. "చేస్తానే వున్నా బాబూ! కూర్చోలేదుగా" అన్నాడు.

కూలివాళ్ళని చంపుకుతింటాడు శాస్త్రి. అందుచేతనే అతనిపనికి కూలీలు రావటం గగనమై పొయ్యేది. హోరీకి గూడ తెలుసును యీసంగతి. ఐతేనేం? గత్యంతరం లేని రోజు వచ్చింది.

“నాకూ తెలుసు పనిచెయ్యటం, చెయ్యాల్లనుకుంటే క్షణం పట్టదు. ఇష్టంలేకపోతే ప్రొద్దుగూకులూ చేసినా పని తేలిచావదు” అని యెత్తి పొడిచాడు శాస్త్రి, హోరీకెదురుగా నిలబడి.

కడుపులోనిది కడుపులో క్రుక్కుకుని, పనిచేయటం ప్రారంభించాడు హోరీ. నెలల తరబడి పొట్టనిండా తిండిలేదు. ఒకపూట తింటే, వొకపూట పస్తు. ఆ దొరికినపూట గూడా కూరా, నారాలేని కూడు. ఎంతత్వరగా చేయాల్నని అనుకుంటే మాత్రం యేంలాభం? కాళ్లూ, చేతులూ ఆడొద్దూ? పైగా శాస్త్రి అక్కడే నిలబడి వున్నాడు కాల యముడిలా. ఒక్క క్షణంసేపు నిలబడి, నడుం నొప్పులు తీర్చుకుంటే, మళ్ళీ గబగబా చేయొచ్చును పని. చూస్తే శాస్త్రి వూరుకోడు.

నెత్తిన మోపులు పెట్టుకొచ్చి, క్రింద పడేశారు ధనియా, కూతుళ్ళూ. వాళ్ళ చీరెలన్నీ తడిసి, ముద్దలైనాయి. మోపులు క్రింద పడేసి, కాస్త గాలి పీల్చుకోబోయారు. “యెందుకట్లా నించున్నారు? ఇదేంవన్నా తమాషా అనుకున్నారా? ప్రొద్దుట్నుంచీ చూస్తూన్నా. కాలుతీసి, కాలు పెట్టేప్పటికే గగనమౌతోందే? నడవండి, నడవండి” అంటూ కేక వేశాడు శాస్త్రి.

ధనియాకు కోపం వచ్చింది. "యేమిటే! వూపిరిగూడా పీల్చుకోగూడదన్న మాట. మేం వూం మనుషులమే. నీకూ కాలి కొచ్చినంతమాత్రాన దున్నపోతులం ఐపోయామను కున్నావా ? నువ్వెళ్ళి యెత్తుకురారాదూ మోపులు ! తెలి సొస్తుందిగా!!" అన్నది మండిపోయి.

శాస్త్రికిగూడా వచ్చిందికోపం. "డబ్బివ్వటంలే నీకు? ఇక్కడకొచ్చి వూపిరి తీసుకుంటానిగ్గాదు మేం నీకు డబ్బిచ్చేది. అంతతీరిగ్గా కూర్చోవాలనుకుంటే, ఇంటిదగ్గరే కూర్చోక పోయావ్. ఇక్కడి కెందుకొచ్చావ్?" అన్నాడు.

ధనియా దీనికి బదులు చెప్పేదేగాని, యింతలో హోరీ కల్పించుకుని "ఏమిటే ఆ గొడవ, వెళ్లి నీ పని నువ్వు చెయ్యక" అని అన్నాడు.

"వెళ్తున్నాగా. పనిచేస్తావుంటే ఇంకా ఈ పురమాయింపు లేమిటా అని!" అని అన్నది ధనియా.

కళ్లెర్రజేసి, "పూటకు గతిలేకపోయినా, యింకా పులుపు చావలేద?" అన్నాడు శాస్త్రి.

"నీ ఇంటికి రాలేదుగా బిచ్చం పెట్టమని."

"ఇట్లాగే వుంటే బిచ్చం అడుక్కునే రోజులూ వస్తాయి. తొందరపడకు."

ధనియా జవాబు చెప్పేదేగాని, చెయ్యిపట్టుకుని లాక్కుపోయింది సోనా; లేకుంటే పోట్లాట పెరిగిపొయ్యేదే. కాని కాస్తదూరం వెళ్ళింతర్వాత ధనియా తనకోపంకాస్తా వెళ్ళ గక్కుకుంది. "నీదే అడుక్కునే జాతి; నువ్వే అడుక్కుతిన రాదూ. మేం కూలీలం. పనిచేస్తాం; పొట్ట గడుపుకుంటాం!"

“ఊరుకోవే అమ్మా యిక, మంచీ, చెడ్డా చూడనే చూడవు. ప్రతిమాటకీ పోట్లాటేనా?” అని మందలించింది సోనా.

పిచ్చివాడిలా, క్రిందూ, మీదూ కానకుండా పని చేస్తున్నాడు హోరీ. అతడి లోపల్లోపల యేదో అగ్ని ప్రజ్వరిల్లినట్లుంది; ఏదో అనుపమానశక్తి ప్రవేశించింది అతని శరీరంలో. తరతరాలనుండి అతని శరీరంలో దాచుకున్న నీరు వేడెక్కింది; ఆవిరౌతోంది; ఆ ఆవిరితో అతనొక యంత్రంలా ముందూ, వెనుకా తెలియని శక్తితో పనిచేస్తున్నాడు. కళ్ళు చీకట్లు కమ్ముతున్నయి. తల దిమ్మెక్కుతోంది. ఐనా అతని చేతుల్లు యంత్రంలా, అవియకుండా, ఆగకుండా పనిచేస్తూనే వున్నయి. శరీరమంతా చెమటలు గ్రక్కుతోంది. నాలుక పిడచగట్టుక పోతోంది. ఎవరో సుత్తులతో తల పగులగొట్టూన్నట్లుంది. ఐనా ఏదో భూతం ఆవేశించినట్లు పనిచేసుకు పోతున్నాడతను.

కాస్సేపటి కతని కళ్ళకేమీ కన్పించకుండా పోయింది. నేలలోకి దిగబడిపోతూన్నట్లనిపించింది. నిలద్రొక్కుకుందామని చాచిన చేతులు చాచినట్లుండగానే, స్పృహతప్పిపోయింది. చేతిలో కత్తిజారి క్రింద పడిపోయింది. గభీమని బోర్లగిలబడి పోయాడు.

అదే సమయంలో మళ్ళీ మోపెత్తుకు వస్తోంది ధనియా. చూస్తే హోరీ చుట్టూ మూగివున్నారు కొందరు మనుష్యులు. “బాబుగారూ మీ రట్టాంటి మాటలనగూడదండీ. మీ మాటలు గుచ్చుపనే యీ మనిషి యిట్టా అయ్యాడు” అంటున్నా రెవరో శాస్త్రిలో.

నెత్తిమీది మోపు, నేలమీదికి విసరివేసి, పిచ్చిదానిలా పరుగెత్తింది ధనియా. వెళ్ళి, హోరీ తలలేపి, తన తొడమీద పెట్టుకుని ఏడ్చింది. "అప్పుడే నన్నొదిలిపెట్టి పోయావా... ఒసేయ్ సోనా, పరిగెత్తుకెళ్ళి మీ బాబాయిని పిల్చుకురావే అమ్మా. మీ నాన్న పడిపోయాడని చెప్పి పిల్చుకురావే తల్లీ. అయ్యో దేవుఁడా! నేనేఁవైఁపోనురా తండ్రీ... యింకనాకు దిక్కెవ్వరాబాబూ. నన్ను అమ్మాఅని ఎవరుపిలుస్తార్రోయిక..."

లాలా పటేశ్వరి పరుగెత్తుకొచ్చాడు. "అదేఁవిఁటి ధనియా. ఈమాత్రానికే ఇంత గగ్గోలా. హోరీకేఁ బాగానే వున్నాడు. కాస్త ఎండతగిలి, మూర్ఛపోయాడు. అంతేగా. ఇప్పుడే తేరుకుంటాడు. చూస్తావుండు. ఇంతమాత్రానికే బేజారై పోతారా పిచ్చిదాన!" అంటూ గోముగా, కోప్పడ్డాడు.

ధనియా వెళ్ళి పటేశ్వరి కాళ్ళమీద పడింది. పడి, "నేనేం చెయ్యనుబాబూ. దేవుఁడన్నీ హరించుకుపోయినా వూరు కున్నా. ఇక ఇప్పుడు నేనేం చేసేది, అయ్యో నా దేవుడా!" అంటూ ఏడ్చింది.

సోనా నీళ్లు తీసుకొని వచ్చింది. పటేశ్వరి, హోరీ ముఖంమీద నీళ్లు చిలకరించాడు. కొంతమంది తలగుడ్డలు విప్పి, గాలి వీచారు. హోరీ శరీరం చల్లబడిపోయింది. పటేశ్వరి ధైర్యం కూడా సన్నగిలింది. అయినా ధనియాకు ధైర్యం చెబుతూనే వున్నాడు.

"ఇదివరకీయనిట్టా ఎప్పుడూ పడిపోలేదుబాబూ" అన్నది ధనియా అధైర్యంతో.

"రాత్రేం నైనా యెంగిలి పడ్డాడా?" అనడిగాడు పటేశ్వరి.

"ఆఁ రాత్రి అన్నం వండాను బాబూ. ఐనా నీకు తెల వందేం వుంది మా సంగతి. పొట్టనిండా తిని, యెన్నేళ్లయ్యిందో. వెనకా ముందూ చూచుకుని పనిచెయ్యమని యెన్నిసార్లు చెప్పా నెన్నిసార్లు చెప్పాను. వింటేనా. ఆయనమాత్రం యేం చేస్తాడులే, మా రాతిట్టావుంటే" అన్నది ధనియా.

ఇంతలో హోరీ కళ్ళు తెరచి, చూచాడు.

ధనియాకు ప్రాణం వచ్చినట్లయింది. అతని మెడ వాటేసుకుని, "యిప్పుడెట్టా వుంది. నా ప్రాణాల్లో ప్రాణాల్లే కుండా పొయ్యాయ్" అన్నది.

"ఫర్వాలేదు. బాగా నేవున్నా. అదేం విటో కళ్ళుతిరిగి పోయినై" అన్నాడు హోరీ.

"నీవొంట్లో వోపిక లేదాయె. మరీ అంత వళ్ళు తెలియ కుండా పనిచేసుకుంటారా యెక్కడన్నా" అంటూ ప్రేమతో లాలిస్తూ, చీవాట్లు పెట్టింది.

"మీ ఆవిడ వూరు నాడూ ఏకం అయ్యేట్టు యేడిస్తే!" అన్నాడు పటేశ్వరి నవ్వుతూ.

"ఏఁ వేఁ? నిజంగానా! యేడ్చావా!" అని ఆదుర్దాగా అడిగాడు హోరీ.

"ఈయనెప్పుడూ యింతే. తను కాగితాలపై వొదిలి పెట్టెందుకు పరుగెత్తికొచ్చాడో అడగరాదూ?" అన్నది ధనియా, పటేశ్వరిని, కృత్రిమ కోపంతో చూస్తూ.

పటేశ్వరి మరికాస్త పరిహాసం చేశాడు. "అదికాదయ్యా, దేవుడో! నా దేవుడా అంటూ యేడుస్తూ కూర్చొంది.

ఇప్పుడంటే సిగ్గుపడతాందిగాని, ఇందాక నుదురు బాదుకుంటూ, వాకటే యేడవడం!" అన్నాడు.

హోరీ కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినై, "పిచ్చిదానా యేంసుఖం అనుభవిస్తామనే యింకా బతికుండాలని కోరుకోటానికి" అన్నాడు భార్యతో.

చేతులమీద వేసుకుని, యింటికి తీసుకొచ్చారు హోరీని; మంచంవాల్చి, మంచంమీద పడుకోబెట్టారు. శాస్త్రంటే అయ్యో పని ఆగిపోయిందే అని యేడుస్తున్నాడు. గాని, శాస్త్రి కొడుకు మాతాదీన్ అంతకఠినుడుగాదు. గబగబా ఇంటికి వెళ్ళి, వేడివేడి పాలు పట్టుకొచ్చాడు; ఒక సీసాలో గులాబీ నీరు గూడ తీసుకొచ్చాడు. పాలు తాగేప్పటికి, హోరీ ప్రాణం కుదుటబడింది.

అప్పుడే, గోవర్ కూడా కూలీనెత్తిన సామానుపెట్టి, వెంటబెట్టుకుని వస్తున్నాడు.

వూళ్ళో కుక్కలు భౌ, భౌ మంటూ యెదురెళ్ళినై, కాని తర్వాత తోకలూపుకుంటూ వూరుకున్నయి. "అన్నయ్యొచ్చాడన్నయ్యొచ్చాడు!" అని చప్పట్లు కొట్టుకుంటూ పరుగెత్తింది రూప. సోనాగూడ రెండు మూడడుగులు ముందుకు వేసింది గాని, వుత్సాహాన్నంతా హృదయంలోనే అణచుకుని వూరుకుంది. ఝునియాగూడ తలమీద ముసుగుకప్పుకుని గుమ్మంలో నిలబడి పోయింది.

వచ్చి తల్లిదండ్రుల పాదాల్ని స్పృశించాడు గోవర్. తర్వాత రూపనెత్తుకుని గారాంచేశాడు. ఆశీర్వదించి, అతని తలను హృదయానికి హత్తుకొని, అపరిమితంగా ఆనందించింది

ధనియా. ఆవిడ హృదయం గర్వంతో వుప్పొంగిపోయింది. ఈనాడావిడ మహారాణికంటె మిన్నగా వున్నది; ఈ బీద తనంలో, ఈ దురదృష్టాల తిరుగలిలో, పడి నలిగిపోతూన్నా, ఆవిడ కళ్ళనిచూచినా, మొఖాన్ని చూచినా, హృదయాన్ని చూచినా, నడక తీరుచూచినా, మాటల ధోరణిచూచినా, మహారాణిలా వుంది. గోవర్ పెద్దవాడయ్యాడు; బట్టతీరూ, కట్టుతీరూ చూస్తే పెద్ద మనిషిలా వున్నాడు. గోవర్ ఎక్కడో వొకచోట భద్రంగానే వున్నాడనీ, సంతోషంగానే వున్నాడనీ, ఆవిడ మనసు చెబుతూనేవుంది. ఇవ్వాళ కళ్ళెదుట నిలబడి, ఆవిడ మనసనుకున్న మాటలన్నీ నిజమేనని ఋజువుచేస్తున్నాడు గోవర్. చేయిజారి పడిపోయిన నగ దొరికినట్లుగా సంతోషిస్తోంది ధనియా; కాని హోరీ మొహం త్రిప్పుకుని పడుకున్నాడు.

"అదేంటమ్మా! నాన్నట్లా వున్నాడేం?" అనడిగాడు గోవర్.

ఇంటి గొడవలన్నీ చెప్పి కొడుకుమనసు కష్టపెట్టటం ఇష్టం లేదా తల్లికి. "ఏంలేదు బాబూ, కాస్త తల నెప్పిగావుంది. పద బాబూ కాళ్లూ; చేతులూ కడుక్కోందూగాని. ఇప్పటిదాకా ఎక్కడున్నావ్రా నాయనా! వొక్క వుత్తరం ముక్కన్నా వెయ్య కూడదంటరా, యేడాదిగ్గాని గాపకం రాలేదన్నమాట మేం. నీకోసంవంని దార్లు చూచూచ్చి, కళ్లు కాయలు కాసినయ్ గదరాబాబూ. తప్పకుండా వస్తావు, ఈ కళ్లకగనబడతావనే ఆశతోనేరా బతికుంది. ఎంతమంది ఎన్నెన్ని మాటలన్నారూ, ఎన్నెన్నిమాటలన్నారనుకునావ్? ఆ మాటలన్నీ వింటూంటే;

పై ప్రాణాలు, పైనే పోయినట్టుండేది. సరేగాని, ఇన్నిరోజు లెక్కడున్నావ్రా బాబూ?”

“పెద్ద దూరం వెళ్ళలేదమ్మా. ఇక్కడే లక్నోలోనే వుంది” అన్నాడు సిగ్గుపడుతూ గోవర్.

“ఇంత దగ్గిరుండేనన్నమాట వుత్తరమొక్క గూడా రాయంది !”

లోపల యింట్లో, రూప సోనా లిద్దరూ కలిసి, అన్నయ్య తెచ్చిన సామానంతా బయటికితీసి, భాగా లేసు కుంటున్నారు; ఝునియా దూరంగా నిలబడివుంది. గోవర్, చేసినపనికి ప్రాయశ్చిత్తం చేయాల్నని చూస్తోంది; అంతకు పూర్వం యిక యీ పద్దురాదులే అనుకున్న వృద్ధవ్యాపారస్థుడు, ఆసామీని చూడగానే పాతచితాలు తిరగేస్తాన్నట్లుంది ఝునియాని చూస్తూంటే. ఝునియా చంకలోవున్న పిల్లవాడు క్రిందికి దిగి, ఆ వస్తువులన్నీ ఒక్కసారే నోట్లో పెట్టుకోవాలని మారాంచేస్తున్నాడు; చంకలో నిలవటంలేదు; ఐనా ఝునియా అతన్ని క్రిందికి దింపలేదు. అట్లాగే చంకలో బిగించుకునుంది.

“అన్నయ్య నీకని అద్దప్పూం, దువ్వెనా తెచ్చాడొదినా.” అన్నది సోనా.

“నాకేం వద్దులే. అట్టిపెట్టుకోసి.” అన్నది ఝునియా వుపేక్షగా.

రూప కుర్రవాడికని తెచ్చిన టోపీ బయటికి తీసింది. ‘ఒహ్హో యిది మన చిన్ని టోపీ!’ అంటూ, కుర్రవాడి నెత్తికి తొడిగింది.

ఆ టోపీ తీసివేసి, విసురుగా నేలమీదికి విసరేసింది ఝునియా. ఇంతలోనే గోవర్ ఇంట్లోకి వస్తూండడం చూచి, గబగబా తన గదిలోకి వెళ్ళిపోయింది; గోవర్ వచ్చిచూస్తే సామానంతా చిందరవందరగా కెలికేసి వుంది. లోపలికి వెళ్ళి, తన అపరాధాన్ని క్షమించమని ఝునియాని ప్రార్థించాలనుకున్నాడు గోవర్; కాని వెళ్ళేందుకూ, అడిగేందుకూ సాహసించలేకపోయాడు. ఏం చేసేందుకూ తోచక, అక్కడే కూర్చొబడి, ఒక్కొ-వస్తువూతీసి, చెల్లెళ్ళకు పంచటం ప్రారంభించాడు. చెప్పు లివ్వకపోయేప్పటికి రూప మొహం ముడుచుకుంది; "నీకు చెప్పులెందుకులే. బొమ్మ తెచ్చాడుగా; ఆడుకో!" అంటూ కవ్వించింది సోనా. 'నీబొమ్మలు చూచి నేనేమన్నా యేడుస్తున్నానా? నువ్వు నాచెప్పుల్ని చూచి యేడవడానికి!' అని వెక్కిరించింది కూడాను సోనా. మిఠాయిని పంచిపెట్టే అధికారం ధనియా తీసుకుంది. ఔనుమరి! ఇన్ని రోజుల తర్వాత వచ్చాడు కొడుకు యింటికి; వూరంతా పంచి పెట్టేనేగాని ఆ తల్లి సంతోషం తీరదు.

పెట్టె తెరచారు. చీరెలు బయటకొచ్చినయి. అన్నీ జరీ అంచులున్న చీరలు. లాలా పటేశ్వరిగారింట్లో కట్టుకునే చీరల్లా వున్నయి. అన్నీ యెనభై నెంబరు; వందానూ. ఎన్ని రోజులు మన్నుతాయి యింతపలచటి చీరలు. ఉన్నవాళ్ళంటే అదివేరు. ఆ యిళ్ళల్లో ఆడవాళ్ళకు పనేముంటుంది? కూర్చోవటమూ, పండుకోవటమూ తప్ప! ఈ యింట్లోనంటే, పొలం వెళ్ళాలి; పనులు చేయాలి. సరే! హోరీకి ధోవతితోపాటు, ఒక శాలువ కూడా తీసుకువచ్చాడు.

ధనియా సంతోషించింది. "మంచిపనిచేశావు నాయనా. పాత శాలువా పీలికలు పీలికలై పోయింది గూడాను" అన్నది.

ఇంతలో గోవర్‌కు యింట్లో పరిస్థితంతా తెలిసి పోయింది. ధనియా చీరంతా మాచికలే. సోనా చీర నెత్తి మీద చిరిగింది; ఆ చిరుగులోనుంచి తల వెంట్రుకలుగూడ బయటికి కనిపిస్తూన్నవి. రూప కట్టుకున్న పరికిణీ అంతా పీలికలై వ్రేళ్లాడుతూంది. అందరి ముఖాలు పీక్కుపోయి వున్నవి; శరీరమంతా పేళ్ళు కట్టినట్లుంది. ఎక్కడ చూచినా, యెటుచూచినా బీదతనం ప్రత్యక్షమౌతూంది.

ఆడపిల్లలు చీరలు చూడటంలో నిమగ్నలై వున్నారు. ధనియా కొడుకుకు యేం చేసిపెట్టాలా అని ఆలోచిస్తూంది. సాయంత్రానికని అట్టిపెట్టుకున్న జొన్నపిండి వున్నదిగాని, గోవర్ కది చేసి ఎట్లా పెడ్తుంది? పరదేశంలో ఎంత మంచి తిండికి అలవాటు పడ్డాడో యేమో; ఇప్పుడీ జొన్నపిండి రొట్టె సహిస్తుందో, లేదో. కోమటింటికి వెళ్లి, గోధుమపిండి బియ్యం నెయ్యి అరువుకని తీసుకొని వచ్చింది. కోమటమ్మ ఈమధ్య అప్పివ్వడం మానేసిందిగాని ఇవ్వాళెందుకనో పాత అప్పు లెప్పుడు తీరుస్తావనిగూడా అడగకుండా అడిగినవస్తువులన్నీ అరువు కిచ్చేసింది.

"ఏఁవఁమ్మా! కొడుకు బాగా సంపాదించుకొచ్చాడా?" అనడిగింది కోమటమ్మ.

"ఇంకా తెచ్చినవి తీసి చూడలేదమ్మా. నేనుగూడా అప్పుడే ఏం అడుగుతాన్లే అని అడగనూకూడాలేదు. అందరికీ జరీచీరలు మట్టుకు పట్టుకొచ్చాడు. ఏఁవోఁనమ్మా! బిడ్డ

మాత్రం చెక్కుచెదరకుండా వచ్చాడు. అదే పదివేలు!" అన్నది ధనియా.

"అంతేలేమ్మా. ఎక్కడుంటేనేం లే. పదికాలాలుపాటు బ్రతికితే అంతేచాలు. అబ్బాయికూడా మంచాడు. అందరికి మల్లే ఎగిరిపడేరకం గాదు; నాకు తెలుసుగా. సరేగాని వస్తే అన్నా తీర్చెయ్యగూడదంటమ్మా? మీకే బరువు తగ్గుతుందిగదా అని అంటన్నా." అన్నది కోమటమ్మ.

ఇక్కడ చిన్నికి చెప్పులూ, రెడీమేడ్ చొక్కా, టోపీ తొడిగి, ఒక చిన్న రాజుగా తయారు చెయ్యాల్నని చూస్తోంది సోనా. వాడేమో అన్నీ చేతుల్తో పట్టుకుని ఆడుకోవాలని చూస్తున్నాడు. లోపల ఝునియా, గోవర్లు పాత పోట్లాటలన్నీ బయట పెట్టుకుంటున్నారు.

ఝునియా కోపం అభినయిస్తోంది. "నన్ను తీసుకొచ్చి యిక్కడ పడేశావు. తమరేమో దేశాంతరం పోయారు. ఏంవయ్యింది; బ్రతికుందా? చచ్చిందా? అని అజగూడ కనుక్కోవటంలేదు. ఆ పోవటం పోవటం ఏడాదైంతర్వాత గాని దొర గారికి మెళుకువ రాలేదన్న మాట. ఇంత మోసగాడి వనుకో లేదు బాబూ నేను. నా వెనకే వస్తన్నా వనుకున్నా నేను; వెనకవాడివి, వెనకే వుడాయించి, యిప్పుడా, యేడాదైంతర్వాతా వచ్చేది ? అయినా మగాళ్లని నమ్మగూడదు బాబూ. ఎక్కడ యెవతి కన్నేసిందో! ఇంట్లో వొకటుందిగా, బయటిది వుంటందను కొన్నావో, ఏంవో!" అంటూ నిష్ఠూర్యాలాడింది.

గోవర్ తన నిర్దోషిత్వాన్ని ఋజువు చేసుకున్నాడు. "ఝునియా నామాటనమ్ము. దేవుడి సాక్షిగా చెబ్తున్నా.

పరాయి ఆడదానివంక కన్నెత్తిచూస్తే వొట్టు. నిజవేఁ. సిగ్గేసీ, భయంఁవేసీ వూరొదిలిపెట్టి పారిపోయా. ఐనా నిన్ను తల్చుకోని క్షణం లేదనుకో. ఇక నువ్వులేందే బ్రతకలేననుకొని, నిన్నెంట బెట్టుకుని తీసుకెళ్దామనే ఇప్పుడు నేనొచ్చింది. మీ నాన్నాళ్లకి బాగా కోపం వచ్చిందనుకుంటా. కాదూ?"

"నన్ను చంపెయ్యాలని చూస్తే!"

"నిజంగా!"

"మా నాన్న, అన్నయ్యలూ ముగ్గురూ కలిసి యింటి మీద కొచ్చారు కర్రలేసుకుని. అత్త నాలుగు ఝాడించేప్పటికి వూరుకున్నారు; యెడ్లని తోలుకుపోయారు."

"మరీ యింత మొగలాయా? నాన్నేఁవీఁ అనలా మరి?"

"ఆయన మాత్రం వొంటరిగా యెంతమందితోనని పోట్లాడతాడు? వూళ్లోవాళ్ళు తోలికెళ్ళనిచ్చేవాళ్ళు గాదు కాని మీనాన్న మంచితనం చూచూరుకున్నారు."

"అయితే నాన్న వ్యవసాయం చెయ్యటంలేదా?"

"ఇంకేం చేస్తాడు? కొంత శాస్త్రిగారి హయాంలో వుంది. మిగతాది నాటనుగూడా లేదు."

గోవర్ దగ్గర ఇప్పుడు రెండువందల రూపాయలవరకూ వున్నవి. దీనికితోడు, యిదంతా వినేప్పటికి, మరీ మండి పోయాడు.

"ఐతే నేనక్కడికెళ్ళి, అదేదో తేల్చేసుకుంటా. ఇంటి కొచ్చి, యెడ్లని తోలుకెళ్తాడూ? అంతగర్వమా? పట్టపగలు దోపిడీ చేస్తాడూ? ఒక్కొక్కణ్ణీ మూడేళ్ళు ఖైదులో పెట్టిస్తే సరి వదిలిపోతుంది. ఇవ్వకపోతే కోర్టుకెళ్ళి, ముప్పుతిప్పలు

పెట్టి, మూడు చెరువుల నీళ్ళు తాగిస్తా. ఆ నిక్కేవిటో, అదీ చూస్తాగా!" అన్నాడు.

ఆ ఆవేశంలోనే, ఆ ఆవేశంతోనే నాలుగడుగులు వేశాడు గోవర్; కాని ఝునియా చేయిపట్టుకుని ఆపింది. "యెళ్ళొచ్చులే, యిప్పుడే యేఁవంత ముంచుకు పోయిందని. అన్నం తిని, కాస్సేపు కూర్చుని, తర్వాతెళ్ళొచ్చు. ఇంకా కావాల్సినంత పొద్దుంది. ఇక్కడేఁవోఁ పెద్ద పంచాయితీ చేశారు. ఎనభై రూపాయల తప్పేశారు. ముప్పైమణుగుల ధాన్యంగూడా యివ్వాలన్నారు. దాంతోనేగా వంగున్నవాళ్లం లేవటానిగ్గూడా వీల్లేకుండా పోయింది." అన్నది ఝునియా.

చిన్నికి క్రొత్తగుడ్డలవీ తొడిగి, తీసికొనివచ్చింది సోనా. ఆ గుడ్డలవీ వేసుకుంటే వాడు నిజంగానే జమీందారీ బిడ్డలా వున్నాడు. గోవర్ తీసుకుని, యెత్తుకున్నాడు. ఐనా కొడుకును చూచి, సంతోషించే స్థితిలో లేడు గోవర్. అతని నెత్తురు వుడికిపోతోంది; దీనికితోడు దగ్గర డబ్బుంది. అసలీవూళ్ళోవాళ్ళ నిక్కేమిటో తేల్చేసుకోవాలి. 'తప్పు' వేసే అధికారం యెవల్లిచ్చారు వీళ్ళకి? అతనొక ఆడదాన్ని తెచ్చుకుని వుంచుకుంటే, యీ పంచాయతీదార్ల అబ్బసొమ్మేం పోయింది? అసలీ ఒక్కమాటమీద కేసుపెట్టాడంటే చాలు; ఒక్కొక్కళ్ళ చేతికీ బేడీలు పడిపోతై. తలుచుకుంటే వాళ్ళ సంసారాలన్నీ దమ్మిడీకి కొరగాకుండా చెయ్యగలడు. ఏమనుకుంటున్నారో గాని వీళ్ళు!

ఎత్తుకోగానే కాస్సేపు నవ్వుతూనేవున్నాడుగాని చిన్ని, తర్వాత యేదో భయంకరమైన వస్తువును చూచినట్లు, కళ్ళింత పడి, గుక్క విడవకుండా యేడవడం మొదలుపెట్టాడు.

భర్తచేతుల్లోవున్న బిడ్డని తీసుకొని, "ఎందుగ్గాని ఈ ఆలోచనలన్నీ, నీళ్లుపోసుకోరాదూ? వూళ్లోవాళ్లందర్తో పోట్లాట పెట్టుకుంటే నిర్వాకమైనట్టే. డబ్బున్నాడే మారాజు యీ రోజుల్లో; వున్నాళ్లేవన్నా చెల్లుతుంది. లేనాళ్లమాటెవళ్లింటారులే." అన్నది ఝునియా.

"ఇంతకీ నేను పారిపోవటం మూలానొచ్చింది లేకపోతేనా!"

"పట్టణంగాలి సోకిందిగా. అందుకనే యిన్నిమాటలు మాట్లాడుతున్నావ్. లేకపోతే ఎందుకు పారిపోయా?"

"కర్రపట్టుకొని, పటేశ్రీని, శాస్త్రినీ, సింగునీ, వాకొక్క ముండాకొడుకునీ వీపులు పగిలేట్టుబాది, ఆ డబ్బుకాస్తా కక్కించాలనిపిస్తోంది!"

"మెదిత్తే కదిత్తే డబ్బంటన్నావే; నువ్వేమాత్రం పట్టుకొచ్చావో అదీచూపించు చూస్తా" అంటూ జేబు తడమబోయింది ఝునియా.

"ఆఁ. యేం సంపాదించాలే నీ ముఖం. నువ్వుగూడా పద మరియెట్టా సంపాదిస్తానో చూద్దువుగాని. పట్టణం అంతా తిరిగేటప్పటికే ఐపోతుందాయె యేడాది."

"అత్తొప్పుకుంటేగా, నే వచ్చేది."

"అమ్మేఁవంటుంది? అమ్మ పెత్తనం యేంటి?"

"అష్టాఁ! అక్కడిదాకా వచ్చిందన్నమాట. అమ్మ వొప్పుకోపోతే మట్టుకు నేను రాను బాబూ. నువ్వేఁవోఁ నన్నొదిలి పోతివి. ఇకప్పుడు నా కెవళ్ళున్నారిక్కడ? మీ అమ్మేగనక నన్నింటో అడుగు పెట్టనియ్యకపోతే నేనేఁనైఁ పోయేదాన్నో. బతికినంతకాలంవూ మర్చిపోలేను మీ అమ్మ చేసిన మేలు. ఐనా నువ్వుమాత్రం యెన్నిరోజులని వుంటా వూరొదిలిపెట్టి?"

"లేకపోతే యిక్కడ కూర్చునేంజేస్తాను నేను? ఇక్కడేం వుంది? పనిచేసినంత కాలం చెయ్యటం; తర్వాత చావటం. అంతేగా! కాస్తబుద్ధుండి, కాస్త పనిచేస్తే అన్నం లేక చావాల్సిన గతెందుకు పడ్తంది? ఇక్కడంటే తెలివి వుపయోగించటానికే వీల్లేదయ్యో! నాన్న నేనంటే అంత ముఖం చాటేస్తన్నా డెందుకు?

"మనదృష్టం బాగా వుండబట్టి, అట్టాగన్నా వున్నాడు. లేకపోతే నువ్వుచేసిన పనికి చర్మం వొలిపించి, యెండేయించే వాడు గాదూ?"

"ఐతే నిన్నూ తిడ్తన్నాడా అదే పనిగా?"

"అమ్మో. నన్నే. పల్లెత్తుమాట గూడా అనడు. మీ అమ్మకే కొంచెం కోపం వచ్చింది మొట్టమొదట; నన్ను అమ్మా! అంటా పిలుస్తాడు మీ నాన్న. నాక్కాస్త తలకాయ నెప్పొచ్చినా సరే కంగారుపడిపోతాడనుకో. ఆయనకేఁ? దేవుఁడు! కోడల్నేవీఁ అనబోకే అంటావుంటాడు యెప్పుడూనూ అత్తతో. ఇల్లొదిలిపెట్టి పారిపోయావని నువ్వంటేమాత్రం మాంచికోపం. అందుట్లో యెక్కడచూచినా కాండబ్బు గూడా

పుట్టటంలేదా; పంటకొచ్చిన డబ్బు మిస్లుదగ్గిరే ఎగిరిపోయింది. ఇకిప్పుడు కూలిగూడా చేస్తన్నారు. ఇవ్వాళ పొలంలో స్పృహ తప్పి గూడా పడిపోయాడు. అందుకనేగా నువ్వొచ్చేటప్పటికి యిల్లంతా గందరగోళంగా వుంది."

కాళ్లూ, చేతులూ కడుగుకొని, తలదువ్వుకుని, గ్రామ విహారానికి బయల్దేరాడు గోవర్. బాబాయిల యిళ్ళకు వెళ్ళి, పలకరించి వచ్చాడు. తర్వాత పాతస్నేహితుల్ని కలిసికున్నాడు. వూళ్లో యేమంత పెద్ద మార్పేమీలేదు. పటేశ్వరీ క్రొత్తచావడి వేయించాడు. ఝింగురసింగు క్రొత్తగా ఒక నుయ్యి తవ్వించాడు. గోవర్‌కు కన్పించిన వాళ్ళందరూ, బాగా మర్యాద చేస్తూ మాట్లాడారు. వూళ్లో యువకులంతా అతన్నొక హీరోని చేసేసుకున్నారు; అతనితోపాటు లక్నోగూడ వెళ్ళిపోవాలనుకున్నారు. ఒక్కయేడాదిలో అంత గొప్పగా మారిపోయాడు గోవర్.

ఝింగురసింగు నూతిదగ్గర స్నానం చేస్తున్నాడు. గోవర్ చూచాడుగాని నమస్కారమూ చెయ్యలేదు; పలకరించనూ లేదు. 'నువ్వంటే నాకేం లెఖలేదు' అన్నట్లుగా వున్నాడు గోవర్.

ఝింగురసింగే పలుకరించాడు. "ఎప్పుడొచ్చావురా గోవర్. బాగున్నావా? లక్నోలో నౌకరీకుదిరావా?" అనడిగాడు.

"నౌకరీ చెయ్యటానికిగ్గాదు లక్నోకెళ్లింది. నౌకరీ చెయ్యాల్సిన గతేంపట్టిందినాకు? వ్యాపారం చేస్తన్న!" అన్నాడు గోవర్ తలబిరుసుగా.

ఒక్కసారి క్రిందినుంచి, పైదాకా నిలువునాచూచి, "రోజుకేమాత్రం సంపాదిస్తున్నా వేంటి?" అనడిగాడు సింగు.

"ఆఁ ఏంవుందిలే. రెండున్నరో, మూడో. ఇంకా మంచిరోజులైతే నాలుగు!"

ఎన్నితిప్పలుపడ్డా పాతికో, ముప్పయ్యో సంపాదించే ప్పటికి తాతలు దిగివచ్చేవారు సింగుకి. ఈ పల్లెటూరి బుడ్డాడు నెలకి నూరు సంపాదిస్తూన్నాడు. పాపం! తల యెత్తుకో లేకపోయాడు, సింగు. గోవర్‌కంటె అతనిగొప్ప యేంవుంది? కులం గొప్పదేననుకోండి. కాని ఈ రోజుల్లో కులం చూచే వాళ్లెవరున్నారు? అంచేత గోవర్‌తో నీలుగుతూ మాట్లాడి నందువల్ల వచ్చేలాభం యేమీ లేదు. మెత్తటిమాటలు నాలుగుచెప్పి యేదోవొకపని చేయించుకోవాలి. "చూడు బాబూ! ఇక్కడంటే రోజుకి మూణ్ణాలు దొరకటవేఁ గగనంగా వుంది. నీకేం మహారాజువి; సంపాదిస్తున్నావు. భవసియా (అది అతని జ్యేష్ఠపుత్రుడి పేరు) వున్నాడే వూరికే గాలిగా, వూరుపట్టుకుని తిరుగుతున్నాడు బాబూ. చదువూ లేదు; చట్టుబండలూ లేదు. ఎక్కడన్నా గుమాస్తాగిరి చూచిపెట్టుదూ; నీకు పుణ్యంవుంటుంది. లేకపోతే వెంటబెట్టు కెళ్ళినా సరే! నీకు వాడికీ స్నేహంవేఁగా. జీతం తక్కువైనా ఫర్వాలేదులే; నాలుగు పై డబ్బులు దొరికే వీలుమాత్రం వుండేటట్టు చూడు" అన్నాడు ఝింగురసింగు.

గోవర్ నవ్వాడు; ఝింగురసింగు యింత తేలికవా డయ్యాడు ఏమిటా అన్నట్లు నవ్వుతూ, "ఆ పైపై సంపాదన్తోనే మనుషులు పాడైపోతాంది; ఆ యెంగిలి కూడెందుకో చెప్పండి!

అంతేలే! మనకట్టాంటి యెంగిలికూడు తింటేనేగాని, కడుపు నిండినట్టుండదాయె; మనబ్రతుకే అంతైపోయింది మరి! లక్నోలో గుమాస్తాగిరీలు దొరక్కేం; దొరుకుతయ్‌గాని, నమ్మకస్తులు కావాలి ఆ షావుకార్లకి. నేను భవానీని తీసికెళ్ళి యెక్కడో వొకచోట కుదర్చ గల్గుననుకో. ఐనా తర్వాత ఈ మహారాజు శాస్త్ర చెయ్య చాచాడంటే నాదుంప తెగుతుంది ముందు; వాళ్ళొచ్చినా మెడపట్టుకుంటారు. ఈరోజుల్లో నమ్మకానికున్నంత గౌరవం చదువుగ్గూడా లేదు తెలుసా!" అన్నాడు.

మొహం మాడ్చేస్లు, యీ నాలుగు మాటలూ అని, ముందుకు సాగాడు గోవర్. ఝింగురసింగేమీ అనలేక వూరుకున్నాడు 'ఎంత గర్వం వీడికి!'. ధర్మావతారం దాల్చినట్లు మాట్లాడాడు.

శాస్త్రికి కూడా యిట్లాగే బుద్ధిచెప్పాడు గోవర్. భోజనం చేసేందుకు వెడుతున్నాడు శాస్త్రి. గోవర్‌ను చూచి, "బలే హుషారుగా వున్నావోయ్. బాగా సంపాదిస్తున్నావటగా? మా అబ్బాయికూ్కడా యేదో వొకటి చూచిపెడుదూ. ఇక్కడ దేపనిగా జూదం ఆడుతున్నాడు." అన్నాడు శాస్త్రి.

"అయ్యో. అదేంమాటండీ శాస్త్రిగారూ! మీకేంవండీ మహారాజులు. ఎవళ్ళింటికెళ్ళినా మీకేదో వొకటి ముట్టజెపుతూనే వుంటారాయె. పుటకలకీ, చావులకీ, పెళ్ళికీ, కార్యానికీ, మంచికీ, చెడ్డకీ యేదొచ్చినా మీది మీరు వడుక్కుపోతూ వుంటారయ్యో. పైగా వ్యవసాయం చేస్తారు, వడ్డీకిస్తారు, కమిషన్ వ్యాపారం చేస్తారు, దలాలీ చేస్తారు. ఎవళ్లైనా

యేమైనా పొరపాటుచేస్తే జుల్మానాలు వేస్తారు; వాళ్ళ కొంపలు దోచుకుంటారు. ఈ సంపాదనంతా ఏం చేస్తన్నా రండీ యింకా కావాలంటారు? ఏం చేసుకుంటారండీ యిదంతా? లేకపోతే చచ్చిపోయేటప్పుడు పట్టికెళ్ళడాని కేవన్నా యేర్పాటు చేసేసుకున్నారా కొంపదీసి!"

శాస్త్రిగారు చూచాడు; గోవర్ అమిత గర్వంగా మాట్లాడుతున్నాడు పెద్దా, చిన్నా మంచీ, మర్యాదా లేకుండా. తండ్రి తనక్రింద కూలి చేస్తున్నాడని యింకా తెలియదేమో. ఐనా చిన్ననది త్వరగానే పొంగిపోతుంది! కాని శాస్త్రి తన లోపలి ఆలోచనల్ని పైకి వుబకనీయలేదు. చిన్న పిల్లలు మీసాలు పట్టుకు లాగుతూంటే, నొప్పికలిగినా, నవ్వుతూ మాట్లాడే ముసలివాళ్ళలాగా, నవ్వుతూ "లక్నోనీళ్ళుతాగి మంచి మాటకారివయ్యావోయ్ నీవు. ఏమాత్రం సంపాదించుకు వచ్చావేంటి? ఏదీ చూపించు! సరేగాని నువ్వెప్పుడూ జ్ఞాపకం వస్తానే వున్నావుసుమా! నాలుగు రోజులుంటావుగా," అన్నాడు శాస్త్రి.

ఆఁ. వుండొద్దూమరి. వందన్నర వసూలు చేసుకున్న పెద్దలమీద దావా వెయ్యాలిగామరి. నన్నెవళ్లేస్తారో అదీ చూద్దాం వనుంది." అంటూ బెదరించి, ముందుకు నడిచాడు. వూళ్లోవున్న యువకులందరికీ యీ విషయం తెలిసింది; వాళ్ళందరూ బ్రహ్మరథం పట్టారు గోవర్‌కి.

"కేసుపెట్టేశెయ్యి గోవరన్నా! ఈ ముసలి ముండా కొడుకు పొంవంటాడనుకో. అయితే ఐందిగాని బలేమాటన్నావులే అన్నా. పట్వారీక్కూడా కాస్త బుద్ధి చెప్పరాదూ. తండ్రీ

కొడుకులికీ, అన్నాదమ్ములికీ మధ్య తంపులు పెట్టావుంటాడు. జమీందారు యేజంట్లతో కుమ్మక్కై రైతుల ప్రాణాలు తీస్తున్నాడు. మనపొలం యేమైపోయినాసరే, ముందు వాడి పొలం దున్నాలంట; వాడిపొలం వూడవాలంట!" అన్నాడొక యువకుడు.

మీసాలు మెలివేశాడు గోవర్. "నాకూ తెలుసుగా ఈ రామాయణం. ఏడాదిలోనే మర్చిపోయానంటా! నేనిక్కడ వుంటంలేదు గాని, వుంటే నేనా, వొక్కొక్కడ్నీ యేడిపించుకు తినకపోయానూ! సరేలే, హోలీపండుగ వస్తాందిగా? ఆ వంక పెట్టి వీళ్ళందర్నీ యేడిపించుకు తినండి!" అన్నాడు.

నిజమే! హోలీ పండుగకి ప్రోగ్రాం వేయాలిసిందే. రంగులుబాగా చిక్కగా, కలపాలి. తీపీ, కారమూ బాగా వేయించాలి. రంగులో బొగ్గూ గిగ్గూ కలిపి పంచాయితీదార్ల ముఖాలికి పుయ్యాలి. అదేమంటే హోలీ పండుగ అనవచ్చును. డబ్బుదేముంది? గోవరన్నయ్య సంపాదించుకు వచ్చాడు పట్నాం నుండి.

భోజనం చేసింతర్వాత, భోలాని కలిసికోవాల్నని బయల్దేరాడు గోవర్. ఆ యెడ్ల జతని తోలుకొచ్చి, మళ్లీ దొడ్లో కట్టేసేవరకూ నిద్రపట్టదు. పోట్లాటలకి జడిసే ఘటం కాదు గోవర్.

"నువ్వెళ్ళి మళ్ళీ గల్లంతు చెయ్యబాకురా బాబూ, అక్కడ. తోలికెళ్ళే తోలికెళ్లాడ్లే; డబ్బివ్వాలిగామరి" అని నసిగాడు హోరీ.

గోవర్ వుద్రేకపడ్డాడు. "మధ్యనువ్వు మాట్లాడొద్దు నాన్నా! ఆవు బాగాచేస్తే యాభై చేసేదేమో. అందుకని వందన్నరపెట్టి తోలుకొచ్చిన యెద్దని పట్టుకుపోతాడా? పోనీ, మూడేళ్లు మందగ్గరున్నయ్యనుకున్నా వందకి తక్కువ చెయ్యవు. తనడబ్బు రాదనుకుంటే దావా వెయ్యక పోయ్యాడా? డిగ్రీ చెయ్యకపోయ్యాడా; ఇంటికొచ్చి యెద్దు నిప్పుకుపోతాడూ? ఇటేమో యెద్దూ లేకపోయె; అటేమో వందన్నర జుల్మానా చెల్లిస్తివి. నేనుండాల్సింది ఇంటికాడ. దొడ్లో కెవ్వడడుగు పెట్టేవాడో చూచేవాణ్ణి. పంచాయితీదార్ల నెళ్లి ఇళ్లల్లో పడుకో మనేవాణ్ణి. నన్నెవడలేసేవాడో చూచేవాణ్ణి. నువ్వాగాబట్టి కళ్లప్పజెప్పి, చూస్తాకూర్చున్నావ్" అని లేచాడు గోవర్.

తప్పుచేసినవాడిలా తలవంచుకున్నాడు హోరీ; కాని ధనియామాత్రం యీ అవిధేయతని సహించలేకపోయింది. — "అదికాదురా నాయనా! మరీ అంత అడ్డగోలుగా మాట్లాడ తావుగాని, నిప్పూ నీళ్ళూ దొరక్కపోతే యేమైపోతావురా? ఇంట్లోనేమో వయసొచ్చిన పిల్లుండె; దాని పెళ్ళిగూడా కావాలా మరి? చచ్చినా, బతికినా ఇరుగూ, పొరుగూ..." అని అంటూండగానే తల్లిమాటల్ని సగంలో త్రెంపేశాడు గోవర్.

"సరేనమ్మా! యిరుగూ, పొరుగూ వుందిగా మనకి. గౌరవంగా కూడా బతుకుతుండేవాళ్ళంగా. నా పెళ్ళెందు కవ్వలేదో చెప్పు. నే చెప్పనా? మనింటో తడి లేదుగాబట్టి; మనం బీదాళ్ళం గాబట్టి! డబ్బు కావాలమ్మా డబ్బు? డబ్బుంటే వెలీలేదు గిలీ లేదు!!"

లోపల్నుండి చిన్ని మేదుపు వినిపించేప్పటికి, ధనియా యింట్లోకి వెళ్ళిపోయింది. గోవర్ బయటికి బయల్దేరాడు. హోరీ కూర్చొని ఆలోచిస్తున్నాడు. ఈనాటికి కొడుకు మాటల ముందు తనమాటలు పనికిరాకుండా పోయినై.

"నేనుకూడా రానంట్రా." అన్నాడు గోవర్తో.

"నేనేం పోట్లాటకెళ్ళటం లేదులే నాన్నా. జడవబాక. లా నాన్నై వుంది. నేనెందుకు పోట్లాడతానూ?"

"నేనుగూడా వస్తే నష్టం యేంవుంది?"

"కావల్సినంత నష్టం. ఐపోయే పనిగూడా ఆగిపోతుంది. నువ్వొస్తే."

హోరీ కిమ్మనలేదు; గోవర్ వెళ్లిపోయాడు.

ఐదునిమిషాలైనా కాకపూర్వమే, మనుమడి నెత్తుకొని, బయటికొచ్చింది ధనియా. "అబ్బాయెళ్లిపోయాడూ? వొంటరిగా యెట్టాపోనిచ్చావంట? దేవుఁడసలు బుద్ధిపెట్టాడా లేదా అంట నీకు? భోలా వూరికినే అప్పజెప్పుతాడనుకున్నావా నువ్వు? అబ్బా కొడుకులు, ముగ్గురూ కలిసి మీదపడితే యేమైంపోతాడు నాబిడ్డ? అయ్యో నారాత మండిపోనూ. కదలవేఁ పరిగెత్తికెళ్ళి ఆపెయ్యి అబ్బాయిని."

లేచి, మూలనున్న కఱ్ఱతీసుకొని, పడుతూలేస్తూ వూరు బయటికి పరుగెత్తాడు హోరీ. చూస్తే చాలదూరాన, లీలగా కన్పిస్తోంది చకచక నడచిపోయే గోవర్ ఆకారం; ఇంతలోనే అంతదూరం ఎట్లా నడిచాడో గోవర్. హోరీ బాధపడ్డాడు. మొదటనే వెళ్లొద్దనంటే పోయేది; గోవర్ మాట తీసేసేవాడు

గాదు. ఇక, యిప్పుడు పసుగెత్తినా లాభంలేదు; ఐనా అంత ఓపికగూడా లేదు. అక్కడే గొంతుకూర్చొని, "వాడికే ఆపదా రాకుండాచూడు భగవంతుడా!" అనుకున్నాడు హోరీ.

గోవర్ గొల్లపల్లె వెళ్లేప్పటికి, ఆవూళ్లో మఱ్ఱిచెట్టుకింద కూర్చొని, జూదం ఆడుతున్నారు కొందరు. గోవర్‌నిచూచి, యెవరో పోలీసు వస్తున్నాడనుకుని, ఎక్కడివాళ్లక్కడ లేచి పారిపోబోయారు. ఇంతలోనే జంగీ అనే అతను గోవర్‌ని గుర్తించాడు. "అరే. మన గోవర్ధనా వచ్చేది!" అన్నాడు.

"జడవబాకండిరా. నేనే. ఇవ్వాళేవచ్చాను. మళ్ళీ ఎన్నిరోజులకొస్తానో, చూచిపోదాం అని యిట్లావొచ్చా. ఏదో మీ దయవల్ల కాస్త మంచి ఉద్యోగవే దొరికింది. మా జమీందారు యిద్దరు ముగ్గురు మంచి మనుషులు దొరికితే తీసుకురమ్మని చెప్పాడు, చౌకీదారుద్యోగం కోసంలే. ప్రాణం పోయినా సరే నిలబడి పోట్లాడే మనుషుల్ని తీసుకొస్తాగా అని చెప్పివచ్చా. జంగీ! వస్తావా నువ్వు? బలే వుషారుగా వుంటుంది లే." అన్నాడు గోవర్.

గోవర్‌ని చూస్తూంటే ఆశ్చర్యంవేసింది జంగీకి. అత నెప్పుడూ చెప్పులుగూడా తొడుగుకున్న పాపాన పోలేదు; గోవరంటే నల్లగా మెరిసే బూట్లువేసుకున్నాడు, యిస్త్రీచేసిన చొక్కా, చక్కగా నున్నగా దువ్వుకొన్న తల, అంతా పెద్ద వుద్యోగస్థుడిలా వున్నాడు. ఏడాది క్రితం, కట్టుకునేందుకు గూడా గుడ్డల్లేని గోవర్, యీనాడిట్లా...! ఎంత మార్పు. అందుట్లో జంగీ వఠి జూదగాడు; పైన గంజా పిచ్చి. ఎంత పిక్కలుకున్నా యింట్లో డబ్బులు పుట్టేవిగాదు.

నోరూరింది. "యెందుకురానూ? ఇక్కడెట్లాగో పనేవీఁలేను. ఎంతిస్తారేంటి?" అన్నాడు.

"అందులో యేఁవుంది! అంతా మనచేతుల్లోనేగా వుండేది. నీయిష్టంవొచ్చినట్టే చేద్దాం. ఇంట్లో మనుషులుంటే యింకా యెక్కడో చూట్టం యెందుకులే! అని, వొచ్చా." అన్నాడు. అపరిమితమైన ఆత్మవిశ్వాసంతో గోవర్.

"ఏంపని చెయ్యాలేంటి?" అనడిగాడు జంగీ వుత్సాహంతో.

"నీయిష్టం! చౌకీదారీ చేసినాసరే; లేకపోతే వూళ్ళకెళ్లే వుద్యోగం చేసినాసరే. అదేమంచిదిలే. వూరెళ్ళి వచ్చి, ఆసామీ యింటికాడ లేడని చెప్తే సరి? రోజుకి రూపాయిన్నర బేటా దొరుకుతుంది."

"వుంటానికి యిల్లుగూడా యిస్తారా మరి?"

"యిళ్ళకేం తక్కువ? పేద్ద బంగాళావుంది. నీళ్ళకి పంపు; ఎలక్ట్రిక్ లైట్లు! అన్నీవుంటై. సరేగాని, కామతా వున్నాడా వూళ్లో?".

"పాలమ్ముకురావటానికని బజారెళ్లాడు. నన్నెవళ్లూ బజారు కెళ్లనివ్వను. అదేఁవంటే గంజా తాగుతావంటారు. అసలీ మద్యం తాగటం మాత్రం యేఁవుందిలే. రోజుకొక అర్ధణా వుంటేచాలు. ఎందుకులే. నువ్వు కామతా కేఁవీఁ చెప్పబాక. నేనొస్తాలే పట్టణం."

"ఓ మహారాజులాగా రావొచ్చు. హోలీ వెళ్లిం తర్వాత."

"ఐతే ఖాయంవేనా!"

యిద్దరూ కలసి, భోలా ఇంటికి వచ్చారు. భోలా త్రాళ్ళు పేనుతున్నాడు. గోవర్ గబగబా వెళ్లి భోలా కాళ్లకి మ్రొక్కాడు. మ్రొక్కి "నేను చేసిన తప్పుకి మన్నించాలి!" అన్నాడు గద్గదస్వరంతో.

త్రాడు పేనటం ఆపి, "నువ్వుచేసిన పనికి నిన్నేంచేసిన పాపంలేదురా అబ్బాయి. ఐనా ఇంటికొచ్చావు, యింకా నేననేదేంవుంది. పో దేవుడే చూస్తాడ్లే ఆ మంచీచెడ్డా అంతా," అన్నాడు భోలా.

ఉన్నవీ, లేనివీ నాలుగు కలిపి పట్టణంలో తన వున్నత స్థితిని గురించి తెలియచెప్పాడు గోవర్. 'జంగీ'ని పట్టణం తీసుకునివెళ్లేందుకు అంగీకరించవలసిందని కోరాడు. వెదక బోయిన తీగె కాళ్ళకు తగిలినట్లయింది భోలాకు. ఇంటిదగ్గర వుంటే యేదోవొక పేచీ తెచ్చిపెడుతూంటాడు గోవర్. పోనీ, బయటికిపోతే, నాలుగు డబ్బులైనా సంపాదించుకుంటాడు. ఇంటికి పంపకపోతే పోనీ, తనఖర్చైనా వెళ్ళబెట్టుకుంటాడు; అంతేచాలు.

"కాదులే మావా. రెండు మూడేళ్ళలో మనిషై పోతాడు చూస్తావుండు!" అన్నాడు గోవర్.

"రెండు మూడేళ్లు వున్నప్పటిమాటగందా."

"నెత్తిమీదకొస్తే సరి, దానంతటదే తెలిసొస్తుంది."

"అయితే యింకెళ్ళేదెప్పుడు?"

"పండగెళ్ళగానే. వ్యవసాయం, గివసాయం పనులు పురమాయించుకొని."

"ఇక కృష్ణా, రామా అనుకొంటూ కూర్చోమను మీ నాన్నని."

"చెబుతానేవున్నా; వింటేనా."

అక్కడెవర్నన్నా వైజ్ఞుణ్ణెరుగుదువేం వోం. దీంతుంప తెగ వాకటే దగ్గు, చస్తన్నాననుకో. ఏదన్నా మందు పంపిచ్చి పెద్దూ."

"మాయింటి పక్కనే వున్నాడు డాక్టరు. చెప్పి, మందు చేయించి పంపుతాలే. దగ్గు బాగా యెప్పుడొస్తాంది? రాత్రి పూటా, పగలా?"

"రాత్రిపూటే బాబూ. కంటిమీద కునుకు పట్టటం లేదనుకో. ఇక్కడ చేసి, చచ్చేది మాత్రం యేంవుందిలే. అక్కడికి రమ్మంటే పోనీ నేనేవస్తా. వుంటాని కీలుంటందామరి!"

"చెబితే నమ్మవుగాని మాంవయ్యా. అక్కడికీ ఇక్కడికీ పోలికేంవుంది? ఇక్కడ రూపాయికి పదిసేర్లిచ్చినా కొనరా పాలు, అక్కడ ఐదుసేర్లన్నా సరే, యెత్తుకుపోతారనుకో; రెండు మణుగుల పాలైనా సరే, కన్నుమూసి తెరిసేటప్పటికి, ఖర్చైపోతై."

షర్బత్ చేసి పట్టుకొస్తానంటూ లోపలికి వెళ్ళాడు జంగీ. ఒంటరిగావున్న అతనుచూసి, కాస్త ముందుకు జరిగి, "చూడు బాబూ! ఇక నేనిక్కడుండలేను. ప్రాణం కొడిగట్టిపోతాం దనుకో. జంగీ సంగతి నీకు తెలుసుగా. కామతా అంటే పాలు పట్టికెళ్తన్నాడు. ఇక యింటిదగ్గర పనంతా నేనే చెయ్యాలనుకో. గొడ్డకికట్టెయ్యటం, మేతెయ్యటం, కుడితిపెట్టటం, పాలు

పితకటం ... వొక టేవింటె, అన్నీనీ. ఇవిచాలక యీ దగ్గొకటి; రొమ్ములు కుళ్ళబొడుస్తాంది. ఇసుగెత్తిపోతాందనుకో. ఏమూలాన్నో కూకొని, యింతతిని, హాయిగా, కాళ్ళుజాచి పొడుకోవాలనిపిస్తాంది. ఎంతకాలంవని పడను యీ బాదరబందీ అంతా. చూడు యీ పలుపుతాడు తెగిపోయి నాలుగురోజు లయ్యిందా. నేను చూచేదాకా యెవళ్ళూ పట్టించుకోనే లేదు. ఇక నేను వేనితే వేనినట్టు; లేకపోతే లేనట్టు." అన్నాడు భోలా.

గోవర్ చాలా ఆత్మీయత్తో మాట్లాడాడు. "నువ్వు గూడా నాతోపాటు లక్నోరా మావయ్యా. ఐదు శేర్లు పాలమ్మ కుంటేచాలు. నేను చాలామంది షావుకార్లనెరుగుదును. మణుగు పాలకి పూచీ నాదేననుకో. నాకూవొక టీ దుకాణం వుంది. పదిసేర్లపాలు నేనే పుచ్చుకుంటాను. నీకేమీ యిబ్బందుండదు." అన్నాడు.

జంగీ షర్బత్ పట్టుకొచ్చాడు. ఒక గ్లాసుడు షర్బత్ తాగి, "నువ్వొకిక నే ప్రొద్దుటపూటా, సాయంత్రవూ, దుకాణాలో కూర్చుంటేచాలు మావయ్యా, వొక రూపాయన్నా కళ్ళజూడొచ్చు." అన్నాడు గోవర్.

ఒక నిమిషం ఆగి, సంకోచిస్తూ, నాయనా! కోపంలో మంచీ చెడ్డా తెలవకుండా పోతంది. నేను మీ యెడ్లజతని యిప్పుకొచ్చా; నువ్వుతోలికెళ్లిపో బాబూ. మాకు వ్యవసాయం మాత్రం ఏంవుందిలే." అన్నాడు భోలా.

"నేనింకో కొత్తజతని కొనబోతున్నా మావయ్యా?"

"వద్దొద్దు. కొత్తజత నేంచేసుకుంటా? ఈ జతుండగా. దీన్నే తోలికెళ్లు.

ఐతే ఇంటికెళ్లిం తర్వాత నీకివ్వాల్సిన పైకం పంపిచ్చేస్తా"

"అదేఁవన్న మాటలే బాబూ. డబ్బెక్కడుంటే యేఁ వుంది? మీ యిల్లొకటీ, మాయిల్లొకటీనా? అక్కడే వుండనీ, ఝునియా మీ యంటి మంచింట్లోకొచ్చినందుకు న్యాయంగా ఐతే నేను సంతోషించాల్సింది. నేనేఁ వోఁ దానిమీద పగబట్టి తిని. అంతకంటే మంచి అత్తారెక్కడ దొరుకుతారు బాబూ దానికి మాత్రం!"

సాయంత్రం అయ్యేప్పటికి గోవర్ యింటి ముఖం పట్టాడు, ఎడ్లజతని వెంటబెట్టుకుని. అంచులదాకా నిండిన రెండు పెరుగుకుండల కావడేసుకుని, బావవెనకే బయల్దేరాడు జంగీ.

289

# 17

పల్లెటూళ్ళల్లో, సంవత్సరంలో ఆరుమాసాలు యేదో ఒక పండుగని పురస్కరించుకుని, ఆనందోత్సవాలు జరుగుతూనే వుంటాయి. భజనలు, హరికథలు, నాటకాలు, అప్పిచ్చినవాళ్ళ బెదరింపులు, జమీందారు యేజంట్ల దురాగతాలు, యీ ఆనందానికి అడ్డంరావు. ఇంట్లో బియ్యం లేకపోయినా, కట్టుకునేందుకు బట్టలు లేకపోయినా, బొడ్లో డబ్బులు లేకపోయినా - యేది యేమైనా సరే! - ఈ పండుగలు మాత్రం వస్తూనే వుంటాయి. జీవితం కోరుకునే ఆనందాన్ని అణచిపెట్టలేం; నవ్వులేని మనిషి బ్రతకగలగడం చాలా కష్టం.

హోలీ వస్తే ఆటపాటలూ, భజనలూ నో ఖేరాంగారి చావట్లోనే జరిగేవి. రంగులు కలపటం, నాటకాలు వేయటం - అన్నీ - అక్కడ జరగవలసిందే. ఆయన కూడ మూటవిప్పి ఐదో; పదో ఖర్చు చేస్తూండేవాడు. అంతడబ్బు ఖర్చుపెట్టి, తమ యింటిముందే వుత్సవాలు జరిపించుకోగలశక్తి మరే రైతుకూ లేదు ఆ గ్రామంలో.

కాని, యీ సంవత్సరం వూళ్లో వున్న యువకులందరూ గోవర్ యింటిముందే గుమికూడుతున్నారు. సమస్తోత్సవాలూ గోవర్ యింటిముందే జరుగుతున్నాయి; నోఖేరాంగారి చావడి బిక్కు, బిక్కుమంటోంది. వూళ్ళోవాళ్లా చావడివైపు తొంగి కూడా చూడటంలేదు! గోవర్‌కి సంపాదించటమూ చేతనౌను; ఖర్చు పెట్టటమూ చేతనౌను. సంపాదించి, పాతర వేసుకుంటే యెవరికి తెలుస్తుంది? డబ్బున్న తర్వాత ఖర్చుపెడితేనే దానికి అందమున్నా, చందమున్నా. గోవర్ యింటిముందు చాపలు పరచాడు. ఆడేవాళ్ళకూ, పాడేవాళ్ళకూ భోజనాలు గూడ యేర్పాటు చేశాడు. అందులో, వూళ్ళో ఆడేవాళ్ళూ పాడేవాళ్ళూ, నాటకాల్లో వేషాలు వేసేవాళ్ళూ కావలసినంత మందున్నారు. శేఖర్ కుంటివాళ్ళ వేషం వేయటంలో బహు నేర్పరి. స్వరాన్ని అనుకరించటంలో గూడా అతనిదే అందె వేసిన చేయి. మనిషి మాటలైనాసరే, జంతువుల అరుపులైనా సరే, పిట్టలకూతలనైనా సరే యిట్టే అనుకరించేస్తాడు. గిరిధర్ యే వేషానికైనా సరే తూచినట్లు సరిపోతాడు. వకీలు వేషం గానీండి, పట్వారీ, ఠాణేదారు, గుమాస్తా, షావుకార్ల వేషాల్లో దేనికైనా కానీండి, అచ్చుగుద్దినట్లు సరిపోతాడు. ఐతే ఈ వేషాల నన్నిటినీ వేసేందుకు తగిన పరికరాలూ, దుస్తులూ లేవు అతని దగ్గర. గోవర్ మొత్తం మీద అవన్నీ సంపాదించి, తీసుకురాగలి గాడు; అంచేత యీసారి అతనివేషాలు చూడ ముచ్చటగా వుంటాయి తప్పకుండా.

దీపాలు పెట్టేవేళకే జనం అంతా ప్రోగయ్యారు. చుట్టు ప్రక్కల గ్రామాలనుండిగూడా బళ్లు కట్టుకొని వచ్చారు

చూద్దామని. పది అయ్యేప్పటికి మూడు, నాలుగు వేల జనం వచ్చేశారు. ఝింగురసింగు వేషం వేసుకొని, గిరిధర్ రంగంమీది కెక్కేప్పటికి, యిసుకవేస్తే రాలకుండా వున్నారు జనం. ఆ బట్ట తల, ఆ బుర్రమీసాలు, ఆ బానకడుపు! మూడు మూర్తులా ఝింగురసింగులాగానే వున్నాడు. కూర్చొని భోజనం చేస్తు న్నాడు. పెద్ద భార్య విసన కర్రతో విసురుతోంది.

ఠాకూర్ ఝింగురసింగు భార్యవంక రసికుడిలా చూస్తూ, "నువ్విప్పటికీ మాంచి వయసులోనే వున్నావుసుమా! యెవరైనా పడుచువాళ్ళు చూశారంటేనా, అబ్బో!... అంటు న్నాడు. "అందుకనేగావాలిమళ్ళీ పడుచు పెళ్ళాన్ని కట్టుకొంది!" అని మూతి త్రిప్పుకుంది మొదటిభార్య.

"దానికీ నీకూ సాపత్యమేమిటే! నీకు సేవ చేస్తుందిగదా అని చేసుకుంటే."

ఈ మాటలన్నీ వింటూన్న రెండోభార్య మూతీ, ముక్కీ త్రిప్పుకుంటూ వెళ్ళిపోతుంది.

రెండో దృశ్యం. ఠాకూర్ మంచంమీద పండుకుని వున్నాడు? రెండవభార్య పెడముఖం పెట్టుకుని కూర్చుని వుంది. ఆవిడ మొఖం తనవైపుకు త్రిప్పుకోవాలని ప్రయత్నిస్తూంటాడు ఠాకుర్. "కోపమేలనే, కోమలాంగీ!"

"నేనేం కోమలాంగిన్లే! వాళ్ళకీ, వీళ్ళకీ సేవజెయ్యటానికని తెచ్చిపెట్టుకున్న దాసీముండనయ్యో."

"నువ్వేనే నా రాణివి. ఆ ముసలిదే చెయ్యాలి నీసేవలన్నీని!"

ఈ మాటలన్నీ వింటూన్న మొదటిభార్య, చీపురుకట్ట చేతబట్టుకొనివచ్చి, ఠాకూర్ గారి వీపుమీద నాలుగు సింగారిస్తుంది. ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని, కాళ్ళకు బుద్ధి జెపుతాడు ఠాకూర్.

తర్వాత మరో అనుకరణ. ఈసారి ఠాకూర్ పదిరూపాయలకు దస్తావేజు వ్రాయించుకుని, అయిదురూపాయలే చేతిలో పెడతాడు.

రైతువచ్చి, ఠాకూర్ కాళ్ళుపట్టుకుని బ్రతిమలాడుతాడు, యేడుస్తాడు. ఎంతో కష్టంమీద పదిరూపాయలిచ్చేందుకు అంగీకరిస్తాడు ఠాకూర్. కాగితాలమీద వ్రాతకోతలు పూర్తయింతర్వాత ఐదురూపాయలిస్తాడు ఆ ఆసామి చేతికి. ఆ రైతు, పాపం, గుక్కతిప్పుకోలేక —

"ఐదే యిస్తారేంవండీ బాబుగారూ ?!"

"ఐదుకాదులే: పదే. ఇంటికెళ్ళి లెఖ్ఖపెట్టుకో!"

"కాదు బాబూ. చూచాగా. ఐదే."

"ఒకరూపాయి నజరానా ?"

"చిత్తం !"

"రాతకోతలకొక రూపాయా ?"

"చిత్తం !"

"కాగితానికొక రూపాయా ?"

"చిత్తం !"

"రూపాయి వడ్డీ?"

"చిత్తం !"

"దస్తూరికొక రూపాయి?"

"చిత్తం బాబూ!"

"శౌఖంగా యిచ్చింది ఐదు. పదవ్వాలా మరి?"

"నిజవేఁ కాని బాబుగారూ! ఈ ఐదుగూడా మీరే వుంచుకోండి."

"పిచ్చెక్కిందా యేవిఁటి నీకు?"

ఇందులో పిచ్చేఁవుంది బాబుగారూ! ఒకరూపాయి పెద్ద దొరసానికి; ఒకరూపాయి చిన్న దొరసానికి. ఒకరూపాయి చిన్న దొరసానిగారి తమలపాకులికి; ఇంకొక రూపాయి పెద్ద దొరసాని తమలపాకులికి. ఇంకా వొక్కరూపాయి మిగిలింది. అది మీ దహన సంసకారాలకి!"

ఇట్లాగే నోఖేరాంనిగురించీ, పటేశ్వరి, శాస్త్రిలను లక్ష్యించీ, చిత్ర, విచిత్ర వేసాలు వేశారు. ప్రదర్శనాలలో నవ్యత్వం యేమీలేదు; అనుకరణ గూడ పాతబడినదే. ఐనా గిరిధర్ చేసే అనుకరణ చూచి, జనం పొట్టలు చక్కలయ్యేట్లు నవ్వారు. ఇట్లాగే తెల్లవార్లూ ప్రహసనాలు జరుగుతూనే వున్నవి. పీడిత, దళిత హృదయాలు ఈ కల్పనలద్వారా, ప్రహసనాలద్వారా తమ తమకసి తీర్చుకుని, సంతోషించాయి. చివరి ప్రహసనం పూర్తయ్యేప్పటికి కాకులుకూసినై.

తెల్లవారింతర్వాత, ఎవళ్లని చూచినా ప్రహసనాలని గురించే మాట్లాడడం. ఆ పాటలే పాడుతున్నారు; అవే అనుకరణలు చేస్తున్నారు. వూళ్లో పెద్దలంటే పెద్ద తమాషా ఐపోయింది; బయటకు అడుగుపెట్టే పారం లేకుండా పోయింది. ఎక్కడికి వెళ్లినా, నలుగురైదుగురు పిల్లలు కలసి వెంటబడుతున్నారు; పాటలుపాడీ, మాటలనీ హేకిలి చేస్తున్నారు.

ఝింగురసింగంటే యెట్లాగూ హాస్యప్రియుడేగాబట్టి, పెద్దగా పట్టించుకోలేదు. కాని పటేశ్వరికి కోపం వచ్చింది. ఇంక శాస్త్రిగారి సంగతి చెప్పనవసరమేలేదు. ఆయనకసలు కోపం ముక్కుమీదనే వుంటుంది; పోట్లాడేందుకుగూడ వెనుదీయడు. అందరూ గౌరవించాలి ఆయన్ని; జమీందారు యేజంటు దగ్గర్నుండి జమీందారువరకూ! అతన్ని, అతని స్వగ్రామంలో, ఇంతగా అపహాస్యం జేయటమా! నవ్వులపాలు జేయటమా? ఆయనకే బ్రహ్మతేజం వుంటే ఈ దుష్టులందరినీ భస్మీపటలం చేసేసేవాడు; వీళ్లందరూ భస్మమైపోవాలని శాపం యిచ్చేవాడే. కాని, పాపం! ఈ కలియుగంలో శాపాలు అంతగా పని చెయ్యటంలేదు. అంచేత కలియుగాయుధాన్నే బైయటకు తీశాడు; హోరీ ఇంటికి వెళ్లాడు. "ఏం హోరీ! యివ్వాళైనా వస్తావా పొలంపనికి? బాగుపడ్డావుగా. నాకెంత నష్టమౌతుందో తెలియడం లేదులాగుంది నీకు!" అన్నాడు కళ్లెర్రజేస్తూ.

గోవర్ ఆలస్యంగా పండుకున్నాడేమో - అప్పుడే లేచి కళ్ళు నలుముకుంటూ బయటికివస్తూంటే, శాస్త్రిగారి మాటలు వినిపించినయి. బతిమాలటం మాట అట్లా వుంచి, "ఇక మానాన్న మీపొలంలో పనిజెయ్యటానికి రాడు; మేం మాసాగు చేసుకోవద్దా యేమిటి ?" అంటూ తలబిరుసుగా మాట్లాడాడు.

"ఎందుకు చెయ్యవోయ్ పని ? మధ్యలో కమతం మానెయ్యటం మీ యిష్టమేనా యేమిటోయ్ ! అంతిష్టం లేకపోతే జ్యేష్ఠంలో మానేసుకోండి, యెవరొద్దన్నారు ? అంతే గాని, అంతకుముందు వదలటానికి వీల్లేదు" అన్నాడు శాస్త్రి.

గోవర్ మరింత పట్టుదలగా మాట్లాడాడు. "నీ కేవిఁ బానిసలంగాదు మేం. ఇష్టం వున్నంతకాలం చేస్తాం; కష్టవైఁ నప్పుడు మానేస్తాం. ఇదేఁవన్నా బలవంతవాఁ యేంటి?" అన్నాడు.

"ఐతే పనిలోకి రారన్నమాట?"

"రాం?"

"ఇంకేఁ, వడ్డీ అసలుఘాయిదాల్లో మాడబ్బు మా కిచ్చెయ్యండి. మూడు సంవత్సరాలకీ వందౌతుంది వడ్డీ. నెలకి మూడు రూపాయలు వడ్డీ తగ్గుతుందిగదా మన పనిలోకి వస్తే అనుకున్నా. సరే; మీకిష్టం లేకపోతే నేనుమాత్రం యేం జేస్తానులే; నాడబ్బు నాకిచ్చేయండి!"

"మీపని చెయ్యనని నేను మాత్రం యెప్పుడన్నానండీ శాస్త్రుల్లుగారూ. కాకపోతే మరి మాపని మాత్రంఁ చూసుకో వద్దండీ" అన్నాడు హోరీ శాస్త్రితో.

"ఏవిఁ పని? యెందుకు చెయ్యాలి? మనం యేమన్నా కూలాళ్ళమా? బలేగావుందే! వాకొంద అప్పివ్వటం, వడ్డీకింద బతికినంతకాలవూఁ కూలీ, నాలీ లేకుండా చాకరీ చేయించు కోవటవూఁ. ఇది వడ్డీవ్యాపారవాఁ? నెత్తురు తాగటంగాని..." అంటూ లేచాడు తండ్రిమీద గోవర్.

"సరే బాబూ, పోట్లాటదేనిగ్గాని, నాడబ్బు నాకిచ్చె య్యండి. యేదో యెరిగినవాడవుగదా అని యిచ్చినందు కింత యిందా... నేను మామూలుగా రూపాయకి అణావడ్డీ పుచ్చు కుంటా. మీకూ తెలుసుగా. మీరు అర్ధణా చేసుకుని యిచ్చె య్యండి."

"రూపాయికేగానీ, అంతకంటే దమ్మిడీగూడా యెక్కువివ్వం. కావాలంటే పుచ్చుకో. లేకపోతే కోర్టుకెక్కు. మేవూఁ చూస్తాం. రూపాయికొక్కనీ అంటేమాత్రం మాటలా యేవిఁటి!"

"డబ్బున్నదిగదా అని, మహాఁ గర్వం యెక్కినట్లుందే."

"ఒకటిచ్చి, పది పుచ్చుకునేవాళ్ళకిగ్గాని మాకెందుకూ గర్వం? మేం అంటే కూలాళ్ళం. మా గర్వం అంతా చెమటై కారిపోతుంది. నాకు బాగా జ్ఞాపకం; యెల్లకని ముప్ఫై రూపాయలిచ్చావు. ఆ ముప్ఫయ్యీ నండైనయి. ఆ వందా రెండొందలైనయి. ఇట్లాగేగా మీరు రైతుల్ని దోచుకుని, దోచుకుని, చివరికి కూలాళ్ళని చేసేసింది! మీరేమోఁ భూములికి ఖామందులై కూర్చున్నారు. ముప్ఫై యిస్తే రెండొందలైంది! ఇంత ఘోరకలింకెక్కడన్నా వుంటుందా? ఎన్నిరోజులైంది నాన్నా?"

"ఎనిమిదేళ్ళో, తొమ్మిదేళ్ళో ఔతుందనుకుంటా" అన్నాడు హోరీ గాద్గదికంగా.

గోవర్ ఱొమ్ము బాదుకున్నాడు. "అమ్మొ బాబోయ్. తొమ్మిదేళ్ళకే ముప్ఫైరూపాయలూ, రెండొందలైపోయినయ్! రూపాయి లెఖ్ఖసిచూస్తే యెంతౌతుంది!"

నేలమీద పుల్లతో గీస్తూ లెక్కవేశాడు గోవర్ - పదేళ్లకీ ముప్ఫయ్యీరు. అసలుగూడా వచ్చికలిస్తే అరనై యాసు. సరే, డెబ్బైతీసుకో పోనీ. అంతకంటే దమ్మిడీ యెక్కువివ్వను."

గోవర్‌తో మాట్లాడినా లాభం లేదనుకుని, హోరీతో మాట్లాడాడు శాస్త్రి. "వింటున్నావటయ్యా హోరీ! నీకొడుకెట్లా

ఫైసలు చేస్తున్నాడో. రెండొందలూ వదులుకుని, డెబ్భై పుచ్చుకోవాలట; లేకపోతే కోర్టుకెక్కాలట. వ్యవహారాలిట్లా వుంటే యింకా ఎన్నిరోజులు నడుస్తుందీ ఈ ప్రపంచం? నువ్వేమో వింటూగూర్చుంటావ్? నేను బ్రాహ్మణ్ణయ్యా, బ్రాహ్మణ్ణి! బ్రాహ్మడి సొమ్ముతిని, బాగుపడ్డవాడెవ్వడూ లేడు. నేను ఈ డెబ్భయియ్యా పుచ్చుకోను; కోర్టుకూ వెళ్ళను. నేనే గనక బ్రాహ్మడి పుటక పుడితే, నా రెండొందలూ పుచ్చుకునే తీరతా; మీరే యిస్తారయ్యా నాయింటికొచ్చి, కాళ్ళమీద పడి బ్రతిమాలి మరీయిస్తారు; యేమనుకుంటున్నావో!"

శాస్త్రి వెనక్కి తిరిగాడు గంగ వెర్రులెత్తినట్లు. గోవర్ మెదలకుండా కూర్చున్నాడు. హోరీకి మాత్రం యిదంతా నచ్చలేదు. అదే గనుక యేషావుకారు డబ్బో, యేకోమటి డబ్బో ఐతే అతనికంత బాధగా వుండేదికాదు; యిదంటే బ్రాహ్మణుడి డబ్బు! ఆడబ్బులో కానీ తొఱ్ఱపడినాసరే, తర్వాత యెప్పుడో వొకప్పుడు కక్కవలసే వస్తుంది. బ్రాహ్మణుడి కోపం సామాన్యమైనది కాదు; పుత్ర, పౌత్ర పర్యంతం' వంశనాశనం ఐపూనుకుంటుంది. సాంప్రదాయాల్లో పుట్టి పెరిగిన హోరీ, భయపడిపోయాడు. పరుగెత్తుకెళ్ళి, వెళ్ళిపోతూన్న శాస్త్రిగారి కాళ్ళకు అడ్డం పడ్డాడు. "నామాటవిను బాబూ; వాడు పసిగాయ, వాడికేం తెలుస్తుంది? చచ్చేలోపుగా నీకివ్వాల్సిందంతా, దమ్మిడీల్తో సహా, తీరుస్తానంటున్నాగా!" అని విల విల తన్నుకుంటు న్నట్లు మాట్లాడాడు.

శాస్త్రి కొంచెం మెత్తబడ్డాడు. "అది కాదయ్యా! వాడి పొగరు చూచావుగా, రెండొందలకీ డెబ్భైయిస్తాడట; యిష్టం

లేకపోతే కోర్టుకెళ్లాలట. ఇంకా అబ్బాయికి కోర్టుగాలి సోకినట్లు లేదు. ఒకసారెళ్తేగాని, అదిగూడా తెలిసిరాదు. పట్టణంలో నాలుగు రోజులుండి, వచ్చాడో లేదో, దొరనైపోయాననుకుంటున్నాడులా వుంది."!

"దమ్మిడీల్తోసహా చెల్లగట్టుకుంటా నంటన్నాగా బాబూ."

"ఐతే రేప్పొద్దుట్నుంచీ పనిలో కొస్తావుగా."

"మా వ్వాడ్పులు గూడా వున్నైగా బాబూ; లేకపోతే మీ పనిలోకే వచ్చేవాడిని."

శాస్త్రి వెళ్ళిపోగానే, తండ్రిమీద విరుచుకుపడ్డాడు గోవర్ — "యేం! దేవుండనుకొనెళ్లావా కాళ్లాయెళ్లా పడ్డానికి? అసలు వాళ్ళననిమాత్రం యేం లాభంలే; మీ వంటాళ్ళుండబట్టే వాళ్ళ కళ్ళంత నెత్తికెక్కింది. ముప్పై యిచ్చాడు; రెండు వందలూ గోళ్ళూడగొట్టి వసూలు చేసుకుంటాడు; పైన వెట్టి చాకిరీగూడా చేయించుకుంటాడు. మీ ప్రాణాలు తీసేస్తాడు!"

హోరీ ధర్మశాస్త్రం బోధించాడు కొడుక్కి— "ఐనా నీతి నియమాలు వదిలేస్తే యెట్లారా? మన ఖర్మ మనది. పుచ్చుకునేప్పుడు యింత వడ్డీ యిస్తామని అందీ మనవేంగా; యివ్వాళ కాదంటే యెట్లా? అందులోనూ బ్రాహ్మడాయె; వాళ్ళ డబ్బు అసలే అరిగి చావదు!"

గోవర్ కనుబొమ ఎగరేశాడు. నీతినియమాలొదులుకోమని ఎవర్నన్నాను? బ్రాహ్మడి డబ్బు అరుగుతుందని నేను మాత్రం అన్నానా? అంత వడ్డీయివ్వం అన్నానేను. అంతేగా? బాంకులో ముప్పావలా పుచ్చుకుంటారు. నేను రూపాయియిస్తానన్నాగా. ఇందుట్లో బ్రాహ్మడిసొమ్ము తింటం ఏంవుంది?"

"నీళ్ళకి ధారులెవరు తీస్తార్రా యిప్పుడు? పసుగెత్తికెళ్ళి, బెదరగొట్టొచ్చావు గాసి. వెళ్ళి, బ్రతిమాలి తీసుకురారాదూ?" అన్నాడు హోరీ కొడుకుతో.

"అసలు నువ్వే చెడగొట్టావు వీళ్ళందర్నీ."

"నువ్వుకొట్టినట్టు కొడితే, వాళ్ళకసలే సిగ్గూ, బిడియాలు లేకుండా పోతై."

"ఒకపూట కడుపుమాడిస్తేసరి, వాళ్ళకే తెలిసొస్తుంది."

"నేనువాళ్ళకి తండ్రినిరా; కసాయివాణ్ణిగాదు."

గాయంవున్న వ్రేలికే తగులుతాయి ఎదురుదెబ్బలు; అంచేతనే గాయంమానేందుకు మరింత ఆలస్యం ఔతుంది. తండ్రికొడుకుల సద్భావం ఎట్లాగో గాయపడింది; ఇప్పటికిది మూడో ఎదురుదెబ్బ.

ఇంటికొచ్చి, ఝునియాని వెంటబెట్టుకొని వెళ్ళాడు పొలంలోకి గోవర్. ఝునియా బిడ్డని చంకనేసుకుని వెళ్ళింది. ధనియా, ఆవిడతోపాటు ఆడపిల్లలిద్దరూ, కళ్ళప్పగించి, చూస్తూ వూరుకున్నారు. కొడుకుచేసే వుద్దండపు పనులు చూస్తూంటే తల్లికిగూడా కోపం వచ్చింది. రూపని కొట్టినా పర్వాలేదు; చిన్నపిల్ల. ఎదిగిన ఆడబిడ్డని, సోనాని కొట్టాడంటే ఆవిడకు అసహ్యం వేసింది.

లక్నో వెళ్ళిపోవాలని నిశ్చయం చేసేసుకున్నాడు గోవర్, ఇవ్వాళరాత్రి. ఇక యిక్కడ వుండలేడతను. అతని మాటంటే యింట్లో విలువే లేకుండాపోయింతర్వాత యింకా వుండేం లాభం? ఇచ్చి, పుచ్చుకోవటాలని గురించి మాటాడేందుకు వీల్లేదు; ఆడపిల్లల్ని కొస్తే, యిట్లా అనేప్పటికే యింట్లోవాళ్ళం

దరూ, కట్టుకట్టినట్లు మూతులు బిగబట్టుకుని కూర్చున్నారు; తనని పరాయివాడిలా చూస్తున్నారు. ఇక యీ యింట్లో, చచ్చినా వుండగూడదు.

తండ్రీ, కొడుకు లిద్దరూ, భోజనంచేసి, బయటికి వచ్చారో లేదో, నోఖేరం దగ్గరనుండి కబురువచ్చింది, యింటికి రమ్మని.

హోరీ, మంచిబెట్టుగా, "శిస్తు కట్టేశాగా? పొద్దుగూకిం తర్వాత, యిప్పుడెందుకు రమ్మన్నాడు" అనడిగాడు వచ్చిన మనిషిని.

"పిలుచుకు రమ్మని చెప్పారు. ఏవన్నా చెప్పాలను కుంటే, వచ్చి, ఆయనకే చెప్పుకోండి" అన్నాడు వచ్చిన మనిషి.

హోరీకి వెళ్ళాలని లేదు; ఐనా వెళ్ళక తప్పలేదు. గోవర్, దీనంతటితో తనకేమీ సంబంధంలేనట్లు, కూర్చు న్నాడు. ఒక అరఘుంటయింతర్వాత హోరీ వచ్చాడు; వచ్చి, చుట్ట ముట్టించుకుని, కూర్చున్నాడు. గోవర్ వూరుకోలేక, "యెందుకూ పిలిపించింది?" అనడిగాడు.

"దమ్మిడీగూడా బాకీ లేకుండా శిస్తు చెల్లగట్టేశా. ఆయ నేవో రెండు ఫసలీల శిస్తింకా బాకీ వుందంటాడు. నిన్నగాక మొన్న, ఫ్యాక్టరీలో, వచ్చిన సొమ్మంతా, యిరవై అయిదు రూపాయలూ, వాడిచేతుల్లో పోసొచ్చా. ఇప్పుడేవో ఇంకా బకాయీ వుందంటాడు. చచ్చి గీ పెట్టుకున్నా యివ్వనని చెప్పొచ్చా" అన్నాడు హోరీ, నిండారుగై.

"రశీదుందిగా నీ దగ్గర?" అన్నాడు గోవర్.

"రశీదెక్కడిస్తన్నాడు?"

"రశీదడక్కుండా డబ్బెట్టా యిచ్చావు నువ్వు?"

"ఇట్లా నీతి తప్పుతాడని నాకేం తెలుసు? ఐనా యిదంతా నీమూలాన్నే వచ్చింది. రాత్రి, అంతమందిలో, అట్లా యెద్దేవా చేశావు కాబట్టే, మరీ యింత బరి తెగిపోయాడు. ఎన్ని సార్లు చెప్పా నెన్నిసార్లు చెప్పాను; నీళ్ళల్లో వుండేవాళ్ళు మొసల్తో వైరం పెట్టు కుంటేయెట్లాగురా? అని. విన్నావా? వడ్డీ, బాడ్డీ అంతా కలిపి, డెబ్బైఐదంటున్నాడు. ఎవళ్ళింటో కన్నంవేసి తేను అంతడబ్బు?"

నువ్వారశీదు పుచ్చుకుంటే, నేనెంతయెద్దేవా చేసినా, యేమీ, అయ్యేదిగాదు. ఐనా డబ్బుతో వ్యవహారం ఐనప్పుడు కాస్త జాగ్రత్త పడగూడదూ? రశీదివ్వడనుకుంటే, సుభ్రంగా మనార్డరు చేసేస్తే పోతందిగా. కాకపోతే పావలో, అర్ధో ఎక్కువౌతుంది. ఈ గొడవంతా వుండదుగా అప్పుడు?"

"ఇంతకీ యిదంతా నీమూలాన్నే వచ్చింది. వూళ్ళో పెద్దలందరూ, పగబట్టి కూర్చున్నారు. ఆ నారాయణమూర్తి ఏం చెయ్యదల్చుకున్నాడో, యేమో."

"నేనెళ్ళి అడుగుతానాగు వాళ్ళని."

"నువ్వెళ్తే మరీ చెడతంది."

"చెడ్తే చెడతంది. కోర్టుకి తీసికెళ్ళి, ప్రమాణం చెయ్యమంటా; ప్రమాణం చేయిస్తా. నీకెందుకు నువ్వు మాట్లాడకుండా కూర్చుని, చూస్తావుండు. నాకింకొకళ్ళ డబ్బు కాండబ్బు గూడా వద్దు; నా డబ్బు కాండబ్బు గూడా యింకొకళ్ళకి పోనివ్వను."

కూర్చున్నవాడుకూర్చున్నట్లేలేచి నోఖేరాంగారి చావడి వైపుకు వెళ్ళాడు. చూస్తే, పెద్దలందరూ సభతీర్చి, కూర్చు న్నారు. ఆ చావట్లో గాలికూడా కుట్రకంపు కొడుతోంది.

"ఏఁవండీ, నోఖేరాంగారూ! మా నాన్న శిస్తంతా కట్టేసినా, యింకా బకాయీ వుందంటన్నారంట. ఏఁవిఁటండీ ఈ అన్యాయం?" అన్నాడు గోవర్ వుద్రేకంగా.

మంచంమీద పడుకుని, మాంచి ఠీవిగా, "హోరీ బతికున్నంతకాలం ఆ విషయాలేవీ నీతో మాట్లాడాల్సిన అవసరంలేదు నాకు" అన్నాడు నోఖేరాం.

"అయితే నాకూ, ఇంటికీ యేఁవీఁ సంబంధం లేదా?" అన్నాడు గోవర్.

"నీ యింట్లో నువ్వు రాజువే నేఁవోఁ. ఇక్కడమాత్రం నువ్వేం అన్నా చెల్లదు."

"ఐతే సరే! కానీ. నీ యిష్టం వచ్చినట్టే కానీ. నేనూ, కోర్టుకెళ్ళి, నీతో ప్రమాణం చేయించి, అప్పుడు చెబుతా. ఆసామీ లందరినీ నోరులేనాళ్ళని చేసి, నీయిష్టం వొచ్చినట్టాడ దాఁవనుకుంటన్నావేఁవోఁ. ఆ పప్పులేవీఁ వుడకవ్. జమీం దారుగారుకూడా నేనుండే చోటే వుంటారు. ఆయన కళ్ళగ్గం తలు కడదాం అనుకుంటన్నారేఁవోఁ. ఆయనకంతా పూస గుచ్చినట్టు చెప్పేస్తా. నా దగ్గర రెండోసారి శిస్తెట్టా వసూలు చేస్తావో, అదీచూస్తా."

గోవర్ మాటల్లో సత్యం ప్రతిధ్వనించింది. నిజానికి వున్నబలం వుంది అతనివాక్కుకి. నిర్భయంగా అతనన్నమాటలు

వింటూంటే, అంతవరకూ బిర్రబిగిసి కూర్చున్న నోఖేరాంకు భయం వేసింది; అంతవరకూ అతన్ని సమ్ముకూర్చున్న అవినీతి పరుగు లంకించుకుంది.

యేదో, మరచిపోయిన విషయం జ్ఞప్తికి తెచ్చుకుంటూన్నట్లు, అభినయిస్తూ "నీకంత కోపం యెందుకయ్యా! అందులో యేఁవుంధి? మీనాన్న డబ్బిస్తే, యేవోఁ, యెక్కడన్నా కాగితాలకింద పడిపోయిందేవోఁ; రేపు కాగితాలన్నీ వెదికి చూస్తాలే. ఎంతోగాని, మొత్తంమీద యిచ్చినట్టే వుంది; యిప్పుడిప్పుడే గుర్తుకొస్తాంది. ఐనా నీగల్లంతేకాని, యిచ్చిం డబ్బు యెక్కడికి పోతందయ్యా పిచ్చిగాకపోతే. ఏఁ వంత పెద్ద మొత్తంలే నువ్వంత అబద్ధం ఆడతావనుకుంటానికి. ఆమాత్రం భాగ్యానికి నేనుమాత్రం మేడలుకడతానా, మిద్దెలు కడతానా?" అన్నాడు నోఖేరాం.

ఇంటికొచ్చి, తండ్రిమీద ఝుఁయ్యిమంటూ లేచాడు గోవర్. కొడుకు మాటలువిని దుఃఖంతో కుమిలిపోయాడు పాపం ముసలివాడు. "నువ్వు చిన్నపిల్లలికంటే కనాకష్టం ఐపోయ్యావ్. పిల్లి మ్యాఁవ్ అన్నా జడుసుకుంటె, యెట్టా చచ్చేది? ఎంతదూరఁవని నిన్ను కాపాడుకొంటూ తిరగను ఒక డబ్భై యిస్తా నీకు. శాస్త్రికిచ్చి, బాకీ చెల్లగట్టినట్టు రాయించి తీసుకో. అంతకంటే కాండబ్బుగూడా యివ్వొద్దు. ఇచ్చావంటే, ఇక నాదగ్గిరనుంచొక్క దమ్మిడీగూడా రాదు నీకు. నేను దూరదేశాల్లో వెళ్ళుండేది నువ్వుచేసే అప్పులన్నీ తీర్చటానిగ్గాదు. చచ్చినాసరే, యెవళ్ళదగ్గరా అప్పులు తేబాకు; ఇవ్వబాకు." అన్నాడు కొడుకు.

ధనియా గూడ భోజనంచేసి, వాకిట్లోకి వచ్చింది - "అప్పుడే వెళ్తన్నావేఁ నాయనా. మూడ్నాలుగు రోజులుండి, ఆ వూడుపు లైనయ్యానిపించి, అప్పులూ సొప్పులూ తీర్చేసుకు నెళ్ళు బాబూ" అంది.

"ఇప్పుడు నాకు రోజుకి రెండు, మూడు రూపాయలు నష్టం వొస్తాంది తెలుసా నీకు ? ఇక్కడనే చేసేపని, నాలుగణా లిస్తే యెవళ్ళో వొకళ్ళు చేసేస్తారు. ఈసారి ఝునియాని గూడా తీసికెళ్తా; అక్కడ వంటకి బాగా యిబ్బందిగా కూడా వుంది."

"నీ యిష్టఁ వొచ్చినట్టే చెయ్యిబాబూ! వొంటరిది; అక్కడ బిడ్డనే సాక్కుంటందా, పనే చేసుకుంటందా? యేఁవోఁ నాయనా!" అన్నది ధనియా, భయం భయంగా.

"ఏఁ బిడ్డుంటే ? అక్కడేఁవోఁ పొయ్యాదుకోలేక నేను చావటంలా."

"నేను మాత్రం వద్దంటన్నానంట్రా; దూరదేశమా, ముందూ, వెనకా యెవ్వరూ లేనుగూడా లేరయ్యె, పసిబిడ్డని పెట్టుకుని యెట్టా కడతేరుస్తుందో అంటన్నాగాని."

"దూరదేశం ఐతే మాత్రం యిరుగూ, పొరుగూ వుండ రంటమ్మా. ఈ రోజుల్లో నాలుగు డబ్బులుంటే, యేపసికావా లన్నా ఐపోతంది. డబ్బులేకపోతే అమ్మా బాబూగూడా తలవరీ రోజుల్లో."

ధనియాకు అర్థమైంది; నిలువెల్లా మండిపోయింది- "ఐతే అమ్మా బాబునీ గూడా అట్టాంటాళ్ళలో జమకట్తావంట్రా!"

"కళ్లారా చూస్తానే వున్నాగా."

"నువ్వేం చూస్తన్నావురా? చూచినా నీకేం తెలుస్తుందని. కన్నకడుపు శోకం నీకేం తెలుస్తుందిరా. నాలుగుడబ్బులు సంపాదించేటప్పటికి, పెంచి పెద్దాళ్ళని చేసినాళ్ళని మరిచిపోతారు మీరు. ఈ వూళ్లో యింతమందుండారు; యెవరికోసంరా వాళ్లు రాత్రింబగళ్ళు వళ్లు తమది కాదనుకుని కష్టపడేది? బిడ్డలకోసమేం గదంట్రా?"

"మీరప్పెందుకు జేశారో నాకేం తెలుసు. నాకు దమ్మిడీ గూడా ఖర్చవ్వలేదు."

"ఐతే పెంచకుండానే పెద్దాడివైపోయానంటావా?"

"పెంచటానికి డబ్బెందుకు? చిన్నప్పుడేవోఁ పాలుతాగి పెరిగాను. పాలొదిలి పెట్టింతర్వాత గాలికే పెరిగానయ్యో. మీయందరూ తిండే, తిన్నా నేనూనూ. నాకోసం అని ఒక్క శేరుపాలు కొన్నపాపాన పోలేదు; ఒక్క గరిటెడు నెయ్యి కొన్నపాపాన పోలేదు. ఇప్పుడేవోఁ నేనీ అప్పులన్నీ తీర్చాలి! శిస్తు కట్టాలి; చెల్లెళ్లకి పెళ్లిళ్లు చెయ్యాలి! ఇక నా బతుకంతా మీకోసవేఁ కష్టపడాలా? నాకుమాత్రంలేరూ బిడ్డలు?"

ధనియా నిశ్చేష్టురాలై పోయింది. ఒక్క క్షణంలో ఆవిడ మధురస్వప్నం చెల్లాచెదరై పోయింది. తన దుఃఖమూ, దారిద్ర్యమూ పోయేరోజు వచ్చిందని సంతోషపడుతున్నది యింత వరకూ. గోవర్ యింటికి వచ్చిందగ్గర్నుంచీ, ఆవిడ పెదవుల మీద యేదో మందహాసం చిందులుత్రొక్కుతూండేది. ఆవిడ మాటల్లో మృదుత్వమూ, పనుల్లో వుదారతా కనిపించేది.

భగవంతుడావిడమీద దయదలచినప్పుడు, నమ్రతగానే మెలగాలి మరి. అంచేతనే ఆవిడ హృదయంలో ఆ శాంతి; ప్రవర్తనలో సౌజన్యమూ. కొడుకన్న మాటలు వింటూంటే భగభగమండే మంటల్లో నడచినట్లుంది; ఆవిడ కోరికలన్నీ మాడిపోయిన శనగల్లా గిడసబారిపోయినై. ఆవిడ గర్వం అంతా బద్దలై, ధూళయ్యింది. ఇన్నిమాటలు విన్నతర్వాత, యింకా జీవితంలో యేం సుఖం వుంటుంది? ఈ నావనెక్కి జీవితసాగరాన్ని దాటాలెనని అనుకుందావిడ; ఆనావే యిప్పుడు బద్దలై ముక్క చెక్కలై పోయింది. ఇంక యేసుఖం చూచుకొని బ్రదికేది.

కాదు; గోవర్, ఆవిడకన్నబిడ్డ; గోవర్ స్వార్థపరుడు గాడు. అతనింతవర కెప్పుడూ తల్లిమాటకు యెదురాడలేదు; దేనికనీ మంకుపట్టు పట్టలేదు. ఏదిపెడితే అది కిమ్మనకుండా తినేశేవాడు. అంత అమాయకుడు, అంతమంచివాడు, ఇవ్వాళ, యిట్లా, పుల్లవిరిచినట్లు, మనసు బాధపడేట్లు, ఈమాటలన్నీ యెందుకంటున్నాడు! అతను కష్టపడాలని, యెవ్వరూ, యేమీ, అనలేదే. అప్పులసంగతి అతనేగా స్వంతంగా ప్రస్తావించింది. అప్పు తీర్చిపెట్టమని తల్లిదండ్రులు కోరలేదే. బిడ్డ గౌరవంగా, యింతసంపాయించుకుని, తింటున్నాడు. అంతేచాలు కన్నకడుపులు సంతోషించేందుకు. ఆఁ. ఔను. అతనేమైనా సహాయం చెయ్యగలిగితే, కుటుంబానికి గూడా యింత సహాయంచేస్తాడు? చెయ్యలేకపోతే సరేసరి. ఎవరుమాత్రం యేం అనగలరు; భార్యనిగూడ వెంటబెట్టుకుని వెళ్ళాల్నని అనుకుంటున్నాడు. ధనియా మాత్రం యేమన్నది? అతని మంచికే చెప్పింది, భార్యని తీసికెళ్ళినందువల్ల కలిగే సుఖంకన్నా, బాదరబందీ యెక్కు

వాతుందని. ఇందులో అతనంత కష్టపడవలసిన అవసరమేం వుంది? అసలు దీనికంతా కారణం ఝునియాయే నేమో; అదే రగిల్చి వుంటుంది యీ నిప్పు. కూర్చోబెట్టి, వున్నవీ, లేనివీ కలిపి చెప్పి వుంటుంది. ఇక్కడంటే తన యిష్టంవచ్చినట్లు తిరిగేందుకు వీలా లేదు; పైన అంతో యింతో యింటిపని గూడా చేయాల్సి వస్తోంది. అక్కడంటే తనయిష్టమే రాజ్యం. చేతిలో నాలుగు డబ్బులుగూడా ఆడతాయి. హాయిగా తిన వచ్చు; తిరగవచ్చు; కాళ్ళు బారజాపుకుని పండుకోవచ్చును. మొగుడూ, పెళ్ళాం; యిద్దరేగా! యేమంత పెద్ద వంటపని? అదీగాక, డబ్బుంటే, అక్కడ బజారులో, వండిన అన్నమూ, కూరలూగూడా అమ్ముతారు. ఈ వుపద్రవానికంతటికీ ఝుని యాయే కారణం; సందేహంలేదు. ఇదివరకు పట్టణంలో వుండి గూడా వచ్చిందా; అక్కడినీళ్ళు బాగా వంటబట్టి వుంటై. ఇక్కడికొస్తే, పలకరించేవాళ్లుగూడా లేకపోయాను. ఈ పిచ్చి కయ్యొక్కడు దొరికాడు; ఇంకేం? వలలో వేసుకుంది. ఐదు నెల్ల కడుపేసుకుని వచ్చినప్పుడు, ఎంత వినయంగావుంది; పిల్లికి మల్లే మ్యాంవ్, మ్యాంవ్, అంటూ వచ్చింది. అప్పుడే యింట్లో అడుగు పెట్టనివ్వకపోతే దిక్కూ, దివాణమూ లేకుండాపోయేది; అడుక్కుతింటూ పోయేది. పాపంఅని యింట్లో పెట్టుకున్నందుకు యిదా ఫలితం? జరిమానా కట్టుకోవలసి వచ్చింది; వూళ్లో తలెత్తుకుని తిరిగేపని లేకుండా పోయింది; వ్యవసాయం పాడై పోయింది; ఇల్లంతా గుల్లయ్యింది. ఇప్పుడు తిన్న ఇంటివాసాలు లెక్కపెడుతోంది; అన్నంతిన్న పళ్లానికి చిల్లులు పెడుతోంది. డబ్బు చూచేప్పటికి కళ్ళు నెత్తికొచ్చినై; క్రిందా, మీందా కన్పించ

కుండా పోయింది. తగుదునమ్మా అని బయల్దేరింది. ఇవ్వాళ బిడ్డకొస్త డబ్బు కళ్ళజూస్తూండేప్పటికి నా అంతవాళ్లు లేరని, తయ్యిమంటూ బయల్దేరింది. తన బంగారబ్బిడ్డని దోచుకు పోవాలని చూస్తాంది.

"నీ కెవళ్ళేం జెప్పార్రా నాయనా. ఇదివరకెప్పుడూ యిట్లాంటి మాటలన లేదు నువ్వు. మేవూ, నువ్వూ వొకటి గాదంట్రా. చెల్లెళ్ళుమాత్రం నీవాళ్ళుకాదూ. ఈ యిల్లు నీది గాదూ? ఇక్కడమాత్రం పరాయాళ్ళేవళ్ళున్నార్రా బాబూ. మేం మాత్రం యింకెంతకాలం బతుకుతాం? ఇంటి మర్యాద్దక్కిస్తే, తరవాత నువ్వే సుఖపడతావు. సంపాదించుకునే దెందుకురా నాకు తెలవక అడుగుతాను. ఇంటోవాళ్ళందరూ సుఖంగా బతకటానికేనా? ఎవళ్ళపొట్ట వాళ్ళు గడుపుకుంటే గొప్పేం వుంది? పంది మాత్రం తన పొట్ట తను పోసుకోటంలా! ఝునియా యిట్టా పాంసై కాటేస్తందని కలలో గూడా అనుకోలేమురా నాయనా" అంటూ కళ్ళనీళ్ళు బెట్టుకుంది ధనియా.

గోవర్కు కోపం వచ్చింది— "అమ్మా! నే నేవంత అమాయికుణ్ణి గాదులే అది చెప్పిన మాటవిని, చెడిపోటానికి. అనవసరంగా దానిమీదిరుచుసపడతా వెందుకు? యేవన్నా సహాయం చెయ్యగలిగితే చేస్తానే వుంటా. అంతేకాని యీ భారం అంతా మొయ్యమంటే నే మొయ్యలేను" అన్నాడు.

ఝునియాగూడా, గదిలోనుండి, బయటికి వచ్చింది. వచ్చి, "అదేంటత్తా? అత్తమీదకోపం దుత్తమీద తీర్చుకున్నట్టు నామీద లేస్తావేందుకు? మీ అబ్బాయంత బుల్లి

పిల్లాడేవీఁ కాదు నామాట విని చెడిపోటానికి. ఎవళ్ళమంచి వాళ్ళకి తెలవదా యేవిఁటి? బతికినంతకాలవ్వూఁ కష్టపడి, బిడ్డలకేవీఁ లేకుండా చెయ్యాలని యెవళ్ళనుకుంటారేవిఁటీ? బతికిన్నాలుగురోజులూ బాగా బతకాలనే అనుకుంటారు యెవ్వారనుకున్నా. అందుట్లో తప్పేంవుంది?" అంది.

"సరేలేవే. చెప్పొచ్చావు. ఈ తెలివిదివరకేఁ వయ్యింది అంట. ఇవ్వాల్టికి నీమంచీ చెడ్డలాలోచించుకునేపాటి దాని వయ్యావన్నమాట, నాకేం తెలుసు మరి! నాయింటికొచ్చి, కాళ్ళమీద పడి, గెడ్డాం పట్టుకుని బతిమాలినప్పుడే వఁయ్యింది ఈ తెలివంతా! మేంగూడా, అప్పుడు, మామంచి చెడ్డలు ఆలోచించుకొంటే, నువ్వేఁ వయ్యేదానివో, అదిగూడా ఆలోచించుకో. ఈ పాటికి సోదిలోక్కూడా లేకుండా పోయేదానివి" అంది ధనియా పళ్ళు పటపట కొరుకుతూ.

ఇక రామరావణ యుద్ధం ప్రారంభంఐంది. ఎత్తిపొడుపులూ, తిట్లూ, దుమ్మెత్తి పోసుకోవటమూ, కాండ్రించి వుమ్మి వెయ్యటమూ; ఒకటేటా! మధ్య మధ్య గోవర్ కూడా, నేనూ వున్నాననిపిస్తున్నాడు. హోరీ, విగ్రహంలా కూర్చుని అంతా వింటూన్నాడు. సోనా, రూపలు తలలు వంచుకుని కూర్చున్నారు. దులారి, పున్ని, యింకా యిద్దరు ముగ్గురు ఆడవాళ్ళూ వచ్చారు మధ్యవర్తిత్వానికి. గర్జించే మేఘం వొకటి రెండు చినుకులు వదిలినట్టు, మధ్యమధ్య, యిద్దరూ, చెరుకాస్సేపూ యేడుస్తున్నారుగూడాను, తమ తమ నుదుటి వ్రాతల్ని తలచుకొని. ఇద్దరూ ఆ నారాయణమూర్తిని తిడుతున్నారు యీనాటికిట్లా తయారుచేసినందుకు. ఇద్దరూ

తమదేమీ తప్పు లేదని ఋజువు చేసేందుకు ప్రయత్నిస్తూనే వున్నారు. ఝునియా కివ్వాళ, హీరా శేఖర్లంటే యెక్కడలేని సానుభూతీ పుట్టుకువచ్చింది; ధనియా వాళ్ళని యెందుకూ కొరగానివాళ్ళని చేసివేసిందట. సొంత మరదులే పనికిరాకుండా పోతే, తాను పనికిరాకుండాపోటంలో విడ్డూరం యేంవుంది? ధనియా గూడా తన తప్పేమీ లేదని చెబుతూనేవుంది. ఐనా ప్రజాభిప్రాయం ఝునియా వైపుకే మొగ్గుచూపుతోంది; ఎందువల్లనో యేమో! ఐతే ఒకటి మాత్రం వుంది: ఝునియా యెంతసేపు మాట్లాడినా నిగ్రహంగా మాట్లాడుతోంది. ధనియా వళ్ళు తెలియని ఆగ్రహంతో పోట్లాడుతోంది. అదీగాక ఝునియా యిప్పుడు నాలుగురాళ్ళు సంపాయించేవాడి భార్య!

"నీ దుంపతెగ, నామాటిని వూరుకోవే, నా కొంప తియ్యొబాకే. ఎందుకే అట్లా నోరుపారేసుకుంటావ్?" అన్నాడు హోరీ, దగ్గరగా వచ్చి.

ధనియా బుస్సుమంటూ లేచింది. "నీకూ యిక్కడా నేనే దొరికానూ? నాదేనేవిటి తప్పంతా. ఔను మరి అవి నాకు పూజలు చేస్తాందయ్యొ!"

యుద్ధక్షేత్రం మారింది.

"తక్కువ్వాళ్ళతో పోట్లాడేవికూడా తక్కువ్వాళ్ళే."

కాని, ఝునియా తక్కువదని ధనియా యెట్లా అనుకుంటుంది?

"పోనీలే, చిన్నదికాదే అనుకుందాం. పెద్దదే అనుకుందాం. ఇష్టంలేనివాళ్ళని యెంతకాలంవని కట్టేసి వుంచుకుంటాం? పిల్లల్ని పెంచి, పెద్దాళ్ళని చెయ్యటం మన ధర్మం;

మనపని మనం చేశాం. వాళ్ళూ పెద్దాళ్ళయ్యారు; వాళ్ళకీ కాళ్ళూ, రెక్కలూ వచ్చినై. ఇకిప్పుడు నువ్వానేదేవిఁటి? వాళ్ళు సంపాదించుకొచ్చి, నిన్నూ నన్నూ కూర్చోబెట్టి, పోషించాలనా! కన్నవాళ్ళం గాబట్టి మనం చచ్చినా బ్రదికినా వాళ్ళని పెద్దాళ్ళని చెయ్యాలి; అంతే. వాళ్ళుగూడా మనకి చేసితీరాలని యెక్కడాలేదు. వెళ్ళేవాళ్ళని, సుఖంగా వెళ్ళిరండి నాయనా అని సాగనంపటం మనధర్మం. మన మాటంటావ్రా; పైన దేవుఁడే వున్నాడు. ఎట్లా జరగాలనుంటే అట్లా జరుగుతుంది. నలభయ్యో, నలభయ్యైదో యేళ్ళు గడవలా? అట్లాగే మిగిలినయ్యీ గడుస్తయ్. ఇంకెన్నేళ్ళుంటాం? బాగావుంటే పదేళ్ళు" అన్నాడు హోరీ గద్గదంగా.

అక్కడ, గోవర్ ప్రయాణానికి సిద్ధమౌతున్నాడు. ఇంక ఈ ఇంట్లో, పచ్చిమంచినీళ్ళుగూడా ముట్టుకోగూడదు. తల్లే యిన్నిమాటలన్న తర్వాత, యింక చచ్చినాసరే, ఆ ముఖం చూడగూడదు.

చూస్తూండగానే, సామానంతా సర్దుకోవటం పూర్తి అయిపోయింది. ఝునియా చీరకట్టుకుంది. ఫ్రాకూ, టోపీ వేసుకుని, జమీందారు బిడ్డలా తయారయ్యాడు చిన్ని.

"నాయనా! నీతో చెప్పాలంటే నోరు పెగలకుండావుంది; ఐనా మనసు వప్పుకోటంలేదు. వెళ్ళి, కాస్త మీ అమ్మతో గూడా వెళ్ళొస్తానని చెప్పిరారాదు బాబు! ఆ మాత్రం మాటంటే యేం పోతుందినాయనా నీకు! నవమాసాలుమోసి పెంచిందే నిన్ను. దాని రక్తం పంచుకుని, ప్రేగు తెంచుకుని పుట్టావే.

ఆమాత్రం మాటగ్గూడా నోచుకో లేదంటరా అది?" అన్నాడు హోరీ డగ్గుత్తికతో.

"అది నాకు అమ్మకాదు" అన్నాడు గోవర్ తల త్రిప్పుకుంటూ.

కన్నీరు కారుస్తూ, "సరే నాయనా! నీయిష్టంవొచ్చినట్లే కానీ. సుఖంగా వెళ్ళి రా నాయనా, సుఖంగా వెళ్ళిరా" అన్నాడు హోరీ.

ఝునియా వెళ్ళి, అత్త పాదాలని స్పృశించింది. ధనియా యేమీ మాట్లాడలేదు. ఆశీర్వదించలేదు; కన్నెత్తిగూడా చూడలేదు. చిన్నిని, బుజాలమీద యెక్కించుకుని ముందు, ముందు నడచాడు గోవర్. ఝునియా గుడ్డలమూట చంకన పెట్టుకుని, భర్త వెనక, వెనకే నడచింది. గ్రామస్థులు కొందరు; వూరిబయటివరకూ వెళ్ళి, గోవర్ని సాగనంపారు.

ఉన్నచోటనే, నిలువునా కూలబడిపోయింది ధనియా. హృదయం పగిలేట్టు యేడుస్తోంది. హృదయాన్నెవరో రెండుగా చీల్చివేస్తూన్నట్లుందావిడకు. దహనమై, భస్మమైపోయిన గృహంలావుంది ఆవిడ మాతృహృదయం. ఏమూలనైనా కూర్చొని, హృదయ భారం తగ్గేట్టు యేడ్చుకుందామనుకున్నా, కూర్చునేందుకు గూడా చోటులేకుండాపోయింది, ఆ కాలి నుసైపోయిన యింట్లో.

# 18

కొడుకూ, కోడలూ వెళ్ళిపోయిం తర్వాత, ఇల్లంతా 'బేలు' మంటోంది. మెదిలినా, కదిలినా, చిన్నే గుర్తుకొస్తున్నాడు ధనియాకు. కన్నతల్లి ఝునియాయే ఐనా, ధనియాయే పెంచింది చిన్నిని. 'వుంగ'పోసేది, మాడున ఆముదం పెట్టేది, కళ్ళకు కాటుక పెట్టేది, జోకొట్టి నిద్రపుచ్చేది. కాస్త తీరుబడైతే చాలు, మనుమణ్ణెత్తుకుని, ఆడించేది. మనుమడిమీది వాత్సల్యంతో రోజూపడే కష్టాల్నిగూడా మరచి పోయేది. అతని ముఖాన్ని– అమాయికంగా, వెన్నముద్దలానున్నగావున్న మనుమడి ముఖాన్ని– చూచుకొని, ఆవిడహృదయం బాధలన్నీ మరచిపోయేది; ప్రేమతో పొంగులు వారేది. ఇప్పుడా జీవనాధారం లేకుండా పోయింది. ఖాళీగా మూలను పడున్న వుయ్యాలమంచం చూచి, కళ్ళంటా నీరుకారుస్తుంది. నే నేం పాపం చేశాననీ, ఝునియా నాకీ శిక్షవేస్తోంది అనుకుంటూ కుమిలి పోతుంది. ఆ దయ్యంవచ్చి, బంగారంలాంటి యిల్లు పాడుపెట్టి పోయింది. కొడుకు గోవర్, తనమాటకెప్పుడూ, యెదురు చెప్పిన పాపాన పోలేదు; ఈ 'ముండ' వచ్చింతర్వాతనే

అట్లా పాడైపోయ్యాడు. అక్కడికి, పట్టణం, తీసికెళ్లి యింకెన్ని ఆటలాడిస్తుందో. ఇక్కడున్నప్పుడు గూడా బిడ్డని సరిగ్గా చూచేదే కాదు; తానుజడ వేసుకోవటం, బొట్టుపెట్టుకోవటంతోనే సరిపోయేదయ్యె! ఇంకా తీరికెక్కడుండేది. పాపం! చిన్నేమో నేలమీదపడి, గుక్కపట్టి, యేడ్చేవాడు. ఒక్కనాడైనా సుఖంగా వున్నాడూ వాడు. ఎప్పుడూ, వంటినిండా కురుపులేనయ్యె. కురుపులుపోతే దగ్గు, దగ్గుపోతే జ్వరం, యెప్పుడూ దేంతోనో వొకదాంతో బాధపడుతూనే వుండేవాడు. ఇట్లా ఆలోచించిన కొద్ది, ఝునియామీద అపరిమితమైన కోపం వచ్చేది ధనియాకు. గోవర్ అంటే యింకా మమత పోలేదావిడకు. అసలు ఝునియాయే గా చేసిందంతాను; యేం మందుపెట్టిందో, కొడుకు మనసు విరిచేసింది. ఎంత వగలాడి కాకపోతే, గోవర్ అట్లా మందు చల్లినట్లు, దాని కొంగుపట్టుకు తిరుగుతాడు. అంతకుముందు దీన్ని పేరెట్టి పిలిచినవాళ్ళున్నారా? అన్నల పెళ్లాలు పట్టుకుని తన్నుతూ వుండేవారు. గోవర్ని వలలో వేసుకుంది; రాణై పోయింది.

ఒకనాడు, "ఎందుకే! ఎప్పుడు చూచినా, అట్లాఝునియామీదపడి యేడుస్తావు? మన బంగారం మంచిది కాకపోయింతర్వాత, కంసాలి ననేంలాభం? గోవర్ నేను నిన్ను తీసుకెళ్లనంటే, యిదిమాత్రం వెళ్లేదా యేమిటి? పట్నంనీరు తాగేటప్పటికి వాడికళ్లూ నెత్తికెక్కినై అనుకుని వూరుకోరాదూ?" అన్నాడు హోరీ, రోజూ ధనియా అనేమాటలు విని, విని విసిగిపోయి.

"ఇకచాల్లే; వూరుకో. అసలు నువ్వేకాదూ, దాన్ని నెత్తిమీద కెక్కించుకొంది; లేకపోతే ఆవాళే చీపురుకట్టతో సింగారించి, బైటికి నెట్టేసేదాన్ని."

ఎడ్లని తోలుకుని, పొలం వెళ్తూన్నవాడల్లా వెనక్కి తిరిగి, "సరేనే నువ్వన్నట్టు కొడుకుబుద్ధిని కోడలే విరిచేసిం దనుకుందాం. ఐతేమాత్రం నీకింత యేడుపెందుకే? చెప్పు! లోకం అంతా చేస్తున్నట్టే, అబ్బాయీ చేశాడు. వాడికీ పిల్లా, జల్లా కలిగారా మరి. ఎంతకాలంవంని మన బరువెత్తుకుని తిరుగుతాడు వాడుమాత్రం?"

"అసలిదంతా తెచ్చిపెట్టింది నువ్వేగాదూ."

"ఐతే నన్నుగూడా ఇళ్ళగొట్టేశెయ్యి మరి! రా, యీ యెడ్లని తోలుకెళ్ళు. నేనూ, కూర్చుని చుట్ట ముట్టించు కుంటాను!"

"నువ్వెళ్ళి జైల్లో కూర్చుంటే, అప్పుడూ, నేనెడ్లని తోలికెళ్ళి, వ్యవసాయం చేసేది!"

ఈ హాస్యంతో, అంతవరకూ వున్న దుఃఖాన్ని మరచి పోయింది ధనియా. కూర్చుని, 'జడేస్తా ఇట్టారావే' అని పిలి చింది రూపని. ఎడ్లనితోలుకుని, పొలంకేసి బయల్దేరాడు హోరీ. వసంతకాలం వచ్చింది. ఎక్కడచూచినా సువాసనే, ఎటు చూచినా సంతోషమే. ఆనందాన్ని దోసెళ్ళతో ఎత్తి, లోకం మీదికి విరజిమ్ముతున్నాడు వసంతుడు. మామిడికొమ్మలమాటున దాగి, కోకిల కుహూ కుహూరవాలు చేస్తూంది, ఎంతో మధు రంగా, మనసులు వూయల లూగేట్లు. విప్పచెట్లమీద, మైనా పక్షులు గుంపులుగుంపులుగా పెళ్ళికివచ్చిన జనసమూహంలా,

హుషారు పడుతూన్నయి. సిమ్మలూ, దిరిసెనలూ, విప్పలూ, ఆనందంతో వూగిసలాడుతూన్నయి. మామిడితోపులోకి ప్రవే శించేప్పటికి హోరీ మనసుగూడ, ఆనందంతో కేరింతలు కొట్టింది. చుట్టు ప్రక్కల ఎక్కడచూచినా కనిపించే ఆహ్లాదమూ, శోభ, స్ఫూర్తి అతని మనసులోకికూడ ప్రవేశించినై; అంతవరకూ ఆమనసులో గూడుకట్టుకున్న నిరాశ, వ్యధలు మాయమై పోయినయ్. హోరీ హృదయం ఆనందంతో పాటలు పాడుకొంది.

"మామిడి తోటలో
కోకిల పాటలు పాడిందీ
మది పొంగి పొంగి
పులకించిందీ"

అదే దారిని, యెదురుగా, 'దులారి' వస్తోంది, గులాబీ రంగు చీరెకట్టుకొని, కాళ్ళకి వెండికడియాలు పెట్టుకుని, కంఠా నికి తెల్లటి కంటె వేసుకొని. ముహం వాడివుందిగాని, మనసు మాత్రం పచ్చగానే వుంది. ఇదివరకప్పుడప్పుడూ, పొలంలోనో, కళ్ళంలోనో దులారీతో సరసాలాడుతూనే వుండేవాడు హోరీ. వరుసకావిడ వదినె; ఈయన మరది. ఇంకేం ? ఎన్నిసరసాలైనా ఆడవచ్చును. సాహుకారుగారు చనిపోయిం తర్వాత, బయటకు రావటం మానేసింది దులారి. పగలల్లా దుకాణంలోనే కూర్చుని వూళ్ళో విశేషాలన్నీ తెలుసుకుంటూండేది. ఎక్కడైనా పోట్లాట జరుగుతూన్నట్లుంటే మాత్రం, అక్కడికెళ్ళి, ఏదో వొకవిధంగా మధ్యవర్తిత్వం చేస్తూండేది. చచ్చినా, రూపాయకు అణా వడ్డీకంటె తక్కువకిచ్చేదికాదు అప్పులు. అసలుకంటె వడ్డీ తీపని ! డబ్బొచ్చినా, రాకపోయినా వడ్డీమాత్రం పెరిగిపోతూం

టుంది. ఇచ్చిన అప్పులు వసూలుచేసేదెట్లా? కోర్టులెక్కేది కాదు; జప్తులు చేయించేదికాదు. అంతా భగవంతుడిచ్చిన నోటిబలంతోనే కొట్టుకొచ్చేసేది. వయస్సు పైబడ్డకొద్దీ నోటి దురద గూడ యెక్కువైపోయింది. కాగా ఆవిడ తిడుతూంటే, జనం నవ్వుకునేవారు. నవ్వుకునీ, "ఈ డబ్బంతా యేంజేసు కుంటావు పెద్దమ్మా; చచ్చిపోయేటప్పుడు దమ్మిడీగూడా పట్టి కెళ్ళలేవు గదా; బీదా, బిక్కీకి యింతపెడితే పుణ్యాం అన్నా దక్కుతుంది; స్వర్గానికెళ్తావు" అనేవారు. చచ్చిపోవటం అనే మాట వస్తే చాలు; ఆవిడ మండిపోయేది.

"ఇవ్వాళ జలేగావున్నావే, పడుచుదానికి మల్లే!" అన్నాడు హోరీ.

"ఇవ్వాళ్ళ మంగళవారం గూడాను, అట్టాంటి మాట లనబాకు బాబూ; దిష్టిగూడా తగుల్తుంది. అందుకనే కాస్త మంచిగుడ్డ కట్టుకోటానిగూడా ప్రారంలేకుండా పోయింది. బయ టికి అడుగుపెట్టగానే కొరుక్కుతినేటట్లు చూస్తారయ్యో అంద రూనూ, అంతకుపూర్వాం, జన్మలోనే ఆడదాన్ని చూచెరగ నట్టు! పటేశ్వరీ లాల్ మరీని, యిన్నేళ్లొచ్చినా, వెనకటి గుణం యింకా వదిలిపెట్టలా."

సంభాషణ మంచి పట్టులోకి దిగటం చూచి, హోరీ ఆగిపోయాడు; ఎడ్లుముందు వెళ్ళిపోతున్నయి.

"ఆయనకేంవమ్మా! ఒకటే భజనచెయ్యటం. పౌర్ణానికీ, అమావాస్యకీ సత్యనారాయణవ్రత కథలు చదివించుకొంటాడు. పూటపూటా దేవుడిగుడికెళ్తాడు. చూస్తానే వున్నావుగా."

"ఆ మచ్చు మచ్చంతా అంతే; ముసలాళ్లైపోయేటప్పటికి ఎక్కడలేనిభక్తి పుట్టుకొస్తుంది; చేసిన పాపానికి ప్రాయచ్చిత్తం చేసుకోవద్దూమరి? అందుకని! ఇంత ముసల్దాన్నయి పొయ్యాన్నే, నాతో యేం సరసాలు, నువ్వేచెప్పు."

"నువ్వేవిఁటి, ముసలిదానివేఁవిటి? నన్నడిగితే..."

"చాల్లెద్దూ! ఇకూరుకో, లేకపోతేచచ్చేటన్నితిట్లు తిడతా, యేఁవనుకున్నావో. కొడుకు దూరదేశఁవెళ్లి సంపాదిచ్చుకొచ్చాడని, వొక్కనాడన్నా పప్పు అన్నం పెట్టా? ఐందానికీ, కాందానికీ సరసాలాడతానంటా బయల్దేరతావుగాని."

"ఎంతొట్టంటే అంతొట్టమ్మా. ఏం సంపాదించాడో యేమో, వాడిదన్న దొక్క కాండబ్బు యీచేత్తో ముట్టుకో లేదు. ఒక్క జత పంచలూ, వొక తలపాగా మాత్రం తెచ్చిచ్చాడు. అంతే."

"ఏఁవైతే యేంలే. సంపాదిస్తన్నాడుగా. ఇవ్వాళ కాకపోతే రేపొస్తాడు అక్కరకి. పసిలో పని, నా కివ్వాల్సింది గూడా యిచ్చేస్తే, పోతందిగా; వడ్డీ వూరికే పెరిగిపోతందయ్యో."

"అదేఁవన్నమాటమ్మా; నీ అప్పు అణాపైసల్తో చెల్లగట్టెయ్యనూ. చేతిలోకి డబ్బురానీ మరి. ఐనా యేం తినేస్తే మాత్రం యేంలే, ఏమన్నా పరాయాళ్ళమా? నీవాళ్ళవేఁగా."

ఇట్లాంటి మాటలు వింటే, దులారి మారుమాట చెప్పేది గాదు; నవ్వుకుంటూ తన దారిని తాను వెళ్ళిపోయింది. హోరీ నాలుగంగల్లో వెళ్ళి యెడ్లని అందుకున్నాడు. ఎడ్లని 'బంతి'కి కట్టి, నూర్పిడిలో పడ్డాడు. వూరంతటికీ యిదేకళ్ళం. కొంత మంది నూరుస్తున్నారు; కొంతమంది తూరుపార బోస్తున్నారు;

కొంతమంది 'కాటా' వేస్తున్నారు. చాకళ్లూ, మంగళ్లూ, కుమ్మర్లూ, కమ్మర్లూ, వడ్రంగులూ, భట్రాజులూ, బ్రాహ్మలూ- అందరూ వచ్చారు యెవరి మామూళ్ళు వాళ్ళు పట్టుకెళ్ళేందుకు. ఝింగురసింగు గూడా వచ్చి, చెట్టుక్రింద మంచం వాల్చుకుని, కూర్చున్నాడు, తనిచ్చిన అప్పులో నాలుగోవంతు, ముందుగానే వడ్డీక్రింద మినహాయించుకునేందుకు. కోమట్లు గూడా వచ్చి, బేరసారాలు చేసుకుంటున్నారు. అరటికాయలూ, నారింజకాయలూ అమ్ముకునేవాళ్ళు; మిఠాయీలూ, జిలేబీలూ, అమ్ముకొనేవాళ్ళూ అదేపనిగా, అటూ యిటూ, తిరుగుతున్నారు. హోరీదగ్గర వాటా పంచుకునేందుకని శాస్త్రి గూడ వచ్చాడు. వచ్చి, ఝింగురసింగు కూర్చున్న మంచంమీదే కూర్చున్నాడు.

పొడుం చేతిలో వేసుకుంటూ, "విన్నావటయ్యా, గవర్నమెంటు కూడ వడ్డీ తగ్గించుకోకపోతే, డిక్రీపొందటానికి వీల్లేదంటోందట !" అన్నాడు శాస్త్రి.

"నేనొకమాట చెబుతాను వినవయ్యా.. నీకు డబ్బు అవసరం ఐతే, నాయింటికొచ్చి, నేనన్నంత వడ్డీకే పట్టుకెళ్తావు, దేవుడా అంటూ. ఔనా? గవర్నమెంటేంఅంటే యెవడిక్కావాలి? గవర్నమెంటే అప్పివ్వటం మొదలుపెడ్తే అప్పుడొస్తుంది చిక్కు. అంతవరకూ యేమీ ఫర్వాలేదు. నోటుమీద తక్కువ్వడ్డీయే రాయిద్దాం; మన రేటుప్రకారం నాలుగో వంతు ముందుగానే మినహాయించుకుంటున్నాం గదండీ!"

"నిజమేననుకో. గవర్నమెంటైనా అంతపిచ్చిది; దీనికి గూడా యేదోవొక పితలాటకం పెడుతుంది."

"ఐనాసరే, నేను చెప్పిందానికేమీయెనుకుండదు."

వూళ్ళో పెద్దమనిషెవరో వొకరు వచ్చి సంతకం పెట్టాలనీ, స్టాంపులుంటేనేగాని చెల్లదనీ అంటుందనుకో గవర్న మెంటు. అప్పుడేంజేస్తా?"

"ఊఁ, అననీ! మనదేంపోయింది. ఆసామీ వెళ్తాడు; కాళ్లా వేళ్లాబడి, బతిమాలుకుని, తనే తెచ్చుకుంటాడు. మన నాలుగోవంతు మట్టుకు మనం వొదిలిపెట్టేదిలేదు."

"అదేమన్నమాటలేవయ్యా, యెప్పుడైనా యిరుక్కు పోయామంటే పధ్నాలుగు సంవత్సరాలు పడుతుంది."

ఝింగురసింగుకు నవ్వొచ్చింది. పకపకా నవ్వాడు—"అదేంటండీ శాస్త్రిగారూ! అట్లా మాట్లాడుతారు. 'లా', న్యాయం, కోర్టులూ- అన్నీ- డబ్బవళ్ళదగ్గిరుంటే, వాళ్ళపక్షం పలుకుతాయి. నిజఁవేఁననుకోండి; గవర్నమెంటుంది అన్యాయం జరక్కుండా చూట్టానికే. వడ్డీ వ్యాపారస్తులు ఆసామీలనీ, జమీందాన్లు రైతుల్నీ పీడించకుండా చూట్టానికే వుంది. నిజఁవేఁ. మరిప్పుడు జరుగుతాందేవిఁటి? జమీందారు రైతుల్ని చెట్టుకట్టేసి బాదించటంలా, వడ్డీవ్యాపారస్తుడు బోలెడంత వెట్టిచాకిరీ చేయించుకోటంలా. ఎవడన్నా రైతు కాస్త పలుకున్నవాడు వుంటే వాడిని జమీందారూ యేమీఁ అనడు; వడ్డీ వ్యాపారస్తుడూ వాడిజోలికి పోడు. వాణ్ణిగూడా కలుపుకునేదీ; మిగతావాళ్ళమీద యింకాస్త జోరు చేసేదీ. జమీందారు గారికి యింకా ఐదువందలన్నా యివ్వాల్సి వుంటావు నువ్వు; ఐనా, నోఖేరాంకి నిన్నేఁవైనా అంటానికి గుండెలున్నయ్యా? నీతో స్నేహంగా వుంటేనే మంచిదని తెలుసు నోఖేరాంకి.

ప్రతిరోజూ కోర్టుకెళ్ళటం అంటే మాటలా? యేమీ ఫర్వాలేదు. మనరోజులు మట్టుకు యిప్పట్లాగానే గడుస్తాయి."

లేచి, కళ్లం నాలుగువైపులా తిరిగి, మళ్లీవచ్చి మంచం మీందకూర్చుని, "అన్నట్టు మీ అబ్బాయి పెళ్లి సంగతేం జేశారు? నన్నడిగితే, యెంత తొందరగాచేసేస్తే అంత మంచిదనంటా. ఒకటే గొడవగావుంది వూరంతా" అన్నాడు ఝింగురసింగు.

శాస్త్రికి కందిరీగలు కుట్టినట్లుగా వుంది. సింగుచేసిన విమర్శకుగల కారణం యేమిటో, ఆశయం యేమిటో, శాస్త్రికి పూర్తిగా తెలుసు. శాస్త్రికి యెక్కడలేని కోపం వచ్చింది — "మా వీపువెనక కావలసినన్ని అనుకోమను; అంతేగాని నాముందెవరైనా సరే, యేమైనా అంటే, వాళ్ళదుంప తెంపేస్తా. మా అంత ఆచారంగా వుండేవాళ్ళని వొక్కళ్ళని చూపించు. సంధ్యావందనం గూడ చెయ్యనివాళ్ళ నెంతమందిని చూపించమంటే అంతమందిని చూపిస్తా. ఒక ధర్మంలేదు; ఒక కర్మలేదు. ఒక పురాణం వింటం అంటూలేదు. వీళ్ళందరూ బ్రాహ్మలెట్లా ఔతారయ్యా. జీవితంలో వొక్కసారి గూడా ఏకాదశీ వుపవాసాలు వుండియెరగని వాడేంముఖంపెట్టుకుని విమర్శిస్తాడయ్యా మమ్మల్ని. ఎవరైనా సరే, వచ్చి, 'యిదిగో శాస్త్రిగారూ' ఫలానానాడు మీరు స్నానం, సంధ్యా చెయ్యకుండా మంచినీళ్ళు త్రాగారని గాని, బజార్లో వస్తువులు తెచ్చుకుని తిన్నారనిగాని, యింకో కులస్థుడిచ్చిన మంచినీళ్ళు త్రాగారనిగానీ అనమను; వింటాను. సిలియా మా వాకిట్లోకి గూడ అడుగుపెట్టదు; పాత్రలూ అవీ ముట్టుకోనటం మాటట్లా

పుంచి. ఇప్పుడు మా అబ్బాయి మంచిపని చేస్తున్నాడనిగాదు నేననేది. ఐందేదో ఐపోయిందిగా; ఒకసారి కాలు జారిపోయిం తర్వాత, ఆడదాన్ని వదిలిపెట్టెయ్యటం అంత ఛండాలం లేదంటాన్నేను. ఇందుట్లో రహస్యం యేముంది? ఎంతమంది కావాలంటే అంతమందికి చెబుతాను. స్త్రీజాతి పవిత్రమైన జాతి సుమా!"

పడుచుదనంలో, శాస్త్రిగూడ గొప్పరసికుడనే అని సించుకున్నాడు; ఐనా తన ఆచార వ్యవహారాలనుమాత్రం, తుచలు తప్పకుండ, అనుష్ఠించేవాడు. మాతాదీన్‌గూడ తండ్రికి తగిన కొడుకే. ఆయన అడుగుజాడలలోనే నడుస్తున్నాడు. ధర్మానికి మూలతత్వమే యిది: పూజా పునస్కారాలు; జపతపాలు; స్నాన సంధ్యలు. తండ్రీకొడుకులిద్దరూ ఈ మూల తత్వాన్ని ఆచరిస్తూంన్నంతకాలం యింకొకళ్లెవళ్లైతే మాత్రం వ్రేలెత్తి చూపగలరు?

ఏమనేందుకూ పాలుపోక, "నాదేంవుందండీ? నలుగురూ అనుకొంటూన్నది చెప్పాగాని" అన్నాడు సింగు.

శాస్త్రి మహాభారతాన్నీ, పురాణాలనీ వుదహరించాడు. బ్రాహ్మణులు, ఇంతకుపూర్వంగూడా, అన్యజాతి స్త్రీలని వివాహం ఆడారనీ, ప్రస్తుత బ్రాహ్మణులు ఆ అన్యజాతి స్త్రీలకు పుట్టిన సంతానమేననీ, ఈవ్యవహారం ఆదికాలంనుండీ జరుగుతూ వస్తూన్నదేననీ, ఇందులో సిగ్గు పడవలసిన విషయం ఏమీ లేదనీ ఋజువు చేశాడు.

శాస్త్రిగారి పాండిత్య ప్రకర్షని చూచి ముగ్ధుడైపోయాడు సింగు. "ఐతే మరిప్పుడు కొంతమంది బాజ్పాయీలమనీ,సుకుల్‌ల మనీ అంటూంటారెందుకు?"

"కాలాన్నిబట్టి, అంతేమరి. ఈరోజుల్లో యే బ్రాహ్మడి కైనా పూర్వంలా శక్తిసామర్థ్యాలున్నాయా? విషంత్రాగి, జీర్ణం చేసుకోగలిగిన వాళ్లెంత మందున్నారు? అవన్నీ సత్య కాలంనాటి సంగతులు; ఆకాలంతోనే పోయిన్నై అవన్నీని. ఇప్పుడంటే, యిరుగూ పొరుగుతో కలిస్తేనే బ్రతగ్గలుగుతాం. నేనేం చెయ్యగలను చెప్పు. ఆడపిల్లల తండ్రి ముందుకు రావటమే లేదాయె. నీతో చెప్పినట్లే కనిపించిన వాళ్ళందరికీ చెప్పాను. ఇంతకంటే నేను మాత్రం యేం చేయగలను?"

"అబద్ధం ఆడకయ్యా! నామట్టుకు నేను యెన్నిసంబంధాలు తీసుకొచ్చాను. విన్నావానువ్వు? వెయ్యా, వెయ్యిన్నరా కట్నం ఇమ్మంటే యెవళ్ళిస్తారు నీకు? నీకుమాత్రం యేముంది? నాలుగైదెకరాల పొలం వుందేమో; పైన యీ యాయవారమూ. అంతేగా!"

శాస్త్రికి కష్టంవేసింది–"నిజమే. నాకేమీ లేదు; అదుక్కునే తింటాను. నాపిల్లలకి వెయ్యిరూపాయలిచ్చి పెళ్ళిచేశానా లేదా? కొడుకు పెళ్లి ప్రస్తావన వచ్చినప్పుడు నేను మాత్రం యెందు కడగకూడదు? నాఆడపిల్లల్ని యెవరైనా కట్నంలేకుండ చేసుకున్నారా, నా కొడుక్కి కట్నం అడక్కుండా వుంటానికి? ఇక యాయవారం అంటావా? నీ కందులోవున్న మహత్తు తెలియటం కష్టం. జమీందారీలు నాశనం ఐపోతాయి; బాంకులు దివాళాతీస్తాయి; కాని మా అక్షయపాత్రకు క్షయం

అంటూ లేదు. హిందూ జాతంటూ వున్నంతవరకూ, మా బ్రాహ్మణుల అక్షయపాత్రకు లోటంటూ వుండదు. న్యాయానికి మా వృత్తింతమంచిది యింకొకటిలేదంటే నమ్ము. ఎప్పుడూ, యెక్కడో వొకచోట, యేదో వొకటి జరుగుతూనే వుంటుంది; పుట్టుకో, చావో, పెళ్లో, దినమో - యేదేమైతేనేం, మా మామూళ్లు మాకు ముట్టవలసిందే. ఏదీ లేదనుకున్నా పంచాంగం తెరచి తిథి నక్షత్రాలు చెప్పినా చాలు, మా దక్షిణ మాకు ముడుతుంది. మా వృత్తికి వున్న సౌకర్యం, జమీాం దార్లకూ లేదు; షావుకార్లకూ లేదు. అదీగాక, సిలియా మాటలనుకుంటున్నావేమో! సిలియా వొక్కటీ ముగ్గురు మనుషుల పనిచేస్తుంది. మా బ్రాహ్మలపిల్లే కోడలైవస్తే, మహా చేస్తే, రెండుపూటలూ యింత వుడకేసి పడేస్తుంది. అంతేగా? ఇప్పుడు సిలియా యింతపని చేస్తోందా, నేనేం యిస్తున్నాను? ఒక పట్టెడు అన్నం! కాకపోతే యేడాదికో చీర!!"

దగ్గరలోనే శాస్త్రిగారి కుప్పకూడ నూరుస్తున్నాడు, నాలుగు యెద్దుల్ని 'బంతి'గాగట్టి. ధన్నా-మాదిగ-బంతి తోలుతున్నాడు. సిలియా పనలు విదలించి, యెగదోస్తోంది. శాస్త్రిగారబ్బాయి, మాతాదీన్, దూరంగా కూర్చుని, కర్రకు నూనె పట్టిస్తున్నాడు.

సన్నగా, చామనచాయగా, చక్కగా వుంటుంది సిలియా. పెద్ద అందమైన అమ్మాయి కాకపోయినా, బాగా ఆకర్షణీయంగానే వుంటుందని చెప్పవచ్చు; నవ్వులో, నడకలో, మాటలో ఒక విచిత్రమైన ఆనందం తొణికిసలాడుతూంటుంది.

వళ్లంతా గడ్డిపరకలు, ముఖం అంతటా స్వేదబిందువులూ, చిందర వందరై పోయిన ముంగురుల్తూ. . .పనిలో తల్లీనమై వుంది.

"ప్రొద్దుగూకేప్పటికి పనంతా పూర్తైపోవాలి. నీకుసాలిగా వున్నట్టుందే; నేనుగూడా రానా?" అనడిగాడు మాతాదీన్ సిలియాతో. "నువ్వు రావటం నెందుకులే. నేన్చాలనేంటి?" అంది సిలియా.

"ఐతే నేనెళ్లి సంచులు జేరవేస్తా. నువ్వొక్కదానివీ ఎన్ని పనులని జేస్తావులే."

"అంతగాభరా పడతావెందుకు? సాయంత్రానికల్లా వడ్లన్నీ ఇంటికి జేరెయ్యకపోతే నన్నడుగు."

దులారి గూడా వచ్చింది పాతబాకీలు వసూలు చేసుకునేందుకు. హోలీనాడు ఒకర్థణా యెర్రరంగు అప్పుగా తెచ్చుకుంది సిలియా దులారి కొట్లో; యింతవరకూ తీర్చలేదు. దులారి, సిలియాదగ్గర కొచ్చి, "యేం వే, రంగుపట్టికెళ్లి నెల పైగా అయ్యింది. అడిగితేనే వోం వినిపించుకోనే వినిపించుకోవు. ఇవ్వాళి స్తేనేగాని, యిక్కడ్నుంచి కదల్ను" అని కేక వేసింది.

మాతాదీన్ అక్కడినుంచి, నెమ్మదిగా జారుకున్నాడు. సిలియా తనువూ, మనసూ తీసుకున్నాడన్న మాటేగాని, అందుకుగాను యేమాత్రం సహాయం చేసేందుకూ సిద్ధంగా లేడు. అతని దృష్టిలో సిలియా యిప్పుడొక యంత్రంలావుంది; పనిచేసే యంత్రం; అంతే! తనంటే సిలియాకున్న ప్రేమని, తెలివితేటల్తో వుపయోగించుకుంటున్నాడు. అంతే.

సిలియా తలెత్తి చూచింది; మాతాదీన్ కనిపించలేదు. "యెందుకమ్మా అట్టా గొంతుచించుకుంటావ్. అర్థణా కాక

పోతే, అణాకి సరిపడ వడ్లు పట్టికెళ్ళు నీ అప్పుతీర్చకుండా చచ్చి పోతాననుకున్నావా!" అన్నది సిలియా, దులారీతో.

అని, పుజ్జాయింపుగా, ఒక శేరు వడ్లుతీసి, కోమటమ్మ చెంగుపడితే, చెంగులో పోసింది. ఇంతలోనే చెట్టుచాటునుండి పరుగెత్తుకొచ్చాడు మాతాదీన్. వచ్చీ రావటంతోనే కోమటమ్మ చెయ్యిపట్టుకుని "వడ్లక్కడ పోసేస్తావా లేదా? ఇదేం పట్టపగలు దోపిడీ అనుకున్నావా?" అని బెదరించాడు.

ఇటు, సిలియావైపుకు తిరిగి "నువ్వెందుకిచ్చావ ఆ వడ్లు? ఎవర్నడిగి యిచ్చావ్? అసలు నావడ్లివ్వటానికి నువ్వెవరవూ అంట?" అంటూ కళ్ళెర్రజేశాడు.

చెంగులో వడ్లన్నీ క్రిందపోసేసింది కోమటమ్మ. ఏమీ అర్థంకాక, మాతాదీన్‌వంక పిచ్చిచూపులు చూస్తూ నిలబడి పోయింది సిలియా. తాను నిశ్చింతగా ఒక కొమ్మమీద కూర్చునివుంది. ఇప్పుడా కొమ్మ విరిగిపోయింది. నిరాధార ఐపోయి క్రిందికి పడిపోతోంది. కళ్ళనీళ్ళు కళ్ళ గ్రుక్కుకొని, "ఇవ్వాల్టికి కనికరించమ్మా తల్లీ! నీ అప్పెంచుకోన్లే" అంటూ బ్రతిమాలింది కోమటమ్మని.

సిలియావంక జాలిగా చూచి, మాతాదీన్‌ని మిర్రిమిర్రి చూచి, తనదారిని తను వెళ్ళింది కోమటమ్మ.

"ఐతే, మీ సంపాదనమీద నాకేమీ హక్కులేదా?" అన్నది సిలియా, జరిగిన అవమానాన్ని చూచి కృంగిపోతూ.

"లేదు. నీకేం హక్కుంటుంది? ఇంతపని చేస్తే, కొంత కూలిస్తాం. అంతే! నీకిష్టంలేకపోతే, నీయిష్టంవచ్చిన చోటికిపో.

మాకు కులాశ్రీపేం కరువొవలా. కూలిస్తాం వంటే కావల్సినంత మంది గొంకుకుతారు" అన్నాడు మాతాదీన్.

సిలియా మాతాదీన్ వంక చూచింది ; పంజరంలోవున్న పక్షి రెక్కలు విరగగొట్టి, పంజరం తలుపుతీస్తే ఆ పక్షి మన వంక యెట్లాచూస్తుంది? అట్లాచూచింది సిలియా. ఆ చూపులో బాధవున్నదో, అసహ్యం వున్నదో, తిరస్కారం వున్నదో చెప్పటం కష్టం. కాని ఆ రెక్కలు తెగినపక్షి గుండెలాగానే సిలియా గుండెకూడా దడదడ లాడిపోయింది. ఇప్పుడు విశాల మైన ఆకాశంలోనో, చెట్టుమీది చిటారుకొమ్మకో యెగరగల శక్తిలేదు. తినేందుకూ, త్రాగేందుకూ యేమీ దొరకక పోయినాసరే, ఆ పంజరంలోనే, యిదివరకటిలాగానే, పడివుండి, చనిపోయేరోజు వచ్చేవరకూ బ్రతికి వుండడం కంటే యింకేమీ దారికన్పించటంలేదు. ఇప్పుడామెకు ఇంకోదారేది? మాతాదీన్ని పెళ్లి చేసుకోలేదు. ఐనా మనోవాక్కాయ కర్మలతో అతన్ని తనభర్తగా స్వీకరించింది. తిట్టినా, కొట్టినా, అతనే ఆవిడకాశ్రయం యివ్వాలి; అన్నిటికీ ఆధారం అతనే. ఇంకా, నిండా రెండు సంవత్సరాలుగూడా కాలేదు; మాతాదీన్ ఆవిడ పాదాలకు పూజలు చేస్తూండేవాడు. ఐనప్పుడూ, కానప్పుడూ, జంధ్యం చేత్తో పట్టుకుని, సిలియా! ముక్కులో వూపిరున్నంతకాలం, నిన్నన్నివిధాలా నా భార్యగా చూసు కుంటాను! అనేవాడు. ఆవిడ పొలం వెళ్లినా, చెరువుకు నీళ్లకు వెళ్లినా, పిచ్చివాడిలా వెంటబడేవాడు; ఎప్పుడూ కొంగట్టుకు తిరుగుతూండేవాడు. అలాంటివాడు ఇవ్వాళ యింత నిష్ఠురంగా,

నిష్కర్షగా మాట్లాడేశాడు! గుప్పెడు ధాన్యంకోసం అన గూడని మాటలన్నీ అనేశాడు!

పాపం! సిలియా నోరెత్తి మాట్లాడలేకపోయింది. ఎండి పోయిన గొంతుకతో, బాధపడుతూన్న హృదయంతో, చచ్చు బారిపోయిన చేతుల్తో, తలవంచుకుని తనపని తాను చేస్తోంది జీవంలేని కట్టెలా.

ఇంతలోనే, యెక్కడినుండి వూడిపడ్డారో, సిలియా తలిదండ్రులూ, మరి కొంతమంది మాదిగలూ వచ్చేశారు. వచ్చి, మాతాదీన్‌ని చుట్టుముట్టారు. తల్లి వెళ్ళి, సిలియా నివతలికి లాగి, "యేంవేం లంజా! కూల్చెయ్యాలంటే నీకూక్కలే దొరకలేదంటే, యిక్కడికెందుకు చచ్చావే? బామ్మడితో వుండాలనుకుంటే బామ్మలికిమల్లేనే వుండు. అక్కడ మమ్ము ల్నందర్నీ కులానికాక్కుండాసేసేసి, యిక్కడికొచ్చి మళ్ళీమాదిగ బతుకే బతుకుతావంటే? సిగ్గులేదంటే నీకు? ముక్కు మూసు కుంటే మూడుగెళ్ళు పట్టదు. థూ!" అని వుమ్మేసింది.

శాస్త్రీ, ఝింగురసింగూ, యిద్దరూ పరుగెత్తుకొచ్చారు. మాదిగలు మంచి కోపంమీదున్నారు. ఏదో వొకవిధంగా వాళ్ళని శాంతపరచాలి. "ఏవిటోయ్ యీ పోట్లాటంతా?" అనడిగాడు ఝింగురసింగు, సిలియా తండ్రిని.

సిలియా తండ్రిపేరు హరఖూ. అరవై యేళ్ళ ముసలి వాడు. నల్లగా, బక్కగా వుంటాడు యెండిపోయిన మిరపకా యలా. ఎండు మిరపలో వున్నంత కారంగూడా వుంది అత నిలో అంత ముసలివాడైనా. "పోట్లాటేంవుంది. ఇవ్వాళ ఈ మాతాదీన్ని మా కులంలో కలిపేసుకోవాలిసిందే. లేకపోతే

నెత్తురు వరదలై పారాల్సిందే. మా అమ్మాయంటే పెళ్ళి కావాల్సిన పిల్ల; యెవళ్ళనో వాళ్ళని యెట్టాగో చేసుకుంటుంది. అందులో యేంవుంది? దాన్ని చేసుకున్నాడు మట్టుకి మాలో కలిసిపోవాల్సిందే. మమ్మల్ని బాపన కులంలో యెట్టాగో కలుపుకోరుగా. ఐతేమానె. మేం మిమ్మల్ని మాకులంలో కలుపుకుంటాం. లేదు మీరే కలుపుకుంటాం అంటే మేం అందరవూం సిద్ధంగానే వుండాం. మీగ్గుండెల్లేకపోతే మేం కలిపేసుకుంటాం రండి. మా బంతిలో కూచ్చొని అన్నంతినండి. మా అమ్మాయి మానంతీశారుగా. మీ మతం యివ్వండి మాకు!" అన్నాడు.

శాస్త్రి కర్రనేలకేసికొట్టి, "మాటలు జాగ్రత్తగా రానీ వోయ్. కావాలంటే, యిదేం నీకూతురు; ఇక్కడే వుందిగా నీ యిష్టంవచ్చిన చోటుకి తీసుకుపో. మేం దాన్నేవీం కట్టెయ్యలేదుగా. పనిచేస్తోంది; కూలి యిస్తున్నాం. కూలిస్తే కావలసినంత మందొస్తారు; నీ కూతురొక్కటే ననుకుంటున్నావేమో" అంటూ గద్దించాడు.

సిలియా తల్లి బారలుచాస్తూ మీది, మీదికి వెళ్ళింది—"బలే గొప్పోడివయ్యా శాస్తుల్లుగారూ! నీ కూతురు మాకులం వాడితో లేచిపోతే, అప్పుడుగూడా యిట్టాగే మాట్టాడేవాడివా! మేం మాదిగాళ్ళంఐతే మాకు మర్యాదుండదనుకున్నావా! సిలియా నెందుకు తీసుకెల్తాం? దానిమానం చెరిచినాడిని గూడా తీసుకెల్తాం దాంతోపాటు. దాని మంచంమీద పడుకో వచ్చుగాని, దాని చేతినీలు తాగ్గూడదేం? ఇతంకీ ఆముండ ననాలీ అసలు. నేనైతేనా, అట్టాంటోడికి కిసం యిచ్చేదాన్ని!

"ఇన్నావుగదంట్రా యీయన మాటలు; యింకా

మొఖాలు చూసుకుంటూ రేంమకురా ?” అని గద్దించాడు హరఖూ; వెంటవచ్చిన మాదిగల్ని చూచి.

హరఖూ ఆ మాటలన్నాడో లేదో, యిద్దరు మాదిగ లొక్క యెగురెగిరి, మాతాదీన్‌ని పట్టుకుని, రెండుచేతులూ విరచి కట్టేశారు. మూడోవాడెళ్ళి, జంధ్యం తెంపేశాడు. ఝింగురసింగూ, శాస్త్రీ కర్రలు సద్దుకుంటునేవున్నారు; మాదిగ లందరూ కలిసి, వొక పెద్ద బొమికెముక్కని మాతాదీన్ నోట్లోపెట్టారు. మొట్టమొదట పళ్లు గట్టిగా బిగించుకున్నాడు మాతాదీన్. కాని యెంతసేపని బిగించుకు కూర్చుంటాడు ; అంమలో అది గట్టిబొమికకూడాను; అదీగాక పెదవు లెట్లా మైలపడిపోయినై. ఇంతలోనే చుట్టుప్రక్కల కళ్ళాల్లోవున్న జనం అంతా ప్రోగయ్యారు; ఐనా ఆశ్చర్యం యేమిటంటే అంతమంది జనంలోనూ వొక్కళ్ళుగూడా అదేమన్న పాపాన పోలేదు. మాతాదీనంటే, యిదివరకే, వూళ్ళోవాళ్ళందరికీ మంటుగావుంది: ఊళ్లో ఆడవాళ్ళందరినీ బుట్టలో వేసుకోవాలని చూస్తూవుండేవాడతను. అంచేత అందరూ, వొకవిధంగా, లోపల్లోపల సంతోషిస్తూనేవున్నారు. ఐనా పైకిమాత్రం, మాదిగలని కొద్దికొద్దిగా కేకలుగూడ వేశారు.

“అయ్యింది చాల్లేవోయ్ యిక. మరీ ముదరనిస్తే నీ అంతూ కనుక్కుంటారుగాని యిక నడు” అన్నాడు హోరీ.

“మీయింటోనూ వుండారాడపిల్లలు. ఈయన గారిట్టా అచ్చోసిన ఆంబోతుకి మల్లే తిరుగుతాంటే యెవరి మర్రాదా దక్కదు. తెలుసా ?” అన్నాడు హరఖూ, నిర్భయంగానే.

ఏమైతేనేం? శత్రువుని జయించారు మాదిగలందరూ కలిసి. ఇంక వెనక్కి తిరిగితేనే మంచిదనుకున్నారు. ఆలస్యం అమృతం విషం! ప్రజాభిప్రాయం మారిపోయేలోగా, వెళ్ళి పోతేనే మంచిది.

మాతాదీన్ కూర్చుని, వాంతిచేసుకుంటున్నాడు. దగ్గరకు వెళ్ళి, వీపు నిమురుతూ "వీళ్ళనా? ఒక్కొక్కళ్ళనీ ఐదేసేళ్ళు పంపుతాగా. జైల్లో పెడితేనేగాని తెలిసిరాదులే వీళ్ళకి" అన్నాడు శాస్త్రి.

"పంపితేపంపు. ఏఁవ్మునిగిపోతంది? నీకుమల్లే కాలు మీద కాలేసుకూర్చోటం లేదుగా ఇక్కడ మేంకైదేత్తే, కష్ట పడాలి సొత్తందని యేడవటానికి. అక్కడా ఈ పనే చేత్తాం. పెట్టినంత తిట్టాం" అన్నాడు హరఖూతల బిరుసుగా.

వాంతిచేసుకున్న తర్వాత, నిర్జీవుడిలా పడిపోయాడు మాతాదీన్; నడుం విరిగిపోయినట్లూ, ఇక ఎందుట్లోనైనా పడి చావటమే తరువాయి అన్నట్లూ. అతనిరసికత్వమూ, గర్వమూ, పురుషార్థమూ ఆ 'మర్యాద' అనే చెట్టుమీదగూడు కట్టుకుని వున్నాయి నేటివరకూ. ఇప్పుడాచెట్టు నిట్టనిలువునా కూలిపోయింది! మాదిగ లతని నోట్లోపెట్టిన బొమిక శరీరంతోపాటు అతని ఆత్మఁగూడా అపవిత్రం చేసేసింది. అతని మతమంతా ఈ స్పృశ్యాస్పృశ్యతల మీద, ఆహార పానీయాలమీద ఆధార పడివుంది. ఈనాడా ఆధారం సమూలంగా పెగలి, పడిపోయింది. ఇక యెన్ని ప్రాయశ్చిత్తాలు చేసుకున్నా, లక్ష ఆవుపేడలుతిన్నా, పదిలక్షల గంగోదకం త్రాగినా, మరిన్ని దాన ధర్మాలు చేసినా, పోయిన మతం తిరిగిరాదు. ఎవరూ చూడనప్పుడు, వొంటరిగా

వున్నప్పుడు జరిగితే, అదివేరే సంగతి; ఈ గల్లంతంతా వూరందరిముందూ జరిగింది! ఇంక జన్మలో, తలెత్తుకుని తిరిగేందుకు వీల్లేకుండా పోయింది. ఇవ్వాల్టినుంచి అతను స్వగృహంలోనే అంటరానివాడుగా భావించబడతాడు. కన్నతల్లి గూడ అతన్నిచూచి అసహ్యించుకుంటుంది. ఇంత బ్రహ్మాండమైన ధర్మం, మతం నాశనమైపోతూంటే అందరూ కళ్ళప్పగించి చూస్తూ కూర్చున్నారు; అదేమన్నవారు లేక పోయారు. ఇంతవరకూ యెదురుకాగానే చేతులెత్తి నమస్కారం పెట్టేవాళ్ళు, యిక అతనిమొహం కన్పించగానే తల త్రిప్పేసుకుంటారు. ఒక దేవుడిగుడిలోకి వెళ్ళేందుకు వీల్లేదు; ఒక హారతి కళ్ళకద్దుకునేందుకు వీల్లేదు. ఇంత ప్రమాదం జరిగేందుకు కారణం! ఎందుకూ పనికిరాని ఆ సిలియా!

ఇదివరకు పనిచేస్తున్న చోటనే తలవంచుకుని, మూర్తి వలె, నిలబడివుంది సిలియా. ఈ అవమానం అంతా తనకే జరుగుతూన్నట్లు కుమిలిపోతూంది. "ఇంకా యెందుకే యిక్కడే పాతేసుకున్నట్టు నుంచుంటావ్. తిన్నగా యింటికి పద. చేసింది చాల్లే"! అన్నది సిలియా తల్లి.

సిలియా వులక లేదు; పలక లేదు. తల్లిదండ్రులమీద, అన్నదమ్ములమీద కోపం వస్తోంది. అసలు వీళ్ళందరూ రావాల్సిన అవసరం యేంవుంది? తనయిష్టం వొచ్చినట్టుంటుంది; వీళ్ళకెందుకు మధ్య? నిన్నిక్కడ అవమానిస్తున్నారని అంటారు వీళ్ళందరూ. లేకపోతే బ్రాహ్మడన్న తర్వాత తన చేతివంట తింటాడా? తానిచ్చిన మంచినీళ్ళు త్రాగుతాడా? ఇంత వరకూ మాతాదీన్ ప్రవర్తనని చూచి ఆవిడమనసు బాధ

పడుతూనేవుంది ; కాని తన బంధువులూ, యిరుగుపొరుగు వారూ అతన్ని అవమానించేందుకు నడుంకట్టేప్పటికి, యింత వరకూ ఆవిడ పడుతున్న వైరాగ్యం, నిస్పృహలు ప్రచండ అనురాగంగా పైకుబికాయి.

"నేనెక్కడికీ రాను. యేం! నన్నేవీఁ బతకనివ్వదల్చుకోలేదా మీరు!" అంటూ తిరుగుబాటు చేసింది సిలియా.

"రావంటే!" అన్నది తల్లి పళ్ళు కొరుకుతూ.

"రాను."

"ఎందుగ్గాని ; మెదలకుండా పద."

"రానంటంలా."

ఇంతలోనే అన్నదమ్ములిద్దరు వచ్చి చేతులు పట్టుకుని లాగటం మొదలుపెట్టారు. సిలియా నేలమీద చతికిలబడింది. ఐనా వదల్లేదు వాళ్ళు ; యింకా యీడ్చారు. సిలియా చీరంతా చినిగిపోయింది, శరీరం అంతా కొట్టుకుపోయి నెత్తురు చెమర్చింది. ఐనాసరే ; వాళ్ళతో పాటు యింటికి వెళ్ళేందుకు సిలియా వొప్పుకోలేదు.

హరఖూ కొడుకుల్ని చూచి, "సరేలే యికూరుకోండ్రా, ఇకిది చచ్చిపోయినాళ్ళల్లోనే జత. మళ్ళీ మన గడపతొక్కిందీ అంటే అప్పుడు నెత్తురు కళ్ళజూత్తా" అన్నాడు.

సిలియా మరీ తెగించింది - "నీ యింటికొచ్చినప్పుడు అట్టాగే చేద్దుగానిలే."

ముసలిదానికి కోపం వచ్చింది. ఎడా, పెడా, తన యిష్టంవచ్చినట్లు తన్నింది సిలియాని. హరఖూ గనక వచ్చి అడ్డంపడకపోతే, ప్రాణాలుగూడా తీసేసేదేమో.

మళ్ళీ కూతురుమీదకు లంఘించబోయింది ముసలిది. హొరఖూవచ్చి ఒక్కతోపు వెనక్కితోశాడు ముసలిదాన్ని - "యేవిఁటే మరీయింత బరితెగిపోతన్నావ్; దాన్ని చంపుకు తింటావా యేంటి ?"

వెళ్ళి, తండ్రి కాళ్ళమీద పడింది సిలియా. "అయ్యా ! నన్ను చంపేశెయ్యండే. మీరందరూ కలిసే చంపండి. అమ్మా ! నీకేవీఁ జాల్లేదంటే ? ఇందుకేనంటే నాకు పాలిచ్చి, పెద్దదాం చేసింది ? పురిటిమంచంమీదే పీకపిసికి చంపెయ్యకపోయావంటే, పీడొదిలిపోయేదిగా. నామూలాన ఆ బామ్మణ్ణి గూడా చెరిపేశారు. ఆయన కులం పోతే మీకేం లాభం ? ఇప్పుడాయన గూడా నన్నేలుకోడు. ఏలుకున్నా యేలుకోకపోయినా ఆయన్తోనే వుండిపోతా నేను. చావనన్నా చచ్చిపోతాగాని, యింత గల్లంతు జరిగింతర్వాత ఆయన్నొదిలిపెట్టను. ఒకసారి చెయ్యిపట్టుకుం తర్వాత, చచ్చినా వొదిలిపెట్టను. నాకూ వుంది నీతి. "

తల్లి పెదవులు కొరుక్కుంది. "పోనివ్వండి లంజని. ఆ బామ్మడుంచుకొంటాడను కొంటాంది. మనఁవిట్టా తిరగ్గానే, యెళ్ళగొడతాడులే."

అన్నదమ్ములికిగూడా జాలేసింది. సిలియా నక్కడే వదలేసి, అందరూ వెళ్ళిపోయారు. లేచి, కుంటుకుంటూ, దగ్గుకుంటూ, కళ్లంలోకివచ్చి, కూర్చొని, నోట్లో గుడ్డ కుక్కుకుని, గుండె పగిలేట్లు యేడుస్తాంది సిలియా.

"వాళ్లతోనే వెళ్లకపోయావే! ఇంతపని చేయించావు చాలదూ? ఇంకేం చేయిద్దామని వచ్చావు ఇక్కడికి? ఇంకా నీ కళ్లు చల్లబడలా?" అని కసురుకున్నాడు శాస్త్రి.

ఏకధారగా నీరుకార్చే కళ్లు లేపి, శాస్త్రిని చూసింది సిలియా. ఆ కళ్లల్లో యేదోవింత వెలుగు ప్రకాశించింది. "నేనెందుకెళ్తాను? చెయ్యిపట్టుకున్నాళ్ల దగ్గిరేవుంటా" అన్నది.

"నా ఇంట్లో అడుగు పెట్టావంటే తన్ని బయటికీడ్చిస్తా" అని బెదరించాడు శాస్త్రి.

"ఆయన నన్నెక్కడపెడ్తే అక్కడే వుంటా. చెట్టుకిందైనా సరే, మేడమీదైనాసరే".

మాతాదీన్ మాటాపలుకూ లేకుండా కూర్చున్నాడు. మధ్యాహ్నం ఔతోంది. ఎండబాగా కాస్తోంది. వళ్ళంతా చెమటలు కారుతోంది. ఐనా కదలకుండా, మెదలకుండా, కూర్చునే వున్నాడు.

కాస్సేపున్నతర్వాత స్పృహలోకొచ్చి, "ఐతే నన్నేం జెయ్యమంటూరు?" అనడిగాడు మాతాదీన్, తండ్రిని.

కొడుకుతల నిమురుతూ, "ఏంచేసేదేఁవుంది నాయనా. వెళ్లిస్నానంచేసి, భోజనం చెయ్యి. తర్వాత పండితులేంజెప్తే అది చేద్దాం. ఆఁ ఒక్కమాట. సిలియాని మాత్రం వదలెయ్యాలిసిందే" అన్నాడు శాస్త్రి.

సిలియావంక నిప్పులు చెరుగుతూన్నట్లు చూచాడు మాతాదీన్. "ఇక చచ్చినా దాని ముఖం చూడను. ఐతే ప్రాయశ్చిత్తం చేసుకున్నతర్వాత ఇంకేవీఁ దోషం వుండదుగా."

"ప్రాయశ్చిత్తం చేసుకుంటే ఇంకేదోషమూ వుండదు."

"ఐతే యివ్వాళే పండితుల్ని కలుసుకోవాలి."

"అట్లాగే నాయనా! నే వెళ్లొస్తాలే."

"తీరా పెళ్లింతర్వాత వాళ్లు దీనికి ప్రాయశ్చిత్తమే లేదంటే?"

"వాళ్ళయిష్టం"

"ఐతే నన్నింట్లోనుంచి వెళ్లగొట్టేస్తారా?"

తనపుత్రప్రేమని దాచుకోలేక పోయాడు శాస్త్రి; కళవళ పడిపోయాడు. "అవేం మాటలు నాయనా! ధనమూ, ధర్మమూ, మర్యాద- యేం పోయినాసరే, నిన్నుమాత్రం వెళ్ళ గొట్టలేన్నాయనా" అన్నాడు.

మాతాదీన్ తండ్రివెనకే అడుగులో అడుగు వేసుకుంటూ వూరి ముఖం పట్టాడు. సిలియాగూడ కుంటుకుంటూ అతని వెనకే బయలుదేరింది.

వెనక్కితిరిగి, "యింకా నావెనకే బడి వస్తావెందుకు? నీకు నాకూ యేం సంబంధం? జరిగింది చాలదూ? ఇంకా నీ కక్షతీరలా?" అన్నాడు మాతాదీన్ నిర్మోగమాటంగా.

మొండితనంగా వెళ్ళి, అతని చెయ్యిపట్టుకుని, "యేం, యెందుకు లేదు సంబంధం? నీకంటే యెక్కువ డబ్బున్నాళ్లూ, అందమైనళ్ళూ, గౌరవం వున్నాళ్ళూ చాలామందుండారీ వూళ్ళో; వాళ్ళందర్నీ వదిలేసి, నీ చెయ్యే పట్టుకుంటున్నాగా! ఇప్పుడిగ్గాని తెలిసిరాలేదేంటి నీకు? నీ మెళ్లో తాడుపడిపోయింది; నువ్వెంత తన్నుకున్నాసరే, అదిమాత్రం తెగిపోదు. నిన్నొదిలి పెట్టి నే నెక్కడికీ యెళ్లను. కూలన్నా చేసుకుంటా; అడుక్క

తింటా, అంతేగాని నిన్ను చచ్చినా వదిలిపెట్టను" అన్నది సిలియా.

అని, అనవలసిన నాలుగూ మాటలూ అని, అతని చెయ్యి వదలిపెట్టి, గిరుక తిరిగి, మళ్లీ కళ్లంలోకి వెళ్లింది. హోరీ యింకా పనిచేస్తూనే వున్నాడు. అన్నానికి పిలుచుకెళ్దామని ధనియాగూడ వచ్చింది. ఎడ్లని విప్పి, చెట్టుకు కట్టేసి, "నువ్వూ గూడావెళ్లి నాలుగు మెతుకులు తినిరారాదంటే సిలియా. ధనియా వుంటుందిలే యిక్కడ. అయ్యయ్యో, నీ చీరంతా నెత్తురు మరకలయ్యిందే. యేవిఁటే, మీవాళ్లంత కటిక వాళ్లేవేఁ" అన్నాడు హోరీ.

సిరియా కళ్లల్లోకి ప్రాణం తెచ్చుకుని చూచింది హోరీ వంక—"ఇక్కడ కటికాళ్లు కానాళ్లెవర్లే. అందరూ అంతే!" అన్నది.

"శాస్త్రిఁ వన్నాడు?"

"నీకూ నాకూ సంబంధం లేదన్నాడు."

"నిజంగానా!"

"అట్టాగన్నా అంటే, గౌరవం దక్కుతుందనుకున్నాడేవోఁ. లోకం యేఁ వన్నా మూకుడా బోర్లేసి మొయ్యటానికి? నా కన్నం పెట్టం కష్టం ఔతే మానుకోమను. ఇప్పుడు చేస్తా నష్టేసు కూలిచేసి బతుకుతా. ఇక రాత్రిపూట కాస్సేపు కళ్ళు మూసుకుంటానికి బెత్తెడు నేల; నిన్నడిగితే నువ్వు యివ్వవూ?"

ధనియా హృదయం మెత్తబడింది. "నేలకేఁవమ్మా. మా యింటో వుందుగానిలే తల్లీ."

హోరీ భయపడిపోయాడు. "రమ్మంటన్నావు బాగానే వుందిగాని శాస్త్రి సంగతి తెలవదూ నీకు?" అన్నాడు.

"వుంటే యింకోక ముద్దెక్కువ తింటాడు; అంతేగా! నేనేంవన్నా నాకర్నా శాస్త్రిరి చెప్పినట్లల్లా యింటానికి? దాని మానం చెరిచారు; కులానిక్కాకుండా చేశారు; ఇప్పుడు సంబంధంలేదు పొమ్మంటారూ! మనుషులా; కసాయళ్లా? మొదటే ఆలోచించుకోలేక పోయాడూ. అప్పుడేవోసైరంగా అని తిరగటం వెందుకు? యిప్పుడిట్టా వాగటం వెందుకు?"

ధనియా తప్పుచేస్తూందనే హోరీవుద్దేశం. శాస్త్రి కొడుకను చాలా అవమానించారు సిలియా తరఫువాళ్ళు. సిలియాని తన్నుకున్నా, తిట్టుకున్నా ఇబ్బంది వుండేదికాదు; సిలియా వాళ్ళమ్మాయి. మాతాదీన్ నోట్లో మాంసంముక్క పెట్టడందేనికి?

ధనియా విసుక్కుంది. "చాల్చాల్లే, మాలావు చెప్పొచ్చావ్ న్యాయ్యం. మగాళ్ళందరూ వొకటే సజ్జు. దీన్ని మాతాదీన్ నాశనం చెయ్యాలా? అప్పుడెవళ్ళూ నోరెత్తలేదేం? సిలియా మానం మాత్రం మానంగాదూ? మాదిగమ్మాయిని వుంచుకున్నాడు; మాంసం ముక్క తింటే తప్పా? మామంచి పనిచేశారు; రాడీ ముండాకొడుకులికిట్టాగే అవ్వాలి. సిలియా! నీ కెందుకు నువ్వు మాయింటికి రామ్మా! ఐనా అదేం అమ్మా బాబూలే; వల్లంతా వూనాం చేసేశారు. యేం వయ్యోయ్! నువ్వెళ్ళి సోనాని పంపు. నేను సిలియాని వెంటబెట్టుకొస్తా."

హోరీ యింటికి వెళ్ళాడు. ధనియా కాళ్ళమీద పడి, హృదయం పగిలేట్లు యేడ్చింది సిలియా.

# 19

సోనాకు పదిహేడో యేడు వచ్చింది; కనీసం ఈ సంత్సరం ఐనా పెళ్లి చెయ్యాలి. రెండు సంవత్సరాలనుంచీ, యిదే యావలో వున్నాడు హోరీ. ఏంచేస్తాడు? చేతిలో చిల్లిగవ్వ లేదు. ఇంక ఈ సంవత్సరం తప్పదు. అప్పో సొప్పో తీసుకోవాలి; పొలం తాకట్టు పెట్టైనాసరే. తల తాకట్టు పెట్టాల్సివచ్చినా తప్పదు. హోరీ యిష్టంవచ్చినట్లు కానిస్తే రెండేళ్ల క్రితమే ఐపోయేది పెళ్లి. యేదో తక్కువలోనే అయిపోయిందనిపించుదామని హోరీ వుద్దేశం. ధనియా ససేమిరా అన్నది; ఎంతలేదన్నా రెండుమూడు వందలుండా లంటుంది; ఝునియా అడుగు పెట్టిం తర్వాత మరీ కష్టమైపోయింది; సంబంధానికెవరూ యెక్కటం లేదు. రెండొందలైనా యివ్వకపోతే, మంచివరుడు దొరకడు. గడచిన పంటలో హోరీకి దక్కిందేమీ లేదు. మాట కేశాస్త్రితో పాలుపంచుకున్నది. విత్తనాలకనీ, ఉప్పు ఖర్చులనీ, కలుపుతీతకనీ, దానికనీ, దీనికనీచాలా వడుక్కున్నాడు శాస్త్రి. పన్ను గూడా హోరీయే చెల్లించాడు. రెండోపంట అంటే చేతికి దక్కిందేమీ లేదు.ఈ సంవత్సరం ఫర్వాలేదు. ఎంతో కొంత చేతిలో పడేట్లే

వుంది. పప్పూ అన్నం పెట్టేందుకు సరిపడ ధాన్యంవుంది యింట్లో. ఇంకో రెండు వందలు చేతిలోవుంటే కన్యాదానం చేసెయ్యొచ్చు. గోవర్ వొక వందరూపాయ లాదుకుంటే, మిగతా వంద యెక్కడో వొకచోట తెచ్చుకోగలడు హోరీ. ఝింగుర సింగూ, మంగ్రూ షావుకారూ కాస్త మెత్తగానే మాట్లాడుతున్నారు; గోవర్ సంపాదించుతున్నాడుగదా! వాళ్ళ డబ్బు మాత్రం యెక్కడికి పోతుంది?

వెళ్ళి, గోవర్‌ని చూచి, రెండు మూడు రోజులుండి వస్తానన్నాడు హోరీ, ఒక రోజున.

కాని ధనియా, యింకా, ఆనాటిమాట మరచిపోలేదు. గోవర్ నడిగి డబ్బు తెచ్చుకోవటం సుతరాం యిష్టంలేదు ఆవిడకి.

హోరీకి కంపరమెత్తింది- "ఐతే పనిజరగొద్దూమరి? యేం చేస్తావో చెప్పు."

ధనియా తలత్రిప్పింది—"గోవర్ దేశాంతరం వెళ్ళలేదనుకో, అప్పుడేం చేసేవాడివి? ఇప్పుడూ అంతే!"

హోరీ నోరు మూతబడిపోయింది. ఒక్కక్షణం ఆగి, "అదే గదంటే నిన్నడిగేది" అన్నాడు.

"అదంతా ఆలోచించుకోవాల్సింది మగాళ్ళే!" అని తప్పించుకుంది ధనియా.

హోరీ, రెడీగానే వున్నాడు, "సరేనే! నేనూ లేకపోతాననుకో; నువ్వేంచేసే దానివి? అదేచెప్పు" అన్నాడు.

"ఐతే దర్భదానం చేసేసేదాన్ని; నన్నెవళ్ళేం వంటారు?" అన్నది ధనియా అన్నిటికీ తెగించినట్లు.

కుశ-కన్యాదానం హోరీగూడ చేయొచ్చును. అట్లాచేస్తే బాగానే వుంటుంది; కాని కులగౌరవం వదులుకోవటం అంటే మాటలా? అతని అక్కచెల్లెళ్ళ పెండ్లిళ్ళకి మూడువందల మందికి 'బంతిభోజనం' పెట్టాడు. కట్నంగూడ బాగానే ఇచ్చాడు. మంచి 'సానాయిమేళం' తెప్పించాడు. భోగంమేళం, ఏనుగలూ, లొట్టిపిట్టలూగూడ వచ్చినయి. ఇప్పటికీ యిరుగు పొరుగు వాళ్లామాటలు తలచుకుంటూంటారు; చుట్టుప్రక్కల పది పదిహేను వూళ్ళతో అతనికి పరిచయం వుంది. కుశ-కన్యాదానం చేసి తలెత్తుకు తిరగగలడా? ఇల్లుంది; ఏదో యింత పొలంగూడా వుంది. ఒకకుంట అమ్మేస్తే రెండువందలికి తక్కువలేకుండానే వస్తుంది. భూమి అమ్ముకోవటమంటే మాటలుకాదు; భూమంటే వల్లమాలిన ప్రేముంటుంది రైతుకి. కుల మర్యాదకంటే ఎక్కువ భూమి అంటే. ఐనా కుంట అమ్మేసుకుంటే యింకా అతను వ్యవసాయం యేం చేస్తాడు?

ఇట్లా వెనకా, ముందూ ఆలోచించుకోవటంతోనే కొన్ని రోజులు గడచిపోయినై. ఐనా యిదమిత్థమనుకోలేక పోయాడు హోరీ.

దసరా శలవులు. శలవులకి ఝింగురసింగు కొడుకూ, పటేశ్వరిగారబ్బాయీ, నోఖేరాంకొడుకూ వచ్చారు. ముగ్గురూ యింగ్లీషు చదువులు చదువుతున్నారు. ఒక్కొక్కడికీ ఇరవై యేళ్లుంటాయి; ఐనా యింకా యూనివర్సిటీ కెళ్లిన పాపానపోలేదు. ఒక్కొక్క క్లాసులో రెండు మూడేళ్లు దండ యాత్రలు కొడుతున్నారు. ముగ్గురికీ పెళ్లిళ్లయినై. పటేశ్వరి గారి సుపుత్రుడు బిందేశ్వరీలాల్ - ఒక బిడ్డ తండ్రిగూడా

అయ్యాడు. ముగ్గురూ కలిసి జూదం ఆడతారు; 'చిలుం' త్రాగుతారు; అచ్చుబోసిన ఆంబోతుల్లా బజార్లంటపడి తిరుగుతారు. ప్రతిరోజూ, హోరీ ఇంటికేసి చూస్తూ చక్కర్లు కొడ్తుండేవారు. వాళ్ళట్లా వచ్చేప్పటికి సోనాగూడా యేదోవొక పనిమీదవచ్చి గుమ్మంలో నిలబడేది గోవర్ తెచ్చిపెట్టిన చీర కట్టుకుని. ఇదంతా చూస్తూంటే హోరీకి కారం రాసుకున్నట్లుండేది. పంటంతా పాడుచేసేందుకని పంతంగట్టి ప్రకృతంతా యేకమై వుప్పినగాలిని పంపబోతుండా అన్నట్లు నీరు కారి పోయేవాడు.

హోరీ పొలం తడుపుకునేందుకు వుపయోగించుకునే నూతి దగ్గరకే వచ్చారు ఆ ముగ్గురూనూ, స్నానం చేసేందుకని. సోనా గూడా అక్కడేవుంది తండ్రికి సాయంచేస్తూ. సలసల కాగిపోయాడు హోరీ.

ఆ వేళ సాయంత్రమే కోమటమ్మ - దులారి - దగ్గర కెళ్లాడు హోరీ. ఎట్లాగైనా ఆడవాళ్ళ మనసులు కాస్త మెత్తగా వుంటాయి; తక్కువ వడ్డీకి అప్పిస్తుందేమోననుకున్నాడు హోరీ. దులారి తన రామాయణం మొదలుపెట్టింది. వూళ్లో వాళ్ళందర్నీ యెంతో కొంత బాకీవున్నా రావిడకి; చివరికి ఝింగుర సింగుగూడ యిరవై రూపాయలు బాకీ వున్నాడు. ఐనా ఒక్కళ్లూ అప్పుతీర్చిన పాపాన పోవటంలేదు. ఇక డబ్బెట్లా పుడుతుంది ?

హోరీ బ్రతిమలాడాడు. "వదినా, వదినా! నీకు పుణ్యం వుంటుందొదినా. నువ్విప్పుడు లేదన్నావంటే, యిక నేను బ్రతకటమే కష్టమైపోతుంది. ఝింగురసింగూ, పటేశ్వరీ

నామీద కత్తికట్టి కూర్చున్నారు. ఉన్న ఆ చేరెడునేలా పోతే నేనెందుకు పనికొస్తాను చెప్పు. తాత ముత్తాతలు సంపాయించింది యేం ముఖం పెట్టుకొని అమ్ముకోను?" అంటూ అల్లల్లాడి పోయాడు.

దులారి వోట్టుపెట్టుకుంది. "దేవుడితోడంటే నమ్మవయ్యా; నా దగ్గర యేమీలేదు. తీసుకున్న వాళ్ళివ్వకపోతే నేనుమాత్రం ఎక్కడ్నుంచి తెస్తాను; నేవ్వేచెప్పు! నువ్వేవన్నా పరయాడివా వుంచుకుని లేదంటానికి? సోనా గూడా నాబిడ్డేగా! యేం చెయ్యను? నీతమ్ముడు హీరా యెడ్లకని యాభై పట్టికెళ్ళాడా; ఐపులేకుండా పోయాడు; ఆయనగారి పెళ్లాన్నడిగితే కయ్యానికి కాలుదువ్వుతుంది. శేఖర్ అంత అమాయికుడికి మల్లే వుంటాడా; చచ్చినా కాండబ్బు చేపడు. అసలు సంగతి నీకూ తెలుసు; నాకూ తెలుసు; వాళ్ళదగ్గిర మాత్రం యెక్కడు-దిలే. వుంటేగా, అప్పులు తీర్చటానికి! అందుకనే నేనూ వూరుకుంటున్నా. ఎవళ్ళ పొట్టలు వాళ్ళు పోసుకోవటమే గగనమైపోతూండె. పొలం మట్టుకి అమ్మొద్దుబాబూ" అన్నది.

మరికాస్త దగ్గరికి జరిగి, "ఆ పటేశ్వరీలాల్ కొడుకదే పనిగా తిరుగుతున్నాడు మీ ఇంటి చుట్టూనూ. వాళ్ళు ముగ్గురూ అంతే. కాస్త కనిపెట్టుండు. పట్టణం యెళ్లొచ్చిన సజ్జుగాదూ పల్లెటూళ్లల్లోవాళ్లకిమల్లే వరసా వాయీగూడా చూడరు. మనవూళ్లోనూ వున్నారుగా వయసులోవున్న అబ్బాయిలు; వీళ్ళు కాస్త వెనకా ముందు, మంచీ చెడ్డా చూస్తారు, భయపడతారు. ఆ పట్టణంవాళ్లేంవుంది; అచ్చోసిన ఆంబోతులే! మాకాశల్యొచ్చింది మొన్న అత్తారింటినుంచి;

ఈ వ్యవహారం అంతాచూచి, నేను వాళ్లమాఁవని పిలవనంపి వెంటబెట్టి పంపించేశా. ఎంతకాలంఁవని పొరాయిస్తాకూర్చుంటాం మనం మాత్రం?" అనిచెవిలో చెప్పినట్లు చెప్పింది.

తాను మాట్లాడుతున్నపుడు హోరీ ముసి ముసి నవ్వులు నవ్వటంగూడా కోమటమ్మ గమనించింది. "ఎందుకట్లా నవ్వు తావ్ ? నువ్వుమాత్రం తక్కువ తిన్నావంటలే ! ఏదో వొక వంక పెట్టుకుని ఎట్లాలేదన్నా యాభైసార్లు వచ్చేవాడివి ఈ కొట్టుకి; నేను నీవంక చూళ్లేదుగాని..."

హోరీ కూడ "అదేఁవన్నమాటలేవమ్మా ! అబద్ధం ఆడతానెందుకు ? నీకు యిష్టంలేక పోయినా, వచ్చిపోతూండ డానికి నేనేం పిచ్చాణ్ణా ?" అని గోముగా మందలించాడు.

"వఠి అబద్ధాలకోరు నువ్వు."

"కళ్లెత్తి చూచేదానివి కాదనుకో. నీ మనసుమాత్రం చూస్తానూ వుండేది; పిలవనూ పిలుస్తూండేది."

"ఇక చాల్లే; మాలావుసోది చెప్తున్నావుగాని అదే పనిగా వస్తావుంటే చూచి, జాలేసేది. అంతేగాని నువ్వేఁవంత పెద్ద జమాను మనిషివనేంకాదు!"

ఇంతలో, యెవరో వుప్పుకావాలంటూ వచ్చారు; పరిహాసం ఆగిపోయింది. వాళ్ళకి వుప్పిచ్చి, పంపేసింతర్వాత, "పోనీ మీ అబ్బాయి దగ్గిరికెళ్ళిరారాదూ? చూచొచ్చినట్టూ వుంటుంది; ఏఁవన్నా సాయంగూడా చేస్తాడేమో" అన్నది దులారి.

"వా డెక్కడిస్తాడు. నాలుగు డబ్బులు సంపాదించటం మొదలు పెట్తే, పిల్లల కళ్ళు నెత్తికొస్తై. నే నెళ్దావఁనే అను

కున్నా గాని, యింటి చొప్పుకోవటం లేదు. అది వొద్దన్న తర్వాత వెళ్తే యింట్లోవుండే పారం వుండదు; దాని సంగతి నీకు తెల్సుగా."

"ఉహ్హూఁ! ఆవిడగారి మాట జవదాటవన్న మాట."

"నువ్వు మాట్లాడకే పోతివి; మరేం చెయ్యమంటా!"

"ఇప్పుడైనా సరే, నేను చెప్పినట్టల్లా వింటానంటే, యిప్పుడే రాయించేసుకుంటా!"

"మునుకుపోయిందేవుంది; రాంచుకో. రెండొందలు. ఆమాత్రం చెయ్యనంటలే నేను."

"ఐతే మరి ధనియాతో మాట్లాట్టం మానేస్తావా?"

"చచ్చినా! ఒట్టెయ్యనా?"

"మాట్లాడ్తే?"

"నాలిక తెగ్గోసెయ్యి."

"సరే. ఇంకేఁ? వెళ్ళు! వెళ్ళి పెళ్ళికొడుకును చూసుకో; డబ్బు నేనిస్తా."

హోరీ కళ్ళు నిండాకుతైనయి. వెళ్ళి కోమటమ్మ కాళ్ళు పట్టుకున్నాడు. పాపం! భావావేశంతో నోటమాట పలకలేక పోయాడు.

కోమటమ్మ కాళ్ళు వెనక్కిలాక్కొంది.— "ఇట్లాంటి పనుల్చేస్తేనే నాకు మండుతుంది. ఏడాది లోపుగా నా డబ్బు నా కిచ్చేసెయ్యాలి వడ్డీతోసహా. నీ మాటంటే నమ్మకంలేదు గాని, ధనియా వుందిగా. శాస్త్రిగారికి నువ్వంటే మా కోపంగా

వుండల్లే వుంది. వూళ్లోనుంచి గెంటించకపోతే నేను బ్రాహ్మణ్ణే కాదంటున్నాడు. ఎందుకొచ్చిన గొడవ? ఆ సిలియాని వెళ్లి పొమ్మనరాదూ? తిని కూర్చోలేగాని..."

"నేనేం చెయ్యను? ధనియా తీసుకొచ్చి యింట్లో పెడితే."

"శాస్త్రిగారు కాశీ వెళ్లాడంట. అక్కడెవరో గొప్ప పండితుడు ఐదువందలిస్తేగాని ప్రాయచ్చిత్తం చెయ్యటానికి వీల్లేదన్నాడంట. ఎప్పుడన్నా విన్నావా? మనం యీ ఘోరకలి? మతం వొకసారి పోయింతర్వాత లక్షప్రాయచ్చిత్తాలు చేసు కుంటేమాత్రం యేంలాభం? నువ్వెన్ని ప్రాయచ్చిత్తాలు చేసుకుంటేమాత్రం నీచేత్తో పోసిన్నీళ్ళెవలన్నా తాగుతారూ?"

హోరీ ఇంటిముఖం పట్టాడు; వుత్సాహంతో గంతు లేస్తున్నది అతని మనసు. పుట్టింతర్వాత ఇంతసంతోషం ఇంతకుపూర్వం యెప్పుడూ కలగలేదు. దార్లో శేఖర్ ఇంటి కెళ్లి, తమ్ముణ్ణి వెంటబెట్టుకుని, పురోహితుడిని కలిసికొని, లగ్నాలు విచారించి, ఇంటికొచ్చి వాకిట్లో కూర్చోని, పెళ్లి సంబంధాల్నిగురించి సంబరాలనుగురించి సోదేసుకు కూర్చున్నాడు.

"జాంపొద్దు పోయినా నీకింకా అన్నానికి తీరుబడి కాలే దేంటి? లేచొచ్చి, అన్నంతిను; తర్వాత మాట్టాడుకోవచ్చులే నీ సోదంతా" అన్నది ధనియా, వాకిట్లోకొచ్చి.

"ఈ సహాలగ్నంలోనేనే పెళ్లి. ఇట్లావచ్చి, యేంవేం సామాను పట్టుకురావాలో చెప్పు. ఏంకావాలో నాకేం తెలు స్తుంది" అన్నాడుహోరీ.

"ఏఁవీఁ తెలవకపోతే యీ చర్చంతా యెందుకు? యింతకీ అసలు డబ్బెక్కడన్నా చూచావా; లేకపోతే కలలు కంటన్నావా?"

"అదంతా నీ కెందుకులేవే. ఏఁవేం పట్టుకురావాలో నువ్వుచెప్పు; తెచ్చేవాణ్ణి నేనుండాగా" అన్నాడు హోరీ ధీమాగా.

"గాల్లో మేళ్ళుకట్టం చేతగాదుబాబూ నాకు."

"సరే. మాచెల్లెళ్ళపెళ్ళి కేవేంపట్టుకొచ్చావోఁ చెప్పు; చాల్లే."

"డబ్బు దొరికిందో లేదో చెప్పు ముందు."

"దొరికిందే; దొరికింది! నేనంటే యేఁవనుకున్నావు మరి?"

"ముందులేచి, అన్నానికిరా; తరవాత మాట్లాడుకుందాంగాని."

కోమటమ్మతో మాట్లాడి వచ్చాడని తెలిసింతర్వాత మూతి ముడుచుకుంది ధనియా. "దాందగ్గిర డబ్బు పుచ్చుకొని, అప్పు తీర్చినాళ్లెవళ్ళన్నా వుండారూ? వడ్డీమీద వడ్డీయేసి ప్రాణాలు పీక్కుతింటుంది దయ్యానికిమల్లే" అన్నది.

"ఏం చేస్తావేఁ మరి? అప్పెంకెక్కడా పుట్టకపోతే?"

"ఈవంక పెట్టుకుని సరసాలాట్టానికెళ్ళానని చెప్ప రాదూ? ఈ డొంకతిరుగుడు మాటలెందుకు? ఇన్నేళ్లొచ్చినై యేం లాభం; బుద్ధుంటేగా."

"ఏవిఁటే మరీపసిపిల్లకిమల్లే మాట్లాడుతావ్? నాలాంటి బీదాడితో అది సరసాలాడతందంటే యెక్కడన్నా నీపిచ్చిగాని; మాట్లాట్టవేఁ గగనవఁయ్యె!"

"నీకంటే మంచాళ్ళు యెళ్ళొచ్చారేంటి దాందగ్గరకు!"

"నీకేం తెలుసే. దాందగ్గర డబ్బుంది; మహామహా వాళ్ళే వెళ్ళి గడపమీద కూర్చుంటారు."

"అది వూఁ అందో లేదో, వూరంతా డప్పేసొచ్చా వన్నమాట."

"ఊఁ అంటఁ వేంటి? వాగ్దానం చేస్తే." హోరీ, అన్నం తినేందుకని లోపలికి వెళ్ళాడు. శేఖర్ ఇంటికి వెళ్ళిపోయాడు. సిలియాని వెంటబెట్టుకొని బయట కొచ్చింది సోనా. ఇంతవరకూ తలుపుచాటున నిలబడి, మాటలన్నీ వింటూ నేవుంది సోనా. తన పెళ్ళికి రెండువందలు అప్పు తెస్తున్నారనేప్పటికి మనసంతా చీకాకు పడిపోయింది; నీళ్ళల్లో క్రొత్తసున్నం వేసినట్లు బుసబుస మన్నది. గుమ్మంలో గూట్లో దీపం వెలుగుతోంది; పొగచూరటం మూలాన గూడు పైభాగంఅంతా నల్లగావుంది. ఎడ్లు గాట్లో జనపకట్టలు నములుతూన్నయి. అన్నం దొరుకుతుందేమోనని, వెనక కాళ్ళమీద కూర్చుని తోకాడిస్తూ చూస్తోందొక కుక్క. సోనా సిలియా లిద్దరూ కలిసి, గొడ్లచావడి దగ్గర కొచ్చారు.

"విన్నావా! కోమటమ్మదగ్గర రెండొందలప్పు తెస్తన్నా డంట మా నాన్న నా పెళ్ళికని" అన్నది సోనా.

సిలియాకు ఇంటి గుట్టంతా తెలుసు. "ఇంటో లేకపోతే తేవద్దుమరి?" అన్నది.

ముందు నల్లగా గుబురుగావున్న చెట్లవంక చూస్తూ "మానాన్న, అమ్మా అప్పు చెయ్యటం నాకేం బాగుండటంలా. తర్వాతెట్టా తీరుస్తారు? ఇప్పుడికే బోలెడన్నప్పులున్నయి. ఇంకా రెండొందలు తెస్తే ఇంకా కష్టంగాదూ?" అన్నది సోనా.

"డబ్బులేకపోతే పెద్దపెద్దాళ్ల పెళ్లిళ్లే అవవు. అట్టా ఐతే నీకు ముసలి మొగుడే రాసుందన్నమాట. ముసలాణ్ణి పెళ్లి చేసుకుంటావా మరి?"

"ముసలాణ్ణెందుకు చేసుకుంటాను! అన్నయ్య ఝునియాని పెళ్లి చేసుకోలా కట్నాం గిట్నాం లేకుండా; అన్నయ్యేఁవఁన్నా ముసలాడా?"

"అట్టా చేసుకుంటే పేరు చెడిపోతంది."

"కట్నాం పుచ్చుకుంటే పెళ్ళిచేసుకోనని పెళ్లారితోనే చెప్పేస్తా." (ఏటవతల వూళ్ళో వొక షావుకారుగారబ్బాయిని కుదుర్చుకున్నారు సోనాకని)

"మీా నాన్న యిచ్చాడు; మా నాన్న పుచ్చుకున్నాడ నంటే పెళ్ళికొడుకు ? అప్పుడు ! "

రామబాణంఅని సోనాఅనుకున్న అస్త్రం, జీలగ బెండై పోయింది. ఏమనేందుకూ తోచక, "ఐనాస రే, వొకసారి చెప్పేచూస్తాను. నాకేంసంబంధం లేదనంటాడనుకో; గోమతీ నదీ దగ్గరిగానే వుంది; యేట్లోపడి చస్తా; పీడొదిలి పోతంది. పాపం! మా అమ్మా నాన్నా పొట్టగట్టుకుని పెంచారు నన్ను; పెద్దాన్ని చేశారు. ఇంట్లోనుంచి వెళ్లిపోయేటప్పుడుగూడా యింకొక రెండొందలు నెత్తిమీా దేసి పోనా? ఛీ, దేవుఁడింత యిస్తే, వాళ్లిష్టం వచ్చినంత పెట్టుకోవచ్చు కన్నకూతుళ్లం గాబట్టి. వాళ్లసలే తిండిలేక చస్తన్నారయ్యే. షావుకారు కోర్టు కెక్కితే రేపట్నుంచీ అడుక్కుతినాల్సిందేగా. మునిగి చచ్చి పోతేనే మంచిది. తిండికిలేకపోతేమానె! వాళ్లకి పొలఁవఁన్నా మిగుల్తుంది. చచ్చిపోయానని నాలుగు రోజు లేడ్చినా ఫర్వా

లేదు; తర్వాతన్నా సుఖంగా వుంటారు. నా పెళ్లి చేశారంటే, బ్రతికినంతకాలవూఁ యేడుస్తూకూర్చోవాల్సిందేగా. రెండేళ్లల్లో ఈ రెండొందలు నాలుగొందలైపోతాయి; నాన్నెట్టా తీరుస్తాడు ఈ రుణం అంతా?" అన్నది సోనా.

సోనా కన్నుల్లో యేదో వింత జ్యోతి వెలుగుతూన్నట్లని పించింది సిలియాకి. ఉన్నదాన్నున్నట్లు కావిలేసుకుని, "చూట్టానికి పిచ్చిదానికిమల్లే వుంటావు; ఇంత తెలివెక్కడ తెచ్చుకున్నా" అన్నది సిలియా.

"దీనికి తెలివెందుకే? నా కేం కళ్ళు లేవనుకున్నావా? నా పెళ్లికని రెండొందలు రుణంచేస్తారు; రెండేళ్ళకి నాలుగొందలౌతై. రూప పెళ్లికని మళ్ళీ రెండొందలు రుణం. ఇల్లూ పొలం వేలాంవేస్తారు. అమ్మా, నాన్నా బిచ్చానికి బయల్దేరతారు. అంతేగా? ఇంతకంటే నే చచ్చిపోవటం మెరుగ్గాదూ. నువ్వు చీకట్లోనేవెళ్లి, పెళ్లికొడుకుని పిల్చుకురా; వద్దులే, పిల్చుకురావటం యెందుకు? మాట్లాడాలంటే నాకు సిగ్గేస్తందేవోఁ గూడాను. నేనన్న మాటలన్నీ నువ్వేచెప్పు. యేంవంటాడో చూడు. ఎంతదూరంలే. ఏటి కవతలగట్టునేగా. అప్పుడప్పుడు యేరుదాటి యివతలిక్కూడ వస్తావుంటాడు. ఒకసారి వాళ్ళగొడ్లు మా చేలోపడితే, బాగా తిట్టాను కూడాను; కాళ్లావేళ్లాపడ్డట్టు బతిమాలుకున్నాడు. సరేగాని, యీమధ్యెప్పుడన్నా శాస్త్రిగారబ్బాయిని చూచావా నువ్వు! బ్రాహ్మలందరూ కలపి వెలేసేరంటగా?"

"ముసలాడు డబ్బివ్వటం లేదేవోఁ. ఎందుకెలేత్తారు?" అన్నది సిలియా.

"ఐనా వదిలిపెట్టేసెయ్యరాదూ. మీ కులంలోనే యెవళ్ళో వొకళ్ళ్ని కట్టుకుని హాయిగా కూర్చోక."

"ఛ. నా మూలానేగా పాపం ఆయన కీయిబ్బందు లన్నీ వచ్చింది. బొమ్మడైనా సరే, దేవుడైనా సరే. ఎవడైతే నాకేం నాదగ్గిరికొచ్చి నాకాళ్ళమీద తలపెట్టింతరవాత. రేపెంత బాపనమ్మని చేసుకుంటేమాత్రం నేను చేసినంతసేవ చచ్చినా చెయ్యలేదు. కులంవాళ్ళకి జడిసి నాలుగైదు రోజు లుంటాడేమో దూరందూరంగా. తరవాత తనే వత్తాడు పరి గెత్తుకుంటూ."

"ఇంకా రాకేం? నువ్వు కనబడితేనేచాలు కర్ర పుచ్చు కుంటాడు."

"రాకపోతే రాకపోతాడు. రమ్మని యేడిచానేంటి నేను మాత్తరం. ఎవళ్ళనీతాళ్ళకే వుంటంది. తను దారితప్పాడని నేం తప్పుతానా."

ఉదయమే లేచి, యేటవతలికి వెళ్దామనుకున్నది సిలియా; కాని ధనియాకి తలనొప్పిగావుంది. హోరీ యేమోపని పురమా యించాడు; ఆగిపోక తప్పలేదు. వీలుచేసుకుని మధ్యాహ్నం బయలుదేరింది.

కాస్సేపటికి హోరీవస్తే సిలియా కన్పించలేదు. "సిలియా యెక్కడికెళ్ళింది? ఉండుండి యెగిరిపోతందెక్కడికి? పనుల మీద మనసే వున్నట్టుండదు; నీకేవన్నా తెలుసా అమ్మా సోనా? సిలియా యెక్కడికెళ్ళిందో" అనడిగాడు హోరీ.

సోనా అబద్ధంఆడింది. నాకేం తెలవదు. చాకలాళ్ళిం టికెళ్ళి బట్టలు తెచ్చుకోవాలంది. అక్కడికెళ్ళిందో, యేమో.

ధనియా మంచంమీదనుంచి లేచి, "ఎక్కడికి కెళ్తేయేఁ? నువ్వేఁవన్నా కూలిస్తన్నావా అదికెక్కడికీ యెళ్ళకుండా యిక్కడే పడుంటానికి? " అన్నది.

" ఏఁ ! మనింటో వుంటంలా ! దానిమూలాన వూరంతా ఆడిపోసుకోవటంలా మనని?"

"ఇంటో వుంటే ! ఒకమూల పండుకొంటంది. అందుకని అద్దికావాలంటావా?"

"ఒకమూలనుంటం యేంఖర్మ, గదికి గదే యిచ్చేశావుగా."

"అయితే యేఁవంటా? నెలకొక యాభై పుచ్చుకుంటానంటావా!"

"ఎంతైతే యేఁ? కానీ జొతుంది! మనింటో వున్న తర్వాత యెక్కడికెళ్ళినా, మంతో చెప్పెళ్లాలిసిందే. రానీ; చెప్తా."

సోనా పనిచేస్తూందన్నమాటేగాని, సిలియానిగురించే ఆలోచిస్తోంది. ఒకనైపున భయం; మరోనైపున ఆశ. భయం యెక్కువ; ఆశ తక్కువ. వాళ్ళకి డబ్బొస్తాంటే యెందుకొద్దంటారు? చేదా! డబ్బున్నాళ్ళకే మరీనీ; యింకా సంపాదించాలనుకొంటారు. అందుట్లో మానఁగారికి— మహతోగారికి— మరీ ఆశ. పెళ్ళికొడుకు మంచాడే; ఐనా వాళ్ళ నాన్నమాట కాదంటాడా? ఐతే మాత్రఁవేఁ అనాల్సిన నాలుగుమాటలూ కుండ పగలగొట్టినట్టనేస్తేసరి; అంత డబ్బే కావాలనుకుంటే, వెళ్ళి డబ్బున్నదాన్నే చేసుకో. నేనుమాత్రం నిన్ను చేసుకోను.

మామగారే అంగీకరిస్తే, వెళ్లి ఆయన పాదధూళిని పుచ్చుకొని పూజిస్తుంది. సిలియాకు పొట్టనిండేట్లు మిఠాయి పెడుతుంది; గోవర్ యిచ్చివెళ్లినడబ్బు యింకా సోనాదగ్గరే వుంది!

ఇంకా సిలియా రాలేదేం? ఎంతదూరంవని. వాళ్ళిప్పుడే రానివ్వలేదేవోఁ! ఓహో! వచ్చేస్తాందే; ఏవిఁటి అంత నెమ్మదిగా వస్తాందేఁ? సోనాకు భయంవేసింది. వాళ్లొప్పుకోలేదేవోఁ. లేకపోతే పరిగెత్తుకొచ్చేదిగాదూ. సరేలే యిక సోనాని పెళ్లిచేసుకున్నట్టే! కాసుకూర్చో బాబు!!

సిలియా వచ్చింది; కాని సోనాదగ్గరకి రాకుండా హోరీ అప్పజెప్పినపని చేసేందుకని వెళ్లిపోయింది. ఎక్కడికెళ్లావని హోరీ నిలదీసి అడిగితే యేమని చెప్పాల్నాఅని భయపడి పోతోంది. సిలియా తిరిగి పని పూర్తిచేసుకుని వచ్చేవరకూ, సోనాకు పిచ్చెక్కిపోయింది. సిలియా రాగానే పరుగెత్తుకెళ్లి "యింతసేపెక్కడ చచ్చావే? చూచూచి కళ్లుకాయలు కాస్తేనూ!" అనడిగింది.

సిలియాకు కష్టంవేసింది. "ఐతే యేంవంటా? నేనక్కడికెళ్లి నిద్రపోయానంటావా? ఇట్టాంటి మాటలు నుంచున్నపళాన ఐపోవాలంటే ఐపోతయ్యా. వీలూచ్చుసుకోవద్దూ. పెళ్లి కొడుకు–మథుర్–అప్పుడే యేటికేసొత్తన్నాడు. ఎళ్లి నువ్వు చెప్పమన్న మాటలన్నీ చెప్పా. అబ్బో, యెంతుబ్బిపోయాడని. నాకాళ్ల మీదపడి 'సిల్లో! సోనాని నాకిస్తన్నారని తెలిసిందగ్గిర్నించీ,

కంటిమీద కునుకు పడితే వొట్టు. నాన్నెన్ని చెప్పినా వినడే. ఏంచెయ్యాలబ్బా ?' అన్నాడు."

"వాళ్ళ నాన్నినకపోతే నేనూ విన్న. నేనూ మొండి దాన్నే. అన్నంతపనీ అయ్యేంతర్వాతగాని తెలవదు"అన్నది సోనా.

"చెప్పేదినవేఁ మరి ? వచ్చే, వచ్చేవాడల్లా, యెనక్కి తిరిగి నన్నెంటపెట్టుకు నెళ్లాడా ళ్ళనాన్నదగ్గిరికి. బాగావున్నాళ్లులే; చెరుకుతోటేవుంది ఆరేడెకరాలు. ఎంతుంటే యేంలే ; ఆయన్ని చూత్తేనే నవ్వొచ్చింది నాకు. పాలేరుకంటే కనా కష్టంగా వుంటాడు చూట్టానికి. నాయిష్టం వొచ్చినంత పుచ్చు కుంటూ, యిచ్చేవాళ్లిత్తావుంటే మజ్జ నీగొడవేంటని కసురు కున్నాడాయన. 'డబ్బు కావాలనుకుంటే డబ్బు తెచ్చుకో ; అంతే! నేనుమాత్తరం పెళ్లిచేసుకో' నంటాడు కొడుకు. ఇట్టాగే మాటలు పెరిగిపోయిన్నై; ఆయనేఁవో పలుపుతాడుతీసి గొడ్డుని బాదినట్టు బాదాడు కొడుకుని. ఇంకెవళ్ళన్నా ఐతే అప్పుడే యెదురు తిరిగేవారు. కొడుకొక్క గుద్దుగుద్దితే అక్కడే నెత్తురుకక్కుకు చచ్చేవాడే ఆయన ! వఠి పీలమనిషికూడాను. కళ్ళ నీళ్ళుపెట్టుకునెళ్లిపోయాడు కొడుకు. ఇక ముసలాయన నామీద లేచాడు; నానా తిట్లూ తిట్టాడు. నాకేం పట్టింది; ఆయన తిడతాంటే వూరుకుంటానికి? నాకేంబయం ? సరేగాని; బాబూ యీ రొండొందల్తో నువ్వెందలాలూ యెక్కవు. మా హోరీబాబు చెడిపోడు. డబ్బివ్వాళో త్తంది; రేప్పోతంది. చచ్చేడుపుటాలెత్తినా

నీకొడుకట్టాంటి పిల్ల దొరకదు. ఏం వనుకున్నావోగాని,' అని కుండ పగలగొట్టినట్టనేసొచ్చేశా."

"అంతమాత్రానికే గొడ్డునిబాదినట్టు బాదాడూ" అనడిగింది సోనా, కళ్ళ నీళ్ళుబెట్టుకుంటూ.

సిలియా ఇంతవరకూ వొక రహస్యాన్ని దాచిపెట్టింది. కాని సోనా మొహంచూస్తే, ఆ రహస్యంగూడా బయట పెట్టేస్తేనే మంచిదనుకుంది.- "కాదులే; ఆ ముసలాయన గోవరన్నయ్య సంగత్తెచ్చాడు. 'తియ్యగా వుంటేనే యెంగిలని అనుకోకుండా తినేది; డబ్బివ్వకపోతే ఆ పాపం యెట్టాపోతంది?' అన్నాడు ముసలాయన. దానిమీద కొడుకేవోఁ 'అదేఁవన్న మాటలే; అన్నికుటుంబాలూ అంతే. కొందరు బయటికి పొక్కుతారు; కొందరు పొక్కరు' అన్నాడు ముసలాయన. ఒక మాదిగమ్మాయికి యిదివరకే యిలాకాపడ్డాడులే. ఆ అమ్మాయికి యిద్దరు కొడుకులుగూడాను. అందుకని కొడుకా మాటలంటాంటే కారం రాసుకున్నట్టయ్యిందిగాఁవన్ను; చెయ్యి చేసుకున్నాడు. ఉన్న మాటంటే వులుకెక్కునగాదూ."

సిలియా, సోనాలిద్దరూ యింటిముఖం పట్టారు. సోనా మనసానందంతో కేరింతలు కొడుతోంది. మథుర్‌నిగురించి తలచుకున్నప్పుడల్లా, అతని రూపమూ, కోపమూ ప్రత్యక్షమౌతూన్నాయి. అతని మూర్తిని హృదయంలో దాచుకుని, కన్నీటితో అభిషేకం చేయాలనిపిస్తోంది. దేవతలువచ్చి, పుష్పక విమానంలో యెక్కించుకుని, వినువీధిని తీసుకుపోతూన్నట్లనిపించింది.

ఆరోజు రాత్రే సోనాకు విపరీతమైన జ్వరం వచ్చింది.

మూడురోజుల తర్వాత ఏటవతలినుంచి మంగలి ఒక జాబు తీసుకొచ్చాడు:

'మహారాజ రాజశ్రీ హోరీ మహతోగారి దివ్యసముఖానికి, మీ వియ్యంకుడు గౌరీరాం చాయఃంగల విన్నపములు చేసి వ్రాయించుకునేదేమనగా, మనం ఇంతకుపూర్వం కట్నాన్ని గురించి ఆలోచించుకునే వున్నాం, గాని, తర్వాత తాపీగా పరిశీలించుకున్న మీదట ఈ కట్నాలవల్ల అటువారికీ, యిటు వారికీగూడానున్నూ బాధాకరమేనని తెలుసుకున్నవారము గాబట్టిన్నీ, వొకసారి సంబంధం కుదిరినతరువాత మీకూ, మాకూ యేవిధమైన భేదమూ వుంటానికీ వీల్లేదుకాబట్టిన్నీ, మీకు కట్నం యివ్వవలసిన అవసరం లేదనిన్నీ, మీకు కలిగినంతలోనే పప్పు భోజనాలు పెట్టినందువల్ల కూడానున్నూ, మాకెట్లాంటి అభ్యంతరమూ లేదనిన్నీ, మేమన్నివిధాలా సంతృప్తిపడి సంతోషించేందుకు సిద్ధంగా వున్నామనిన్నీ విన్నవించుకఃంటున్న వాళ్ళం.

ఇంతే సంగతులు.

చిత్తగించవలెను.

ఇట్లు,

గౌరీరాం మహతో.

ఉత్తరం చదువుకుని, గబగబా యింట్లోకివెళ్లి, ధనియాకుగూడ చదివి వినిపించాడు హోరీ. హోరీ వుత్సాహంగా వున్నాడు గాని, ధనియా యింకేదో విచారంలో మునిగి తేలుతూన్నట్లుంది. ఒకక్షణం ఆగి, "అదంతా గౌరీరాంగారి మంచితనం. మంచాడు కాబట్టి అట్లారాశాడు. అందుకని మనం

వూరుకుంటే నవ్వాలపాలవవూఁ? నలుగురూ యేఁవంటారు ! డబ్బాతుందని మర్యాదొదిలిపెట్టుకుంటావాఁ ? మనం యివ్వ గలిగినంతా మనం యివ్వాలిసిందే. ఎవడికోసం వుచ్చుకుం టాడు ! నువ్వుగూడా జవాబు రాయించెయ్యి. ఏఁ, తల్లిదండ్రుల సంపాదన్లో కూతురికిమాత్రం పాల్లేదేమిటి ? రాయించే దేఁవిట్లే, నేనే చెబుతా ఆ వుత్తరం తెచ్చిన మంగల్తో. పద!" అన్నది ధనియా.

హోరీకేమీ పాలుపోలేదు. గౌరీరాంగారు చూపిన సజ్జనత్వానికి బదులాఅన్నట్లు వుదారంగా ప్రవర్తించమంటోంది ధనియా. అట్లాగే మర్యాదచేసి, ధనియా సందేశం వినిపించి, మంగలిని సాగనంపాడు.

మంగలి వెళ్లిపోయింతర్వాత, "ఇదేవిఁటే ? నీబుద్దేవీఁ నాకు అంతుబట్టకుండావుంది. కాస్సేపు నేనే ముందంటావు; యింకాస్సేపేవోఁ వెనకాడతావుంటావు. నిన్నటిదాకా నేవోఁ చచ్చినా అప్పుచెయ్యొద్దు, ఋణంతేవద్దు అంటివి. దేవుఁడి దయంటూ, గౌరీరాంగారట్లాంటి వుత్తరం రాస్తే, వంశమర్యా దంటాంటివి ! ఆ దేవుఁడిక్కూడా తెలవదు నీ బుద్దెప్పుడేఁ వంటుందో" అన్నాడుహోరీ.

"అవతలాళ్ళనిబట్టే మనఁవూఁనూ. నిన్నటిదాకా గౌరీరాం బిగుసుక్కూర్చున్నాడు; యివ్వాళంటే దిగొచ్చాడు. ఒక మాటంటే నాలుగుమాటలన్నా తప్పులేదు; అంతేగాని చేయెత్తి ఆశీర్వదిస్తాంటే తిట్టటం తప్పుగాదూ?" అంది ధనియా.

"ఐతే యింకేఁ ఋణం పట్టుకురా; యెక్కడ్నుంచి తెస్తావో; చూస్తాను!"

"డబ్బు తేవటానికి నాకేం పట్టింది, నువ్వు బ్రతికుండగానే!" అన్నది ధనియా కళ్ళు తళతళలాడిస్తూ.

"కోమటమ్మదగ్గిరే పట్టుకొస్తా ఐతే."

"అక్కడే తెచ్చుకో. ఎవరిదగ్గిర తెచ్చినా, వడ్డీ తప్పేది లేదుగా. ఏరాయైతేయేంలే పళ్ళూడగొట్టుకుంటానికి."

వాకిట్లోకి వెళ్ళి, చుట్టముట్టించాడు హోరీ. శుభ్రంగా కట్నం గిట్నం యివ్వకుండానే, అంతా, వెళ్ళమారి పోయేదే! కాని ధనియా యెక్కడ వూరుకోంటుంది. ఎప్పుడు చూసినా, యేదోవొక పితలాటకం తెచ్చిపెడుతూనే వుంటుంది. ఇల్లు గడవటం యెంతకష్టంగావుందో ధనియాకిమాత్రం తెలియదూ? ఎప్పటికొస్తుందో బుద్ధి!

# 20

భోలా రెండోవివాహం చేసేసుకున్నాడు. భార్య లేకుండా బ్రదకటం దుర్భరమైపోయింది. కూతురు ఝునియా వున్నప్పుడంటే తండ్రికి కావలసిన మంచీ, చెడ్డా అంతా చూస్తూ వుండేది; వేళకింత అన్నంపెట్టేది. కూతురు వెళ్లిపోయింతర్వాత, అతని బ్రదుక్కి దిక్కూ, దివాణమూ లేకుండాపోయింది. కోడళ్ళున్నా, వాళ్లకి యింటి పనులే తెమలిచచ్చేవి కాదు; ఈయనకు సేవలూ, సపర్యలూ యేంచేస్తారు! అంచేతనే రెండోపెళ్లి చేసుకోవలసివచ్చింది. అదృష్టమా అంటూ, వయసులోవున్న విధవే దొరికింది; భర్త చనిపోయి యింకా మూడు నెలలుగూడా కాలేదు; ఒక బిడ్డ కూడాను. భోలా నోరూరింది. ఇంక ఆ పెళ్ళి కాస్తా ఐపోయేంతవరకూ నిద్ర పోలేదు.

ఇప్పటివరకూ ఆయింట్లో కోడళ్ళదే రాజ్యం. ఇష్టం వచ్చినప్పుడు చేసేవారు ; యిష్టమైంది తినేవారు. ఒక కొడుకూ, కోడలూ పట్నం వెళ్ళి పోయారు. అప్పట్నుంచీ రెండో కొడుకు పెళ్లామే యేలుతోంది యిల్లంతా. పాలూ, పెరుగూ చేతికి

జిక్కినంతా దొంగతనంగా అమ్ముకుని ముప్పై, నలభై రూపా యలు ముడి కట్టుకొంది ఐదారు నెల్లోనే. ఇప్పుడంటేయింకో అత్తగూడా వచ్చింది యింట్లోకి; అత్తగారి అదుపాజ్ఞల్లో వుండట మంటే కష్టమైపోయింది; ప్రతిరోజూ యేదోవొక చిల్లికజ్జాగా వుందిసంసారం. పోట్లాటలు పెరిగి, పెరిగి, వేస్లు పడేవరకూవచ్చింది. వేస్లుపడేప్పుడు తన్నుకోనటమూ, కొట్టుకోటమూ సాంప్రదాయ సిద్ధంగా వస్తూన్న ఆచారమే! భోలా యింట్లోగూడా ఆ ఆచారాన్ని పాటించవలసేవచ్చింది. కొడుకు పడుచువాడు గూడాను; తండ్రిగదాఅని యింతవరకూ గౌరవిస్తూ వచ్చాడు భోలాని. రెండోపెళ్లి చేసుకున్నతర్వాత యింకా మొదటి సంబంధం కొడుకుమీద తండ్రికేం హక్కుంటుంది? ఉంటుందని భోలా కొడుకు మాత్రం వొప్పుకోలేదు. నాలుగు తన్ని బయటికీడ్చాడు కొడుకు. ఇంట్లోవున్న వస్తువుల్ని ముట్టకోనివ్వలేదు గూడాను. ఊళ్లోవాళ్ళుగూడా యెవ్వరూ భోలాకొమ్ము కాయలేదు. రెండోపెళ్లి చేసుకున్నతర్వాత అతన్నందరూ వ్రలిపికట్టగా చూడటం మొదలుపెట్టారు. ఆ రాత్రి కేచెట్టుక్రిందో పడుకుని, తెల్లవారగానే నోఖేరాంగారి దగ్గరకు వెళ్ళాడు భోలా. వెళ్లి, తన గోడంతా చెప్పు కున్నాడు. నోఖేరాంకుమాత్రం భోలాఅంటే జాలేందు కేస్తుంది? ఐనా అతని వెనకనేవున్న, ఎర్రెర్రగా, పుల్లపుల్లగా వున్న ఆడదాన్ని చూచింతర్వాత మనసు మార్చుకున్నాడు నోఖేరాం. తన గొడ్ల పాకలోనే వొకమూల వుండమన్నాడు. గొడ్లని చూచేందుకూ, గడ్డి, గాదం చూస్తూండేందుకూ యెట్లాగూ వొక నమ్మకస్థుడు అవసరమే. మాసానికి మూడు

రూపాయలూ, రోజుకు శేరు వడ్లూ యిస్తానంటూ, భోలానే పాలేరుగా పెట్టుకున్నాడు.

పొట్టిగా, లావుగా, కుదిమట్టంగా, చామనచాయగా వుంటాడు నోఖేరాం. బారాంటి ముక్కు; చీమకళ్ళు. పెద్దతల పాగా చుట్టుకుని, మోకాళ్ళవరకూవుండే చొక్కా తొడుక్కుని, పలచటి పరుపొకటి కప్పుకుని తిరుగుతూంటాడు చలి కాలంలో. నూనెతో 'మాలీసు'చేయించుకోవటమంటే మంచి సరదా ఆయనకు; అందుకని బట్టలెప్పుడూ నల్లగా, నూనె కంపుకొడుతూంటాయి. ఆయనది చాలా పెద్దకుటుంబం. ఏడుగురు అన్నదమ్ములూ, వాళ్ళ పిల్లా జల్లా; అందరికీ యీయనే ఆధారం. దీనికితోడు తొమ్మిదోతరగతి చదువుతూన్న కొడుకు; ఆ కొడుకు చదువుకే జౌతోంది బొచ్చెడు ఖర్చు. జమీందారుగారిచ్చేది నెలకు పన్నెండురూపాయల జీతం. ఇంట్లో చూస్తే కనీసం నూరన్నా ఖర్చౌతుంది. అంచేత, రైతులాయనచేతిలో పడ్డారంటే, చెరకు నమలినట్లు నమలి, పిప్పి చేసి గాని వదలిపెట్టేవాడు గాదు. ఆరురూపాయలు జీతం వున్నప్పుడుగూడా రైతుల్నింతగా బాధించేవాడుగాదు. జీతం పన్నెండైన తర్వాతనే రైతుల్ని పీడించుకుతినటం యెక్కువైపోయింది. అందుకనేనేమో జమీందారుగూడా జీతం పెంచనిది!

మొత్తంమీద, వూళ్ళోవాళ్ళందరూ అతనంటే జడుస్తూనే వుండేవారు; చివరికి ఝింగురసింగూ, శాస్త్రీగూడా కాకాపడుతూండేవారు. పటేశ్వరిమాత్రం, అంతో యింతో లెక్కచెయ్యనట్లు కన్పిస్తుండేవాడు. 'నేను బ్రాహ్మణ్ణి.

కాయస్థులందరూ నాగుప్పెట్లో వున్నారు' అని నోఖేరాం అనుకుంటే, 'నేను కాయస్థుణ్ణి; కలం పట్టనేర్చినవాణ్ణి, నాముందు వీళ్ళందరూ బలాదూర్' అని పటేశ్వరి అనుకునేవాడు. అందులోనూ నోఖేరాంఅంటే జమీందారుగారి వుద్యోగి; పటేశ్వరి సూర్యుడ స్తమించని బ్రిటీషుసామ్రాజ్యానికి వుద్యోగి. నోఖేరాం ఏకాదశిచేసి ఐదుగురు బ్రాహ్మలికి విందుచేస్తే, పటేశ్వరి ప్రతి పౌర్ణమికీ, అమావాస్యకీ సత్యనారాయణ వ్రతంచేసి పదిమంది బ్రాహ్మలికి భోజనం పెట్టేవాడు. కొడుకుల చదువుల దగ్గర నుంచీ, వొకళ్ళ కొకళ్ళకి పోటీగానేవుండి; ఎవరి కొడుక్కి ముందు వుద్యోగం దొరుకుతుందో! ఇప్పటికి పటేశ్వరి కొడుకే ముందున్నాడు. మరో విషయంలోగూడా పటేశ్వరిదే పై చేయిగా వుంది; నీళ్ళుమోసే విధవావిడ నొకావిడని వుంచుకున్నాడనే ప్రతీతిగూడావుంది. ఇప్పుడతనితో తులతూగేందుకు తగిన అవకాశం నోఖేరాంకుగూడా కలిగొచ్చింది.

నోఖేరాం భోలాకు ధైర్యం చెప్పాడు — 'నువ్విక్కడే వుండవోయ్ భోలా. నీ కేంకావల్సినాసరే, వచ్చి నాతో చెప్పు; నీకేమీ యిబ్బంది లేకుండా చూడటానికి నేనున్నాగా. నీ కొచ్చిన భయం యేమీలేదు. మీయింటిదిగూడా వుందిగా? దానిక్కూడా యేదోవొకపని చూస్తాలే.'

'బాబూ! వొకసారి మా అబ్బాయిని పిలిపించి, గడ్డి పెట్టిచ్చండి. ఇల్లూ గిల్లూ కట్టాను, పాడి పశువుల్ని కొన్నాను, వాణ్ణొక యింటివాణ్ణి చేశాను. ఇంతాచేస్తే సిగ్గూ యెగ్గూ లేకుండా నన్నింట్లోనుంచెళ్ళగొడతాడూ? బుద్ధుండక్కర్లా? తప్పేరే యీ యవ్వారం తేల్చి పారెయ్యాలి?' అన్నాడు భోలా.

"నా మాట విను భోలా! ఇక వాడితో పోట్లాడి లాభం లేదు. వాడిని ఆ భగవంతుడే శిక్షిస్తాడు. ఈ ప్రపంచమే అట్లా వుంది. ఎక్కడ చూచినా అన్యాయంగానేవుంది; కాబట్టేగా యిదంతా నరకంఅని అందరూ అనేది. ఆ నారాయణ మూర్తంతా చూస్తూనేవుంటాడు; ఈ అన్యాయమ్మూ, అదీ అంతా చూస్తూనేవుంటాడు. ఈ క్షణంలో నువ్వేంవనుకుంటూంది గూడా ఆయనకి తెలుసు. అందుకనేగా అందరూ ఆయన్ని అంతర్యామనంటూ కొలుచుకునేది? నీ కెందుకు, నువ్వు మెదల కుండా కూర్చో. అంతా ఆయనే చూసుకుంటాడు; యిక్కడ గూడా నీకేమీ లోటులేకుండానే చేస్తాడు."

అక్కడినుంచి లేచి, హోరీ దగ్గరకు వెళ్లి, మళ్ళీ తన గోడంతా విప్పి చెప్పుకున్నాడు భోలా.

" ఈ కాలంలో పిల్లలమాటే చెప్పావ్; అందరూ అంతే! చచ్చిచెడి పెంచి, పెద్దాళ్ళని చేస్తే, యెదిగి మనమీాదే కాలుదువ్వుతారు. మా అబ్బాయిసంగతే చూడరాదూ. అమ్మతో పోట్లాడెళ్లి యిన్నిరోజులయ్యిందా; ఇంతవరకూ వుత్తరమ్మూ లేదు; పత్తరమ్మూలేదు. అమ్మా, అయ్యా చచ్చి పోయారనుకున్నాడో యేమో. అమ్మాయికి పెళ్ళీడొచ్చింది; వాడికి యేమీ పట్టినట్టేలేదు. పొలం తాకట్టుపెట్టి రెండొందలు పట్టుకొచ్చా; యేంచెయ్యను? " అన్నాడు భోలా.

భోలాని వెళ్ళగొట్టాడన్న మాటేగాని, తండ్రి వెళ్ళి పోయింతర్వాత గాని తెలిసిరాలేదు కొడుక్కి. ప్రొద్దున్నే లేచి కుడితి పొయ్యాలి. పాలు పితకాలి. పితికిన పాలు బజారుకు

తీసికెళ్ళి అమ్ముకోవాలి. మళ్ళీ వచ్చి, మళ్ళీ కుడితి, మళ్ళీ పాలు పితకటం! ఒకటా? ఒక వారం రోజుల్లో అబ్బాయిగారికి తెలిసివచ్చింది. భార్యా భర్తలకు పోట్లాటవచ్చింది. 'ఏం? చావటానికనొచ్చాననుకున్నావా నీయింటికి. నాకన్నం పెట్టంగూడా కష్టంగావుంటే, ఆమాటనేసెయ్యరాదూ; నాకన్నారింటికే పోతా!' అన్నది భార్య. నిజంగానే వెళ్ళిపోతుందేమో. వెళ్ళిపోతే అన్నంగూడా తానే వండుకోవాల్సి వస్తుందని భయపడిపోయాడు భర్త. భయపడిపోయి, ఒక పాలేరుని పెట్టుకున్నాడు. ఏం లాభం? చాటునా, మాటునా పాలమ్ముకోవటం సాగించా డానౌకరు. అందుకని వాడిని తీసేశాడు. మళ్లీ ఆరంభంవినవి భార్యాభర్తల కీచులాటలు. అలిగి, కన్నవారింటికి వెళ్లిపోయింది భార్య. ఇక తప్పక, భోలా దగ్గరకు వచ్చాడు కొడుకు. వచ్చి, "యేదో బుద్ది గడ్డితిని, తప్పు చేశాగాని, యింటికొచ్చి, నీయిష్టం వొచ్చినట్టే కానీ" అని తండ్రిని బ్రతిమాలుకున్నాడు.

ఇక్కడ డీపాలేక బ్రతుకుగూడా భోలాకు నచ్చటంలేదు. మొట్టమొదట వొక నెలవరకూ బాగానే గడిచిందిగాని, తర్వాత్తర్వాత నౌఖేరాం కాస్త నెత్తికెక్కాడుగూడాను; అప్పుడప్పుడూ మంచం వాల్చమని, పక్క వెయ్యమనిగూడా పురమాయిస్తున్నాడు. పాపం! భోలామాత్రం యేంచేస్తాడు; కానిరోజులు వచ్చినయి. అందుకని అన్నిటికీ తలవంచక తప్ప లేదు. సొంతయింట్లో వుంటే కొట్లాడుకున్నా, కాట్లాడుకున్నా అది వేరేసంగతి; ఈ వెట్టిచాకిరీ చేయవలసిన అగత్యం మాత్రం వుండదు.

వెళ్లి, భార్యతో ప్రస్తావించాడు. భార్య - నోహరి - "అక్కడ తన్నులు తిన్నొచ్చావు చాలదూ. మళ్లీ యేం మొఖం పెట్టుకెళ్తా అక్కడికి? సిగ్గు లేదూ నీకు?" అని చీవాట్లు పెట్టింది.

" ఇక్కడమాత్రం రాజ్యం యేలుతున్నాం వంటవే! " అన్నాడు భోలా.

"అంతిదిగా వుంటే నువ్వుపో. నేను మట్టుకు చచ్చినా రాను" అని బిగదీసుకుంది నోహరి.

భార్య వొప్పుకోదని భోలాకు మొదటే తెలుసు. అతని కింకా దృష్టి ఆనుతూనే వుంది; దేవుడింత బుద్ధిగూడా యిచ్చాడు. అందుకనే యిక్కడనుండి వెళ్ళిపోవాలని అత ననుకున్నది. తనమాట యెవ్వరూ ఆలోచించక పోయినా, తనభార్యమాట మాత్రం అందరూ వింటున్నారు. భార్యచెప్పే సమాధానం వింటే భోలాకి కోపం వచ్చింది. కాని యేం చేస్తాడు? భార్యని వదలి వెళ్ళిపోగల సాహసమే అతనికి వుంటే, నోహరిగూడా మారు మాటాడకుండా అతను చెప్పినమాట వినేదే. నోఖేరాంగూడా భోలా వదలేసెళ్ళిన భార్యని ఇంట్లో పెట్టుకునేందుకు తప్పకుండా సందేహించేవాడు. తడిక అడ్డం పెట్టుకుని వేటాడే మనిషిగాని, ధైర్యంచేసి ముందుకువచ్చే మనిషిగాదు నోఖేరాం. ఐతే యేం? నోహరికి భోలా లోతు పాతులు బాగా తెలుసు!

"అందుకే, మూర్ఖప్పట్టు పడతావ్! అక్కడికెళ్తే, కోడళ్ళు గూడా లేరా, అంతా నీ చేతిమీదగానే నడుస్తుంది. ఇక్కడీ పాలేరుబతుకు బతకటం గౌరవంవంటే?" అని బ్రతిమలాడాడు భోలా.

"నిన్నెళ్ళొద్దనలేముగా నేను. నీ కొడుకులు గాబట్టి నువ్వు తింటావేఁవోఁ తన్నులు; నాకేఁవవసరం? అంతకంటే యిక్కడే కూలీనాలీ చేసుకోటం బాగా వుంది నాకు" అన్నది భార్య.

గత్యంతరంలేక భోలా వెళ్ళలేదు. కొడుకు వెళ్ళి, ఎట్లాగో భార్యతో రాజీ పడ్డాడు. ఇక్కడ నోహరినిగురించి వూళ్ళో వాళ్ళందరూ గుసగుసలాడుతున్నారు: ఇవ్వాళ గులాబీ వన్నె చీర కట్టుకుంది. దానికేఁ! రోజుకొక కోక మారుస్తుంది. పోలీసే మొగుడైతే యింకా భయఁవెందుకు? ఏనా భోలా కళ్ళు పూడిపోయినయ్యా!

శేఖర్ అసలే పరిహాస ప్రియుడు; గ్రామానికంతటికీ విదూషకుడూ, నారదుడూగూడ అతనే. "ఊళ్లో యేది జరిగినా తెలుసుకుని తీరుతాడు. ఒకనాడు నోహరి హాల్లింటికి వెళ్లింది. శేఖర్ పరాచికం ఆడాడు. నోహరి వెళ్లి, నోఖేరాంకు చెప్పింది. శేఖర్‌ని రచ్చ చావడికి పిలిపించి, నానామాటలూ అన్నాడు నోఖేరాం. యేమీ చెయ్యలేక, ఏమంటే యేమౌతుందోనని, తలవంచుకు తిరిగివచ్చాడు శేఖర్.

ఒకనాడు పటేశ్వరీలాల్‌గారి బుద్ధిగూడా గడ్డితిన్నది. వేసవికాలం. తోటలోకూర్చొని మామిడికాయలు కోయిస్తున్నాడు లాలా. నిక్కుతూ, నీలుగుతూ వెళ్ళే నోహరి కన్పించింది. "యేఁవండోయ్ రాణీగారూ! కాస్త నిల్లారండి. మావిడికాయలు మహాఁతియ్యగా వున్నయి; వచ్చి పట్టికెళ్ళు" అని కేకేశాడు.

తనని గేలి చేస్తున్నాడనుకుంది నోహరి. ఈ మధ్య ఆవిడకి కాస్త గర్వంగూడ యెక్కింది. అందరూ తనను జమీం దారిణి అనుకోవాల్ననీ, గౌరవించాల్ననీ కోరుకుంటూంది గూడాను. గర్వం వున్న మనుష్యులికి, శంకలూ, సందేహాలూ యెక్కువగానే వుంటాయి. అందులో గుమ్మడికాయల దొంగ ఒకటికి పదిసార్లు తడుముకుంటాడు భుజాల్ని. నావంకచూచి అట్లా నవ్వుతాడెందుకు ? నన్నుచూచి అందరూ అట్లా కళ్ళల్లో నిప్పులు పోసుకుంటా రెందుకు? నేనెవర్నీ యేమీ యివ్వమని అడుగో లేదే. గ్రామంలోకి వచ్చింతర్వాత, ఎవ రికీ తెలియని రహస్యాలుగూడా నోహరికి తెలిసి వచ్చినై. ఈ పటేశ్వరిలాల్ సంగతిగూడ తెలుసు; నీళ్ళుమోసే విధ వావిడిని వుంచుకోలా? ఇంకా తననుచూచి, గేలి చేస్తా డెందుకు, తాను పెద్ద పత్తిత్తైనట్టు ! గొప్పవాళ్ళు కదూ. నోహరి అంటే బీదది; తక్కువ కులం. అంచేత అందరూ తేలిక చెయ్యాలని చూస్తారు. ఆవు చేలోమేస్తూంటే దూడ గట్టున మేస్తుందా? పటేశ్వరీలాల్ కొడుకు సిలియా యింటి చుట్టూ చక్కర్లు కొట్టలా ? అంటరాని ఆడవాళ్ళ కొంగులు పట్టుకు తిరుగుతూంటారు. పైన మాది అగ్రజాతి అంటూ కబుర్లు చెబుతారు !

" ఇంత దానం చెప్పొచ్చించీ బాబూ! ఆళ్ళనోళ్ళూ, యీళ్ళనోళ్ళూ కొట్టుకు తినేవాడివిగా. మా మావిడికాయ లివ్వొచ్చావుగాని యింకోకసారి నాజోలికొచ్చావంటే బాగా వుండదు; యిప్పుడే చెప్తుతున్నా" అన్నది నోహరి, అక్కడే నిలబడి.

ఓహో! గొల్లలకూడా యింత గర్వం ఐతే యెట్లా బ్రదికేది. నోఖేరాంని వలలోవేసుకుంది; దేశం అంతా యేలుతున్నట్లు మాట్లాడుతూంది. "మానిక్కు చూపిస్తున్నావే. ఇకెవ్వళ్ళనీ వూళ్ళోనే వుండనిచ్చేట్టులేవే! కాస్తనోరుదగ్గర పెట్టుకుని మాట్లాడు; యింత మిడిసిపాటు పనికిరాదు గాని" అన్నాడు పటేశ్వరీలాల్.

"ఐతే నీ యింటికెప్పుడూ అడుక్కోటానికి రాలేదే?"

"నోఖేరాం గనక ఆచావిడినీడ యివ్వకపోతే చచ్చినట్టు అడుక్కు తినేదానివి."

నోహరికి కారంరాసుకున్నట్లయింది. నోటికొచ్చినట్లు ప్రేలింది. నానాతిట్లూ తిట్టి, ఆకోపం విసురుమీదనే యింటికి వెళ్ళి, యింట్లో బోలీ, బొచ్చె, తీసి బయట పడెయ్యటం మొదలు పెట్టింది.

ఈ విషయం నోఖేరాంకు తెలిసి, గాభరాపడుతూ పరుగెత్తుకొచ్చాడు. "ఇదేం విం టే, అన్నీ అట్లా బయట పడేస్తావేం. ఎవరన్నా యేమైనా అన్నారా?" అనడిగాడు.

మగవాళ్ళని కనుసైగల్తో ఆడించే కళలో అందివేసిన చెయ్యి నోహరిది. ఆవిడ బ్రతుకంతా ఆ కళాభ్యసనంలోనే వెళ్ళి వారింది. నోఖేరాం చదువుకున్నవాడు. 'లా' గూడా తెలిసిన వాడు. మత గ్రంథాలు గూడ వల్లించటం వచ్చును. పెద్ద పెద్ద వకీళ్ళతోను, బారిస్టర్లతోను మాట్లాడినవాడు. ఐతే మాత్రమేం? ఎందుకూ పనికిరాని యీ నోహరి చేతిలో కీలుబొమ్మ ఐపోయాడు. కను బొమలు ముడిచి, "కానికాలం వచ్చింది; ఈగడప

తొక్కాను. అంతమాత్రాన మర్యాదొదిలిపెట్టుకోవాలని ఎక్కడుంది?" అంది నోహరి.

బ్రాహ్మడికి కోపంవచ్చింది. మీసాలు మెలివేశాడు. "నీవంకెవడైనా కన్నెత్తి చూశాడా? చెప్పు! వాడిగుడ్లు పీకేస్తా" అన్నాడు.

నోహరి నిప్పులో నెయ్యిపోసింది. "ఆపటేశ్వరీలాల్ యేదో వొకవంక పెట్టుకుని చాలూమాలూ లేని మాటలాడ తావుంటాడు. నేనేమైనా నీతితప్పిందాన్నా డబ్బులెగరేసి, కన్ను గిలపటానికి? ఊళ్లో యింతమందాడాళ్ళున్నారు; వాళ్ళ నెవళ్ళూ యేమీఁ అనరేఁ? అందరూ నామీద పడతారేఁ!" అన్నది.

నోఖేరాంకు పిచ్చెక్కినట్లయింది. లావాటి కర్రతీసికొని, భుజాన పెట్టుకుని, పెనుతుపానులా పరుగెత్తాడు మామిడితోట కేసి. వెళ్లి, పటేశ్వరీలాల్‌నిచూచి, "బైటికిరా, మగాడివైతే, గొయ్యితీసి గోతిలో పాతిపెడతా యేఁవనుకున్నావో. మళ్ళీ యెప్పుడైనా నోహరిని ఒక్కమాటనిచూడు, తెలుస్తుందిపస; నీ నెత్తురు కళ్ళజూస్తా. నీ పట్వారీ, గిట్వారీ పీకవతల పారే యిస్తా. అసలు నీకింత గర్వం యెక్కడ్నుంచొచ్చిందంట. ఆఁ? అంటూ గర్జించాడు.

పటేశ్వరీలాల్, కిక్కురుమనకుండా, తలవంచుకు కూర్చున్నాడు. జన్మలో జరగలేనంత అవమానం. ఒకసారి వూరవతల తాటితోపులో పట్టుకుని యెవళ్ళోగాని చితకబాడిచారుగాని, ఆ సంగతి వూళ్ళోకి ప్రాకలేదు. కాని యివ్వాళ వూరంతా వింటూండగా, చూస్తూండగా జరిగింది యీ అవమానం.

నిన్నగాక మొన్న వూళ్ళో అడుక్కునేందుకని వచ్చిన ఆడది, యివ్వాళ వూరంతటినీ గడగడ వణికిస్తోంది. ఏకై వచ్చి, మేకై కూర్చుంది. పటేశ్వరీలాల్ అంతటివాడు జొడు గుడిచి వూరుకున్నాడు !

నోహరి ఆ వూరికి రాణై పోయింది. ఆవిడని చూచి, రైతులు దారితప్పుకుంటున్నారు. ఆవిడగారిని కాస్త పూజించుకునేట్లయితే, నోఖేరాంతో పెద్దపెద్ద పనులుగూడా చిటికెలో చేయించేసుకోవచ్చుననే విషయం బహిరంగ రహస్యమై పోయింది. గ్రామంలో యే చిన్నపని వచ్చినాసరే - వేస్లు పడాలనుకున్నా, శిస్తు కట్టేందుకు వాయిదా కావాలనుకున్నా, గుడిసె వేసుకునేందుకూ, దడి కట్టుకునేందుకూ, బెత్తెడు నేల కావాలనుకున్నా నోహరిని సవరదీయవలసిందే; లేకపోతే అనుకున్నపని కాదు. చివరికి జమీందారుగారి యేజంటు గూడ, ఆడవినిచూచి భయపడవలసిన రోజులు వచ్చినయి.

ఆవిడని ఆశ్రయించుకుని వుండటం, కంటగింపుగావుంది భోలాకి. ఆడదాని సొమ్ము తినటంకంటే అధమంఐనపని లేదని అతని వుద్దేశం. నెలకు మూడురూపాయల జీతం అతనికి. ఆ డబ్బుగూడ అతనిచేతిలో పడటంలేదు; నోహరే కొట్టేస్తుండేది. పుగాకు కొనుక్కునేందుకుగూడా కాండబ్బుండేది గాదతని చేతిలో. నోహరిమాత్రం రోజుకు రెండణాల తమలపాకులే నములు తుండేది. ఎవర్ని చూచినా, అతనిమీద సవారీ చేసేవాళ్ళే: కట్టెలు పగలగొట్టమనీ, కావెడు నీళ్ళు తెమ్మనీ. ఇంతా కష్టపడి, యింటికివస్తే గుక్కెడు మంచినీళ్ళిచ్చేవాళ్ళు గూడా లేరు. ప్రొద్దుననగా వండిన అన్నం, పాచన్నం, రాత్రి

పూట తివవలసి వస్తోంది; అది గూడా, కూరానారా లేకుండా, గంజిలో కలుపుకుని, యింత వుప్పేసుకుని...

ఎంతకాలమని సహిస్తాడు? వెళ్లి, కొడుకుతో నేవుండి, కలిగిన కలోగంజో త్రాగటమే మంచిదని నిశ్చయం చేసుకున్నాడు. ఎంత కాదనుకున్నా సొంతయింట్లో వుంటం వేరు; పరాయి పంచకంటే యెప్పుడూ మెరుగే.

" అక్కడకొచ్చి, నేనెందుకు చాకిరీ చేస్తానూ! " అని రాగాలు తీసింది నోహరి.

" నిన్నురమ్మనెవరంటన్నారు? నేనెళ్తానంటన్నాగాని" అన్నాడు భోలా గుండె నిబ్బరంచేసుకుని.

-- " ఐతే నన్నిక్కడొదిలి పెట్టెళ్తావా! సిగ్గన్నా లేదూ నీ ముఖానికి? "

" సిగ్గొదలిపెట్టి చాలా రోజులయ్యిందిలే. "

"ఏం వనుకున్నావో గాని పంచాయితీని పిలిపించి, గడ్డి పెట్టిస్తా."

"ఇప్పుడు మాత్రం తక్కువ గడ్డితినిపించావంటలే. ఇంకా యెంతకాలం మూర్ఖాం వనుకుంటన్నా నాకళ్ళు?"

"అబ్బో! వల్లంతా నగలు దిగేసినట్టే మాట్లాడతన్నావే. ఈ బెదరింపులికీ, గదిరింపులికీ జడిసిపోతాననుకున్నావా!"

భోలా గబగబా లేచి, మంచానికానించిన కర్ర పుచ్చుకొని, బయల్దేరాడు. ఒక్కదూకుదూకి, వెళ్లి, అతని మణికట్టు లంకించుకుంది నోహరి. అంతబలంగా బిగించి, పట్టుకునేప్పటికి, భోలా విదిలించుకోలేక పోయాడు; ఖైదీలాగా అక్కడే కూర్చొ

బడిపోయాడు. బ్రదికున్న రోజుల్లో, భోలాగూడ ఆడవాళ్ళని అరచేతుల్లోఆడించినవాడే. ఇవ్వాళనంటే, అతనే ఒక ఆడదాని హస్తపాశాల్లో చిక్కుకుపోయాడు; బయటపడే శక్తిలేదు. గింజుకునీ, విదలించుకునీ గల్లంతు చేస్తే యింకోపదిమందికి తెలుస్తుంది; అంతే. లాభం యేమీ వుండదు. ఐనా భయమెందుకు? 'నువ్వంటే నాకు నచ్చటంలేదు. నిన్నొదలి పెట్టేస్తున్నా' అని అనవచ్చుగా? పంచాయితీ అని బెదరిస్తుందీ? 'పంచాయితీ అంటే నీకులేని భయం నాకేఁవిఁటి' అని అనగూడదూ?

కాని, యీ భావాలను మాటల్లో పెట్టేందుక్కావలిసిన సాహసంలేదు అతనిలో; నోహరిలో, యేదోగాని, అద్భుత వశీకరణశక్తి వుండి వుండాలి.

# 21

లాలాపట్టేశ్వరీలాల్ సామాన్యుడు కాదు; మహా పురుషుడు. పట్వారీలలోవుండే సద్గుణాలన్నీ ఆయనలోనే మూర్తీభవించినయి. అన్నదమ్ముల్లో ఒకరింకొకరి 'జాగా', అంగుళం ఆక్రమించుకున్నా సరే, చూస్తూ వూరుకోలేడు. ఎవరైనా ఆసామీ షావుకారుకివ్వాల్సిన బాకీ చెల్లించేందుకు ఆలస్యంచేస్తే సహించలేడు. గ్రామంలోవున్న సమస్తప్రాణుల హితం కోరటమే ఆయన పరమధర్మం. సంధులన్నా, రాజీ బేరాలన్నా ఆయనకు నమ్మకంలేదు. అవన్నీ నిర్జీవలక్షణాలు! జీవితానికి లక్షణం సంఘర్షణ; అంచేత ఆయన సంఘర్షణకు వుపాసకుడు! ఈ మధ్య, జీవితాన్ని మరింత వుల్లాసంగా గడపాలని బహుప్రయాసపడుతున్నాడు. అందులోనూ మంగ్రూ షావుకారంటే అవ్యాజానురాగం పుట్టుకొచ్చిందిమరీని. మంగ్రూ షావుకారు వూళ్లోకల్లా ధనవంతుడు; ఐనా స్థానిక రాచకీయాల్లో జోక్యం కలిగించుకునేవాడు కాదు. అధికారంకోసం, పరువు ప్రతిష్టలకోసం, ప్రాకులాడటం మానేశాడు. ఇల్లుగూడా వూరు బయట కట్టుకున్నాడు. అక్కడ ఒక చిన్నతోట వేయించుకుని, నుయ్యి త్రవ్వించుకుని, ఒక చిన్న శివమందిరంగూడా కట్టించుకుని

కాలక్షేపం చేస్తున్నాడు. పిల్లాజల్లా యెవరూ లేరు; అంచేత అప్పులివ్వటంగూడ తగ్గించేశాడు. చాలావరకు పూజా పునస్కారాలు చేసుకుంటూ, కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. చాలామంది ఆసాములు అప్పులెగ్గొట్టినా, కోర్టుల కెక్కడం అన్నమాట తలచకుండా వూరుకున్నాడు. హోరీగూడ వందన్నరవరకూ బాకీవున్నాడాయనికి; ఐనా యిస్తాడనీ, పుచ్చుకుంటాననీ, ఆశ లేకుండాపోయింది. ఒకటిరెండు సార్లు బెదరించాడు కాని, హోరీ పరిస్థితి చూచి, లాభం లేదనుకుని వూరుకున్నాడు. ఈ సంవత్సరం హోరీ పొలం బాగా ఏపుగా వుంది; రెండు మూడు వందలైనా కళ్ళ జూస్తాడని అనుకుంటు న్నారు వూళ్ళోవాళ్ళందరూ. పటేశ్వరీలాల్ మంగ్రూసాపు కారుదగ్గరకు వెళ్లాడు; ఇప్పుడు గనక దావావేశావంటే నీడబ్బంతా వచ్చేస్తుందని నచ్చజెప్పాడు. మంగ్రూ సాపుకారుకి దయ లేకపోవచ్చుకాని, కావలసినంత సోమరితనం వుంది. అంచేత యెందుకులే యీరభసంతా అనుకున్నాడు. కాని పటే శ్వరీలాల్ 'నీ కెందుకయ్యా! ఆ భారంవంతా నానెత్తిమీదే శేసెయ్యి, నేచూచుకుంటాగా, నువ్వు కచ్చేరీగ్గూడ రావద్దు' అనంటే కాదనలేక పోయాడు. కాలుకదిపే అవసరం లేకుండా బాకీ వసూలౌతూంది. సరే! దావా వెయ్యమని పటేశ్వరీ లాల్‌తో చెప్పి, ఖర్చులకని డబ్బుగూడా యిచ్చేశాడు. హోరీ కీసంగతే తెలియదు. దావావేశారు; డిక్రీ పొందారు. పైరు వేలం వేసేందుకని, అమీనా వచ్చింతర్వాతగాని హోరీకి తెలియలేదు. ఊరంతా ప్రోగయ్యింది పొలంగట్టుమీద. హోరీ, మంగ్రూసాపుకారు దగ్గరికి లగెత్తాడు. ధనియా,

పటేశ్వరీలాల్‌ని, పేరుపెట్టి తిట్టడం మొదలుపెట్టింది. ఇదంతా పటేశ్వరీలాల్ గూనుపుఠాణా యేననీ, ఆవిడబుద్ధి యిట్టే పసి కట్టేసింది. మంగ్రూ పూజామందిరంలో వుండటంచేత హోరీ కలుసుకునేందుకు వీలులేకపోయింది. ధనియా యెన్నితిట్లు తిట్టినా, పటేశ్వరీలాల్‌కు పోయేదేముంది? పైరు వందన్నరకు వేలం పాడేశారు. మంగ్రూసావుకారు పేరనే కొట్టేశారు. ఇంకెవ్వరూ మాట్లాడలేదు. శాస్త్రిగూడా పాటపాడదా మనుకున్నాడు గాని, ధనియా నోటికి జడిసి వూరుకున్నాడు.

"ఊళ్లో వాళ్ళ కొంపలిట్టానిలువునా కూల్చటం న్యాయ మేఁనా నీకని పటేశ్వరీలాలా నడిగిరారాదూ; అట్టా నుంచుంటా వెందుకు?" అని హోరీమీద కేకలేసింది ధనియా.

"నేనడగటానికూడా వీలుంచా నువ్వు; నువ్వు తిట్టిన తిట్లు వినకపోతేగా" అన్నాడు హోరీ దీనంగా.

"తప్పుడు పనులుచేసినాళ్ళకి తిట్టులు తగల్లవూమరి?"

"తిట్టింతర్వాత మనం చెప్పేమాట లెందుకు వింటారు. వాళ్ళు."

"నేనూ చూస్తాగా; నా చేనుగట్టెక్కమను!"

"మిల్లువాళ్ళొచ్చి పట్టించుకుపోతే నువ్వేంచేస్తావు? నేనేం చేయగల్ను. కావాలంటే నాలుగుతిట్లు తిట్టి, ఆనాలిక దురద వదిలించుకో."

"నాకంఠంలో వూపిరుండగానే నా చేనుకోసుకెళ్తారుగా?"

"ఆ! నువ్వూ నేనూ బ్రతికుండగానే కోసుకెళ్తారు. ఊరంతా యేకమైనా ఆపలేరు. ఇప్పుడాపైరు నాదికాదే పిచ్చిదానా! మంగ్రూసావుకారుది"

" మంగ్రూసావుకారు చేశాడా ఆసాగంతా కెక్కలిర గ్గొట్టుకుని ?"

" ఎవళ్ళుచేస్తేయేం; ఇప్పుడదంతా సావుకారు హక్కు భుక్తంలో వుంది."

పైరంతా సావుకారు వశమైపోయింది. దాంతోపాటు మరో క్రొత్త సమస్య వచ్చిపడింది. కోమటమ్మ అప్పిస్తానన్నది యీ పైరునుచూచే; ఇప్పు డేంతాకట్టుపెట్టుకుని యిస్తుంది అప్పు ? ఇదివరకటి బాకీయే వుంది రెండువందలదాకా. పైరు తీసుకుంటే పాతబాకీ వసూలైనట్లేగదాఅని కొత్తఅప్పుయిస్తా నన్నది; ఇప్పుడంటే? లగ్నంగూడా కుదుర్చుకున్నారు; తిథినిశ్చయ మైపోయింది. ఏటవతలి పెళ్ళివారన్ని యేర్పాట్లూ చేసేసుకునే వుంటారు. వివాహం కాకతప్పదు. హోరీకి గంగవెర్రులెత్తి నయి; వెళ్ళి కోమటమ్మ పీకనొక్కి, చంపివేద్దామన్నంత కోపం వచ్చింది. వెళ్ళి, ఎన్నివిధాల బ్రతిమలాడుకోవాలో, అన్నివిధాలా బ్రతిమలాడుకున్నాడు. ఐనా ఆరాతిబొమ్మ మనసు కరగలేదు. 'దులారీ ! నీ డబ్బు తీసుకుని, నే నెక్కడికీ పారిపోను. అంతతొందరగా చచ్చిపోనులే. పొలం వుంది, ఇల్లుంది, ఎదిగొచ్చిన కొడుకున్నాడు. నీడబ్బు కొచ్చిన భయమేమీ లేదు. నా మర్యాద కాపాడు తల్లీ, నీకు పుణ్యం వుంటుంది' అని వేడుకున్నాడు. కాని వ్యాపారాన్నీ, దయనీ కలగాపులగం చేసేందుకు దులారి అంగీకరించలేదు. వ్యాపా రానికి, 'దయ' పెట్టి పూత పూస్తే ఆవిడకేమీ అభ్యంతరం లేదు. కాని అమ్మో ! 'దయ'కు వ్యాపారం పేరు పెట్టటమే! ముమ్మాటికీ వీల్లేదు.

ఇంటికొచ్చి, "ఏం చేస్తావిక?" అన్నాడు హోరీ, ధనియాతో.

"నువ్వు కావాలనుకున్నట్టే అయ్యిందిగా" అని తిప్పి కొట్టింది ధనియా.

"తప్పంతా నాదే నంటావా?" అన్నాడు హోరీ బాధ పడుతూ.

" ఎవరి తప్పైతేయేం ? నువ్వు కావాలనుకున్నట్టే అయ్యింది."

"ఏతే పొలం తాకట్టుపెట్టమంటావా?"

"పొలం తాకట్టుపెట్తే, తరవాతేం జేస్తాం?"

"కూలో, నాలో."

కాని పంటగడ్డ అంటే యిద్దరికీ ప్రేమే. వాళ్ళ బ్రదుకూ, గౌరవమూ అంతా ఆగడ్డమీదనే ఆధారపడివుంది. పొలంలేని రైతేమిరైతు? కూలివాడితో సమానం.

"మరేం చేద్దామంటా ?" అన్నాడు హోరీ.

"అంటానికేంవుంది? పెళ్ళారొస్తే ఒకపూట అన్నం పెట్టి పంపిచ్చేద్దాం. లోకం నవ్వితే నవ్వనీ. మనంవంటే దేవుడికంత కచ్చిగావుంటే మనం వేంజేస్తాం!" అన్నది ధనియా.

అప్పుడే నోహరి- భోలా భార్య ఆదారిని బయల్దేరింది. హోరీని చూచి, కొద్దిగా, 'తొలుగు' వేసింది. వరుసకి వియ్యాపురాలు; హోరీ వియ్యంకుడు.

ధనియాకూ, నోహరికీ, పరిచయం యిదివరకే యేర్ప డింది. "ఎక్కడికి బయల్దేరా యియ్యాపరాలా! రాకూర్లో" అని పిలిచింది ధనియా.

నోహరి కెలాగో దిగ్విజయం గలిగింది కాబట్టి, ప్రజాభి ప్రాయాన్ని తన కనుకూలంగా మార్చుకోవాల్నని చూస్తూంది. వచ్చి, నిలబడింది.

ఆపాదమస్తకం వొకసారి పరీక్షగాచూచి, "యేం? యిట్లా దారితప్పొచ్చావు?" అనడిగింది ధనియా.

"ఆఁ. యేఁవీఁలేదు. మిమ్మల్నే చూచిపోదాఁవనొచ్చా. అమ్మాయి పెళ్ళెప్పుడు?"

"ఏఁవోఁనమ్మా. దేవుఁడి దయుండాలిగా"అని సంది గ్ధంగా మాట్లాడింది ధనియా.

"తిథిగూడా కుదిరిందనిన్నానే."

"ఆఁ. కుదిరినట్టేలే."

"నన్నుగూడా పిలుస్తారా పప్పన్నానికి?"

"నా బిడ్డ నీబిడ్డగాదూ? ఇంకా నిన్నుగూడా పిలవాలీ!"

"ఏఁవేం పెడతన్నారు? నన్నుగూడా చూడనియ్యి."

ఏమని చెప్పాలో తోచలేదు ధనియాకు. హోరీ కలి పించుకున్నాడింతలోనే, 'ఇంకా యేఁవీఁ సామాను తెప్పించ లేదు. ఐనా కుశకన్యాదానఁవేగా. సామానెందుకులే' అంటూ.

నోహరి నమ్మలేకపోయింది. "ఎంతలేదన్నా పెద్ద మ్మాయిగా. బాగానే చేస్తార్లెద్దూ పెళ్ళి" అన్నది.

ఉన్నవాళ్ళకేం తెలుస్తాయిలే లేనివాళ్ళకష్టాలు అన్నట్లు నవ్వాడు హోరీ.

" నీకుమాత్రం తెలవందేముంది? డబ్బుంటేగా బాగా చెయ్యడానికి?

" నువ్వూ, నీకొడుకూ, ఎంతమంది సంపాదించాలేంటి? చెబితే నమ్మేటట్టుండాలి."

" కొడుకంతమంచాడైతే యీ అనుకోటాలన్నీ యెందుకు? ఒక ఉత్తరంముక్కగూడా రాసి పడెయ్యటంలేదు; యింకా డబ్బేం పంపిస్తాడు? రెండేళ్ళౌతున్నయి; వొక్కఉత్తరం ముక్కగూడా రాసినపాపాన పోలేదు."

ఇంతలోనే సోనాగూడ ఎడ్లని తోలుకువచ్చింది. నెత్తిమీద పచ్చని గడ్డిమోపెట్టుకుని యౌవనం తొణికిసలాడుతూన్నా, బాలికలా అమాయకంగా వుంది. పచ్చిగడ్డి మోపక్కడే పడేసి, యింట్లోకెళ్ళింది.

"పిల్ల బాగానే పెరిగింది" అన్నది నోహరి.

"ఆడపిల్లలు పెరగటానికేంలే. తోటకూర కాళ్ళకిమల్లే వూరికేనే పెరిగిపోతారు" అన్నని ధనియా.

"పెళ్ళికొడుకు మంచాడేనా?"

"మంచాడేమరి. డబ్బుగూడా చేతికొస్తే యీ నెల్లోనే ముడేద్దామనుంది."

నోహరి లోతైన మనిషిగాదు. ఈమధ్య కొంత డబ్బుగూడా మూటకట్టింది; అంతడబ్బు తనదగ్గరుందని అందరికీ తెలియాలి; సోనా పెండ్లికని డబ్బిస్తే కీర్తిగూడ దక్కుతుంది. ఊరంతా చెప్పుకుంటారు. నోహరి దగ్గరకు యింత డబ్బు ఎట్లా

వచ్చిందాఅని అందరూ ఆశ్చర్యపోతారు; చాలా మంచిదని కూడా చెప్పుకుంటారు. ధనియా, హోరీ కలిసి యింటింటికీ వెళ్లి, తన మంచితనాన్ని వర్ణించి, వర్ణించి చెప్పుకుంటారు. ఊళ్లో తన గౌరవం యినుమడించుతుంది. ఇప్పుడంటే వూరంతా వ్యతిరేకంగా వుందిగాని, యీ సహాయంచేసిన సంగతి తెలిస్తే, హారతులు పడుతుంది. ఈఆలోచనలతో వుబ్బి, తబ్బిబ్బైపోయింది నోహరి.

"ఏదో కొద్దిగా కావాలంటే, నా దగ్గర పుచ్చుకుని పని జరిపేసుకోండి. తరవాత వున్నప్పుడే యిద్దురుగాని" అన్నది నోహరి.

భార్యా, భర్తలిద్దరూ తమచెవుల్ని తామే నమ్మలేక పోయారు; నోహరికేసి చూచారు. లేదు; నోహరి పరాచికం ఆడటంలేదు. ఆ యిద్దరి కన్నుల్లోనూ ఆశ్చర్యమూ, కృతజ్ఞతా, సందేహమూ, సిగ్గూ మిళితమైపోయినై. ఎంతచెప్పినా, లోకు లనుకున్నంతచెడ్డదిగాదు నోహరి.

"మీ గౌరవం పోయినా, నా గౌరవం పోయినా వొకటే. మిమ్మల్ని నవ్వితే నన్నునవ్వినట్టుగాదూ? ఇయ్యం కుడూ, యియ్యపురాళ్ళ చుట్టరికమాయిరి!" అని అన్నది మళ్ళీ నోహరి.

"నీ యింట్లో డబ్బుంటే నా యింట్లోవున్నట్టేగా. ఇంకెక్కడైనా దొరుకుతయ్యేమో చూస్తాను. బైటదొరికితే, యింట్లోవి కదిలించటఁవెందుకులే" అన్నాడు హోరీ సందేహిస్తూ.

"అంతగాక పోతే..." అంటూ సమర్థించింది ధనియా.

"అదికాదూ. ఇంట్లో డబ్బుంటే వీధినిపడి యెవరిస్తా రెవరిస్తారని, తిరగటం వెందుకు? బైట అప్పుతెచ్చుకుంటం వంటే మాటలా. వడ్డీ యివ్వాలి, నోట్సుబిళ్ళ కొనుక్కురావాలి; సాచ్చ్యాలు తేవాలి. రాసినాడి కివ్వాలి. ఇస్తానన్న వాడికాళ్ళు పట్టుకోవాలి. ఎందుకొచ్చిన సొద యిదంతా. ఆం. నా డబ్బు ముట్టుకోగూడదనుకుంటే, ఆ మాటేరు" అని, నేనూ మీకు కావలసినదాన్నేగా అన్నట్లు మాట్లాడింది నోహరి.

"ఛ; ఛ? అది కాదు నోహరీ! నువ్వు చెప్పేదీ నిజం వేననుకో. ఇంట్లో వుంటే, యింకొకళ్ళ దగ్గర చెయ్యి చాచటం వెందుకు? ఐనా మనలో మాట; ఈవ్యవసాయాన్నెట్లా నమ్ముతాం? నీకేవన్నా అవసరం వొస్తుందనుకో, నాదగ్గర డబ్బు లేకపోతే నీకూకష్టం వేస్తుంది; మేంవూం యిబ్బంది పడి పోతాం. అందుకనిగాని, లేకపోతే నీదగ్గర వుచ్చుకోటానికేం" అని, సర్ది చెప్పాడు హోరీ.

"ఇప్పుడు నాకేంవీం తొందర్లేదులే."

"ఐతే నీదగ్గరే తీసుకుంటాం. కన్యాదానం ఫలంగూడా, బయటివాళ్ళకి పోకుండా నీకే దక్కుతుంది!"

"ఏమాత్రం కావాలి?"

"నీదగ్గరెంతుందేవింటి?" 

"వందుంటే చాలా?"

హోరీ ఆశపడ్డాడు. దేవుండిదయుంటే యిట్లావుండాలి; గుంజగలిగినంతా గుంజుకోవటమే మంచిది.

" వందేవ్వుంటే వందతోనే జౌతుంది. ఐదువందలుంటే ఐదువందల్తో జౌతుంది. పిండి కొద్దీరొట్టె " అన్నాడు.

"నాదగ్గర రెండొందలున్నై. అంత మట్టుకిచ్చేస్తా నేను."

" ఇంకేం! దివ్యంగా సరిపోతుంది. ఇంట్లో బియ్యం గూడావున్నయి. సరేగానమ్మా నువ్వింత మంచిదానివనెప్పుడూ అనుకోలేదమ్మా. ఈరోజుల్లో యెవళ్ళ నెవళ్లాదుకుంటున్నారు. ఆదుకోవాలంటేమాత్రం శక్తెక్కడుంచి చచ్చింది? చల్లటివేళ తలుచుకోవాలమ్మా నీపేరు."

దీపాలు పెట్టేవేళయింది. కొద్దికొద్దిగా చలిగాగూడ వుంది. ధనియా లోపలికి వెళ్ళి, కుంపటి .తీసుకొచ్చి, దీపం వెలిగించింది. ఆదీపం వెలుతురులో ఆ కులుకులాడి నోహరి, సాక్షాత్తూ లక్ష్మీదేవిలా కూచ్చునివుంది. అప్పుడావిడకళ్ళల్లో సహృదయత మెరసిపోయింది; బుగ్గలమీద నునుసిగ్గు దొంతరలు గూడుకట్టుకున్నాయి; పెదవులమీద స్ఫ్రేరణ నృత్యంచేసింది.

ఇంకాస్సేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్న తర్వాత, ఇక వెళ్తొస్తానంటూ లేచి నుంచొంది నోహరి. "ఇవ్వాళెట్లాగో పొద్దుగూకిపోయిందిగా. రేపొచ్చి, పట్టికెళ్ళండి డబ్బు" అంటూ యింటి ముఖం పట్టింది.

"పద. నేనుగూడావచ్చి పంపిస్తా యింటిదాకా" అన్నాడు హోరీ.

"వద్దులే, కూర్చో, నే నెళ్ళగల్గునులే."

"అదేంవన్నమాట. నిన్ను భుజాల మీాదెక్కించుకెళ్ళి దింపిరావాలనిపిస్తాంటే."

నోఖేరాంగారి చావడి, వూరిబయట పెడగావుంది. అంచేత వూరిబయటదారంటే వెళ్ళవచ్చు; ఇద్దరూ కలిసి ఆదారినే బయల్దేరారు. నాలుగు వైపులా నిశ్శబ్దంగా వుంది.

"కాస్త ఆయన్తో మాట్లాడి మంచీ, చెడ్డా చెప్పరాదూ. నలుగుర్లో వుంటున్నప్పుడు తలలో నాలిక్కిమల్లే వుండకపోతే బదగ్గలుగుతుంవాఁ? చెప్పు. ఎవళ్తోచూంచినా వాకటే పోట్లాట. నువ్వేవోఁ నన్నింట్లో కూర్చోబెట్టి, తిండి పెట్టలేవాయె; నేనేవోఁ కూలికెళ్ళి నాలుగు డబ్బులు తేకా తప్పదాయె. బయటికెళ్ళింతరవాత యెవరితోనూ మాట్లాడకుండానూ, నవ్వకుండానూ వుంటే జరుగుతుందా? అదికాదు; నా వంకాళ్ళుచూశా రీళ్ళునవ్వారంటే నేనేంచేస్తానంట? నేనేఁవన్నా రాణివాసం చేస్తన్నానా యెవళ్ళూ నన్ను చూడకుండా వుంటానికి? ఏయెండకాగొడుగు పట్టాలి; తప్పుతుందా? మాతాతలు నేతుల్తాగారంటే యేవిఁటీ లాభం? ఈనాడు నెలకి మూడురూపాయిలు పుచ్చుకుని, పాలేరుతనం చేస్తన్నావా లేదా? వెనక్కి యెవళ్లో పోగాకడుక్కోవాలి అందలం బయట పెట్టరా అన్నాడంటలే! నేనుమాత్రం బదకలా? ఎప్పుడూ కుండెడు పాడుండేది మాయింట్లో; అందుకని యిప్పుడు కూలి చెయ్యనంటే గడుస్తుందా? ఆయనకిదేవీఁ యెక్కినట్టే కనబడదు. కాస్సేపు కొడుకుల్దగ్గిరి కెళ్తానంటాడు; కాస్సేపేవోఁ లక్నో పరిగెత్తుతానంటాడు. నాదుంప తెంపున్నాడనుకో" అన్నది నోహరి.

"ఆఁ. భోలా యెప్పుడూ అంతేలే. ఇంత పసితనఁవైతే యెట్లా! సరేలే. నేచెబుతాలే" అని సర్దేశాడు హోరీ.

"రేపొద్దున్నే వస్తావుగా డబ్బు పట్టికెళ్లటానికి?"

"మరి రాతకోతలు..."

"ఆఁ. సింగినాదవూఁ జీలకర్రానూ! నాకు తెలవదం టలే, డబ్బు తీసుకుని యెగేసే మనిషివికాదని."

ఇంతలోనే నోఖేరాంగారి చావడి వచ్చింది. నోహరి లోపలికి వెళ్లిపోయింది. హోరీ యింటికి మళ్లాడు.

## 22

గోవర్ తిరిగి పట్టణం చేరుకునేప్పటికి, యిదివరకతను కూర్చుని అమ్ముకునే చోట, ఎవరో కొత్తమనిషి వచ్చి కూర్చున్నాడు. ఇదివరకు గోవర్ దగ్గర కొనుక్కునే వాళ్ళందరూ, అతన్ని మరచిపోయినట్లున్నారు. మీర్జాగారి గుడిసెగూడ ఒక చిన్న పంజరంలాగా వుంది. ఝునియా ఆ గుడిసెలో కూర్చుని, ఏడుస్తూండేది. కుర్రవాడంటే వాకిట్లోనూ, బజారులోనూ తిరిగి ఆడుకుంటానికి అలవాటు పడ్డవాడు; ఇక్కడ యెక్కడికెళ్లి ఆడుకుంటాడు? గుడిసెముందొకగజంకూడా లేదు ఖాళీస్థలం. అందులోనూ కుళ్ళుకంపు. వేసవికాలంలో వుడకపోస్తూంటే బయటకొచ్చి పడుకునేందుక్కూడా వీల్లేదు. తల్లిని వదలి పెట్టి ఒక్క క్షణంకూడా వుండేవాడుగాదుకుర్రాడు. ఆడుకునేందుకెట్లాగూ వీల్లేదు; అంచేత అన్నం తినటమూ, పాలు త్రాగటమూగా వుంది వాడి దినచర్య. ఇంటిదగ్గరంటే, కాస్సేపు ధనియా, కొంతసేపు రూప, మరికొంతసేపు సోన, అప్పుడప్పుడూ పున్ని, హోరీ— యింతమందెత్తుకుని ఆడిస్తూ

వుండేవారు. ఇక్కడెవళ్ళున్నారు? ఝునియూ వొంటరిది; ఇంటి పని చేసుకోవటంతోనే తెల్లవారిపోతూంది ఝునియాకి.

గోవరంకేు పడుచుతనంలో పొర్లుతున్నాడు. సంతృప్తి చెందని కోరికలు, యింద్రియభోగం అనుభవిస్తేనేగాని చల్లారేట్లు లేవు. ఏపని చేసేందుకూ మనసు పోయేదిగాదు. అమ్ముకొస్తానని వెళ్ళి, గంటకూడా తిరక్కముందే తిరిగి వచ్చేసేవాడు. మనస్సును రంజింప చేసుకునేందుకు మరోమార్గమంటూ లేకుండాపోయింది. చుట్టుప్రక్కలుండే కూలీలూ, జట్కాబళ్లవాళ్లూ కూర్చుని, తెల్లవార్లూ జూదం ఆడుతూండేవారు. మొదట్లో గోవర్ కూడా ఆడేవాడేగాని, యిప్పుడు వాటిమీదకుకూడా మనసు పోవటంలేదు. ఇరవై నాలుగు ఘంటలూ ఝునియాతోనే కూర్చుని, నవ్వుతూ, త్రేలుతూ గడపాలని అతనికోరిక. కొద్దిరోజుల్లో ఝునియాకు కూడ విసుగెత్తిపోయింది; ఎక్కడికైనా, ఎవరూ లేనిచోటికివెళ్లి నిశ్చింతగా పండుకుని, నిద్రపోవాలనిపించేదావిడికి. కాని, ఆ ఏకాంతం ఎలా దొరుకుతుంది? గోవర్ మీద కోపంవచ్చేది. పట్టణవాసం యెంతో ఆనందంగావుంటుందని కలలుగన్నది; ఇక్కడి కొచ్చిచూస్తే యీ పాడుగుడిసె, తనూ తయారు. కొడుకును చూచినా చీకాకువేసేది. మరీ విసిగిపోయినప్పుడు, వాడిని బైటికినెట్టి, తలుపులోపల గొళ్లెంపెట్టేసుకునేది; వాడు బయట గుక్కపట్టి యేడ్చేవాడు.

గోరుచుట్టుమీద రోకటి పోటన్నట్లు, మళ్ళీ 'కడుపు' వచ్చింది. అన్నం అంటే యిష్టంలేకుండా పోయింది. ఏమూలనైనా ముడుచుకుని పండుకుంటే బాగుంటుందనిపించేది.

ఎవరితోనూ మాట్లాడకుండా, పలకకుండా పండుకోవా లనిపించేది. ఇంతలో గోవర్, తన కామాన్ని మోసుకొచ్చే వాడు; స్వాగతమిమ్మని తలుపుతట్టేవాడు. ఆమెళ్లో పాలచుక్కన్నమాట లేకుండాపోయింది; కాని, 'చిన్ని' పొట్ట మీదెక్కి సవారీ చేస్తుండేవాడు. దేహంతోపాటు, మనస్సు కూడా శుష్కించిపోయింది. చెయ్యాల్సని అనుకున్నపని చేసే ఓపిక లేదు. కాస్తనడుంవాలిస్తే చాలు, 'చిన్ని'వచ్చి ఆమెమ్మలు పీక్కుతినేవాడు. వాడి కిప్పుడు రెండేళ్లు; పళ్లుకూడ బాగా పదునుగా వచ్చినయి. నోట్లోకి పాలురాకపోతే, కోపం వచ్చి, గట్టిగా కొరికేవాడు; ఐనా వాడిని పొట్టమీదినుంచి దొర్లించే నోపికకూడా లేకుండా పోయింది ఝునియాకు. ఎప్పుడూ, ఆవిడకు, మృత్యువు కళ్ళముందు కట్టినట్లు కన్పించు తూండేది. భర్తన్నా, కొడుకన్నా ప్రేమలేకుండాపోయింది. ఎవళ్ళని చూచినా, బెల్లం వున్నప్పుడు వచ్చే చీమల్లా కన్పించే వారు. వర్షాకాలంలో కుర్రాడికి విరేచనాలజబ్బు పట్టుకుంది. ఆజబ్బుతో పాలొదిలేశాడు. 'అమ్మయ్య!'అనుకుంది ఝునియా. అనుకున్నదో, లేదో, వారంరోజుల్లో, 'చిన్ని' చనిపోయాడు. మళ్ళీ ఆ కన్నకడుపుకు పేగుతీపంటే యేమిటో తెలిసివచ్చింది; గుండె పగిలేట్టు యేడ్చింది.

కొడుకు చనిపోయి వారమన్నా కాలేదు; గోవర్ వచ్చి బలవంతం చెయ్యటం మొదలుపెట్టాడు. కోపం పట్టలేక పోయింది ఝునియా. 'నువ్వు మనిషివికాదు; పశువ్వి!' అని ఆక్రోశించింది.

'చిన్ని' చనిపోయాడన్నమాటేగాని, అతని రూపం కళ్ళకు కట్టినట్లు కన్పిస్తూనేవుంది ఝునియాకు. 'చిన్ని' బ్రదికున్నప్పుడు, తన కళ్ళముందు తిరుగుతూన్నప్పుడు, అతన్ని చూచుకుని ఆనందపడుతూండేదావిడ; కాని ఆ ఆనందంకంటే అతన్ని సాకేందుకు పడేకష్టమే ఎన్నో రెట్లెక్కువగా వుండేది. ఇప్పుడంటే, ఆ బిడ్డ జ్ఞాపకాన్ని యెంతో 'అత్తారుబతం' గా దాచుకుందావిడ; ఇప్పుడావిడ మనసులో ముద్రించుకున్న 'చిన్ని' రూపం యెప్పుడూ చిరునవ్వులు వొలకబోస్తూంటుంది. అతని ముఖం యెంతో అమాయికంగా, నిర్మలంగా కన్పిస్తూంటుంది. ఆబిడ్డ సౌశీల్యాన్నీ, చక్కని రూపాన్నీ తనవూహాబలంతో చిత్రించుకుంటూ, అనిర్వచనీయమైన ఆనందాన్ని, బాధకుప్రాణం పోసే ఆనందాన్ని అనుభవించుతూందావిడ; ఆ ఆనందంలో వాస్తవికతవల్ల కలిగే నల్లనినీడలు లేవు.

ఇప్పుడు కళ్లకు కట్టినట్లు కన్పించే 'చిన్ని', ఆవిడ తన హృదయంలో, యెంతో ఆప్యాయంగా దాచిపెట్టుకున్న బిడ్డకి ప్రతిబింబం! ఈ ప్రతిబింబానికి కాళ్లూ, చేతులూ, ముక్కూ, నోరూ లేవు; ఆ రూపం నిజమైనదీకాదు, స్థిరమైనదీకాదు. కాని ఆవిడ హృదయంలో దాచుకున్నరూపం నిజమైనదే; తన ఆశలతోనూ, శుభాకాంక్షలతోనూ ప్రాణం పోసుకుంటోం దారూపానికి. ఇదివరకు బిడ్డకు పాలిచ్చి పెంచింది; ఇప్పుడు తన రక్తాన్నే త్రాగించి పెంచుకుంటోంది.

ఆ గుడిసెఅంతా చీకటిమయం అనీ, ఎప్పుడూ దుర్గంధం కొడుతూండే చోటనీ, ప్రతిరోజూ పొయ్యిదగ్గర పొగలో ముక్కులు చీదుకుంటూ కూర్చోవలసి వస్తూందనీ, ఆలోచించు

కునేందుకా—వలసిన తీరికగూడా లేదు యిప్పుడావిడకు. చనిపోయిన బిడ్డను తలచుకుంటూ కూర్చుంటే, ఆవిడలో యేదో నూతనశక్తి ప్రవేశించినట్లుండేది. తన చుట్టూవున్న కష్టాలు అంటినట్లే వుండేవికావు. బ్రదికినంతకాలం బరువని పించాడు; చనిపోయినతర్వాత ఆవిడప్రాణాలకే ప్రాణమై పోయ్యాడు. గోవర్ తొందరగా వచ్చినా, ఆలస్యంగా వచ్చినా; అన్నం తిన్నా, తినకపోయినా, సంతోషంగావున్నా, విచారంగావున్నా ఝునియాకేమీ పట్టినట్లేవుండేదిగాదు. అత నేంసంపాదిస్తున్నాడో, యెంత ఖర్చుచేస్తున్నాడో తెలుసు కోవాలనికూడా వుండేదిగాదు. ఆవిడ జీవితమంతా అంతర్ముఖ మైపోయింది; బయటికొక నిర్జీవయంత్రంలా, రోజువారీ పనులు చేసుకుంటూ తిరుగుతోంది; అంతే.

ఆవిడ దుఃఖంలో పాలుపంచుకోగలిగితే, ఆవిడ అంతర్జీవి తంలో స్థానం సంపాదించుకోగలిగితే, ఆవిడదగ్గరకు వెళ్లగలిగే వాడే గోవర్; ఆవిడ జీవితానికి ముఖ్యాంగం కాగలిగేవాడే. కాని ఆవిడ బాహ్యజీవితంవొడ్డుకుమాత్రమే వెళ్ళేవాడతను. అంచేత అతనిదాహం తీరేదికాదు. నిరాశతో తిరిగి వెళ్ళి పోయేవాడు.

"ఎంతకాలంవని యిట్లాయేడుస్తూ కూర్చొంటావ్. 'చిన్ని' చచ్చిపోయి అప్పుడే అయిదునెల్లు దగ్గిరదగ్గిరౌతాంది" అన్నాడొకనాడు గోవర్.

"నాదుఃఖం నీకు తెలవదులే. నీ పన్నువ్వు చూసుకో. నన్నిట్లాగే వుండనియ్యి" అంటూ వుసూరుమన్నది ఝునియా.

"ఏడిస్తే వస్తాడా వొకసారి చచ్చిపోయినాడు?"

ఏమని జవాబుచెప్పాలో అర్థంకాలేదు ఝునియాకు. వెళ్ళి వంటపని చేసుకోవటం ప్రారంభించింది. గోవర్ ది యింత పాషాణ హృదయంఅని అనుకోలేదావిడ.

గోవర్ యిట్లాంటిప్రశ్నలు వేసినకొద్దీ, ఝునియా మరింత ముడుచుకొనిపోయేది; తన బిడ్డరూపాన్ని మరింత పదిలంగా దాచుకునేది. 'చిన్ని' పూర్తిగా తనవాడే. ఇంత వరకూ 'చిన్ని' రూపంలో కొంతభాగం గోవర్ హృదయంలో వుండిపోయిందేమోననుకునేది. ఇప్పుడాబిడ్డ పూర్తిగా తనవాడే!

చిల్లర అమ్మకాలలో లాభం కన్పించలేదు; గోవర్ వెళ్ళి పంచదారమిల్లులో పనికి కుదిరాడు. మొట్టమొదటి మిల్లులో బాగా లాభాలురావటం మొదలుపెట్టేటప్పటికి యీ రెండో మిల్లుకూడ కట్టించాడు మిస్టర్ ఖన్నా. మిల్లులో పనికి ప్రొద్దున్నేలేచి వెళ్ళాలిసొచ్చేది. సాయంత్రం దీపాలు పెట్టే టప్పటికి తిరిగొచ్చేవాడు. ఇంటికొచ్చేప్పటికి ప్రాణాలు పోయి నట్లుండేది. ఇంటిదగ్గరుండి పనిచేసేప్పుడుకూడా బాగానే పని చేస్తూండేవాడు. అయినా అలిసిపోయినట్లుండేదేగాదు. మధ్యమధ్య నవ్వుతూ, ప్రేలుతూ మాట్లాడుకునేందుకు అవ కాశం వుండేది. కాస్త అలుపుకలిగినా; నాలుగుచోట్ల తిరిగి నలుగురితో మాట్లాడుతూంటయ్యూబాన అలుపు కలిగినదన్నస్పృహే వుండేదిగాదు. పనెంతచేసినా, మనసు స్వచ్ఛందంగా వుండేది. న్యాయానికి మిల్లులో పెద్ద కాయకష్టం చేస్తూన్నదీ లేదు. ఐనా ఆ ఎంజిన్ల రొదలో, కోలాహలంలో తిరగాలంటే ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని

తిరగాల్సి వస్తోంది. అదీగాక, యెప్పుడెవ రేం అంటారోనని దుడుకు. కూలివాళ్ళందరికీ అట్లాగేవుండేది. కల్లో, సారాయో త్రాగి, కష్టాన్నీ, అలసటనీ మర్చిపోవాలని ప్రయత్నించేవారు. గోవర్ కుకూడా త్రాగుడు అలవాటైపోయింది. ఎప్పుడో ప్రొద్దుపోయింతర్వాత, తప్పత్రాగి వచ్చేవాడు యింటికి. వచ్చింతర్వాత యేదో వొంకవంకపెట్టుకుని ఝునియాని నానా బూతులూ తిట్టేవాడు; కొట్టుకుని గుమ్మం బయటికి లాగేవాడు; మరీ కోపంవస్తే నాలుగుతన్నేవాడు.

నన్ను వుంచుకోబట్టేగదా, నామీాదిట్లా కోపం చూపించుతున్నాడని అనుకునేది ఝునియా. పెళ్ళిచేసుకుంటే తన్నట్లా అవమానించటానికి గుండా, చెరువా? ఒకేళ గోవర్ లెక్కచెయ్యక పోయినా, యిరుగుపొరుగు వూరుకునేవాళ్లా? వచ్చి అతనికి బుద్ధిచెప్పేవారు; వినకపోతే వెలేసేవారు. ఎంత పొరపాటు జరిగిపోయింది! ఈ మోసగాడిని నమ్ముకుని, వచ్చింది యిల్లొదిలిపెట్టి; నలుగురిలోనూ నవ్వులపాలయ్యింది.

గోవరంటే లెక్కలేకుండాపోయింది ఝునియాకి. అతను తిండి తినకపోయినా లక్ష్యపెట్టేదిగాదు. తాను తినకపోయినా లెక్కచేసుకునేదిగాదు. గోవర్ కొడుతూన్నప్పుడు, కత్తిపీట తీసుకుని, అతని గొంతు పరపరా కోసిపారేస్తే బాగుంటుందనుకునేది. రోజులు గడుస్తూన్నకొద్దీ, బ్రతకటమే దుర్భరమై పోతోంది. ఇక యీ యింట్లో బ్రదికుంటానికి ఆస్కారం లేకుండా పోతోంది. ఇంక తన మంచిచెడ్డ లెవళ్లు చూస్తారు? ఇట్లాగే యింకా నాలుగురోజులు గోవర్ తో తన్నులుతింటూ కూర్చుంటే యిక నరకమనేది చూడక్కర్లేదు.

ఒకనాడు నీళ్ళకని, పంపుదగ్గరకెళ్తే "యేఁవేఁ? ఎన్నో నెలా?" అనడిగింది పొరుగావిడో కావిడ.

ఝునియా సిగ్గుపడిపోయింది. "ఏఁవోఁ పిన్నీ, లెక్క చూసుకోలా" అన్నది.

ఆ పొరుగావిడ నల్లగా, లావుగా, పొట్టిగా, కుదిమట్టంగా వుంటుంది, పెద్దపెద్ద బొమ్ములూ, ఆవిడాను. భర్త జట్కా బండి తోలుకుంటూంటాడు. భార్య కట్టెలదుకాణం పెట్టుకుని కట్టె లమ్ముకుంటూంటుంది. ఝునియా అప్పుడప్పుడూ వెళ్ళి కట్టెలు కొనుక్కు తెచ్చుకుంటూండేది. అదే పరిచయం.

నవ్వి, "చూస్తే దగ్గిర పడినట్టే వుంది. రేపో, మాపో; మంత్రసానితో చెప్పకపోయా" అంది ఆవిడ.

"నేనిక్క డెవళ్నీ యెరగనే" అన్నది ఝునియా, భయపడిపోయి.

"నీ మొగు డెట్టావున్నాడూ? మంచీచెడ్డా చూసుకోనక్కర్లా? మరీ అట్టా చెవుల్లో నూనేసుకూర్చుంటే యెట్టా?"

"ఊఁ నేనంటే లెక్కంట్లే ఆయనికి?"

"అంతేలే. నేనుమాత్రం చూట్టం లేదంటలే. నువ్వు పురిటి మంచఁ వెక్కితే యెవళ్ళోవాళ్ళుండొద్దూమరి యింటోపనిచూట్టానికి? అత్తలూ, ఆడబిడ్డలూ లేరూమరి నీకు?"

"అందరూ చచ్చిపోయారని యెప్పుడో అనుకున్నా."

కుళాయిదగ్గర కూర్చొని, బిందె తోముకుంటూంటే, భయమేసింది ఝునియాకు. ప్రసవిస్తే? గుండె దడదడ కొట్టుకుంది.

—'ఊс. అయ్యో దేవుఁడా! సరేలే. చస్తేచస్తాను. అంతేగా. పీడొదిలిపోతంది. ఈనరకంఁవన్నా తప్పతుంది.'

సాయంత్రానికి నొప్పులువచ్చినై. కష్టకాలం వచ్చిందని తెలిసింది. ఐనా అట్లాగే, చెమటలుకారుతున్నా లెక్క-చెయ్య కుండా, పొట్టొక చేత్తో పట్టుకుని, పొయ్యిరాజేసి, పొయ్యిమీద కుండ యెక్కించింది. తర్వాత యిక కదల్లేక, అక్క-డే, పొయ్యి ముందు పడిపోయింది కూర్చున్నది కూర్చున్నట్లు. ఎప్పుడో రాత్రి పదింటికొచ్చాడు గోవర్ తప్పత్రాగి. ఆమత్తులో ఒకటే వాగుడు వాగుతున్నాడు - 'నాకు లెక్కేంటి. ఎద్దైతే పడుం టాడు. అంతేగాని, నేను పడుండకే, నన్ను పుట్టిచ్చిన అమ్మా, అయ్యా లంటేనే పడ్లేదు నేను. ఆళ్ళిళ్ళమాటలు పడకేం! జమా దారంట జమాదారు. కళ్ళురుంతున్నాడు. నలుగురూవచ్చి పట్టు కోకపోతే తెలిసేది మజాఖా. పచ్చినెత్తురు తాగేవాణ్ణి. రేపు చెప్తా వాడిపని. అంతగ్గాకపోతే వురేస్తారు. అంతేగా? నాకేం లెక్క! నడుం సిటారుగా పెట్టి మీసాలు మెలేసుకుంటా, పకపకా నవ్వుతా, ఎక్క-తా వురికంబం. నాకేంబయం? ఛీ! యేంజాతిరా బాబూ యీ ఆడజాతి. వకెదవజాతి! పొయ్యిమీదకుండపెట్టింది, కాళ్ళారజాపి పడుకొంది. మొగుడొస్తాడు; అన్నాం పెట్టాలన్న మాటలేదు. పోనీ, చావనీ ముండని. ఏడిపించనీ, యిష్టం వొచ్చిన ట్టేడిపించమను. ఆ దేవుఁడే చూస్తాడు. నే నూరు కన్నా దేవుఁడూరుకోడ్లే!'

గోవర్ ఝునియాని లేపలేదు; పలకరించనుగూడా లేదు. మెదలకుండా వెళ్ళి, వసారాలో పండుకున్నాడు. తెల్ల వారుఝామున చలివేసింది. కంబళి తెచ్చుకుందామని లోప

లికి వెళ్ళాడు. ఝునియా దగ్గుతోంది. బాధతో మూలుగు తోంది. అప్పటి కతనిమత్తుగూడా దిగిపోయింది. "ఏవిఁటే! యేఁవన్నా నొప్పిగా వుందా?" అని అడిగాడు.

"ఆఁ. కడుపులో నెప్పి చంపేస్తాంది."

"నువ్విందాకే చెప్పలేదేవేఁ? ఇప్పుడెక్కడికి కెళ్తాను?"

"ఎవర్తో చెప్పను?"

"ఏఁ. నేను లేనూ? చచ్చిపోయాననుకున్నావా."

"నేను చచ్చినా, బతికినా వొకటేగా నీకు."

గోవర్‌కు గాభరా యెత్తింది. వెళ్ళి మంత్రసానిని పిలు చుకువస్తే? ఇప్పుడు వెళ్ళి, రమ్మంటే వస్తుందా? ఇంట్లో డబ్బు గూడా లేదు. సాయంత్రమే చెబితే యెక్కడో వొకచోట నాలుగైదురూపాయలు చూచేవని. ఇదివరకెప్పుడు చూచినా చేతిలో యాభై అరవై రూపాయలు కనబడుతుండేవి. ఏమంటూ యీమె అడుగుపెట్టిందో యెర్రని యేగానీగూడా లేకుండా పోయింది.

ఇంతలోనే యెవళ్ళో పిలిచారు, "యేఁవయ్యోయ్! మీా ఆవిడ మూలుగుతాందల్లే వుందే? నొప్పులొచ్చినై య్యా?" అంటూ.

ఇందాక, పంపుదగ్గర మాట్లాడినావిడే పిలిచింది. గుజ్జానికి దాణావేద్దామని లేచిఁది. ఝునియా మూలుగులు వినబడి, యేమిటో తెలుసుకుందామని వచ్చింది.

వసారాలోకెళ్ళి, "కడుపులో నెప్పిగా వుందంట. ఓ కొట్టు కుంటాంది. ఇక్కడెక్కడన్నా మంత్రసాని దొరుకుతుందా?" అని అడిగాడు గోవర్.

"నేను సాయంత్రం చూచినప్పుడే అనుకున్నా. జంగీర పేటలో వుంటంది మంత్రసాని. ఒక్కడుగేసి పిల్చుకురా. తొందరగా రమ్మను. నువ్వొచ్చేదాకా నేనుంటాలే యిక్కడ."

"నేనెప్పుడూ చూడలేదే. ఎక్కడుంటంది?"

"సరే. నువ్విక్కడ కూర్చుని విసురుతూవుండు. నేవెళ్లి పిల్చుకొస్తాలే. ఎవళ్లో శాస్త్రం చెప్పినట్టు యెందుకూ పనికిరా రీమగాళ్లు. తినమంటే తింటాయింత? మంత్రసాని యిల్లుగూడా తెలవదూ?" అంటూ బయలుదేరిందావిడ.

వెళ్ళి, పదినిమిషాల్లో తిరిగివచ్చింది— 'యికీలోకంలో బీదా, బిక్కీ బదికే పారవేలేదు. లంజాముండ; ఐదురూపాయా లిస్తేనేగాని కదలనంటాంది. తరవాత రోజు కెనిఁవిదనాలంట. పన్నెండోనాడు కోకపెట్టాలంట. ఓసి నీమొఖాన బూడిద పొయ్యా అనొచ్చా. ఆపనేఁవిఁటో నేనే చూచుకుంటాలే. పన్నెండుమంది బిడ్డల్ని కన్నా; నాకూ తెలుసులేవే అనొచ్చా. సరేలే బాబూ. నువ్వొట్టా వసారాలోకెళ్ళు. అంతా నేను చూచుకుంటాలే. అవసరఁ వొచ్చినప్పు డాదుకోకపొతే ఇంకా మనిషి మనిషై పుట్టటఁ వెందుకు?'

అని, వెళ్ళి ఝునియాదగ్గర కూర్చొని, పొట్ట నిమురుతూ, "నిన్ను చూడగానే అనుకున్నా. నిజం చెప్పనా? అప్పుణ్నుంచీ అదేయూవనుకో. కంటిమీద కునుగ్గూడా పళ్లేదు. నీకుమాత్రం యెవళ్ళున్నార్లే యిక్కడ" అన్నది.

ఝునియా అపరిమితంగా నొప్పులు పడుతోంది.— "ఇక బ్రదకను పిన్నీ, నే నీబిడ్డ కావాలని యేఁవొచ్చినా? ఒకణ్ణి పెంచి పెద్దాణ్ణిచేస్తే దేవుడొచ్చి యెత్తుకొనిపోయే. మళ్ళీ కాను

ఎందుకు రావాలి చెప్పు. ఒకేళ నేం చచ్చిపోతే, యీబిడ్డని నువ్వే పెంచాలి పిన్నీ" అంటూ ఆపసోపాలు పడుతోంది.

"అదేంటమ్మా, ధైర్యంగా వుండాలిగాని, యిట్టా అధైర్యపడిపోతే యెట్టాచెప్పు. ఇంకొక్క క్షణం వోర్చుకుంటే కష్టందాటి బయటపడిపోతావు. మాటన్నా అనకపోతివి. అంత సిగ్గెందుకమ్మా. నాతో చెబితే మీర్జాసాయబుగారిదగ్గిరి కెళ్ళి తాయెత్తు పట్టుకొచ్చేదానిగా" అంటూ, తల నిమురుతూ ధైర్యంచెప్పింది పొరుగావిడ.

తరువాత ఝునియా స్పృహ లేకుండా పడిపోయింది. ఉదయం తొమ్మిది గంటలయ్యేప్పటికి ఝునియా మళ్ళీ కళ్ళు తెరచింది. చూస్తే బిడ్డనెత్తుకుని కూర్చునివుంది పొరుగావిడ. తన చీరగూడ మార్చి, వుతికినచీర కట్టింది. శరీరంలోవున్న రక్తంఅంతా యెండిపోయినట్లు వళ్లంతా బలహీనంగావుంది.

పొరుగావిడ ప్రతిరోజూ వుదయంవచ్చి, ఝునియాకింత చేసి, పెట్టిపోతూవుండేది. తర్వాత రోజుకి నాలుగైదుసార్లువచ్చి, బిడ్డకు పోతపాలుపట్టి వెళ్తూవుండేది. బిడ్డపుట్టి నాలుగురోజు లైనా, యింకా ఝునియారొమ్ముల్లో పాలుపడలేదు. బిడ్డ గుక్కపట్టి ఒకటే యేడవటం; పోతపాలు అరగటంలేదు. ఒక్క నిమిషంగూడా వూరుకోవటంలేదు బిడ్డ. పొరుగావిడ తన రొమ్ములు తీసి, బిడ్డ నోట్లోపెట్టేది. ఒక్కనిమిషం చీకిచూచి, పాలు రాకపోయేప్పటికి మళ్లీ యేడుపు లంకించుకునేది శిశువు; బిడ్డ ఎండిపోతున్నాడు. ఝునియాకింకా పాలు పడలేదు. పొరు గావిడ గాభరాయెత్తిపోయింది. వెళ్లి, ఎవరో వొక డాక్టర్ని పిలుచుకువచ్చింది. డాక్టరువచ్చి "ఈ అమ్మాయి శరీరంలో

రక్తం లేదు; పాలు ఎట్లావస్తాయి. మంచి పుష్టికరమైన ఆహారం తీసుకుంటేనే గాని వంటికి రక్తంపట్టదు" అని చెప్పాడు. ఎన్ని నెలలు తినాలో మళ్ళీపాలుపడేందుకు, అప్పటిదాకా యీ పసిగుడ్డెట్లా బ్రదుకుతాడు? ఎండి పుల్లై పోడూ!

ఝూం(ప్రొద్దుపోయింది. త్రాగివచ్చి, వసారాలో పండుకున్నాడు గోవర్. బిడ్డని సముదాయించుదామని వచ్చి, అతనికి రొమ్ములందించి కూర్చున్నది పొరుగావిడ. బిడ్డ కాసేపు చీకింతర్వాత పొరుగావిడ రొమ్ముల్లోకి పాలొచ్చినట్లైంది. "చూడవే ఝునియా. ఇక నీబిడ్డ బదుకుతాడే. నాకు పాలు పడినై" అన్నదావిడ.

ఝునియాకు ఆశ్చర్యంవేసింది. "ఏఁవిఁటే, నీకు పాలుపడినయ్యా?"

"నిజంగానే!"

"నేన్నమ్మలేను తల్లీ."

"చూడిట్టా."

రొమ్ములుపిండి చూపింది. పాలధార ఝుఁమ్మంటూ బయటికొచ్చింది.

"మీ కడసారమ్మాయికి ఎనిమిదో యేడొచ్చిందను కుంటానే" అన్నది ఝునియా.

"ఆ. యెనిమిదేళ్ళు."

"ఈమధ్య మళ్ళీ కానుపులు రాలేదుగా?"

"అదే కడసారిది. తరవాత రొమ్ములెండిపోయినై. అంతా దేవుడి మాయలే. కాకపోతే మరిదేవిఁటి!"

ఆనాటినుండి, ప్రతిరోజూ నాలుగైదుసార్లు వచ్చి, పాలిచ్చి వెళుతూండేది పొరుగావిడ. ఆవిడ ప్రాలుత్రాగటం మూలంగా బిడ్డగూడా పుట్టటం పీలగానే పుట్టినా, దుండు ముక్కలా తయారయ్యాడు. ఒకనాడు స్నానానికని నది కెళ్ళింది పొరుగావిడ. ఆకలేసి, గుక్కపట్టి యేడుస్తున్నాడు బిడ్డ. ఝునియా భుజంమీదేసుకుని, నిద్రపుచ్చాలని విశ్వ ప్రయత్నంచేసింది; లాభం లేకపోయింది. ఇంతలోనే స్నానాని కనెళ్ళిన పొరుగావిడ తిరిగొచ్చింది. వచ్చి, బిడ్డను తీసుకో బోయింది. "ఏం వొద్దులే. చచ్చిపోయినాబాగుండును పీకొదిలి పోతంది. ఎందుకొచ్చిన గొడవ" అంటూ విసురుకుంది ఝునియా.

తటపటాయించిపోయింది పొరుగావిడ. కాస్సేపున్న తర్వాత బిడ్డని పొరుగావిడవళ్ళో కూర్చోబెట్టింది ఝునియా.

ఝునియాకూ, గోవర్‌కూ యిప్పటికీ పడటంలేదు. గోవర్ పట్టిమోసగాడనీ, పబ్బంగడుపుకునే సజ్జనీ, తనని ఒక విలాసవస్తువుగా భావిస్తున్నాడనీ, తాను చచ్చిపోతేగూడ కళ్ళంట నీరుబెట్టుకోడనీ అనుకుంటోంది ఝునియా. అతని కోరికలు తీరుస్తూంటే చాలు. తాను చచ్చిపోతే, యింకోదాన్ని తీసు కొచ్చి యింట్లో పెట్టుకోవాలని అనుకుంటున్నాడేమో. ఆ పప్పు లేమీ వుడకవు. ఎరక్క పప్పులోకాలేసింది. అప్పుడేమో 'నువ్వే నాప్రాణం' అంటూ తిరిగేవాడు. ఇక్కడి కొచ్చిందగ్గ ర్నుంచీ పూర్తిగా మారిపోయాడు. చలికాలం వచ్చింది. పక్కకూ లేదు; కప్పుకునేందుకూ లేదు. ఎప్పుడైనా రెండో, మూడో మిగిలేట్లుంటే వెళ్ళి, కల్లుముంతకు అప్పగించి వస్తూంటాడు.

తాతలనాటి పసుపాకటుంటే, దానిమీదనే పడుకుని, నిద్రపో తున్నారు యిద్దరూనూ. అంత దగ్గరగా పండుకుంటూన్నా, ఎన్నో క్రోసులదూరంలో వున్నట్లుగా వుంటున్నారు!

బిడ్డ నెత్తుకుని ఆడించాలనీ, ముద్దులాడాలనీ, గోవర్ ప్రాణం కొట్టుకుపోతుంది. ఒక్కోసారి, అర్థరాత్రికాడలేచి, బిడ్డ ముఖంచూచి, గుటకలు మింగుతూ ఆనందిస్తూంటాడుగూడాను. ఐనా ఝునియాను చూచి, దగ్గరకువెళ్లేందుకు వెనుకంజ వేస్తాడు; తటపటాయిస్తాడు. ఝునియా అతనితో మాట్లాడటంలేదు; అతనికి కావలసినవి అందివ్వదు, చేయదు. వాళ్లిద్దరిమధ్యావున్న యీ మాలిన్యం ఆనాటికానాటికి గట్టిపడి, పెద్దదై, ఒక పెద్ద వుక్కుగోడలా తయారయింది. ఒకళ్లనొకళ్లు, అనుమానంగా చూచుకుంటున్నారు; మంచిమాటన్నా చెడ్డర్థాలు తీసు కుంటున్నారు. ఇక ఆ మాటలకు చిలవలూ, పలవలూ వేసుకుని, రాత్రింబగళ్లదే ఆలోచనలతో, లేనిపోని అర్థాలు కల్పించుకుని, బాధపడుతున్నారు. వేటకుక్కల్లా వొకళ్ళ మీది కొకళ్లు దూకేందుకు సంసిద్ధంగా వున్నారు.

ఇంట్లోమాట యిట్లా వుంటే, అక్కడ, మిల్లులో గొడవగూడా అంతంతగానే వుంది. ఈసారి బడ్జెట్లో పంచదార మీద డ్యూటీ యెక్కువచేసింది ప్రభుత్వం. కూలీలజీతం తగ్గిం చాలని చూస్తూన్న మిల్లుయజమానులకి చక్కని అవకాశం చిక్కింది. డ్యూటీమూలాన ఐదురూపాయల నష్టంవచ్చేట్లుంటే, కూలీలకూలి తగ్గిస్తే పదిరూపాయలలాభం సంపాదించుకో వచ్చును. అన్ని మిల్లుల్లోలాగానే యీ మిల్లులోగూడ గందర గోళం ప్రారంభం ఐంది. కూలీలు సమ్మెచేసేందుకు సిద్ధంగా

వున్నారు. అసలే దినభత్త్యాలన్నీ ప్రియమైపోయినై. జీతాలు హెచ్చించకపోతేనే బ్రదకటం కష్టమైపోతూంటే, హెచ్చించటం మాటట్లావుంచి, అసలుకే ముప్పుతెచ్చి, జీతాలు కోసేస్తామంటే, తగ్గిస్తామంటే ఎట్లావూరుకుంటారు కూలీలు? మిర్జాఖుర్షేద్ కార్మిక సంఘానికి అధ్యక్షుడు. కార్యదర్శి 'బిజలీ' పత్రికా సంపాదకుడు పండిత ఓంకారనాథ్. మిల్లు యజమానులకు బుద్ధి వచ్చేట్లుగా ఒకసారి సమ్మెచేసి చూపించాలనని అనుకుంటూన్నారు అందరూ. సమ్మెదారులందరికీ ముందునిలబడ్డాడు గోవర్. అసలే కాస్త దుందుడుకుస్వభావం వున్నవాడు. యజమానుల్ని బెదరించితేనేగాని పనిజరిగేట్లులేదు. చావంటే గూడ భయపడని మనిషి గోవర్.

అక్కడికీ, ఒకనాడు, గుండె రాయిచేసుకుని, భర్తకి నాలుగుమాటలు చెప్పాల్లనుకుంది ఝునియా. "పెళ్ళాంబిడ్డలున్నాడివి. ఇట్లా అగ్గిలో దూకితే యెట్లా?" అని హెచ్చరించింది గూడాను. గోవర్‌కు కోపంవచ్చింది— "మధ్య నువ్వెవరివే మాట్లాట్టానికి? నే న్నిసలహా అడగలేదే!" అంటూ లేచాడు. ఇట్లాగే మాటకి మాట పెరిగింది; జుట్టుపట్టుకుని యిష్టం వచ్చినట్లుతన్నాడు ఝునియాని. ఇంతలోనే పొరుగావిడ పరుగెత్తుకొచ్చింది. వచ్చి, ఝునియాను విడిపించి, గోవర్‌ని కోప్పడింది. అసలే కోపంగావున్నాడేమో, పొరుగావిడ మాటలు వింటూంటే పిచ్చెక్కినట్లయింది. "నిన్నెవ్వడు రమ్మన్నాడు నాయింటొకి. ఫో. అవతలికి ఫో!" అంటూ వురిమాడు కళ్ళెర్రజేస్తూ.

"అవున్నాయనా! నీయింటికి రాకపోతే నాగ్గడవదు గాదూ? అందుకనొస్తన్నానీయింటికి! నువ్వుపెట్టే దాంతోనే నిండుతుందాయె నాకడుపు!" అంటూ యెత్తిపొడిచి, "నేనొచ్చి ఆదుకోకపోతే, యివ్వాళ నువ్వు తన్నాలకున్నా, యీ పెళ్లాం వుండేదికాదు యేఁవనుకున్నావో! తెలుసా?" అంటూ [illegible] వేసింది.

"నా యింటికి రావద్దని చెప్తుతాంటే [illegible] అసలు నువ్వే నేరిపావు దీనికింత గీరవాణం" అం[illegible] తాడా అన్నట్లు, బిడికిలి బిగించాడు గోవర్.

పొరుగావిడ అదురూ, బెదురూ లేకుండా, [illegible] బడింది. "ఇక వాళ్లే, పూరుకోవయ్యా; యెవళ్ళన్నా[illegible] నవ్విపోతారు! అసలే చచ్చిసగంనై పోయిన పెళ్లాన్ని కొట్టి నంతమాత్రాన పెద్ద మగాడివై పోతాననుకున్నావా? యేఁ, యెందుకు పడాలి ఆఅమ్మాయి నువ్వుకొట్టేదెబ్బలు? గోమా తంటిది కాబట్టి సరిపోయింది. ఇంకొకత్తైతే చీపురుకట్ట పుచ్చు కుని తిరగబడేది, తెలుసా?" అన్నది.

ఈ గల్లంతంతా విని, యిరుగుపొరుగు వాళ్ళింకోపది మంది ప్రోగయ్యారు. నలుగురూనాలుగు చీవాట్లు పెట్టారు గోవర్ని. వాళ్ళందరూగూడా, ప్రతిరోజూ, చీకటి పడ్డతర్వాత, తలుపులికి లోపల గొళ్ళేలు పెట్టి, పెళ్లాల్ని తన్నే పెద్దమనుష్యులే! ఐతేనేం? ఈపూటమాత్రం న్యాయమూ, ధర్మమూ చెబుతున్నారు. పొరుగావిడకు మరింత ధైర్యం వచ్చింది. "చూశారాబాబూ! నాగడప తొక్కొద్దంటన్నాడు. పెళ్ళాపిల్లూ, బిడ్డలూ వుండగానేసరా? ఎట్టా నిభాయించుకోవాలో

తెలవొద్దూ? నేనేగనక లేకపోతే యీ పసిగుడ్డేనై పోయేదో మీరే అడగండి. పెళ్లాన్ని కొట్టి మొగతనం చూపిత్తాడంట, మొగతనం. నేనే అవ్వాల్సింది యితగాడిపెళ్ళాన్ని, మజా చూపించేదాన్ని! చెప్పుతీసి, చేతపట్టుకుని, నెత్తిమీద బొచ్చూ ... కొట్టేదాన్ని. ఇంటోనుంచి, బరబరాలాగి, బయటికి ... లుపు గెడేసుకునేదాన్ని. అప్పుడు తెలిసొచ్చేదీ అంటూ లేచింది.

... విసురుకుంటూ, మిల్లులోకి వెళ్లిపోయాడు. ఆ ... ఆడదై పోయింది; మగాడై తే చెప్పేవాడు దానితో చూట్లాడేంలాభం! పోట్లాడేం లాభం!

మిల్లులో అసంతృప్తి ... జరగా పెరిగిపోతోంది. కూలీలు, 'బిజలీ' పత్రిక జేబుల్లో పెట్టుకుని తిరుగుతున్నారు. అవకాశం చిక్కినప్పుడల్లా, యిద్దరుముగ్గురు కలిసి చదువుకుంటున్నారు. పత్రిక అమ్మకం బాగా పెరిగింది. కూలీల నాయకులు 'బిజలీ' పత్రిక కార్యాలయంలో సమావేశమై, అర్థరాత్రివరకూ చర్చలు సాగిస్తూండేవారు; సమ్మెకు అవసరమైన స్కీము తయారుచేసేవారు. మరునాడు వుదయం యీ వార్తలు పేపర్లో పెద్దపెద్ద అక్షరాల శీర్షికలతో ప్రత్యక్షమయ్యేవి. జనం అంతా విరగబడి, కొనుక్కుని చదువుకునేవారు. అసలు ధరకి రెండు మూడు రెట్లు ఖరీదుకుగూడ అమ్ముడుపోయేవి ప్రతులు. అటు చూస్తే మిల్లు యజమానులుగూడ కాచుకుకూర్చున్నారు. సమ్మె జరగటంవల్ల వాళ్లకి లాభమే గాని, నష్టం లేదు. కూలీలు దొరకరనే చింత లేదు. దేశంలో నిరుద్యోగం తాండవిస్తూంది. ఇప్పుడిచ్చేకూలిలో సగంయిచ్చినా, 'మహా

భాగ్యం' అంటూ వచ్చేవాళ్ళు కావలసినంతమందున్నారు; కావలసినంత లాభం! ఈ సమ్మె హడావుడిలో వారం, పది రోజులు మిల్లు పనిజేయకపోయినా ఫర్వాలేదు. చివరికి 'కూలి తగ్గించబడింది' అని ప్రకటించేస్తేనే మంచిదనే నిర్ణయానికి వచ్చారు యజమానులు. ఏ రోజున, యెప్పుడు ఆ ప్రకటన చేయాలోగూడా నిర్ణయమైపోయింది. పోలీసుకి కబురందజేశారు. కాని కూలీల కీసంగతి తెలియదు. వాళ్ళ యావలో వాళ్ళున్నారు. సరుకు తక్కువగా వున్నప్పుడూ, డిమాండెక్కువగా వున్నప్పుడూ చూచి, సమ్మెచేయాల్నని చూస్తూన్నారుకూలీలు.

ఒకనాటి సాయంత్రం కూలీలందరూ, పనులు ముగించుకుని, యిళ్ళకువెళ్ళబోతూన్నప్పుడు, మిల్లు డైరక్టర్లు తమ నిర్ణయం ప్రకటించారు. అప్పుడే పోలీసులుగూడ వచ్చేశారు. గోదాంలో కావలసినంత సరుకు నిలవవుంది. ఎంత డిమాండున్నా, ఆరుమాసాలవరకూ యజమానులు ఫికరు పడవలసిన అవసరంలేదు. ఈ సంగతులన్నీ కార్మికులకూ్కడా తెలుసు. ఐనా కార్మికులు సమ్మెచేయక తప్పేట్లు లేదు.

ఈ వార్తవిని, కార్మిక సంఘాధ్యక్షుడు మీర్జా ఖుర్షేదొక చిరునవ్వునవ్వాడు; శత్రువు రణ కౌశల్యంచూచి ముగ్ధుడయ్యాడాఅన్నట్లు నవ్వాడు. ఒక్క క్షణంమాత్రం ఆలోచించి, "సరే! మిల్లు యజమానులే కోరుకుంటున్నారుగదా సమ్మె కావాల్నని. అట్లాగే కానిద్దాం. పరిస్థితులన్నీ వాళ్లకే అనుకూలంగా వున్నై. ఐతేనేం? న్యాయం మన పక్షానుంది. బయటివాళ్ళని తీసుకొచ్చి పనిచేయించుకోవాలని వాళ్ల వుద్దేశం. అట్లా బయటినుంచి యెవళ్లూ రాకుండా చూట్టం మనవంతు.

దానిమీాదే మనజయం ఆధారపడి వుంటుంది" అన్నాడు ఖుర్షేద్.

వెంటనే, 'బిజిలీ' పత్రికా కార్యాలయంలో, అత్యవసర సమావేశం జరిగింది. కార్యవర్గం సమావేశం అయ్యింది; ప్రతినిధుల్ని యెన్నుకోవటం గూడా జరిగింది. రాత్రి ఎనిమిది ఘంటలకు ఒక పెద్దవూరేగింపు బయల్దేరింది. రాత్రి పదిఘంటలకు బహిరంగ సభ జరిగింది. ఆసభలోనే మర్నాటి కార్యక్రమంగూడా నిర్ణయింపబడింది. ఏవిధమైన హింసా పూర్వక కార్యక్రమమూ జరుపగూడదనే హెచ్చరిక గూడా యివ్వటం జరిగింది.

మర్నాడు యజమానులు బయటివాళ్ళని తీసుకొచ్చి మిల్లుగేటులో నిలబెట్టారు. ఇదంతా చూచేప్పటికి సమ్మెచేసే కార్మికులికి శివమెత్తినట్లయ్యింది. రోజు కేయాభైమందో కొత్తవాళ్ళొస్తారని అనుకున్నారు కార్మికులు. వాళ్ళని నయానో, భయానో, నచ్చచెప్పో, బెదరించో, పంపించెయ్యవచ్చనుకున్నారు. అసలు సమ్మెజేసే వారినందర్నీ చూస్తేనే వచ్చినవాళ్ళు భయపడి పారిపోతారనుకున్నారు. అనుకున్నది జరగలేదు; తలక్రిందులైంది. ఈ క్రొత్తవాళ్ళందరూ మిల్లులో ప్రవేశిస్తే, ఇక, రాజీబేరాలు సాగించేందుకుగూడా వీలుండదు. ఏది యేమైనాసరే, వాళ్ళు మిల్లులోపలికి వెళ్ళకుండా చెయ్యాలి. ఇక దౌర్జన్యమూ, గలాటాతప్పితే గత్యంతరం లేదు. కొత్తవాళ్ళుగూడా పోట్లాటకి సిద్ధంగా వున్నట్టే వున్నారు. వాళ్ళూ పాపం, యింతవరకూ, ఆకటితో అలమటిస్తున్నారు; యిప్పుడు కూలి చేసుకునేందుకు ఆదరువు దొరి

కింది. చేతికి చిక్కిన యీ అవకాశం జారవిడుచుకునే కంటే, ఆకలితో మాడిచచ్చేకంటే, పిల్లాజల్లా ఆకలితో యేడుస్తూ కూర్చుంటే చూచేకంటే, యిప్పుడే, అటో యిటో తేల్చేసుకోవటం మంచిదని అనుకుంటున్నారు కొత్తగా పనిలో ప్రవేశించేందుకు వచ్చినవాళ్లుగూడా. సరే. తోపిడి. గలాటా. కొట్లాట. 'బిజిలీ' పత్రికా సంపాదకుడు యెప్పుడు జారుకున్నాడో, పత్తాలేకుండా పోయాడు. ఇక పోతే మిర్జా సాహెబ్‌గారికి బలంగానే తగిలాయి దెబ్బలు. ఆయనగారిని కాపాడాలని వెళ్ళిన గోవర్‌కింకా బాగా తగిలాయిగాయాలు. మిర్జా అంటే పహిల్వాన్ గాబట్టి, దెబ్బలు కాచుకోగలిగాడు. గోవర్ పల్లెటూరివాడు. దెబ్బలు కొట్టటమే తెలుసుగాని, దెబ్బలు తగలకుండా కాచుకోవటం చేతగాదు. గోవర్ చెయ్యొకటి విరిగి పోయింది; తలమీదగూడా గట్టిదెబ్బ తగిలింది; పగిలిందిగూడాను తల. ఇక అక్కడే కుప్పకూలినట్లు కూలిపోయాడు. పడింతర్వాతగూడా కర్రలవర్షం పడింది వీపు మీదా, భుజాలమీదనూ. వళ్ళంతా పిండిగొట్టినట్లైపోయింది. అతను పడిపోవటంచూచి, సమ్మెచేసే వాళ్ళందరూ పారిపోయారు. గట్టివాళ్లుమాత్రం పది పదిహేనుమంది మిర్జాకు కాపలా కాస్తూకూర్చున్నారు. క్రొత్తగా వచ్చినకూలీలు, విజయపతాక నెగురవేస్తూ మిల్లులోపలికెళ్ళారు. సమ్మెదారులు గాయపడ్డవాళ్ళ నందరినీ హాస్పిటల్లోకి చేర్చటం ప్రారంభించారు. కాని హాస్పిటల్లో మాత్రం ఆ గాయపడ్డవాళ్ళనందరినీ చేర్చుకునేందుకు చోటెట్లా వుంటుంది? మిర్జా సాహెబుకు

మాత్రం హాస్పిటల్లో ఖాళీదొరికింది. గోవర్‌కి పట్టీలు మాత్రం కట్టి, యింటికి పంపించేశారు.

వులకని, పలకని గోవర్ శవాన్ని చూసి ఝునియా నిలువునా కంపించిపోయింది; ఆవిడలోని స్త్రీత్వం మేలుకొన్నది. ఇంత వరకూ ఆవిడ దృష్టిలో అతడొక బలమైన మగవాడు; ఆవిడమీద అధికారం చలాయించేవాడు, బెదరించేవాడు, తిట్టేవాడు, కొట్టేవాడు. ఇప్పుడో ? కదలలేడు, నిస్సహాయుడు, అతన్ని చూస్తే జాలికలుగుతోంది. అతని మీదికి వంగి, కళ్ళ నీళ్ళు బెట్టుకుంటూ, పరీక్షగా చూచింది ఝునియా. ఇంట్లో పరిస్థితిని తలచుకుంటూ, అతని వంకచూస్తూంటే ఒక విధమైన యీర్ష్య, కోపమూ కలిగాయి ఝునియాకు. ఇంట్లో ఎర్రని యేగానిగూడ లేదని గోవర్‌కు తెలుసు; ఎక్కడా కాండబ్బు అప్పు పుట్టదనిగూడ తెలుసును అతనికి. ఇన్నీ తెలిసి, తానుచెప్పిన మాటలుకూడ వినకుండ పెడ చెవినిబెట్టి, వెళ్ళి, యీక్రొత్త ఆపదలు కొనుక్కు తెచ్చు కున్నాడు నెత్తిమీదికి. 'నువ్వీ గల్లంతుల్లో కెళ్ళొద్దు. దూకు దూకమని, చివరికందరూ తప్పుకుంటారు. అన్నిదాలా బీదాళ్లే కష్టపడతారు' అని, యెన్నిసార్లు చెప్పింది నెత్తినోర్కెరుపెట్టుకుని ? తన మాటలెందుకు వింటాడు, తాను పగైపోయె. అప్పుడు దూకుదూకుమన్న వాళ్లేరీ యిప్పుడు ?

చూశారూ ! మనంవద్దని యెంతచెప్పినా వినకుండా కుర్చీలమీదా, మంచాలమీదా యెక్కి గల్లంతుచేసే కుర్రాళ్లు కాలుజారి క్రిందపడితే మనం యేమంటాం? "బలేపని జరిగిందిలే!

ఝుటాలం వదిలింది; కాళ్లిరగాలిసింది!” అనమూ కోపంతో ! ఝునియాకు గోవర్ మీాద కలిగిన కోపంగూడా అట్లాంటిదే!

కాని, గోవర్ బాధతో వొక్క మూలుగు మూలిగేప్పటికి, ఆవిడకోపం అంతా పటాపంచలై పోయింది. “అయ్యో, వళ్లంతా యిట్టా పిప్పిపిప్పైపోయిందేవిఁరా దేవుఁడా, వాళ్ళ కట్టాచేతులెట్టొచ్చినయ్యా భగవంతుడా ”అనే మాటలు అప్రయత్నంగానే వెలువడినై ఆవిడనోట్లోనుండి.

ఏంచేసేందుకూ తోచక, అట్లాగే, గోవర్ వంక చూస్తూ వుండిపోయింది ఝునియా. మునిగేపోయేవాడు గడ్డిపరక దొరికినా సంతోషిస్తాడు. అలాంటి గడ్డిపరకేమైన దొరకుతుందేమోనని చూస్తోందావిడ. కాని, వున్నకొద్దీ, ఆవిడ ఆశ అస్తమించే సూర్యుడిలా, క్షీణించిపోతోంది. భవిష్యత్తంతా అంధకారంగా వుంది.

ఇంతలోనే పొరుగావిడ వచ్చింది. “గోవర్ కెట్టా వుందమ్మా, నాకిప్పుడే తెలిసింది. దుకాణం దగ్గిర్నుంచాపళాన పరిగెత్తుకొచ్చా” అన్నది.

అంతవరకూ ఆపుకున్న దుఃఖం ఒక్కసారి వెల్లువై పారింది ఝునియా కళ్ళలోనుంచి. మాట్లాడలేక, అట్లాగే, నిలువుగుడ్లతో చూస్తూవూరుకొంది.

గోవర్ దగ్గరకెళ్లి, ముఖం పరీక్షగాచూచి, ఒొమ్ము మీాద చెయ్యివేసిచూచి, “ఏంపర్వాలేదు. నాలుగురోజుల్లో నయంనైపోతంది. గాబరాపడమాకు. ఎంతచెప్పినా గీత మంచిదయ్యిందిలే, నీ పసుపూకుంకం చల్లగావుండబట్టి. అక్కడి కెళ్లి

నా ళ్లల్లో కొంతమంది చచ్చిపోయారు గూడానంట. సరేగాని, యింటో యేఁవన్నా డబ్బుందా ?" అని అన్నది పొరుగావిడ.

ఝునియా తల అడ్డంగావూపింది, సగంచచ్చి.

"నేను పట్టుకొచ్చిస్తాగాని, కాసినిపాలు కాసియ్యి."

పొరుగావిడ కాళ్లు అమాంతంగా కౌగలించుకుని, "పిన్నీ! నువ్వే నాకు తల్లంటిదానివి. ఇకెవ్వరూ లేరునాకు" అన్నది ఝునియా.

శీతకాలం. సాయంకాలం అయింది. మరింత దిగాలుగా వుంది. పొయ్యంటించి, పాలు కాస్తోంది ఝునియా. వసారాలో కూర్చుని బిడ్డనాడిస్తోంది పొరుగింటావిడ.

"నాయంత ముదనష్టపు దుండదనుకుంటా పిన్నీ. ఇదంతా నామూలానే వచ్చిందేవోఁగూడాను. మనసుకష్టంవేఁసి, యేడుపొచ్చి, తిట్టుకుంటా శాపనార్థాలు పెట్టేదాన్ని. ఈయనికి నాతిట్లే తగిలి..." అన్నది నిండారుతై, ఝునియా.

తర్వాత నోరు పెగల్లేదు; వెక్కి వెక్కి యేడ్చింది.

దగ్గరకెళ్ళి, కారేకన్నీరు కొంగుతో తుడుస్తూ, "ఛీ! అయ్యోంమాటలమ్మా. నీ పసుపూ కుంకం మంచిది కాబట్టి, గోవర్ యీమాత్రంగానన్నా వున్నాడు. ఐనా ఒకమాట. కోపంవొస్తే మొఖానే అనెయ్యి యిష్టఁవొచ్చినట్టు. అంతేగాని లోపల్లోపలమాత్రం చచ్చినా తిట్టుకోగూడదు. తప్పు. తెలిసిందా" అన్నది పొరుగావిడ.

"ఇకిప్పుడు నేనేంచెయ్యాను పిన్నీ" అంటూ మళ్ళీ అడిలి పోయింది ఝునియా.

"ఎందుకమ్మా, అట్టా బేజారై పోతావు. అన్నిటికీ ఆ నారాయణమూర్తే. బీదాళ్ళ కష్టాలన్నీ దేవుడే తీరుస్తా డమ్మా!" అంటూ ధైర్యం చెప్పింది పొరుగావిడ.

ఇంతలోనే గోవర్‌కు స్పృహ వచ్చింది; కళ్ళు తెరచి చూశాడు. కళ్ళెదుట ఝునియా కూర్చుని వుంది. "అబ్బ! బలే దెబ్బలు తగిలినై ఝునియా! నేనెవళ్ళనీ, యేమీ అనలేదు. అందరూ నామీందే యిరుసుకుపడ్డారు. నామాటలు గూడా వినిపించుకోలేదు వాళ్లు. నిన్ను పీడించుకు తిన్నాగాదూ నేను? నీ వుసురే తగిలిందనుకుంటా. ఇంకెంతసేపులే, యిక బతకన్నేను. వల్లంతా వొకటే పోటుగా వుంది" అన్నాడు ఝునియా వంక ప్రార్థిస్తూన్నట్లు చూస్తూ.

"మెదలకుండా పొడుకో. నొరెత్తబాకు, చావూలేదు, గీవూలేదు. నేను లేనూ?" అన్నది పొరుగావిడ.

గోవర్‌కు ఆశకలిగింది. "నిజంగానేనా? నేను చచ్చి పోనూ? నిజవేఁనా?" అన్నాడు.

"లేకపోతే అబద్ధఁవాడతన్నాననుకున్నావా. నీకేఁ కాస్తి తలచిట్లిఁది; చెయ్యి బొవిఁకిరిగింది. ఈమాత్రానికే చచ్చిపోతారేంటి మొగాళ్లు?"

"ఇక ఝునియానెప్పుడూ కొట్టను."

"ఝునియా నిన్ను కొడతందేవోఁ యిప్పుడని భయపడ్తున్నావా?"

"అది కొట్టినాసరే; వూరుకుంటా."

"అంతేలే! బాగుపడింతరవాత అన్నీ మరచిపోతావ్."

"లేదత్తా. చచ్చినా మరచిపోను."

గోవర్, యిప్పుడు పసిపిల్లవాడిలా మాట్లాడుతున్నాడు. ఒకోక్కసారి పదిపదిహేను నిమిషాలు స్పృహలేకుండా పడి వుంటాడు. అతని మనసొక్కచోట వుండదు. ఒకసారి, అతను నదిలో మునిగిపోబోతూన్నట్లూ, ఝునియూవచ్చి రక్షించినట్లూ కలగంటాడు. మరోసారి యెవరో భయంకర రాక్షసుడు తన ఱొమ్ముమీద కూర్చుని, సవారి చేస్తూన్నట్లూ, ఝునియా పోలికలున్న దేవకన్యెవరో తనను రక్షించవచ్చినట్లూ కల గంటాడు. మాటిమాటికీ, వులిక్కిపడి లేచి, "నేను చచ్చిపోనుగా ఝునియా!" అంటూ ప్రశ్నిస్తాడు.

మూడు రోజులిట్లాగే గడచినయి. రాత్రింబగళ్ళనకుండా భర్తకు సేవజేస్తూ కూర్చొంది ఝునియా. పసిబిడ్డను పొరుగావిడ సాకుతోంది. నాలుగోనాడొక జట్కాబండిని తీసికొచ్చి గోవర్ నందులో పండుకోబెట్టి, హాస్పిటల్‌కి తీసుకెళ్లింది ఝునియా. అక్కడినుండి తిరిగి వచ్చింతర్వాత, 'ఫర్వాలేదు; బ్రతుకుతా' ననే ధైర్యంకలిగింది గోవర్‌కి. "నాతప్పులన్నీ కాసి, నన్నుక్షమించు ఝున్నా" అంటూ కళ్ల నీళ్ళుబెట్టు కున్నాడు గోవర్.

ఈ మూడునాలుగురోజుల్లోనూ, ఆపొరుగావిడ యెంత లేదన్నా నాలుగైదు రూపాయలు ఖర్చు పెట్టింది; యింకా యెంతకాలమని ఆవిడ నడుగుతూ కూర్చుంటుంది ఝునియా! ఆవిడగూడా డబ్బున్న మనిషిగాదు. కట్టెలమ్మి, వచ్చినడబ్బు ఝునియా కిచ్చింది. ఏదో వొకపనిచేస్తేనేగాని బ్రదుకు వెళ్ళబోరదు అనే నిర్ణయానికి వచ్చింది ఝునియా. ఇంకా కొన్ని నెలలు గడిస్తేనేగాని గోవర్ బాగుపడడు. తినేం

దుకు తిండికావాలి; గోవర్‌కి మందూ, మాకూ కావాలి. వెళ్ళి, యేదో వొక పనిచేస్తే తిండికి సరిపడేటట్లైనా, సంపాదించుకోవచ్చు. చిన్నప్పటినుండీ, ఆవుల్ని మేపుకురావటమూ, పచ్చగడ్డి పీక్కురావటమూ అలవాటే ఝునియాకు.

ఇక్కడ ఆవులెక్కడ వున్నై? ఆఁ. పచ్చగడ్డి పీక్కురావచ్చును. ప్రొద్దున్నే లేచి, పట్టణం బయటికి వెళ్ళి, గడ్డి పీక్కువచ్చేవాళ్లు చాలామంది వున్నారు ఆ పేటలో. రోజుకు పది పన్నెండణాలు కళ్ళజూస్తారు వాళ్ళందరూనూ.

ఝునియాగూడ ప్రొద్దున్నే లేచి, గోవర్‌తో ముఖం అదీ కడిగించి, బిడ్డని భర్త కప్పగించి, పేటలో వాళ్ళతో కలిసి వెళ్లేది పచ్చగడ్డి పీక్కొచ్చేందుకు. ఆకలనక, దప్పికనక మూడు ఝాములదాకా పచ్చగడ్డి పీకుతూనే వుండేది. తర్వాత నాలుగు బజారులూ కలిసేచోటికెళ్ళి, గడ్డమ్ముకుని, సాయంత్రానికి యింటికి వచ్చేది. మళ్ళీ రాత్రికి, గోవర్ నిద్రపోతే కన్నుమూసినట్లు; గోవర్ మేలుకుంటే జాగారమే. ఐనా, యింత శ్రమపడుతూన్నా యెప్పుడు హుషారుగా వున్నట్లే వుండేది ఝునియా. దారిలోనూ, పనిచేసేప్పుడూ వెంటవచ్చే స్త్రీలందరూ కలిసి యేదోవొక పిచ్చాపాటి మాట్లాడుకుంటూండేవారు; యెక సక్కాలాడుకునేవారు. సార్థకమైన జీవితంలోనూ, తనవాళ్ళకోసం చేసే త్యాగాలలోనూ, యిష్టపూర్వకంగా చేసే పరిచర్యలలోనూ, వుండే అవ్యక్తానందం ఆవిడలో ప్రతిఫలించటం ప్రారంభించింది. అప్పుడే నిలబడటం నేర్చుకున్న బిడ్డ, లేచినిలబడి, చప్పట్లు చరుస్తూ ఆనందించి

నట్లుగా ఆనందించుతోంది ఝునియా. మనసు ఆనందంగా వుంటే దేహంగూడా ఆరోగ్యంగా వుంటుంది. ఒక్క నెల తిరిగేప్పటికి ఆవిడ రూపమే మారిపోయింది. ఇదివరకటిలా అలుపులేదు, సొలుపులేదు; నవయువతిలో వుండే స్ఫూర్తి, సౌకుమార్యం మళ్ళీ కన్పిస్తున్నై ఆవిడలో. ఇప్పటివరకూ పాలిపోతూన్నట్లున్న ముఖంలో గులాబీపూల తారుణ్యం నీడలు చూచుకుంటోంది. తలుపులువేసినచీకటిగదిలో నిర్బంధింపబడి,అవమానాలతోనూ, పోట్లాటలతోనూ విసిగి వేసారి యెండిపోయిన ఆవిడ యౌవనం మళ్లీ వొకసారి చిగురుటాకుల్తో కలకల్లాడుతూ తలెత్తింది, ఏదో మందసమీరం వీచినట్లు, యేదో నవ్యప్రకాశం పొంది నట్లు. ఇదివరకటిలా చీటికీ మాటికీ కోపం తెచ్చుకోదిప్పుడు. ఇదివరకు బిడ్డ యేడిస్తేచాలు, వళ్ళు తెలియని విసుగూ, కోపమూ కలిగేవి. ఇప్పుడట్లాకాదు. ఆవిడ ధైర్యానికీ, ఓరుపుకూ, ప్రేమకూ సరిహద్దులు లేనేలేవా అన్నట్లుంది.

గోవర్ పరిస్థితిఅంతా యిందుకుపూర్తిగా వ్యతిరేకంగా వుంది. మన ఆత్మీయుల కెవరికైనా తీవ్రమైన అపచారం చేస్తాం అనుకోండి మనం. తర్వాత యేదో ఘోర విపత్తొకటి వచ్చిపడినపుడా అపచారాన్ని గుర్తించి, తెలుసుకుని తీవ్ర మైన వ్యధ పడతామనుకోండి. అప్పుడు మన ఆత్మ కొక తీవ్రమైన జాగృతి కలుగుతుంది. జరిగిన అపచారానికి తగిన ప్రాయశ్చిత్తం చేసుకోవాలనని ఒకటే మధన పడతాం; అదే పనిగ ఆరాట పడతాం. అట్లాగే గోవర్ గూడా, యిప్పుడు, మధన పడుతున్నాడు; ఆరాటపడుతున్నాడు. అతనిక క్రొత్త

జీవితాన్ని ప్రారంభించ బోతున్నాడు. ఇదివరకటిలా గర్వంగా వుండకూడదు; ఎంతో విధేయతతో, నమ్రతగా మసలుకోవాలి. ఇంతవరకూవున్న కోపాన్ని వదలిపెట్టేసెయ్యాలి; ఆత్మీయతనూ, ప్రేమనూ అలవరచుకోవాలి. ఇతరులకి సేవాసపర్యలు చేసే సౌభాగ్యం అందరికీ దొరకదు. ఈసారలాంటి అవకాశం దొరికితే చేజారిపోనివ్వడు గోవర్ !

# 23

భోలా రెండవభార్య, నోహరి, మేలుచేసింతర్వాత గప్పుచుప్పుగా వూరుకునే మనిషిగాదు. చేసినమేలు నలుగురితోనూ చెప్పేవరకూ వూరుకోలేదు. 'ఓహో, ఎంత గొప్ప పని చేసింది!' అని నలుగురూ మెచ్చుకుంటేనేగాని నిద్రపట్టదు. ఇలాంటి మనుష్యులికి కీర్తికంటే అపకీర్తే ఎక్కువగా కలుగుతూంటుంది సాధారణంగా. మేలు చెయ్యలేదని తప్పుపట్టరు యెవ్వరూను. అంతమాత్రాన మనం చెడ్డవాళ్ళం ఐపోయినట్లూ గాదు. కాని మేలుచేసి, 'మేమే మేలు చేశాం, ఓహో!' అని డప్పేసుకుంటే, మనవల్ల మేలు పొందినవాళ్ళే మనకు శత్రువులైపోతారు. అట్లాగాకుండా మనసులోనే వుంచుకుంటే పదిమందీ మెచ్చుకుంటారు; నిజమే ననుకుంటారు. "పాపం! మంచి కష్టాల్లోగూడా వున్నా డాహారీ, పొలం తాకట్టుపెట్టాలని గూడా అనుకున్నాడు. ధనియాఅంటే పట్టి గర్వాలగౌరమ్మ; దాన్నిచూస్తే నాకూ మండుకొస్తుంది. ఐనా హారీని చూచేటప్పటికి, జాలేసిందంటే నమ్మండి. ఎంతజెప్పినా మనిషికి మనిషేగదా మేలుచెయ్యాల్సిందని అనుకుని, నాదగ్గిరున్న డబ్బంతా లెక్కపెట్టి యిచ్చేశా. అదీగాకపోయినా, ఎట్లాగో చుట్టమేగా మాకు,

నేను డబ్బివ్వబట్టి సరిపోయిందిగాని, లేకపోతే ఆ యెదిగిన పిల్ల యెట్లా కడతేరేది? ఇంట్లోనే వుండేది?" అంటూ వూరు నాలుగువైపులా తిరిగి బాకాలూదింది నోహరి.

నోహరి యిన్నిమాట లంటూంటే ధనియామాత్రం యెందుకు వూరుకొంటుంది? డబ్బేంవన్నా వూరికే యిచ్చిందా? మాలావు బయల్దేరిందిలే ధర్మాత్మురాలు! రేపు తనుమాత్రం వడ్డీపుచ్చుకోదూ? ఇంకా మేలేంజేసింది? పరాయాళ్ళకిస్తే అసలూ, వడ్డీ రెండూ మింగి కూర్చునేవారు. ఇంకా మేవేం నయిం. డబ్బురాగానే దానిమొఖాన పడేస్తాం. ఆయింటి మర్యాదని మేంగాబట్టి కాపాడాం. మాయింటికొచ్చినప్పుడే యెళ్ళగొడితే యిక తలెత్తుకునితిరిగేపారంగూడా వుండేది కాదాళ్ళకి!

రాత్రి పదిగంటలైంది. శ్రావణమాసం; మేఘాలు దట్టంగా పట్టినై. ఊరంతా చీకటిగావుంది. భోజనంచేసి, చుట్ట కాల్చుకుని, నిద్రపోతూన్నాడు హోరీ. ఇంతలోకే, భోలా వచ్చాడు.

"ఊళ్లో వుండదలచుకుంతర్వాత, వేరే ఒక యిల్లేసుకునుంటే పోయేదిగదంటయ్యా. ఊళ్లోవాళ్ళేంవేంవి వాగుతున్నారో తెలుసా? పెడర్థాలు తీసుకోబోక. ఐనవాడ్ని నలుగురూ అంటూంటే వినలేక నాకు తోచింది చెబుతున్నా. లేకపోతే నాకు మాత్రంవేంపట్టింది" అన్నాడు హోరీ.

ఇంతలోనే, మంచంక్రింద మంచినీళ్ళు పెడదామని ధనియాగూడ వచ్చింది. హోరీ మాటలు విని, "రెండో మగాడైతే పెళ్లాన్ని చీల్చెండేసేవాడు" అంటూ అందుకుంది.

"నీకెందుకే. మెదలకుండా వెళ్ళి నిద్రపోక. నువ్వేఁవన్నా తప్పుచేస్తే నిన్ను చీల్చి యెండేస్తాననుకో, నువ్వూరుకుంటావా!" అని గదురుకున్నాడు హోరీ.

చెంబులో నీళ్ళు రెండుచుక్కలు తీసి, హోరీమీద చిలకరిస్తూ, "ఊఁ, చెప్పొచ్చావ్లే మాలావు, నేను లోకంలో మాటచెబుతున్నానా, యింకేఁవన్నానా? ఆడ దిష్టఁవొచ్చినట్టు తైతక్కలాడతాంటే చూస్తా వూరుకునేమగాడుగూడా వొక మగాడేనా!" అన్నది ధనియా.

హోరీ మండిపోయాడు. పాపం, భోలా యేదోమంచీ చెడ్డా మాట్లాడుకుందామని వస్తే, సానుభూతి చూపటం మాట అట్లావుంచి, ఎదురు అతనిమీదే దండయాత్ర చేస్తోంది ధనియా. 'నువ్వు పొద్దస్తమానవూఁ నీయిష్టఁవొచ్చినట్టు చేస్తాంటే చూస్తావూరుకోవటంలా నేను? యేఁవన్నా అంటే బ్రదక నిస్తన్నా నన్ను? ఆమాటాలోచించవేఁ!" అన్నాడు హోరీ ధనియాతో.

లోపల ఒకటి పెట్టుకుని, పైకొకటి మాట్లాడటం చేత గాదు ధనియాకి. 'ఆడది పాలకుండ పగలగొడ్తేనూ, అన్నం సరిగ్గా వండకపోతేనూ వూరుకుంటాడు గాని మగమనిషి, చెడు నడకలు నడిస్తే యెందుకూరుకుంటాడు?" అనడిగింది తొణక్కుండా.

"నువ్వు చెప్పేదీ నిజవేఁనమ్మా. దాన్ని చీల్చెండేసినా పాపంలేదు. ముసలాణ్ణైపోయానా, పౌరుషంగూడా చచ్చిపోయింది. నేను చెయ్యాల్సిందంతా చేశాను, లాభంలేదు. నువ్వొచ్చి కాస్త బుద్ధిచెప్పరాదూ?" అన్నాడు భోలా.

"పెళ్ళాన్నదుపులో పెట్టుకోలేనాడివి పెళ్లెందుకు చేసుకున్నా! ఈ చెండాలంవంతా చూట్టానికా? అదొచ్చి నీకు సేవ చేస్తుందనుకున్నావా, కాళ్ళు పిసుకుతుందనుకున్నావా; జబ్బొస్తే మంచందగ్గిరే కూర్చుని ఆపసోపాలు పడుతుందనుకున్నావా? అట్లాచెయ్యాలంటే పడుచుతనంలో పెళ్ళి చేసుకున్న పెళ్ళావే చేసేది. నీతోపాటు మంచి అనుభవించింది కాబట్టి, కష్టంవొచ్చినప్పుడుగూడా ఆదుకుంటుంది. అసలది కాదు, దీన్నిచూచి నువ్వెంత వళ్లెట్టామరిచిపోయావంట, అర్థంగాక అడుగుతున్నా నేను! పెళ్ళిచేసుకునేముందు వంచీ చెబ్బరా చూసుకోరూ? సరేలే, అయిందేదో ఐపోయిందిగాని, ఒక చిన్న గండ్రగొడ్డలి పుచ్చుకుని దాన్ని రెండుముక్కలు చేసేసెయ్యి. మాంఅయితే వురేస్తారు. అంతేగా! ఈ నామర్దా అంతా పడేకంటె అదేమెరుగు!"

ఈ మాటలన్నీ వింటూంటే భోలాకిగూడా పౌరుషం వచ్చింది. "ఐతే అదే మంచిదంటావు!" అన్నాడు.

"'కాకపోతేయేంటి. యాభై యేళ్ళెట్టాగో వచ్చినయ్యా. ఇక నూకల్లేవనుకో!" అన్నది ధనియా.

ధనియా మాటలు వింటూంటే కంపరమెత్తింది హోరీకి. "చెప్పావులే మాలావు సత్యకాలపుమాటలు. నామాటవిను భోలా; ఇష్టంలేకపోతే పక్షినిగూడా పంజరంలోపెట్టలేం. ఎందుకొచ్చిన మాటలుగాని, చచ్చిపోయిందనుకుని దాన్ని వదిలిపెట్టేసెయ్యి. వెళ్ళి నీబిడ్డలింటో హాయిగా, మహారాజులా బ్రతుకు. ఇంతన్నంతిని దేవుడిపేరు తలుచుకో. పోయిన పడుచుదనం రమ్మంటే వస్తుందా పిచ్చిగాని! అందుటో

అది బుద్ధి నిలకడలేని మనిషి, ఎట్లాగో నిన్ను సుఖంగా బదకని వ్వదు" అన్నాడు హోరీ.

భోలా నోహరిని వదలి పెట్టేసెయ్యడమే! అసంభవం. ఇప్పటికిగూడా నోహరి కళ్ళుమిచూస్తున్నట్లుంది, భోలా పై ప్రాణాలు పైకిపోయేట్లున్నై. ఐనా తప్పదుమరి. వదలిపెట్టెయ్యక తప్పదు. తాను నుంచున్న కొమ్మని తానే నరుక్కుంది నోహరి.

పాపం! భోలా కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. "హోరీ బాబూ! దీన్ని చేసుకున్నదగ్గిర్నుంచీ యెన్నికష్టాలుపడ్డానో నాకే తెలుసు, దేవుడికే తెలుసు. దీనిమూలాన కామతాతో గూడా పోట్లాటపెట్టుకున్నాను. ఇన్నేళ్ళొచ్చింతర్వాత యీ అపవాదుగూడా రావాలిసుందిగావన్ను. నీకూతురు లేచిపోలేదాఅని యెత్తిపొడుస్తుంది ప్రతిరోజూనూ. నా కూతురు లేచిపోతేనూమాత్రంవేం? శుభ్రంగా మొగుడితో కాపరం చేస్తొందా, లేదా? మంచొచ్చినా, చెడ్డొచ్చినా మొగుడితోనే కాపరంచేస్తొందా; లేదా? ఇట్లాంటాడదాన్ని చూళ్ళేదు బాబూ నేను, అందర్తోనూ నవ్వుతా, పేల్తా మాట్లాడతంది; నన్ను చూస్తేచాలు మొఖం మిటమిటలాడించుకొంటంది. బీదముండాకొడుకుని; కూంలోనాలో చేసుకుని రోజుకి పావలా కళ్లజూట్టవేం గగనం. రోజూ పాలూ పెరుగూ; మాంసవూం చేపలూ తెమ్మంటే యెక్కణ్ణించి తెస్తాను?" అన్నాడు భోలా.

ఇక్కడినుంచి, నోహరిని వెళ్లగొట్టేస్తానని ప్రతిజ్ఞచేసి మరీ వెళ్లాడు భోలా. అనుభవించిందిక చాలులే అన్నాడు; వెళ్ళి కొడుకుల్తోనే వుంటానన్నాడు. కాని, మర్నాడు

చూస్తే యింకా వూళ్ళోనే వున్నాడు. కోమటమ్మ యింటిదగ్గర వుగాకు కొనుక్కెళ్తూంటే చూచాడు హోరీ. పిలవటం యెందుకులే అని వూరుకున్నాడు.

ఇంటికొచ్చి, "ఇంకా యిక్కడేవున్నాడే భోలా మొత్తంమీద నోహారేదో మంత్రం వేసిందనుకుంటా!" అన్నాడు ధనియాతో, హోరీ.

మూతీ, ముక్కూ విరిచింది ధనియా. "గంతకి తగిన బొంతని, ఇద్దరికీ సరిపోయింది. ఇప్పుడేఁవయ్యిందో ఆమర్యాద? అప్పుడు ఝునియావస్తే ముక్కుతెగిపోయిందంటూ; క్రేసుకొచ్చాడే, యిప్పుడేఁవయ్యింది?" అన్నది.

భోలాను తలచుకొంటూంటే జాలేసింది హోరీకి, పాపం! ఆ కులటపాలిటబడి పాడైపోయాఁడు భోలా. వదిలేసెయ్యడంఅంటే మాటలా? భార్య! ఐనా అదిమాత్రం సామాన్యురాలా? బ్రహ్మరాక్షసిగాదూ! పంచాయితీనిగూడా పిలిపించుతుంది. మనవర్తి యిమ్మని గల్లంతుచేస్తుంది. ఇప్పుడంటే వూళ్ళోవాళ్ళకిమట్టుకే తెలుసు; చెవులు కొరుక్కుని వూరుకుంటున్నారు. పంచాయితీ జరిగింతర్వాత యింకేముంది? లోకంఅంతా కోడైకూస్తుంది. నలుగురూ భోలానే అంటారు. మొగుణ్ణొదిలిపెట్టే, పెళ్ళాం గతేంకావాలని అడుగుతారు. మగవాడు మంచివాడుకాకపోతే, ఆడదాని ప్రాణం తీసేస్తాడు. ఆడది మంచిదికాకపోతే మగాడిబ్రదుకు బండలే.

తర్వాత రెండునెల్లకి వూరంతా గుప్పుమంది: నోహారి చెప్పెట్టి కొట్టిందట భోలాని నెత్తిమీదబొచ్చూడేటట్టు.

వర్షాకాలం వెళ్ళిపోయింది. రెండవపంట నాటేరోజులు వచ్చినై. హోరీవంతు చెఱకు వేలంవేసెయ్యటంమూలాన విత్తులు కొనుక్కునేందుకతనిదగ్గర డబ్బులేకుండాపోయింది. దీనికితోడు పాపడెద్దు దెబ్బతినిపోయింది. క్రొత్తయెద్దు నొకదాన్ని కొనుక్కోకపోతే పనిసాగటం కష్టం. పున్నికున్న యెద్దుల్లో వొకటి వూబిలో దిగబడిపోయి చచ్చిపోయింది. అప్పటినుంచీ, మరీ యిబ్బందిగావుంది. ఒకనాడు పున్ని పొలం దున్నితే, వొకనాడు హోరీపొలం. అంచేత వ్యవసాయం సాగవలసినంత తొందరగా సాగటంలేదు.

నాగలి తోలుకొని పొలంవెళ్ళాడు హోరీ. వెళ్ళాడన్న మాటేగాని, భోలానిగురించి ఒకటే ఆలోచన. 'అతనికిన్నేళ్ళు వచ్చినైగాని భార్యభర్తని చెప్పట్టుకుని, నెత్తిమీద బాచ్చాడేల్లు కొట్టటం యింతవరకెప్పుడూ విననూలేదు; చూడనూ లేదు. అక్కడిదాకా యెందుకు. మొగుడిమీద చేయిచేసుకున్న ఆడకూతురెక్కడైనా వున్నదని వినిగూడాయెరగడు. ఈనాటికి నోహరి భోలాని చెప్పట్టుకుని కొట్టింది; నలుగురూ తమాషా చూచినట్లు, చూచి, వూరుకున్నారు. ఈ బ్రహ్మరాక్షసి బారినుంచి యెట్లా బయటపడగలడో భోలా? ఇంతకంటే యెందుట్లోనైనాపడి చచ్చిపోతే మంచిది. అపవాదులూ, అన్యాయాలూ తప్పితే జీవితాని కింకేమీదొరకనప్పుడు చచ్చిపోవటమే మంచిది. ఐనా భోలా చచ్చిపోతేమాత్రం యేడ్చేవాళ్ళెవళ్ళున్నారు? లోకంకోసమని కర్మమట్టుకుచేసి వూరుకుంటారు కొడుకులు, అంతేగాని ముక్కగూడా చీదరు. అంతేమరి. తృష్ణకు లోబడిపోయిన ప్రతిమనిషీ, యిట్లాగే, బ్రదుకంతా

పాడుచేసుకుంటాడు. చచ్చినా యేడ్చేవాళ్ళు లేకపోయింతర్వాత, బ్రదికేం సాధిస్తామని ? చచ్చేందుకు భయమెందుకు ?'

నోహరినిచూస్తే యిట్లావుంది. అటుచూస్తే సిలియా-మాదిగమ్మాయి-! పలుకులోనూ, ప్రవర్తనలోనూ నోహరి కంటే వెయ్యివిధాల మెరుగు. నలుగురికి పెడుతుంది; తాను తింటుంది. రాధికలా తిరిగితేమాత్రం తప్పేముంది? కూలివున్న నాడు కూలిచేస్తుంది; కూలి దొరక్కపోతే పస్తులుంటుంది. ఏది యేమైనాసరే, మాతాదీన్‌నిమాత్రం మరచిపోదు. అతనొక దరిద్రుడు; సిలియావిషయం పట్టించుకోనే పట్టించుకోడు. . .

ఏమో! ధనియా చనిపోతే! హోరీముఖం చూచేవాళ్లే గూడ వుండరు. 'ధనియా చనిపోతే !' అన్న ఆలోచన కలిగితేనే చాలు; హోరీ వళ్ళంతా కంపించిపోతుంది. ధనియారూపం మానసిక నేత్రాలకు కట్టినట్లు కన్పిస్తుంది - ధనియా వొక త్యాగ మూర్తి; సేవలు చెయ్యటంలో ఆవిడకావిడే సాటి. మాటలు చూస్తే కరవొచ్చినట్లుంటుందిగాని, మనసుమాత్రం వెన్న పూసలాంటి మనసు. కాండబ్బు పోతూంటే ప్రాణంపోయినట్లు పోట్లాడుతుంది; అయినా కుటుంబం గౌరవంకోసం తన సర్వస్వం హోమంచెయ్యమన్నా చేసేస్తుంది ! వయసులో వున్నప్పుడు ధనియా యేమంత తక్కువ అంద మైనదికాదు. అప్పటి ధనియా కాలిగోటికికూడా సరి పోలదు యిప్పటి నోహరి. ధనియా నడుస్తూంటే, మహారాణి నడుస్తూన్నట్లుండేది; జనంఅంతా కనురెప్ప వెయ్యకుండా చూచేవారు. అప్పుడే ఝింగురసింగూ, పటేశ్వరీలాల్‌లు గూడ పడుచుతనంలో వుండేవారు; పిచ్చెత్తినట్లు యింటిచుట్టూ తిరిగే

వాడు. ఏదో వొకవంకతో పోట్లాట పెట్టుకోవాలనుకునేవాడు హోరీ; కాని సందిచ్చేవాళ్ళుగాదు వాళ్ళు. అందుట్లో అప్పటి రోజులుగూడ వరికట్టికిరోజులు. పొలాలు పండలేదు. దుంపలూ, గింపలూ తిని బ్రతికేవారు వూరంతా. హోరీ పొరుగూరెళ్ళే వాడు కూలికని. రోజు కణాన్నరకూలి దొరికితే, పండుగ్గావుండేది. ధనియా వంటరిగానే వుండేది యింట్లో. ఐనా పరాయిపురుషు డిని, కన్నెత్తిగూడా చూచేదిగాదు. ఒకసారి పటేశ్వరి సరస మాడబోతే ముఖంవాచేట్లు చీవాట్లుపెట్టింది. పాపం! మానవుడాచీవాట్లు యీనాటికీ మరచిపోలేదు....

ఈ ఆలోచనలు అంతం కాకమునుపే, మాతాదీన్ తన కేసి రావటం చూచాడు హోరీ. కసాయి ముండాకొడుకు! నకిలీలేని అసలుభక్తుడిలా విభూతిపూసుకుని మరీ వస్తు న్నాడు. గోముఖ వ్యాఘ్రం! ఇట్లాంటి బ్రాహ్మడికి నమస్కారం యెవరు చేస్తారు.

దగ్గరకొచ్చి, "యేం! హోరీ! మీదాపటిదిక పనికి రాదనుకుంటానే. ఎన్నాళ్ళయ్యింది దీన్నికొని? నాలుగైదేళ్ళు కావటంలా?" అనడిగాడు మాతాదీన్.

దాపటెద్దుమీద చెయ్యేసి, "నాలుగైదే. ఎనిమిదో యేడు నడుస్తాంది. పింఛినీ యిద్దామాంఅని చూస్తన్నా. ఏం లాభంలే. రైతుకీ, రైతుల యెద్దుకీ యప్పుడే యివ్వాలి పింఛిను. దీన్ని కాడికి కట్టాలంటేనే జాలేస్తాంది. ఏంచేస్తాం? మన చేతుల్లోవుందిగనకనా. ఎక్కడికీపోక? బాగానే వున్నారా?" అన్నాడు హోరీ.

ఈ మధ్య ఒక నెలనుంచి, మలేరియా జ్వరంతో తీసుకుంటున్నాడు మాతాదీన్. ఒకనాడు నాడిగూడా అందటంలేదని గల్లంతుచేశారుగూడాను. మంచంమీదనుంచి తీసి, క్రిందకూడా పండుకోపెట్టారు. అప్పట్నుంచీ, సిలియాని వుసురుబెట్టటంమూలాన్నే తనకీ జ్వరం దాపురించిందేమో నన్న అనుమానం కలిగింది మాతాదీన్‌కు. అతను సిలియాతో సంబంధం తెగగొట్టుకునేప్పటికే, ఆవిడ కడుపుతూంది. ఐనా అతను దయతలచలేదు. నిండుగర్భంతోనే కూలికి వెళ్ళవలసి వచ్చింది సిలియా. అప్పుడేగనక ధనియా దయతలచకపోతే, పాపం ఆ సిలియా బ్రతకటమే కష్టమైపోయేది. ఎన్ని కష్టాలు పడిందో దేవుడికే యెరుక. ఇక యిప్పుడు కూలిగూడా చేసే స్థితిలో లేదు. ఇదంతా చూస్తే మాతాదీన్‌కి పశ్చాత్తాపం కలిగింది. సిలియాకిమ్మని హోరీచేతికి రెండురూపాయలు యిద్దామని వచ్చాడిప్పుడు మాతాదీన్. ఆ డబ్బు సిలియాకందజేస్తే, బ్రతికినంతకాలం హోరీకి కృతజ్ఞుడుగావుంటాడు మాతాదీన్.

"మీరే వెళ్ళివ్వొచ్చుగా" అన్నాడు హోరీ.

"ఏం ముఖం పెట్టుకు వెళ్ళను యిప్పుడు! వెళ్ళితే సిలియా యేమంటుందోనని భయంగాకూడావుంది. క్రోసెడు దూరం పరుగెత్తుకెళ్ళి పట్టుకొచ్చా నీడబ్బు. ఈ వుపకారం చేసిపెడుదూ, నీకు పుణ్యంవుంటుంది. చేసిందానికి అనుభవించింది చాలు. ఇక యీ బ్రాహ్మణత్వం భరించలేన్నేను. చాటుమాటున యెన్ని తప్పుడు పనులుచేసినా వూరుకుంటుంది లోకం. ఇప్పుడు నేనేదన్నాఅంటే కులమర్యాద పోతుం

దంటారు. నేను చేసిన పాపాల్ని క్షమించమని ప్రార్థిస్తున్నానని చెప్పు సిలియాతో. ఏకులమర్యాదపోయినాఫర్వాలేదు గాని యీ బ్రాహ్మణకులంమాత్రం పోగూడదు. మా పూర్వులు సంపాదించినకులం యిది. ఇది లేకపోతే మాకిక తిండిలేదు. ప్రాయశ్చిత్తంకోసంవని మూడొందలు ఖర్చు పెట్టాం; తెలుసా నీకు. ఐనా లాభంలేకపోయింది. సంఘాన్ని బట్టి మనిషి నడుచుకోవాలి నిజమే; సంఘంమాత్రం మనిషి మంచిచెడ్డలు చూడొద్దూ? సంఘం నీతినియమాలకి కట్టుబడితే, సంఘంమట్టుకే ఆదరిస్తుంది. కాని మానవ ధర్మానికి కట్టుబడితే భగవంతుడుకూడా సంతోషిస్తాడు" అన్నాడు మాతాదీన్ దీనంగా.

సాయంత్రం, యింటికి వెళ్ళింతర్వాత, మాతాదీన్ యిచ్చిన డబ్బు సిలియాకిచ్చేశాడు హోరీ. సిలియా సంతోషానికి మితిలేదు. చిరకాలంనుంచి చేస్తూన్న తపస్సుకు ప్రతిఫలం ముట్టినట్లానందించింది. దుఃఖంఅంటే వంటరిగా భరించగలం గాని, సుఖాన్ని యెవరితోనో వొకరితో పంచుకోనిదే సంతోషం పూర్తికాదు. ఎవరితో చెప్పుకుంటుం దీశుభవార్తని? ఊళ్లో యాతో మాట్లాడుకుందామంటే అంత స్వతంత్రం లేదు. ధని తనకంత సన్నిహితులుగా వుండే వాళ్ళింకెవరున్నారు! సంతోషం పురకలు పరుగులు పెట్టూంది. సోనా వొక్కటే వుంది సిలియా స్నేహితురాలు. వెళ్ళి సోనాని కలుసుకోవాలి. ఆలస్యం కాగూడదు. రాత్రంతా గడచేదెట్లా? తానిపుడు అనాథ గాదు. మాతాదీన్ మళ్ళీ తనవాడయ్యాడు. ఇప్పుడావిడ జీవితంలో చీకట్లకు స్థానంలేదు. జీవితమంతా పచ్చని పంట కాబో

తూంది. సెలయేరులు గానంచేస్తాయి ఆజీవితంలో. తన జీవితం మళ్ళీ పూలుపూస్తోంది. ఇన్నిరోజులతర్వాత మళ్ళీ ప్రేమ ఫలించబోతూంది!...

లోపల్లోపల మాతాదీన్ని యెన్నితిట్టుకుంది? అందుగ్గాను క్షమాపణ కోరుకోవాలి. పాపం, అతన్ననవసరంగా వూరందరిముందూ అవమానించింది. తానంటే మాదిగ; తనకు పోయిందేముంది? కులంవాళ్ళందర్నీ పిలిచి సంతర్పణ చేస్తే శ్రాద్ధుటికి మళ్ళీకులంలో కలుపుకుంటారు. ఆయన కులం మళ్ళీ రమ్మన్నారాదు. ఎంత పొరపాటుజరిగింది? ఆయన్ని ప్రేమిస్తున్నానని వూరంతా తిరిగిచెప్పింది తాను. ఛీ. ఎంత గుడ్డితనం, కులం చెడిపోయిందిగాబట్టి ఆయనకోపం వచ్చినా తప్పులేదు. తనకెందుకురావాలి అంత పిచ్చికోపం? వెళ్తే యింటికే వెళ్ళేది. తనకేంపోయేది. నిష్టగావుండేవాడు కాబట్టేగదా అందరూ మాతాదీన్ని గౌరవించింది. ఆయనే భ్రష్టుడైపోతే వాళ్ళందరికీ కోపంరాదూమరి?

ఒక్క క్షణంక్రిందటివరకూ దోషమంతా మాతాదీన్‌దే ననుకుంటూవచ్చింది. ఇప్పుడు తప్పంతా తనదే ననుకుంటోంది. అతను చూపించిన సహృదయత, ఆవిడలోవున్న సహృదయ తనిగూడ మేలుకొలిపింది! బిడ్డను కౌగలించుకుని అదేపనిగ ముద్దులవర్షం కురిపించింది సిలియా. ఇప్పుడాబిడ్డనిచూస్తే సిగ్గుకలగటంలేదు; దుఃఖంరావటంలేదు. మాతృ ప్రేమకూ, మాతృ హృదయానికీ గర్వకారణం ఐపోయాడు యీక్షణం నుండీ.

కార్తీకమాసం. మధుర సంగీతంలా లోకాన్నంతా వడిలో పెట్టుకుని వుయ్యాలలూగుతూంది. చిక్కని వెన్నెల. సిలియా యింట్లోనుండి బయలుదేరింది. వెళ్ళి, సోనాను కలిసికోవాలి. కలుసుకుని యీ 'మంచివార్త' చెప్పెయ్యాలి. అప్పటిదాకా నిద్రపట్టదు. పెద్దగా ప్రొద్దుపోలేదు. బల్లకట్టు తప్పకుండా దొరుకుతుంది. గబగబా నదివగ్గరకు వెళ్ళింది సిలియా. చూస్తే, బల్లకట్టు ఆ వొడ్డునవుంది. బల్లకట్టు మనిషిగూడా కన్పించటంలేదు. వెన్నెలఅంతా కరగి నదిగా ప్రవహిస్తూన్నదా అన్నట్లుంది నదిలోనినీరు. ఒక్క క్షణం పస్తాయించి ఆలోచించింది సిలియా. వున్నట్లుండి నదిలోకి దిగింది. నదేమంత పెద్దలోతుగావుంటుందిలే అనుకుంది. ఐనా ఆ ఆనందోత్సాహంలో నదినిగురించీ, నదిలోతును గురించీ ఆలోచించేందు కవకాశంయేది? మొదట మోకాళ్ళలోతు, తర్వాత నడుంలోతు, తర్వాత మెడలోతు. మునిగిపోతానేమోనని భయపడింది సిలియా. ఏముంది? ఎక్కడైనా యింత చిన్నిగుంటవుంటేచాలు మునిగిపోయేందుకు. అట్లాగే ప్రాణాలరచేతిలోపెట్టుకుని ముందుకు నడచింది. నదిలో నట్టనడుంకి వచ్చింది. మృత్యువు కళ్ళముందు నిలబడి అట్టహాసం చేస్తూన్నట్లుంది. ఐనా సిలియా అధైర్యపడలేదు. ఈతగూడ వచ్చును సిలియాకి. చిన్నప్పుడు చాలాసార్లు దాటింది ఈ నదిని యీదుకుంటూ. ఐనా గుండెమాత్రం కొట్టుకుంటూనేవుంది. అమ్మయ్య! వున్నకొద్దీ లోతు తగ్గిపోతోంది. గండంగడిచి బయటపడినట్లే. ఇక భయంలేదు. సిలియా నదినిదాటింది. వడ్డెక్కి గుడ్డలు పిండుకుంది. అట్లాగే

చలితో, వణుకుతూ ముందుకు నడచింది. ప్రకృతి అంతా ప్రశాంతంగా వుంది; ఇలకోళ్లుగూడా కూయటంలేదు. సోనాని యెప్పుడు కలుసుకుందాం, ఎప్పుడు కలుసుకుందాం అనుకుంటూ గాలిలో తేలిపోతూన్నట్లుగా నడిచింది సిలియా.

కాని వూళ్లోకి వెళ్లింతర్వాత సోనాగారి యింటికి వెళ్ళటం అంటే - మళ్ళీ సంకోచం. సోనాభర్త ఏమంటాడు? అత్తమామ లేమంటారో. ఇంత ప్రొద్దుపోయెందుకొచ్చావని సోనాగూడ లేస్తుందేమో, అందుట్లో పల్లెటూళ్ళల్లో పగలల్లా కష్టపడతా రేమో, పెందలకాడే నిద్రపోతారు. గుర్రుపెట్టూ నిద్ర పోతూంది వూరంతా. సోనా ఇంటితలుపులు వేసివున్నై. తలుపులు కొట్టిలేపితే? తనవేషంచూస్తే యేమనుకుంటారో వూళ్ళోవాళ్ళు. మళ్ళీ వొకసారి గుడ్డలు పిండుకొని, గుమ్మం దగ్గరే, అరుగుమీద కూర్చుంది సిలియా. ఇంతలోనే లఘుశంక తీర్చుకునేందుకని తలుపు తెరిచాడు మథుర్.

"ఎవరూ ఆ అరుగుమీద కూర్చొంది?" అనడిగాడు సిలియాను చూచి.

గబగబాలేచి, చీరసర్దుకుని, "నేనే సిలియాని" అన్నది సిలియా.

"ఇదేవిటే! ఇంత పొద్దుపోయొచ్చావే! అంతా బావున్నారా?"

"ఆ. ఏవీ లేదు. పగలెట్టాగో తీరిగ్గావుండదు; అందర్నీ చూచి పోదాంవనొచ్చా."

"యేరెట్టా దాటా?"

"పెద్ద లోతు లేదుగా. దిగేవచ్చా."

లోపలికి రమ్మని, పిలుచుకువెళ్ళాడు మధుర్. లోపల అంతా చీకటిగావుంది. రెండడుగులు వేసింతర్వాత, చెయ్యి పట్టుకులాగి, సిలియాని కౌగిలించుకోబోయాడు మధుర్. కోపంగా, ఒక్క విదలింపు విదిలించి, "ఇంకేఁవన్నా చేశావంటే సోనాకి చెబుతా యేఁవనుకున్నావో. మరీ అంతవరసా, వాయీ లేకుండా పోతాందేఁ? నాకు మరిది వౌతావు నువ్వు. తెలుసా?" అని చెయ్యిలాక్కుంది సిలియా.

మళ్ళీ సిలియానడుం పట్టుకుని "యేమిఁటి సిల్లీ! మరీ యింత మొఁండిపట్టుపడతావ్. ఎవళ్ళూచూడర్లే" అన్నాడు మధుర్.

"ఏఁ? నేనేఁవన్నా సోనాకంటే అందగత్తెనా? దేవ కన్నెకిమల్లే వుంటుందే సోనా. ఈ యెంగిలికూడు తినబోతా వెందుకు? సోనాతో చెబితే నీమొఖంగూడ చూడదు, యేఁవను కున్నావో!"

మధుర్‌గూడా అంత నీతీజాతీ లేని మనిషేంగాదు. సోనాఅంటే ప్రేమగూడాను అతనికి. అయితేనేం? దట్టమైన చీకటి. ఏకాంతంగావుంది. మంచి యౌవనంలోవున్న సిలియా ముందున్నది. అతనిమనసు స్వాధీనం తప్పింది. సిలియా మాటలు వినేప్పటికి మళ్ళీ స్పృహలోకి వచ్చాడు. సిలియా నడుం వదిలిపెట్టి, "నీకాళ్ళమీందపడతా సిల్లో, సోనాకి మాత్రం చెప్పమాక. నీ యిష్టంవొచ్చిన శిక్షెయ్యి; పడతా!" అన్నాడు.

సిలియాకు జాలేసింది. నెమ్మదిగా చెంపమీంవొక దెబ్బేసి, "యీ శిక్షచాల్లే. ఇక యిట్లాంటి తప్పుడు

పనెప్పుడూ, యెవర్తోనూ చెయ్యమాక. చేశావంటే సోనా దక్కదు నీకు" అన్నది.

"ఇకెప్పుడూ చెయ్యను. చచ్చినంతొట్టు" అన్నాడు మథుర్ ప్రార్థించుతూన్నట్లు. సిలియా కంగారుపడిపోయింది. అతనంటే ఎక్కడలేని దయ పుట్టుకొచ్చింది.

"ఎప్పుడన్నా చేస్తే?"

"నీ యిష్టంవొచ్చిన శిక్షెయ్యి."

అతనిముఖమూ, సిలియాముఖమూ చేరువలోకి వచ్చాయి. వళ్లు జలదరించినట్లుగా వూపిరిపీలుస్తూ, మాట్లాడుతున్నారు యిద్దరూనూ. ఇంతలోనే "ఎవరితోనూ మాట్లాడుతున్నావక్కడ?" అంటూ కేకేసింది సోనా.

సిలియా ఒకడుగు వెనక్కేసింది. రెండడుగులు ముందుకేసి, "మీ వూరునుంచి సిలియా వచ్చింది" అని అంటూ నెమ్మదిగా యింటివెనక దొడ్డిలోకి దారితీశాడు మథుర్. సిలియాగూడా అతనివెనకే వెళ్లింది. ఆ దొడ్డి అదీ చూస్తూంటే సోనా యిక్కడ యెంతసుఖంగా వుంటూందో ననిపించింది సిలియాకు. ఇంటి వెనకగూడా యింకో వసారా దింపారు. ఆ వసారాలోనే వున్నది మంచం. మంచంమీద లావాంటి పరుపుగూడవుంది. ఆమంచం, ఆపరుపూ చూస్తూంటే, మాతాదీన్ పండుకునేమంచం గుర్తుకొచ్చింది సిలియాకు. చక్కటి దిండూ, మంచి శాలువావొకటీగూడ వున్నయి. మంచంక్రింద వెండిచెంబులో నీళ్ళున్నయి. దొడ్డివాకిట్లో పిండారబోసినట్లు వెన్నెలకాస్తోంది. ఒకవైపున తులసికోట. రెండవవైపున ధాన్యపు బస్తాలు గోడకాన్చి గుట్టగాపేర్చారు. దగ్గ

ర్లోనే వాక జోలుంది. జోటిప్రక్కనే దంచినధాన్యం పల్లికెల్లో కెత్తి వున్నయి. సొరకాయలపాదు పెంకుటింటిమీదికి ప్రాకు తోంది. అక్కడక్కడ వెన్నెలపడి, సొరకాయలు మెరుస్తూన్నయి. ప్రక్కగావున్న చావట్లో ఆవు నెమరేస్తూంది. మధుర్, సోనా కలిసి అక్కడే పండుకుంటారులాగుంది. మిగతావాళ్ళం దరూ యింటి కవతలిప్రక్కన పండుకుంటారేమో. సోనాపని హాయిగానే వున్నట్లుందనుకుంది సిలియా. లేచి, యెదురొచ్చింది సోనా. వచ్చి ఆప్యాయంగా కౌగలించుకుంటుందనుకుంది సిలియా. సోనా కౌగలించుకోలేదు. మధుర్ వున్నాడని సందేహిస్తూందేమో బహుశ అనుకున్నది సిలియా. ఏమో, లేకపోతే గర్వంయెక్కిందేమో; తాను తక్కువ కులపుదిగదా. సిలియాకున్న వుత్సాహంఅంతా నీరుగారిపోయింది. స్నేహితు రాలిని కలుసుకున్నందుకు సంతోషం కలగటంపోయి యీర్ష్య పుట్టుకొచ్చింది. సోనా చాలా మారిపోయింది. ఇదివరకంటే యింకో ఛాయ పెరిగినట్లుంది. శరీరం తోమిన యిత్తడి బిందెలా మెరసిపోతోంది. బాగా నున్నబడింది గూడాను యిదివరకటి కంటె. ముఖంలో ప్రౌఢలకుండే నిబ్బరమూ వుంది; వయసులో వున్నవాళ్ళకుండే కాంతీవుంది. సోనానట్లాగే మంత్రముగ్ధలా చూస్తూ నిలబడి పోయింది సిలియా ఒకక్షణంసేపు. ఈ సోనా తానెరిగిన సోనా కాదు. తానెరిగిన సోనా బక్కగా, యెండి పోయివుండేది. చిన్న పిల్లలా బజార్లన్నీ తిరిగేది. వారాల తరబడి నెత్తికి నూనెరాసుకునేదిగాదు. చింపిరిగుడ్డలు కట్టుకుని తిరిగేది. ఇప్పుడో? తన యింటికి రాణిలావుంది. మెడలో కంటెవుంది; కాసులపేరుంది. చెవులకి చెంపస్వరాలున్నయి;

రాళ్ళపోగులున్నాయి. చేతులకి బంగారపు గాజులున్నాయి. కళ్ళకి కాటుకుంది; నొసట కుంకుమ వుంది. ఇల్లంతా కళకళ లాడుతోన్నట్లుంది. ఈ మాత్రంవుంటే స్వర్గం దొరికినట్లే సిలియాకి. నిజంగానే సోనాకి గర్వంయెక్కినట్లుంది. ఇది వరకు చేయీ చేయీ కలుపుకుని వెళ్ళేవాళ్లు గడ్డికనీ, గాదానికనీ. ఇప్పుడు కన్నెత్తిచూడటమే గగనంగావున్నట్లుంది. వచ్చి, కౌగలించుకుని, యెన్నాళ్ళకి చూచానెన్నాళ్ళకి చూచానంటూ కళ్ళనీళ్ళు బెట్టుకుని, కూర్చోబెట్టి, అన్నంపెట్టి తినమని బ్రతిమాలుతుంది; తర్వాత ఆ సంగతీ, యీ సంగతీ, వూళ్ళో కబుర్లూ అడిగి చెప్పించుకుంటుంది; తన అనుభవాలన్నీ— కార్యంనాటిరాత్రి గదిలోజరిగిన విషయాలూ, భర్తతో చీటికీ మాటికీ వచ్చే కజ్జాలూ— చెప్పుతుంది అనుకుంటూ కలలుగన్నది సిలియా. చూస్తే ఆ లక్షణాలేమీ కన్పించటంలేదు. బెల్లంకొట్టిన రాయిలా చూస్తూ వూరుకుంది సోనా. ఎరక్కవచ్చానే అనుకుంటూ పశ్చాత్తాపపడింది సిలియా.

ఎట్లాగైతేనేం, "యింత పొద్దుపోయొచ్చావేం సిల్లో?" అనడిగింది సోనా మూతిముడుచుకుని.

కొంగుతో కళ్ళుతుడుచుకుంటూ "నిన్ను చూసి చాలారోజులయ్యిందిగా, చూసిపోదాంవనొచ్చా" అన్నది సిలియా.

"ఐతేమాత్రం? చూడొచ్చేచుట్టాలు పగలొస్తారుగాని యింత పొద్దుపోయినాక రావటంవేంటి?" అనడిగింది సోనా, కటువుగా.

వాస్తవానికి, సిలియా ఆవేళప్పుడురావటం యేమీ బాగుండలేదు సోనాకు. భర్తతోపండుకుని ప్రేమసల్లాపాలాడుకునే సమయం; సరసాలాడుకునే సమయం; నవ్వుకుంటూ భర్తతో కలిసి కేరింతలాడేవేళ అది. అలాంటప్పుడు వచ్చింది సిలియా; సోనాముందున్న వడ్డించిన విస్తరిని లాగుకుంది!

ఏమనాలో తోచక నేలవంకచూస్తూ నిలబడిపోయింది సిలియా. భూదేవి బద్దలైపోతే బావుండును. సీతాదేవిలా భూగర్భంలో ప్రవేశించొచ్చును. ఇంత అవమానమా! పుట్టిం దగ్గర్నుంచీ యెన్నో కష్టాలుపడింది సిలియా. ఎన్నో అవమానాలు సహించింది. కాని, సోనామాటలు విన్నతర్వాత పడినంత బాధ యిదివరకెప్పుడూ పడలేదు. జాగ్రత్తగా కుండలోపెట్టి దాస్తే,బయటెంతవర్షంకురిసినా కరగిపోదుబెల్లం; కాని ఆ బెల్లాన్నేతీసి, యెండలో యెండబెట్టినప్పుడు, దానిమీద వొక్క నీటి చినుకు పడ్డాసరే, యెందుకూ పనికిరాకుండా పోతుంది. ఆకాశం అమృతాన్ని వర్షిస్తుందని కాచుకకూర్చునివున్నయి సిలియా అంతఃకరణంలోవున్న కోమలభావాలు. ఆశ అడియాస ఐపోయింది. అమృతానికిబదులు విషాన్ని వర్షించిందా ఆకాశం. సిలియా శరీరంమీదున్న రోమరోమానికీ సోకింది ఆ విషం. సర్పదష్టులు బాధపడ్డట్లుగా బాధపడింది సిలియా. ఇంట్లో పడుకుని, కాళ్ళు కడుపులోపెట్టుకుని, పస్తులుండటంమేలు; పదుగురితో పంక్తినికూర్చున్నతర్వాత లేచిపొమ్మని వెళ్ళగొట్టబడితే? అంతకంటే ఎందుట్లోనైనాపడి చావటంనయం. ఎవరో గొంతు నులుముతూన్నట్లనిపించింది సిలియాకు. ఇక్కడినుంచి ఎంత త్వరగా బయటపడితే అంతమంచిది. సోనా మనసులో

యేముందో తెలుస్తూనేవుంది. పొదచాటునవున్న పాము బుసలు వినబడుతూనే వున్నయి; పామినతలికి రాకముందే పారిపోవటం మంచిది. కాని పారిపోయేదెట్లా? ఏమని వంకచెప్పాలి? ఛీ. నిలుచున్నపళాన, ప్రాణాలుపోయినా బాగుండును.

సిలియాకని యేదైనా ఫలహారం తెద్దామని, వంటింటి తాళంచెవి తీసుకున్నాడు మథుర్; కాని వీళ్ళసంభాషణ విని, యేంచేసేందుకూ తోచక, కర్రలా నిలబడిపోయాడు. నెత్తిమీద కత్తి ఆడుతూన్నట్లు, సిలియాకి వూపిరే ఆడటంలేదు.

పరపురుషుడు పరస్త్రీనంక కన్నెత్తిచూడటమే ఘోరాపరాధం సోనాదృష్టిలో. ఏ అపరాధమైనా క్షమించవచ్చునుగాని, ఆఅపరాధాన్నిమట్టుకు క్షమించేందుకు వీలులేదు. దొంగతనాన్నీ, మోసాన్నీ, హత్యనీ— యే అపరాధాన్నైనా సరే— సహించవచ్చు. అంతే అసలు మాట్లాడుకోనేగూడదనికాదు. నలుగురూ చూస్తూన్నప్పుడు మాట్లాడుకోవచ్చు; సరసాలుగూడా ఆడుకోవచ్చు. అంతేగాని, యెవరూలేనప్పుడు కన్నెత్తి చూచుకున్నా తప్పే. ఆ విషయం సోనాకి చిన్నప్పట్నుంచీ తెలుసు. ఎప్పుడైనా హోరీ పొలంనుంచిరావటం ఆలస్యమైనప్పుడు, హోరీ కోమటమ్మ యింటికెళ్ళాడని తెలిస్తే చాలు; ధనియా అతనితో మాట్లాడటం మానివేసేది; ఎప్పుడూ మూతిముడుచుకుని కూర్చునేది. హోరీ కోమటమ్మ యింటికి పుగాకుకోసం వెళ్ళాడని తెలిసినాసరే, వూరుకునేదిగాదు. ఒకసారి పుట్టింటికివెళ్ళిపోతానని ప్రయాణంగూడా కట్టింది ధనియా. ఆబుద్ధే సోనాకుగూడా సంక్రమించింది; పెళ్ళైంతర్వాత మరీ బలపడిపోయింది. పెళ్ళికానివాళ్ళు, మగవాళ్ళైనాసరే,

ఆడవాళ్ళైనాసరే, ప్రేమించుకోగూడదని సోనా అభిప్రాయం. పెళ్ళైంతర్వాత భార్య భర్తనీ, భర్త భార్యనీ ప్రేమించుకోవాలి. అంతే. అందుట్లో, సిలియా తనకు చెల్లెలులాంటిది. సిలియా అంటే ప్రేమే సోనాకి; నమ్మకంగూడావుంది. ఐనా ఆ సిలియావే యివ్వాళ నమ్మకద్రోహం చేస్తోంది. సిలియాకి, మథుర్‌కి సంబంధం చాలాకాలంనుంచి వుండివుండాలి. ఏటివొడ్డునో, పొలాల్లోనో కలుసుకుంటూంటారేమో! లేకపోతే, ఇంత ప్రొద్దుపోయింతర్వాత, యేంది, యెందుకొస్తుంది? వీళ్ళమాటలు వినబట్టి తెలిసింది యిప్పటికైనా. ప్రేయసిని కలుసుకునేందుకిదే మంచిసమయం అనుకున్నాడేమో మథుర్. ఇంట్లోవాళ్ళంతా నిద్రపోతున్నారు గూడాను. అసలు రహస్యం యేమిటో తెలుసుకోవాలని తొందరపడిపోతోంది సోనా. రహస్యంఅంతా తెలిస్తేనేగాని, తన్ను తాను రక్షించుకోలేదు. ఇంకా యిక్కడే నించున్నాడెందుకు మథుర్? సిలియాతో మాట్లాడనివ్వడా తనని?

"బైటికెళ్ళరాదూ యిక్కడనుంచుని పారాయివ్వక పోతే!" అన్నది సోనా, కోపంగా.

కిమ్మనకుండా బయటికి నెళ్ళిపోయాడు మథుర్. సిలియా గుట్టు బైటపెట్టుందేమోనని ఒకటే భయంగావుందతనికి పాపం.

ఇంతవరకూ నెత్తిమీద వ్రేళ్ళాడుతూన్న కత్తి, తెగి, కంఠాన్ని వుత్తరించేస్తుందేమోనని సిలియాభయం.

"ఇదుగో సిల్లో. వుండదుండట్టు చెప్పేసెయ్యి. లేకపోతే యిక్కడే కత్తిపీటతో నరుక్కుని చస్తా. నేంచచ్చిపోయింతర్వాతే నా సవితివి ఔదువుగాని. చూశావా, కత్తిపీటక్కడే

వుంది. ఒక వరలో రొండుకత్తు లివఁడవని తెలవదూ నీకు" అన్నది సోనా, యెంతో గంభీరంగా.

అని, గబగబా వెళ్లి, దూరంగాపడున్న కత్తిపీట పట్టు కొచ్చి, "బెదరిస్తున్నాననుకుంటన్నావేఁవోఁ? నిజం చెప్పుతావా, చెప్పవా?" అంటూ గద్దించడిగింది.

నిలువునా కంపించిపోయింది సిలియా. గ్రామఫోను రికార్డు లాగా, వున్నదున్నట్లు, అప్పజెప్పింది ఒక్కమాటగూడా దాయ కుండా. సోనా ముఖం కందగడ్డైపోయి ది.

శూలాలతో పొడుస్తూన్నట్లు గుచ్చిగుచ్చి చూచింది సిలియాని, సోనా. "నిజఁవేఁగా నువ్వు చెప్పిఁదంతా ?" అనడి గింది.

"నాబిడ్డతోడు అంతానిజవేఁ."

"ఏవీఁ దాయలేదుగా ?"

"అబద్దఁవాడితే నాకళ్ళు పూడిపోత్తై."

"నువ్వాదుర్మార్గుణ్ణి తన్నకపోయా ? పళ్ళతో పీకొదిలి పెట్టకపోయా ? పచ్చినెత్తురు తాక్కపోయా? అరవకపోయా?

యేమని జవాబు చెబుతుఁది సిలియా.

వున్మాదినికి మల్లే; కళ్లతో నిప్పులు చెరిగింది సోనా. "ఏఁ! మాట్టాడవేఁ? నువ్వాపాపాత్ముడి ముక్కెందుకు కొరి కెయ్యలా ? రొండుచేతుల్తోనూ పట్టుకుని గొంతు పిసికెయ్యక పోయావ్ ? నేను నీకాళ్లమీద పడేదాన్నిగా. నువ్వు దొమ్మరి దాంతో సమానం; భోగందాంతో సమానం నువ్వు. ఇట్టాంటి దాని వాబాపనాయనమీద పడేసుస్తావెందుకు ? ఎవణ్నో వొకణ్ణి పెట్టుకుని కులుకుతూ కూర్చోకపోయా. మీ యింటికే

యెళ్లిపోకపోయా! మీ యింటోవాళ్ళందరూ సంతోషించే వాళ్లుగా! 'ఆ బాపనాయన్నెందుకుకీడ్చా నలుగుర్లోకి? ఆయన పేరెందుకూ చెడగొట్టావు? నువ్వక్కడికి పత్తిత్తువా? వొంటరిగా వుండలేకపోతే, యెవణ్ణోవొకణ్ణి కట్టుకుని వూరేక్కపోయా? లేకపోతే యే నూతిలోనన్నాపడి ముక్కుమూసుకోకపోయా? మా బతుకుల్నిగూడా బూడిద చెయ్యటం వెందుకు? నే చెప్పేమాటిను. మళ్ళీ యెప్పుడన్నా యిట్టాంటి పనిచేశావని తెలిస్తే మనముగ్గుర్లో యెవ్వరూ బతకరు; బతికుంటానికీల్లేదు. ఇకనించీ నీకూ నాకూ సంబంధవేఁ లేదు. ఫో అవతలికి! యేందుట్లోనన్నా పడి ఛావు!"

తన కళ్ళని తానే నమ్మలేకపోయింది సిలియా; తన చెవుల్ని తానే నమ్మలేకపోయింది. నడుం విరిగినట్లయ్యింది. ధైర్యం తెచ్చుకుని, తన తప్పులేదని చెప్పాలనుకుందిగాని యేం చెప్పాలో తోచలేదు. కళ్ళు చీకట్లుకమ్మినై. తల తిరుగుతోంది. గొంతెండిపోతోంది. వళ్ళంతా చీమలూ, జెఱ్ఱులూ ప్రాకినట్లుంది. ప్రాణాలన్నీ, రోమఛిద్రాల్లోనుంచి బయటికి పోతూన్నట్లుంది. గోతిలోకి దిగుతూన్నట్లు, అడుగులేసుకుంటూ నెమ్మదిగా నదివైపుకు నడిచింది.

వాకిట్లో "ఈ పాటప్పుడు యెక్కడికెళ్తా సిల్లో?" అనడిగాడు మథుర్.

సిలియా జవాబివ్వలేదు. మథుర్ గూడా మళ్ళీ పలకరించ లేదు.

ఇంకా పిండారబోసినట్టు కాస్తూనేవుంది వెన్నెల. ఇందాకటిలాగానే వెన్నెల్లో స్నానంచేస్తున్నాయి నదిలో కెరటాలు. కనిపించని కలలనీడలా నడచిపోతోంది సిలియా, నదిలోదిగి:

441

# 24

సిలియా కొడుక్కి రెండేళ్ళొచ్చినై; వూళ్లో యెక్కడ చూచినావాడే. ఇతరులికి అర్థంపోతుంది, కాదు అనే బాధ లేకుండా తనభాష తాను మాట్లాడుకుపోతాడు. ఆభాషలో ట, ల, ఘ లని వూరికే కసరత్తు చేయించేవాడు. స, ర, లాంటి అక్షరాలసలు లేనేలేవు అతని భాషలో. రొట్టెని వొట్టి అంటాడు. సామానుని ఛామానంటాడు. కాంతిని తాంతి అంటాడు. వాడు చేసే కూతలఅనుకరణ వింటే కడుపుబ్బేట్లు నవ్వాలిసిందే. ఎవరైనా, 'ఒరేయ్ రామూ! కుక్కెట్లా అరుస్తుందిరా?' అంటేవాలు; "భౌ భౌ!" అంటూ కరవటానికి లగెత్తుతాడు. 'పిల్లి యేఁవంటుందిరా!' అంటే, 'మిఁయావ్', 'మిఁయావ్' అంటూ కళ్ళు పెద్దవిచేసి, చేతులే పంజాలన్నట్టు, నేల నదేపనిగాబరుకుతాడు చేతుల్తో. మంచి హుషారైన కుఱ్ఱాడతను. ఎప్పుడు చూచినా, వొకటే ఆటలు; ఆటలుంటే చాలు, ఆకలిదప్పికలుగూడ మరచిపోతాడు. చంకెక్కటమంటేనూ, వొళ్ళోకూర్చోవటమంటేనూ తలకాయనొప్పి వాడికి. ఇంటిముందున్న నిమ్మచెట్టుక్రింద దుమ్ములో దొర్లాడటంఅంటే బ్రహ్మాండమైనసరదా! ప్రొద్దుగూకులూ

అక్కడే, పిచ్చిగ్గూళ్ళు కడుతూనో, బొమ్మరిళ్ళు కట్టుకుంటూనో కూర్చుంటాడు. వాడీడువాళ్ళతో చచ్చినా పడేదికాదు వాడికి. వాళ్ళందరూ తనతో ఆడుకునేందుకు అర్హులుకాదనేమో వాడి వుద్దేశం!

"నీపేరేవిఁట్రా!" అని యెవరైనా అడిగితే, వెంటనే "లాముా!" అని జవాబు చెబుతాడు.

"మీ నాన్న పేరు?"

"మాతాడీన్."

"మీ అమ్మ పేరేవిఁటి?"

"ఛిలియా."

"శాస్త్రిగారేమౌతాడు నీకు!"

"ఏఁవోఁ! గాలిద కొలుకు!" శాస్త్రిగారంటే వాడికంత ప్రేమెందుకు కలిగిందో యెవరికీ తెలియదు.

రూపకూ, రాముకూ మంచిస్నేహం కలిసింది. వాడితో ఆడుకోవడమంటే అపరిమితమైనసరదా రూపకి. వాడికి నీళ్ళుపోస్తుంది, తలదువ్వుతుంది, బొట్టు పెడుతుంది; అన్నం ముద్దలుచేసి తినిపిస్తుంది. ఒకొక్కసారి, రాత్రిపూట తన ప్రక్కలోనే పండుకోబెట్టుకుని నిద్రపుచ్చేది. అప్పుడప్పుడూ ధనియా కోప్పడుతూండేది "ఎందుకే! వాణ్ణితీసుకొచ్చి అంతా కలగాపులగం చేస్తావ్?" అని. ఐనా, వినేదికాదు రూప. ఇంత వరకూ తాటాకుబొమ్మల్ని చేసుకుని, ఆ బొమ్మలే పిల్లలను కొని, తానే తల్లిఅనుకుని, ఆడుతూండేది. ఇప్పుడంటే రాము దొరికాడు. ఇంకా తాటాకుబొమ్మల అవసరం ఏంవుంది?

హోరీ యింటి వెనకనే, కొద్ది ఖాళీస్థలంవుంటే, అక్కడే, వొక పూరిపాక వేసుకుని, వుంటోంది సిలియా. జీవితాంతం వరకూ హోరీయింట్లో వుంటేమాత్రం యేంబావుంటుంది?

మాతాదీన్ మళ్లీ కొన్నివందలు ఖర్చుపెట్టవలసి వచ్చింది. అప్పుడుగాని కాశీబ్రాహ్మణులు లంగీకరించలేదు అతన్ని మళ్లీ బ్రాహ్మణుల్లో కలుపుకునేందుకు. చివరినాడు పెద్ద 'తతంగం' జరిగింది. బ్రాహ్మలకందరికీ భోజనాలుపెట్టారు. కావలసినన్ని శ్లోకాలూ, మంత్రాలూ దిక్కులు పిక్కటిల్లేట్లు చదివారు. మాతాదీన్ పరిశుద్ధమైనఆవుపేడ తిన్నాడు; గోమూత్రం త్రాగాడు. ఆవుపేడ తినటంమూలాన, అతని మనస్సు పవిత్రమైపోయింది. గోమూత్రం త్రాగటంతో, అతని ఆత్మలోవున్న అపరిశుభ్రమైన కీటాణువులన్నీ నశించి పోయాయి.

ఐతే ఒక్కమాటమాత్రం చెప్పాలి. ఈ ప్రాయశ్చిత్తం వల్లా, జరిగిన 'శుద్ధి' తతంగంవల్లా మాతాదీన్ వొకవిధంగా, నిజంగానే బాగుపడ్డాడు. ఆ 'శుద్ధి' దినంనాడు మండిన ప్రచండాగ్నికుండం ముందు అతని మానవత్వం పరీక్షకు నిలబడింది. ఆ అగ్నిజ్వాలల్లో, మతాన్నీ, ధర్మాన్నీ భుజస్కంధాలమీద మోస్తున్న 'మతస్తంభాల' నిజస్వరూపాన్ని చూడగలిగాడతను. ఆనాటినుంచి, ధర్మంఅంటేనూ, మతంఅంటేనూ అపరిమితమైన అసహ్యం కలిగిందతనికి. ఆవేళే, జంధ్యం తెంపిపారవేశాడు; పౌరోహిత్యాన్ని తీసుకెళ్ళి గంగలో పారవేసొచ్చాడు. ఇప్పుడతను పక్కారైతు. పండితులు 'నువ్వీనాటినుంచి మళ్ళీ బ్రాహ్మణుడవైనావ్!' అన్నారుగాని, అతనిచేతి మంచినీళ్ళుమాత్రం

యెవ్వరూ తాగటంలేదు. ప్రజలు వాళ్ళకవసరమైన విష యాలను గురించీ, ముహూర్తాలనుగురించీ, తిథి, వార, నక్షత్రాలనుగురించీ, తెలుసుకునేందుకు వస్తూనేవున్నారు. ఐనా అతన్ని ఇంట్లోకి రానివ్వరు; పాత్రలు ముట్టుకోనివ్వరు.

సిలియా ప్రసవించిందని తెలిసిననాడు, అతన్ని పట్ట పగ్గాలు లేకుండాపోయినై. ఆనాడల్లా ఓమ్మునిగుచుకు తిరి గాడు. మెదిత్తే కదిత్తే మీసాలు దువ్వటం మొదలుపెట్టాడు. కుఱ్ఱాడెట్లావున్నాడో? తనపోలికలే వచ్చుంటాయా? ఎట్లా తెలుస్తుంది? వాణ్ణిచూస్తే బావుండును. మాతాదీన్ మనసు కేరింతలు కొట్టిందానాడు.

మూడవనాడు, పొలంలో రూప కన్పించింది. "నువ్వా సిలియా కొడుకుని చూశావంటే, రూపా?" అనడిగాడు రూపని.

చూడకపోవటంవేంటీ? చూచా! ఎర్రెర్రగా వుంటాడు దుండుముక్కలిమల్లే. కళ్ళు బలేగా వుంటయ్యే! చానా పెద్దయ్యి గూడాను" అన్నది రూప.

ఆ బిడ్డవచ్చి, అతనిమనసులోనే కూర్చున్నట్లూ, కూర్చుని కాళ్ళూ చేతులూ కొట్టుకుంటున్నట్లూ, అనిపించింది మాతాదీన్‌కి. అతని కన్నుల్లో ఆనందం తొణికిసలాడింది. ఆ ఆనందాన్ని పట్టలేక, రూపని భుజాలమీది కెక్కించుకునీ, బుగ్గలుగిల్లీ, నవ్వి నవ్వించీ, ముద్దులు పెట్టుకున్నాడు.

మాతాదీన్ భుజాలమీదినుండి, క్రిందికి దిగి, జుట్టు సవరించుకుంటూ, "పద, దూరాన్నించీ చూపిస్తా నీకు. వసా రాలోనే, పడుకునుంటాడు వుయ్యాలమంచంమీద. ఎందుకనో గాని, యెప్పుడూ యేడుస్తానేవుంటంది సిలియాఅక్కయ్య."

ఆమాటలు వినలేక ముఖంత్రిప్పుకున్నాడు మాతాదీన్. కళ్ళంట నీళ్ళు గిర్రునతిరిగినై; పెదవులు కంపించిపోయినై.

ఆవేళరాత్రి ఊరంతా మాటుమణిగింతర్వాత, సిలియా యింటికి బయలుదేరాడు మాతాదీన్. పసిపిల్లడు గుక్కపట్టి యేడుస్తున్నాడు. ప్రపంచంలోవున్న ఆనందమూ, మాధుర్యమూ, సంగీతమూ-అన్నీ-మేళవించి ఆహ్వానిస్తూన్నట్లనిపించింది మాతాదీన్‌కు.

బిడ్డని హోరీ యింట్లో పండుకోబెట్టి, కూలిచేసుకునేందుకని వెళ్ళిపోయేది సిలియా. ఏదో వొకవంకపెట్టుకుని హోరీ యింటికి వెళ్ళి, ఆపసిబిడ్డని, యేదో వొకవిధంగా కళ్ళారా చూసుకుంటేనేగాని, అతనికి శాంతి వుండేదికాదు.

"అట్టా సిగ్గుపడతావెందుకు? ఎత్తుకో; యెత్తుకుని ముద్దుపెట్టుకో. ఇంత కటిగ్గుండెః నీది? మూడుమూర్తులా నీకుమల్లేనే వుంటాడు" అనేది ధనియా, ముసిముసినవ్వులు నవ్వుతూ.

జేబులోనుంచి, రెండుమూడు రూపాయలుతీసి, సిలియాకిమ్మనిచెప్పి, గబగబా బయటికివచ్చేసేవాడు మాతాదీన్. ఆ పసిబిడ్డతోపాటు అతని ఆత్మగూడ వికసించుతోంది; ప్రకాశించుతూంది; పెద్దదౌతోంది. ఈనాటికి, అతని జీవితానికి గూడా, వొక వుద్దేశం యేర్పడింది; వొక ఆశయం కలిగింది. ఎంతో నిగ్రహంయేర్పడింది. ఎంతో గంభీరంగావుంటున్నాడత నిప్పుడు.

ఒకనాడు రామూ మంచంమీద పండుకునివున్నాడు. ధనియా ఇంట్లోలేదు; ఎక్కడికో వెళ్ళిపోయింది. రూపగూడ ఇంట్లోలేదు; పిల్లల్తో ఆడుకునేందుకు వెళ్ళిపోయింది. ఇంట్లో

యింకెవ్వరూ లేరు. అప్పుడే మాతాదీన్ వెళ్లటంజరిగింది. ఆకాశంవంక చూస్తూ, చేతులు చాస్తూ, కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నాడు రామూ. మాతాదీన్‌ని చూచి, అదేపనిగా నవ్వటం మొదలుపెట్టాడు. వెంటనే, మంచంమీదవున్న కుర్ర వాడిని తీసుకుని, యెత్తుకున్నాడు మాతాదీన్. అతని హృదయం అంతా నీటిఅలలమీద నాట్యంచేసే కాంతిరేఖల్లా వణికి పోయింది. ఆ కుర్రవాడికళ్లు చూస్తూంటే, 'రామూ' కన్నుల్లోకి చూస్తూంటే, ఆ కన్నుల్లోవున్న లోతుల్లోనూ, నిర్మలత్వం లోనూ, అంతులేని ఆనందంలోనూ, తన జీవితసత్యాన్నే చూసుకుంటూన్నట్లనిపించింది మాతాదీన్‌కి. అతనికెందుకోగాని భయంవేసింది. ఆ బిడ్డ కన్నులతన్నిగుచ్చి, గుచ్చి, చూస్తున్నవా అనిపించిది-అతను అపవిత్రుడు. ఈ బిడ్డ యీశ్వర ప్రసాదంతో సమానం. ఈయీశ్వర ప్రసాదాన్ని ముట్టుకునే అర్హత లేదతనికి! మళ్లీ రామూని, మంచంమీద పండుకోబెట్టేశాడు మాతాదీన్. ఏమిటోగాని, ఒక విచిత్రమైన సందేహం కలిగిందతనికి. ఇంత లోనే రూపవచ్చింది. రూపనిచూచి, తనదారిని తాను వెళ్లిపోయాడు.

కొంతకాలం జరిగింది. ఒకనాడు వడగళ్ళవర్షం కురిసింది. సిలియా యింట్లోలేదు; కూలికని వెళ్లింది. రూపగూడ, యెప్పటిలాగానే పిల్లల్తో ఆడుకునేందుకు వెళ్ళిపోయింది. ఇప్పటికి రామూ కూర్చోనటమూ, దేకటమూగూడ నేర్చుకున్నాడు. దేక్కుంటూ, దేక్కుంటూ వాకిట్లోకెళ్లాడు రామూ. వాకిట్లో ఎండబెట్టిన ప్రత్తిగింజలు చూచాడు. ప్రత్తిగింజల్ని చూచి, పంచదారబిళ్ళ లనుకున్నాడు. అనుకుని, కావలసినన్ని తిని,

అక్కడే, వాకిట్లో ఆడుకుంటూ తిరిగాడు. ఆవాళరాత్రే జ్వరం వచ్చింది బిడ్డకి. మర్నాటికది న్యుమోనియాలోకి దింపింది. మూడవనాటి సాయంత్రం, సిలియా వళ్ళోపడుకుని, ప్రాణాలు విడిచాడు.

రామూ చనిపోయాడన్నమాటేగాని, బిడ్డని మరచి పోలేకపోయింది సిలియా. పాలు పొంగి, ఆవిడ రవికె తడిసి పోతూంది. తడిసినరవికెను చూచుకొని, బిడ్డను తలచుకొని, వెక్కి వెక్కి యేడుస్తుంది. ఇదివరకు, పనులన్నీ పూర్తిచేసుకున్న తర్వాత, యింటికి వచ్చి, రామూని ప్రక్కలో పండుకోబెట్టుకొని, స్తనంతీసి బిడ్డనోటికందించి, అతని తలనిమురుతూ పండుకునేది. అలాంటివేళల్లో ఆబిడ్డ జీవితంలో తొణికిసలాడే వికాసం అంతా, తన ప్రాణాలలోకి సంచయం ఔతూన్నట్లుగా ఆనందించేది. అప్పుడు తీయనిగేయాలు పాడుకునేది; చక్కని కలలుకంటూ, నూతనజగాల్ని సృష్టించుకునేది. ఆ స్వాప్నిక జగత్తుకంతటికీ, తనబిడ్డనే, తన రామునే రాజాధిరాజునుచేసి, సంతోషించేది. ఇప్పుడో ? పనులన్నీ పూర్తిచేసుకుని, పూరి పాకలోకి చేరుకుని, కుక్కిమంచంలో పడుకుని, కుళ్లి కుళ్లి యేడుస్తుంది. చనిపోయి, తన బిడ్డ చేరుకున్నలోకానికే వెళ్లి బిడ్డతో ఆటలాడుకుంటూ గడపాలని తపించిపోతున్నాయి ఆవిడ ప్రాణాలు. ఆవిడ దుఃఖంలో పాలు పూరంతా పంచుకుంటోంది. రామూకు కొత్తా, పాతా అంటూ వుండేదికాదు. ఎవళ్ళు చేతులుచాస్తే, వాళ్ళ చంకల్లోకెక్కేవాడు నదురూ, బెదురూ లేకుండా. చనిపోయింతర్వాత, ఆబిడ్డ చేతలూ తలచు

కుంటూంటే మరింత ఆనందంగానూ, మరింత సమ్మోహనంగానూ వుంటోంది.

ఆనాడు మాతాదీన్ బయటపడ్డాడు. శవాన్ని రెండు చేతులమీదా వేసుకుని వొక్కడూ నదివొడ్డుకు వెళ్ళాడు. ఆనాడు చాచినచేతులు అలాగే, కొయ్యల్లా వుండిపోయినై మరో వారంరోజులవరకూ. ఆనాడతను కొంచెంగూడా సిగ్గుపడ లేదు; వెనకాడలేదు.

చూచినవాళ్లెవ్వళ్ళూ 'అదేంటిటి!' అనిగూడా అనలేదు. అందరూ అతని సాహసాన్నీ, ధైర్యాన్నీ ప్రశంసించారు.

"మనిషన్నతర్వాత అట్లావుండాలి. చేయిపట్టుకున్న స్త్రీని వదిలిపెట్టగూడదు" అన్నాడు హోరీ.

"చాల్లే, వూరుకోయిక! యీబుద్ధి మొదటేవుంటే యెంత బాగుండేది. మనిషంట! మనిషీనీ, మట్టిదిబ్బానూ!" అన్నది ధనియా.

ఒక నెలగడిచింది. మళ్ళీ సిలియా కూలికివెళ్ళటం ప్రారంభించింది. ఒకనాటి సాయంకాలం పౌర్ణమినాటిచంద్రుడు కిలకిలనవ్వుతూ వుదయించాడు. పొలంలో పరిగ యేరుకుని, గంపలోవేసుకుని యింటికి బయలుదేరింది సిలియా. వెన్నెలను చూస్తే గడచినకాలం గుర్తుకొచ్చింది. రవికెఅంతా పాల తోనూ, ముఖంఅంతా కన్నీటితోనూ తడిసిపోయింది. అట్లాగే తలవంచుకుని, మోపెడుశోకంతో ముందుకు సాగింది.

ఇంతలోనే, యెవరిదో అడుగులచప్పుడు వినిపించినట్లై, వులిక్కిపడింది. వెనకనించీ వస్తూన్న మాతాదీన్, ముందు కొచ్చి, "ఎంతకాలంవనేస్తావు సిలియా యిట్లా? ఎంతేడిస్తే

మాత్రం వేంలాభం? చనిపోయిన బిడ్డెట్లాగూ రాడు" అన్నాడు.

అంటూనే అతనుగూడా వెక్కి-వెక్కి యేడ్చాడు.

సిలియా, నాలుకచివరికి వచ్చిన యెత్తిపొడువు మాటల్ని దిగమ్రింగి, "యేంటి, యిట్టావొచ్చావేం ఇవ్వాళ" అనడిగింది.

"ఆఁ, యేంవీఁ లేదు. అట్లా వెళ్తూంటే నువ్వుకన్పించావు. అందుకని వొచ్చా!" అంటూ నత్తులుగొట్టాడు మాతాదీన్.

"అబ్బాయిని ఆడించే ప్రాప్తంగూడా లేకపోయిందిగా నీకు" అన్నది సిలియా.

"కాదు సిలియా; ఒకనాడాడించా."

"నిజంగా?"

"నిజం."

"నేనెక్కడికెళ్లాను?"

"బజారు కెళ్ళావనుకుంటా."

"నువ్వెత్తుకొంటే యేడవలా?"

"ఏడవటం వేవిఁటి! అదేపనిగా నవ్వితే."

"నిజంగా?"

"నిజంగానే సిలియా!"

"అయితే వొక్కనాడేనన్నమాట నువ్వాడించింది."

"ఆడించింది ఒకనాడేననుకో. ఐనా చూట్టానికని రోజూ వచ్చెళ్తూనే వుండేవాడిని. మంచంమీద ఆడుకుంటూంటే చూచి, సంతోషించి, వెళ్లిపోయేవాడిని."

"అంతా నీకుమల్లేనే వుండేవాడు."

"ఆపూట యెందుకెత్తుకున్నానా అని యేడుస్తున్నా. నావి అసలే పాపపుచేతులు. పాపం కట్టికుడిపిందేమో."

సిలియా కన్నులు చూస్తే ఆవిడ ఆతన్ని క్షమించినట్లే వుంది. సిలియా నెమ్మదిగా యింటిముఖం పట్టింది. మాతాదీన్‌గూడ ఆవిడవెనకే నడచాడు.

"ధనియాపిన్నమ్మగారి వసారాలో పండుకుంటన్నా నేను. ఏఁవిఁటోగాని యిప్పుడాయింటో పడుకోవాలంటే భీతాహం యేస్తాంది" అన్నది సిలియా.

"ఎప్పుడూ, నాతో మంచీ చెడ్డా మాట్లాడుతూనే వుండేది ధనియా."

"నిజంగా ?"

"నిజంగానే. కనబడినప్పుడల్లా చెబుతూనే వుండేది."

ఊరు దగ్గరకొచ్చింతర్వాత, సరేలే, యికనువ్వు మీ యింటికెళ్లిపో. పండితులు చూస్తారేవోఁ" అన్నది సిలియా.

"ఇప్పుడిక నాకెవరన్నా భయంలేదు" అన్నాడు మాతాదీన్, ఒళ్ళువిరుచుకుంటూ.

"ఇంట్లోనిం చెళ్లగొడ్తే యేంజేస్తా?"

"నేను వేరే యిల్లేసుకున్నా."

"నిజంగానా?"

"నిజవేఁ"

"ఎక్కడా? నేను చూల్లేదే!"

"పద! చూపిస్తా!"

ఇద్దరూ బయల్దేరారు. ముందు మాతాదీన్. అతని వెనుక సిలియా. హోరీ యిల్లువచ్చింది. గబగబావెళ్లి, హోరీ యింటివెనకవున్న పూరిపాకగుమ్మంలో నిలబడి, "యిదే మనిల్లు!" అన్నాడు మాతాదీన్.

"ఇది సిలియా మాదిగదాని యిల్లుకాదూ!" అన్నది సిలియా (ఆ మాటల్లో అపనమ్మకమూ, క్షమా, వ్యంగ్యమూ మూడూ ముప్పిరిగొన్నట్లుంది).

పూరిపాక తడిక తెరుస్తూ "ఇది నాదేవిగారి మందిరం. ఇది నా పూజామందిరం" అన్నాడు మాతాదీన్.

సిలియా కళ్ళు మెరసినై. "మందిరమైతే ఒకచెంబుడు నీళ్ళు గుమ్మరిచ్చిపోతావ్" అన్నది.

సిలియా నెత్తిమీదిగంప దింపుతూ; "కాదు సిలియా. నాకంఠంలో ప్రాణంవున్నంతకాలం నిన్నొదిలిపెట్టే దిలేదు. నీపూజే చేసుకుంటూ కూర్చుంటా" అన్నాడు మాతాదీన్, వణకే కంఠంతో.

"వట్టి అబద్ధాలు."

"కాదు సిలియా. కావాలంటే నీపాదాలంటి చెబుతా. అన్నట్లు, పటేశ్వరీ కొడుకు నీయింటిచుట్టూ, ఆదేపనిగా తిరుగుతూంటే, చీవాట్లుపెట్టావని విన్నాను. నిజమేనా?"

"నీకెవళ్ళు చెప్పారు?"

"వాడే చెప్పాడు."

"నిజంగానేనా?"

"నిజం!"

నిప్పుపెట్టె గీసి, పొయ్యి వెలిగించింది సిలియా. ఒక నైపున మట్టికుండ; మరోనైపున పొయ్యి. నాలుగైదు యిత్తడి పాత్రలు బాగామెరుస్తూవున్నాయి వొకమూల. గుడిసెమధ్య ఒక చాపపరచి వుంది, అదే సిలియాకు ప్రక్క. ఆప్రక్కకి తలగడ నైపున, వుయ్యాలమంచం వొకటివుంది. దాని ప్రక్కనే రెండు మూడు లక్కబొమ్మలుగూడా పడివున్నాయి. మాతాదీన్ చాపమీద కూలబడ్డాడు. అతని హృదయంలోవున్న బరువు, గుండెలు పగిలేట్లు యేడుస్తేనేగాని తరిగేట్లు లేదు.

" ఎప్పుడైనా నన్ను తల్చుకునేవాడివేనా ? అనడిగింది సిలియా అతని వీపు నిమురుతూ.

సిలియా చేయిపట్టుకుని, "అనుక్షణవూం కళ్ళముందు కట్టినట్లు కన్పించేదానివి. నీకెప్పుడైనా జ్ఞాపకం వస్తూండేవాడినా నేను ? " అనడిగాడు మాతాదీన్.

" నువ్వంటేనే మండేదినాకు."

" జాలివేసేదిగాదూ ? "

"చచ్చినా."

"ఐతే, పరమేశ్వరిగారబ్బాయి..."

"ఇకచాల్లే. తిట్టబాకమరి. నాకు భయంవేస్తాందిగూడాను; వూళ్లోవాళ్లందరూ యింటారేవోం."

"మంచివాళ్లైతే, నేను చేసిందే ధర్మంఅంటారు. చెడ్డవాళ్లమాటల్ని నేను లెక్కేచెయ్యను."

"అయితే నీకన్నం యెవరొండి పెడతారు ?"

"నారాణి సిలియా."

"బామ్మలొప్పుకోరుగా !"

"నాకీ బ్రాహ్మణత్వం అవసరం లేదు. నేను మాదిగనే ఐపోతాను. తన కర్తవ్యం పూర్తిచేసేవాడే బ్రాహ్మడు; చెయ్యని వాడే మాదిగ !"

మాతాదీన్ మెడని చేతుల్తో పెనవేసి, ముందుకు లాక్కుంది సిలియా.

454

# 25

హెూరీ పరిస్థితి రోజురోజుకూ అధ్వాన్నం ఐపోతూంది. జీవితంలో జరిగేసంఘర్షణలో, యెప్పుడూ అపజయమే పొందుతూన్నా, ధైర్యాన్ని వదిలిపెట్టకుండా, నిబ్బరంగా నిలబడుతూ వచ్చాడు. ఇంతకుపూర్వం, ఓడిపోయినాసరే, లెక్కజెయ్యకుండా; అదృష్టంతో తలపడి, సిగపట్టులుపట్టేవాడు. రానురాను ఓపిక సన్నగిల్లి పోయింది. ఆత్మవిశ్వాసంఅంటూ లేకుండా పోయింది. పోనీ, తాను ధర్మం అనుకున్నదాన్ని నమ్మి నిలబడ్డాడాఅంటే అదీలేదు. అట్లావున్నా యేదోవొక ఆత్మ సంతృప్తంటూ వుండేది. నీతికి నీతికీ చెడ్డాడు. వ్రతం చెడ్డా ఫలితం దక్కలేదు. బాగా వుంటుందనుకున్న భవిష్యత్తు, యెండమావుల్లా యెప్పుడూ దూరందూరంగానే వుంటూంది. ఎప్పుడో ఒకసారి బాగుపడకపోతామాఅనే భ్రమగూడా లేకుండాపోయింది. ఆ మూడునాలుగు కుంటల పొలంచుట్టూ కోట కట్టుకున్నాడు; ఆ కోటమధ్య గూర్చుని, ఆ పొలాన్ని ప్రాణాలకంటె మిన్నగా చూచుకుంటూ వచ్చాడు. ఉపవాసాలున్నాడు. అపవాదులు సహించాడు. కూలి చెయ్యటానికిగూడా వెనకాడలేదు. ఎన్నిసహించాల్సివచ్చినా సహించాడు, ఆకోటని

చేతుల్లోనుంచి జారిపోకుండా వుంచుకునేందుకు. ఏంలాభం? తానొకటి తలిస్తే దైవం వేరొకటితలచాడు. ఇన్ని సంవత్స రాలనుండీ కాపాడుకుంటూవచ్చిన ఆకోట, చేతుల్లోనుంచి జారిపోబోతూంది. బాకీలు మూడు సంవత్సరాలనుంచీ పేరుకు పోతున్నాయి. నోఖేరాం బేదఖలీ దావాగూడా వేశాడు. ఋణం పుడుతుందనే ఆశంటూ లేదు; ఋణం దొరక్కపోతే బాకీ యెట్లాతీరుస్తాడు? బాకీ చెల్లగట్టెయ్యకపోతే భూమి నిలవదు. భూమి నిలవకపోతే? బ్రదికినంతకాలమూ కూలో, నాలో చేసుకుని కడుపు నింపుకోవాలి. ఏంచేస్తాడు. అంతా దేవుడి దయగావుంది. జమీందారుగారి ననేంలాభం! ఆసాముల లుంటేనేగా ఆయనకీ గడిచేది. ఈవూళ్లోనే సగంయిళ్ళకుపైగా బేదఖలీ దావాల్లో మునిగివున్నై. నలుగురితోపాటే తనబ్రదు కూనూ. తానే అదృష్టవంతుడైతే, చేతికందొచ్చినకొడుకు దూరదేశాలెందుకు పోతాడు? ఇంటిపట్టునే వుండేవాడు.

సాయంకాలం ఐంది. హోరీ యిదే ఆలోచిస్తూ కూర్చు న్నాడు. ఇంతలోనే శాస్త్రిగారు వచ్చాడు — "ఏఁ హోరీ? బేదఖలీ యేఁవయ్యింది? ఈమధ్య నాకూ, నోఖేరాంకీ మాటల్లే కుండాపోయినయ్యే. ఇంకా పదిహేన్రోజులు గడువుందని విన్నాను, నిజఁవేఁనా? అనడిగాడు శాస్త్రి.

లేచి, శాస్త్రిగారు కూర్చునేందుకని మంచంవాల్చి, "ఆయనకేఁ? మహారాజు! ఆయన దయా, మా ప్రాప్తీ. నాదగ్గర డబ్బుంటే ఈ గొడవలన్నీ యెందుకొస్తయి. నేనుమాత్రం యేం చేశాను? త్రాగానా, తందనాలు తొక్కానా? దుబారా

చేశానా! పంటలే పండవాయె. పండినా, ధరలు అసలేపడి పోయినై. ఇక రైతుమాత్రం వేంజేస్తాడు!" అన్నాడు హోరీ.

"ఎంతజెప్పినా తాతల్నాటి ఆస్థి. అదిపోతే యిక గడిచే డెట్లా! అదీ ఆలోచించుకోవాలిగదామరి."

"నేనేం చెయ్యగలను చెప్పండి. అంతా ఆ దేవుడిదయ."

"ఒక్క వుపాయం చెప్తాగాని వింటా!"

అభయదానం దొరికినట్లయ్యింది హోరీకి. శాస్త్రిగారి కాళ్లుపట్టుకుని, "బాబ్బాబు, నీకు పుణ్యంవుంటుంది. నీకాళ్ళకి మొక్కుతా. ఉపాయం వేంటి బాబూ!" అనడిగాడు.

" అంత భయపడతావెందుకోయ్ పిచ్చివాడా! సుఖాల్లోవున్న మనిషి ధర్మం వేరు; దుఃఖాల్లోవున్న మనిషి ధర్మంవేరూనూ. చూశావ్, డబ్బు బాగావున్నప్పుడు దానం చేస్తాం, చేతిలో డబ్బులేకపోతే, చెయ్యిచాచి బిచ్చం వెత్తుకుంటాం. అదప్పటిధర్మం; ఇది యిప్పటిధర్మం, ఆరోగ్యంగావున్నప్పుడు స్నానవూ, పూజాలాంటివి పూర్తిచేసుకుంటేనేగాని భోజనంచెయ్యం. సరేనా! జబ్బుగావున్నప్పుడంటే స్నానం చెయ్యకుండానే, బట్టలు మార్చుకోకుండానే మంచంమీదే కూర్చుని పథ్యంతీసుకుంటాం; కాదూ! అంతేమరి. అదప్పటి ధర్మవూ, యిదిప్పటి ధర్మవూనూ. ఇదంతా యెందుకూ! ఈ వూళ్ళో నీకూ మాకూ యింత తరతమ భేదాలున్నయ్యా; పూరీ జగన్నాథం వెళ్తే అందరవూ సహపంక్తిని కూర్చుంటాం; ఈభేదాలేవీ వుండవక్కడ. ఆపత్కాలంలో శ్రీరామచంద్రు డంతటివాడు, శబరి యెంగిలిచేసిచ్చినపళ్లు తిన్నాడు. చెట్టుచాటు

న్నించాని, వాలిని చంపేశాడు. మానవమాత్రులం; మన దేం వుంది! రాంసేవక్ మహతోని యెరుగుదువుగా నువ్వు?"

"ఎరక్కేం బాబూ" అన్నాడు హోరీ, నిరుత్సాహంగా.

"మా గ్రామందేలే. బాగా వున్నవాడుగూడాను. పొలవూం, పుట్రా అదీ — మంచిహోదా వున్నవాడులే! ఈ మధ్యనే ఆయనగారి భార్య కాలంచేసింది. బిడ్డా, పాపాగూడా యెవళ్లూలేరు. మన రూపని ఆయనగారికిచ్చిగనక పెళ్లిచేసే శాంవూంఅంటే మనతిప్పలు తగ్గిపోతాయి. నువ్వు 'వూం' అంటే వెళ్లి ఆయన్నెట్లాగో ఒకట్లా వొప్పించేభారం నాది. పిల్ల గూడా పెద్దమనిషయ్యిందా, రోజులూగూడా మంచివిగాదు. కాస్త కాలుజారటవోం పొరపాటు జరగటవోగనుక జరిగేటట్లైతే యిక మొఖం వెత్తుకుని తిరిగే ప్రాప్తంఅంటూ లేకుండాపోతుంది. ఇదే మంచి అవకాశంగూడాను. ఇటు పిల్ల పెళ్లిఐపోతుంది; అటు పొలవూం దక్కుతుంది. ఏవంటావ్?"

హోరీకి, రాంసేవక్కీ- రెండేళ్లే తేడా వయస్సులో. అంత వయసుమళ్లినవాడికి, రూపనిచ్చి పెళ్లిచేయటమే అవమానం. పువ్వులాంటిపిల్లను చూస్తూచూస్తూ కాటికి కాళ్ళుజాచిన వాడికిచ్చి పెళ్ళిచేయటమా? ఇప్పటికే అనేక దెబ్బలుతిన్నాడు హోరీ. వాటన్నిటికంటే ఘోరంగా వుంది యిది. వాళ్ళూ వీళ్ళూ వచ్చి, "నీపిల్లని అమ్ముకో?" అని చెబుతూంటే విని వూరుకోవలసిన రోజులుగూడా వచ్చిన య్యీనాటికి. ఏం చేస్తాడు? కాదనేందుకు సాహసంలేదు. అవమాన భారంతో తలవంచుకున్నాడు.

ఒక నిమిషం ఆగి, "ఐతే యేఁవంటావ్ మరి?" అనడిగాడు శాస్త్రి.

ఉన్నవాడున్నట్లు జవాబుచెప్పలేకపోయాడు హోరీ. "ఆలోచించి చెపుతాలెండి" అన్నాడు.

"ఇందులో ఆలోచించవలసిందేఁవుంది?"

"ఇంటిదాన్ని గూడా అడిగితే బాగుంటుందిగదా అని."

"నీ కిష్టంబౌనా, కాదా?"

"కాస్త ఆలోచించుకోనియ్యండి బాబూ! ఇంతవరకూ, యింటావంటా జరగలేదిట్లాంటిపని. వంశం సంగతిగూడా ఆలోచించుకోవాలిగా."

"నాలుగైదురోజుల్లో ఆలోచించుకుని చెప్పేసెయ్యి. లేకపోతే నువ్విట్లా ఆలోచిస్తూ కూర్చుంటే, బేదఖలీ రోజులుగూడా దగ్గరకొచ్చేస్తై."

శాస్త్రి వెళ్ళిపోయాడు. హోరీ అంగీకరించడన్నసందేహం ఎప్పుడూ లేదు శాస్త్రికి. కాకపోతే ధనియా ఏమంటుందోనన్న భయం లేకపోలేదు. వంశగౌరవంఅంటే పడిచస్తుంది. ఎన్ని కష్టాలొచ్చినా, వంశమర్యాదనిమాత్రం వదిలిపెట్టదు. ఏదేమైనా, హోరీ గనక 'ఊఁ' అన్నాడంటే, యేడ్చి, మొత్తుకుని, నానాగల్లంతూ చేసి, చివరికిమాత్రం, తానూ అంగీకరిస్తుంది. అది గాకపోయినా, ప్రాణాలు పోతేమాత్రం పోదూ వంశ మర్యాద?

"శాస్త్రిరిగారెందుకూ వచ్చాడు?" అనడిగింది ధనియా.

"ఆఁ; యేఁవీఁలేదు. అదే ఆబేదఖలీనిగురించి మాట్లాడదామని."

"కళ్లనీళ్ళు తుడవడానికొచ్చాడా? అంతేలే! లేకపోతే మాకొందరూపాయలు అప్పివ్వటానికొచ్చాడని నేనుమాత్రం అనుకోవచ్చానంటలే."

"ఏంమొహం పెట్టుకుని అడుగుతాఁవ్లేవే."

"అంతకాడికింకా యిక్కడికి రావటఁవెందుకూ అంట"

"అదే, రూప పెళ్ళినిగురించి."

"వియ్యాఁ వెవరూ?"

"రాంసేవక్ గారు. తెలవదూ? ఆయనే."

"నే నెప్పుడుచూశానూ? పేరుమట్టుకింటూనే వున్నా చాలారోజుల్నుంచీ, ముసలాడు గాదూ?"

"ఎం ముసలాడులే. నడికారు మనిషి."

"నాలుగుచీవాట్లు పెట్టలేకపోయా శాస్త్రిని? నాకో అనాలిసింది చెప్పేదాన్ని."

"చీవాట్లు పెట్టలేనుగాని, కుదరదని చెప్పేశాలే. ఖర్చూ గిర్చూలేకుండా పెళ్ళికిపెళ్ళీ ఐపోతంది; పొలాలకి పొలాలూ దక్కతయ్యంటన్నాడాయన."

"ఈ డొంకతిరుగుడు మాటలన్నీ యెందుకు. పిల్లని అమ్ముకోవఁన్నాడని చెప్పేసెయ్యక? ఆడి నోరుపడిపోను; నో రెట్టా వచ్చిందంట ఆమాటనటానికి."

కాని, ఆలోచించినకొద్దీ, హోరీకి మొట్టమొదట్లోవచ్చిన కోపం తగ్గిపోవటం మొదలెట్టింది. కులగౌరవం అంటేనూ, వంశ ప్రతిష్ఠఅంటేనూ అతనికి ప్రేమ లేదనికాదు. కాని అసాధ్యమైన రోగంతో బాధపడేవాడిని పథ్యంచెయ్యమంటే చేస్తాడూ? శాస్త్రిముందు వొప్పుకోనిమాట నిజమేకాని, లోలోపల ఆలో

చించుకుచూస్తే 'యిందులోమాత్రం తప్పేంవుంది?' అనిపిస్తూంది. వయస్సుదేముంది ? చావటం, బ్రదకటం అంతా దైవాధీనం. ముసలివాళ్లు బ్రదికుండగానే పడుచువాళ్ళు చనిపోవటం చూడటంలా? దానినొసట యెట్లారాసివుంటే అట్లాజరుగుతుంది. మనం యేంచేస్తేమాత్రం, దాని నొసటిగీత తుడిచి వెయ్యగలమా ? పిల్లని అమ్ముకోవటంఅనే యెందుకనుకోవాలి? తీసుకున్న డబ్బు అప్పుగా తీసుకుంటాడు. తర్వాత నెమ్మది మీద తీసుకుంటాడు. ఇందులో అవమానం యేంవుంది? నిజమే మరి! శక్తివుంటే, రూపకు తగినవరుణ్ణి చూచే పెళ్లిచేసేవాడు, మంచి కులమూఅదీ చూచి; కట్నంకూడా యిచ్చేవాడు. బాజాభజంత్రీలతో చేసేశేవాడు, ఖర్చౌతుందని వెనకా ముందూగూడా చూడకుండా. దేవుడు తనపక్షాన లేడు; ఎంతనుకుంటే యేంలాభం? లోకులు నవ్వుతారూ? నవ్వుకోనీ; ఒడ్డున కూర్చున్నవాళ్ళ కేం తెలుస్తాయి తాను పడే కష్టాలు ! ఇంతకూ అసలు ధనియా ఒప్పుకుంటుందాఅని ? అసలే వెనకా ముందూ తెలియదు. ప్రాణాలుదక్కే ఆశ కన్పించటంలేదుగాని కులగౌరవాన్ని దక్కించుకోవాలట. అంతైదైతే నాలుగైదొందలు పట్టుకురాక పోయిందీ, తెలిసొచ్చేది.

రెండురోజులు గడచినయి. భార్యాభర్త లిద్దరిమధ్యా మళ్ళీ, యీ ప్రస్తావన రాలేదు. కాని సూటిపోటిమాటలు మాత్రం జరుగుతూనేవున్నయి.

"మొగుడూ పెళ్ళాలు చిలకాగోరింకలికిమల్లే వుంటేనే పెళ్లిచేసినా, చూసినా అందం" అనేది ధనియా.

"పెళ్ళికి అందంయేఁవిఁటే పిచ్చిదానా! పెళ్ళంటే తపస్సే! తెలుసా?" అనేవాడు హోరీ-

"చాల్లే ఊరుకో. తపస్సంట తపస్సు."

"అంతేలేవే. నీ కేం తెలుసు?"

మర్నాడు యింకో క్రొత్తఆలోచనగూడా తట్టింది ధనియాకు. అత్తింట్లో అత్త, మామ, మరది, ఆడబిడ్డ- అందరూ- వుంటేనే అందం. లేకపోతే ముద్దూ, ముచ్చటా తీరనేతీరవు.

"వాళ్ళందరూవుంటే యింకా ముద్దూముచ్చ టైనక్క డుంటాయే నీ పిచ్చిగాని" అన్నాడు హోరీ.

"ఊఁ. నీమాటలన్నీ యిట్టాగేవుంటయ్. వెనకా ముందూ యెవళ్ళూలేకపోతే కాపరం యెట్టాకడ తేరతంది?"

"నువ్వీయింట్లోకొచ్చినప్పుడు ఒక్కడుగాదు, యిద్దరు మరుదు లుండేవారు. అత్తుండేది. మాఁవయ్యుండేవాడు. నువ్వేం సుఖం అనుభవించావు చెప్పు!" అనడిగాడు హోరీ.

"దేశంలోవాళ్ళందరూ మనకిమల్లేనే వుంటారంట కాద్దూ."

"ఏఁ? లేకపోతే ఆకాశంనించి దిగొస్తారనుకొన్నావా? ఇంట్లోవుండే కోడలొక్కతేగా ఇంట్లోవాళ్ళందరూ దాని మీద సవారీచేస్తే దానిబతుకేఁవౌతుంది? చెప్పు!"

ఇట్లాగే, రానురాను ధనియా కొమ్ము తేలికైపోతోంది. నాలుగోనాడు రాంసేవక్ గారు స్వయంగానే విచ్చేశారు గుఱ్ఱం యెక్కి. ఒక మంగలీ; యింకో నౌకరూగూడ వచ్చారు ఆయన వెంట. అంతా జమీందారీఫాయీలాగా వుంది. నాలుగో పడి

దాటినట్లేవుంది.తల బాగానే నెరసిపోయిందిగాని,వళ్లుమాత్రంగట్టి గానే వుంది. కాయశరీరం. అతని ప్రక్కనని లబడితే, హోరీయే ముసలివాడిలాగా కనబడుతున్నాడు. ఏదో వ్యాజ్యం వ్యవహారంమీద బయల్దేరాడట రాంసేవక్. సూర్యుడు నడినెత్తిమీదికొచ్చాడు. ఎండ మాడేస్తూంది. ఈచెవివడ ఆచెవికి తగులుతోంది. అందుకని, కాస్సేపు నీడనుకూర్చుని, ప్రొద్దు వాలింతర్వాత, బయల్దేరదామని వచ్చాడట. కోమటింటికి వెళ్లి, గోధుమపిండీ, నెయ్యీ పట్టుకొచ్చాడు హోరీ. పూరీలు వండారు. అతిథులుముగ్గురూ కలిసి, పూరీలు ఖాళీచేశారు. ఆశీర్వాదం యిద్దామని, శాస్త్రిగారుగూడ వచ్చారు, అదే సమయానికి.

"వ్యాజ్యం యేవిటండీ?" అనడిగాడుశాస్త్రి, రాంసేవక్ని.

రాంసేవక్గారు చాలాదర్జాగా, జవాబుచెప్పటం ప్రారంభించాడు. — "వ్యాజ్యాలదేవుందిలెండి; ఎప్పుడూ యేదోవొకటి వుంటూనేవుంటుంది. మెత్తగావుంటే బ్రదకనిస్తుందండీ ఈ లోకం! మెత్తగావుంటే మొత్తబుద్ధేస్తుందని ఈపోలీసులు, ఈ కచ్చేరీలు, ఇవన్నీయెందుకుచెప్పండి వున్నది. మననిరక్షించటానిగ్గాదూ! ఐనా మనమూ టేవినిపించుకోరువాళ్లు. ఎటుచూచినా ఒక టేదోపీడీ. నోరులేనివాళ్ళని దోచటానికి అందరూ మొనగాళ్ళేగదామరి? ఏంచేస్తాం చెప్పండి. పోనీ, వూరుకుందామూఅంటే, అన్యాయం జరుగుతూంటే చూస్తూ వూరుకోవటం అంతకంటే మహాపాపం. రైతులబ్రదుకు చూడండి; దినదిన గండంగాదూ? పట్వారీకి నజరానా యివ్వ

లేకపోతే, వూళ్ళోనే వుండనివ్వడు. జమీందారుగారి యేజెంట్లకి మామూళ్ళివ్వకపోయినా జరగదు. ఇక కాన్స్టేబుల్ సంగతీ, ఠాణేదారుగారిసంగతీ చెప్పాల్సినఅవసరమేం లేదు: ఇంటి అల్లుళ్ళలాగావచ్చి కూర్చుంటారు మెక్కటానికి! లేకపోతే ఏదోవొకరిపోర్టు రాసిపారేసేస్తామంటారు. తాసిల్దారొచ్చినా, డిప్టీకలెక్టరొచ్చినా, కలెక్టరొచ్చినా చేతులుకట్టుకుని నిలబడాలా? ఆ మహానుభావులందరికీ కాఫీలదగ్గర్నుంచీ, కోడిమాంసందాకా సప్లై చేస్తూనేవుండాలామరి? ఎంతమందికని చేస్తాం? చెరువుల్లో మందుకలుపుతానంటూ డాక్టరుగారొస్తాడు. పిల్లల పరీక్షలంటూ పరీక్ష పంతులొస్తాడు. ఇట్లాగేమరి! కాలువలు చూట్టానికొకడు, పొలం చూట్టానికొకడు, సారాభట్టీలకొకడు, గ్రామ పునర్నిర్మాణానికొకడు, అబ్బ, లెక్కపెట్టాలంటే దుంప తెగుండనుకోండి. ఇంతమందొస్తున్నారా? ఇందులో యెవడైనా రైతుకు మేలుచేస్తున్నాడేమో చెప్పండి. ఒక్కడు, లెక్కకొక్కణ్ణి చూపించండి వేలుమడిచి. నిన్నగాకమొన్న జమీందారుగారు, నాగలికొక్కంటికి రెండురూపాయలు చందాయివ్వండంటూ కబురంపాడు. ఎవరో ఆఫీసరుగారికి విందు చెయ్యటానికట. రైతులు 'మేం యిచ్చుకోలేం బాబూ!' అన్నారు. ఇంకేం వుంది, జమీందారుగారు అగ్గిమీదగుగ్గిలం ఐపొయ్యాడు. జప్తుచేస్తానంటూ చాటింపేయించాడు. ఇదంతా చూస్తూంటే నాకూడా మండింది; యేమాటకామాట చెప్పాలి. వెంటనే నేనుగూడా టముకేయించా, కాండబ్బుగూడా చందా యివ్వొద్దు; ఏమౌతుందో చూద్దాంఅని. ఊళ్ళోవాళ్ళందరూ నామాటమీదే నిలబడ్డారు కట్టుకట్టినట్టు. ఐకమత్యంఅంటే

అట్లావుండాలి. జమీందారుమాత్రం వేంచేస్తాడు? రైతులు పొలాలు దున్నకపోతే ఆయనబ్రతుకుమాత్రం బజార్లోపడదూ? దిగొచ్చాడు. చచ్చినట్టు. ఈ రోజుల్లో మొరాయించకపోతే లాభంలేదండీ. అడగందే అమ్మగూడా పెట్టదని వూరికేనా అన్నారు మనపెద్దవాళ్ళు?"

శాస్త్రి చల్లబడింతర్వాత, వెళ్ళిపోయాడు రాంసేవక్. అతనిమాటలు విన్నతర్వాత హోరీ, ధనియాలిద్దరూ అభిప్రాయాలు మార్చుకున్నారు. శాస్త్రిగారిమంత్రం పారినట్లయ్యింది.

"ఇప్పుడేంవంటారు?" అనడిగాడు శాస్త్రి.

"దాన్నే అడగండి" అన్నాడు హోరీ, ధనియాకేసి చూస్తూ.

"అదికాదయ్యా. ఇద్దర్నీ అడుగుతున్నాగా నేను" అన్నాడు శాస్త్రి.

"బాగా ముదురుమనిషే. సరే, మీ యిష్టం వచ్చినట్టే కానివ్వండి. దేవుం డేంరాస్తే అదేజరుగుతుంది. మనిషిమట్టుకి మంచాడే!" అన్నది ధనియా.

హోరీకిమాత్రం బాగాసంతోషంగానేవుంది. మునిగిపోయేవాడు గడ్డిపరక దొరికినాసరే, ఎంతో ఆప్యాయంగా పట్టుకుంటాడు.

పెండ్లిముహూర్తం నిశ్చయించుకున్నారు. గోవర్ నిగూడా పిలవాలిసిందే పెళ్లికి. వ్రాసేబాధ్యత నెరవేర్చుకుంటే, రావటం రాకపోవటం వాడిష్టం. 'నువ్వు నన్ను పిలిచావా నేను రావ

టానికి?' అని వాడడగటానికిమ్మట్టుకు సందుండగూడదు. సోనాకి గూడా ప్రమాణం చెప్పించాలి.

"నాబిడ్డకి రావాలనేవుంటంది; మెంతుంటేమేఁలే? ఝునియా రానివ్వొద్దూ? దేశాంతరం వెళ్లాడు; వుత్తరవూఁ లేదు. పత్రవూఁలేదు. ఎట్టావున్నాడో బిడ్డ" అంటూ కళ్లనీళ్లు పెట్టుకుంది ధనియా.

గోవర్‌కు శుభలేఖ అందింది. వెంటనే బయల్దేరటానికి తయారయ్యాడు. ఝునియా కంతగాయిష్టంలేదు. కాని ఇట్లాంటి శుభసమయాల్లో 'వెళ్లొద్దు?' అని యెట్లాఅంటుంది? చెల్లిలి పెళ్లికి అన్న వెళ్ళకపోతేయెట్లా? సోనా పెళ్ళికూ్కడా వెళ్ళ లేదయ్యె.

"ఎంతకాలఁవని కన్నాళ్ళకి దూరంగావుంటాం? ఇవ్వాల్టికి కాళ్ళూ చేతులూ వచ్చినయ్ కాబట్టి కొట్టుకుంటాం, కీచులాడు కుంటాం. ఎన్ని చెప్పినా కన్నకడుపులుగాదూ? పెంచారు; పెళ్లాణ్ణిచేశారు. వాళ్ళు నాలుగుమాట లనావచ్చు; మనం పడావచ్చు. మకీ నాలుగైదు నెల్లనించీ, వొకటే మనేదగావుంది నాకు. అప్పుడెందుకొచ్చిందో అంత వెధవకోపం. నీమూలాన కన్నాళ్ళనిగూడా వదులుకోవలసొచ్చింది" అన్నాడు గోవర్ కష్టంగా.

ఝునియాకు కోపంవచ్చింది. "ఆ అపవాదుమాత్రం నామీదెయ్యొద్దు. ఆఁ. నువ్వు పోట్లాడొచ్చి, నన్నంటా వెందుకు? నేనన్నిరోజులున్నా నత్తగారింటో, ఒక్కనాడన్నా పోట్లాడుకు నెరుగుదువూఁ?"

"నీమూలానే వచ్చింది పోట్లాట."

"సరే. నామూలానే వచ్చిందనుకో. నేనుమాత్రం నీకోసంవంని నాయిల్లూ, చుట్టాల్నీ వదిలిపెట్టెయ్యాలా?"

"ఆఁ; కాదూమరి! మీ యింటోవాళ్ళ కెవళ్ళికైనా నువ్వంటే పడిచచ్చిందీ? మీ అన్నాదమ్ములకేవోఁ నువ్వంటే యిష్టవేఁ లేదయ్యె; మీ వదిన్లేవోఁ నిన్నే డిపించుకునితినేవారాయె. ఇక మీ అయ్యసంగతి చెప్పాల్సినఅవసరవేఁ లేదు. నువ్వు కనబడితేనేచాలు నిప్పులుతొక్కిన కోతికిమల్లే యెగిరేవాడు."

"అదంతా నీమూలానేగా!"

"ఇకనుంచీ యేంచేసినాసరే, వాళ్ళకిష్టంలేనిపనిమాత్రం చెయ్యగూడదు. మా నాన్న చాలామంచాడుగూడాను; ఎప్పుడూ నన్ను కసురుకోనుగూడా కసురుకోలేదు. అమ్మంటే అప్పుడప్పుడూ కొట్టావుండేదిగాని, కొట్టగానే తింటాసికేదో వొకటి పెట్టేది."

ఇద్దరూకలిసి యజమానిదగ్గర కెళ్ళారు. గోవర్ యిప్పుడు లేడీ డాక్టరుగారిదగ్గర పనికికుదిరాడు. ఆవిడపేరు మాలతి. శలవు అప్పటికప్పుడే యిచ్చేసింది ఆవిడ. అంతేగాదు. పెండ్లి కూతురుకని ఒక రాట్నమూ, ఒక గాజులజతా యిచ్చింది. ఆవిడగూడా పెళ్ళికి వెళ్ళాలనే అనుకుందిగాని, అర్జంటు కేసు లుండటంమూలాన వీల్లేకపోయింది. ఎట్లాగోట్లా వీలుచేసుకుని పెండ్లినాటికిమాత్రం తప్పకవస్తానని చెప్పింది. కుర్రవాడికని, కావలసినన్ని ఆటబొమ్మలు కొనిపడేసింది. వాడంటే ఆవిడకు ప్రాణంతో సమానం; ఎప్పుడూ యెత్తుకుని ముద్దులాడు తూండేది.

గోవర్ గ్రామంలోకి వచ్చేశాడు. వచ్చి, యింటిపరిస్థితి చూస్తే, వచ్చినవాడొచ్చినట్లు ఆపళాన తిరిగి వెళ్ళిపోదామనిపించింది. ఇల్లంతా పడిపోయేట్లుంది; ఒకవైపుగోడ పడిపోయి దిగూడాను. చావడిగూడా బేలుమంటోంది. ఒక్కటే యెద్దు వుంది చావట్లో. అదిగూడ ముసలిదై పోయింది. అతన్ని చూచి, ధనియా, హోరీ - యిద్దరూ - చాలా సంతోషించారు. కాని గోవర్‌కుమాత్రం విచారంగానేవుంది. ఈ యిల్లెప్పటికి బాగుపడుతుందో అర్థంకావడంలేదు. నిజమే; తాను నౌకరీ చేస్తున్నాడు; అయితేనేం? కడుపునిండా తింటున్నాడు. నౌకరీ చేస్తూన్నా, పట్టణంలో ఐతే, ఆ వొక్కయజమానీ చెప్పిన మాటవింటే చాలు. ఈ వూళ్ళో అట్లాగాదు. కనిపించినవాడు ప్రతివాడూ 'అప్పులు' చేస్తూనేవుంటాడు. ఏటిపొడుగూతా, కష్టపడి పనిచేసి, పంటలుపండిస్తే, తీరా నోటివగ్గరకి వచ్చేప్పటికి, యే అప్పులవాడో వచ్చి, గ్రద్దలా తన్నుకుపోతాడు. ఇక కూర్చుని 'రాంభజన' చేసుకోవాలి!

నాన్నకాబట్టి, యిదంతా సహించి బ్రతుకుతున్నాడు. తానైతే వొక్కరోజుగూడా వుండగలిగేవాడుకాదు. ఇట్లా బాధలుపడుతూంది హోరీ వొక్కడేనేమోననుకుంటే అదీ గాదు. ఊళ్ళోవాళ్లందరూ అంతే. ఆ వూళ్లోవాళ్లల్లో యెవళ్లకీ ప్రాణాలంటూ వున్నట్లు కన్పించదు; ప్రాణాలకిబదులు బాధల్ని పెట్టుకూర్చున్నా రాశరీరంలో అనిపిస్తుంది. ఒఠి తోలు బొమ్మల్లా బ్రతుకుతున్నారు అందరూనూ. నడుస్తారు, పనులు చేసుకుంటారు, 'దణ్ణాలు' పెడతారు. కాని యివన్నీ వాళ్లు కావాలని చేస్తూన్నట్లు కన్పించదు. అట్లా చేయాల్సిని

వాళ్ళ 'గీత'లో వుందికాబట్టి చేస్తున్నారనిపిస్తుంది. వాళ్ళ బ్రదుకులన్నీ యెండిపోయినై; ఎప్పుడో, యెక్కడో యేదైనా కాస్త పచ్చదనం వుండివుంటే, యెండి, ముడుతలు పడిపోయింది. వాళ్ళ జీవితంలో ఆనందం లేదు; వాళ్ళ జీవితానికి 'ఆశ' లేదు. జ్యేష్ఠమాసం వచ్చింది. కళ్ళాల్లో ధాన్యం రాసులు పడివుంది. ఐనా ఒక్కడుగూడా సంతోషంగా లేడు. పండిందంతా అప్పుల వాళ్ళకీ, జమీందారు యేజంట్లకీ కొలిచేస్తే, వాళ్ళకింకా మిగిలే దేం వుంటుంది? భవిష్యత్తంతా అంధకారబంధురంగా వుంది. ఈ చీకట్లో దారీతెన్నూ కన్పించటంలేదు. పంచేంద్రియాలు గూడ పనిచేయటం మానివేసినై. ఇంటిముందే పేడకుప్పలూ, పెంటకుప్పలూ పేరుకొని వుంటాయి. దెధవకంపు వేస్తుంటుంది. వాళ్ళ ముక్కులికి వాసనచూసేశక్తి లేకుండాపోయింది. పీటమీద కూర్చున్నప్పుడు, పళ్ళెంలో యింత పడవేస్తే, రుచీ పచీ వున్నా, లేకపోయినా గబగబాతిని పొట్టనింపుకుంటారు. వాళ్ళట్లా పొట్టల్లో పడేసుకోవటం చూస్తూంటే, ఇంజన్లలో బొగ్గువేస్తున్నట్లుంది. కాండబ్బుకోసం మోకరిస్తారు. ఒక గౌరవంలేదు, సిగ్గులేదు, యెగ్గులేదు; చీమూ, నెత్తురూ - యేవీ - లేవు.

గోవర్ కీసంగతంతా మొదట్నుంచీ తెలుసు. చిన్నప్పట్నుంచీ చూస్తూనేవచ్చాడు. నాలుగు సంవత్సరాలు పట్టణంలో వుంటంమూలంగా, అత నింకో ప్రపంచాన్నిగూడ చూడగలిగాడు. పెద్దపెద్దవాళ్ల యిళ్ళల్లో పనిచేయటంవల్ల అతని రుచులుగూడ మారినై. అప్పుడప్పుడూ రాచకీయ సభలకు వెళ్లి, నాయకులిచ్చే వుపన్యాసాలు విన్నాడు. అదృష్టం అంటే

భగవంతుడు వ్రాసిపెట్టింది కాదనీ, ఎవరిఅదృష్టానికి వాళ్లేకర్తలూ, బాధ్యులూ అనీ తెలుసుకున్నాడు. ప్రతిమనిషీ, తన బుద్ధినీ, సాహసాన్నీ వుపయోగించుకుంటూ, ప్రపంచంలోవున్న అవినీతిమీదికి ధ్వజం యెత్తాలి. ఎవరో దేవత, మరేదో కానరాని శక్తివచ్చి, సహాయం చేస్తుందనీ, కష్టాలు తొలగిస్తుందనీ అనుకోవటం భ్రమ. అందుచేతనే యీమధ్య అతనిలో యేదో అందనివ్యథ కాలూని నిలబడింది. ఇదివరకటిలా తలబిరుసు మనిషికాదు గోవర్ ఇప్పుడు. ఎంతో వినయంగానూ, తన పని తాను చూచుకునేవాడిలాగానూ వుంటాడు. స్వార్థంవల్లా, లోభంతోనూ జీవితాన్నెందుకూ పాడుచేసుకోవటం? అందరూ కష్టాలనుభవించుతూన్నప్పుడు, నువ్వూ, నేనూ అనే భేదాలు పెట్టుకోవటం దేనికి? ఈ కష్టాలమూలాన్నేగదా అందరూ ఒక గాడికికట్టిన పశువుల్లా వున్నది? ఇలాంటప్పుడే ఐకమత్యాన్ని సాధించుకోవాలి.

ఇలాంటి ఆలోచనల్తో గోవర్ తల వేడెక్కిపోయింది. ప్రపంచంలోవున్న మంచీచెడ్డల్ని చూచివుండటంమూలాన అతనిబుద్ధిలో ఉదారభావం స్థానం సంపాదించుకుంది. హోరీ యేదైనా పనిచేస్తూంటే వెళ్ళి, 'నేను చేస్తాలే నాన్నా' అని, ఆపని తనే చేసేస్తున్నాడు, యిదివరకు చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నాడా అనిపించేట్లు.

"ఇంకా యెందుకు నాన్నా నీకీబాధలన్నీని. ఆ భారమంతా నామీద వొదిలిపెట్టేసెయ్యి. ఇంటికాకావాల్సిన ఖర్చంతా నేను పంపిస్తావుంటాలే ప్రతినెలానూ. ఇన్నిరోజుల్నుంచీ కష్టపడతన్నావు; చాలదూ? ఇక మెదలకుండా, కాలు

మీాద కాలేసుకొని కూర్చో. అసలింతకాలం నిన్నిట్టా కష్టపడ నివ్వటం నాదే బుద్ధితక్కువ."

కొడుకుమాటలు వింటూంటే హోరీకి మహదానందం కలిగింది. బిడ్డని ఆశీర్వదించాల్నని అతని రోమరోమమూ ఉవ్విళ్ళూరింది. అతని శరీరంలో వొక అసమానశక్తి, విద్యుత్తులా ప్రవహించినట్లైంది; ఇలాంటప్పుడు తనకున్న ఋణాన్ని గురించీ, మిగతా కష్టాల్ని గురించీ చెప్పటం సబబుగాదు. తానెట్లాగో కష్టపడ్డాడు; కనీసం కొడుకైనా యీచింత లేమీలేకుండా బ్రదికితే, అదే పదివేలు. ఇంతకాలం కష్టపడటం అలవాటైం తర్వాత యిప్పుడు కాలుమీాద కాలువేసుకుని కూర్చోవాల్నని అనుకున్నా కుదరదు. చేతిలో మాల పుచ్చుకున్నంతమాత్రాన మనసు శాంతిస్తుందా?

"చెప్పు నాన్నా. ఇంకా అప్పు లెన్నివున్నై? చెప్తే, వాయిదాల ప్రకారం పంపిస్తావుంటా అక్కణ్ణించీ" అన్నాడు గోవర్.

తల అడ్డంగావూపి, "నీకెందుకులేనాయనా యీ కష్టాలన్నీనీ. నువ్వుమాత్రం యేంవంత సంపాదిస్తున్నావుకాబట్టి? ఏదో నాతిప్పలు నేను పడుతున్నాగా. ఈ కాలం యిట్లాగే వుంటుందంటలే. రూప యెట్లాగో గట్టెక్కిందా? ఇక ఋణంవేంగా తీర్చాల్సింది. నువ్వియ్యన్నీ పట్టించుకోబాక. తిండీఅదీ శుభ్రంగా తింటూవుండు. తిని, తిరగాల్సిన వయస్సు నీది. నాదేంవుంది? ఊరు పొమ్మంటే కాడి రమ్మంటూంది. నువ్వీపొలంపని చెయ్య లేవులేబాబూ. యజమానిగూడా మంచివాళ్ళు దొరికారా,

వాళ్ళనే నమ్ముకునివుండు. మీ దొరసాని యిక్కడికొచ్చెళ్ళింది గూడాను. సాక్షాత్తూ దేవీసమానురాలు" అన్నాడు హోరీ.

"ఆఁ. మళ్ళీ పెళ్ళినాడు వస్తానని చెప్పారుగూడాను."

"ఆ దొరసానికి, చర్మం వొలిచి, చెప్పులు కుట్టించాలి బాబూ. నాలుగు డబ్బులు తక్కువవొరికినా ఫర్వాలేదుగాని, అట్లాంటాళ్ళదగ్గరే చెయ్యాలి నౌకరీ. తెలివబ్బుతుంది గూడాను."

ఇంతలోనే శాస్త్రిగారొచ్చి, సైగ చేశాడు హోరీని రమ్మనంటూ. దూరంగా తీసుకెళ్లి రొంటినుండి, రెండు వంద రూపాయలనోట్లు తీసి హోరీచేతికిచ్చి, "మంచిపని చేశావు హోరీ! నామాట వినబట్టేకదా అక్కడికి కూతురుపెళ్లీ ఐపోయినట్లైంది, ఇటు తాతలనాటి ఆస్తికీ ఆస్థి దక్కింది. నేను చెయ్యగలిగింది నేను చేసేశాను. ఇంక నీ యిష్టం" అన్నాడు శాస్త్రి.

నోట్లైతే పుచ్చుకున్నాడుగాని, హోరీ చేతులు అదేపనిగా వణకిపోవటం ఆరంభించినై. తల వంచుకున్నాడు, నోటినుండి మాట పెగలటంలేదు. ఏదో ఘోరమైన అవమానం జరిగినట్లుగా వుందిహోరీకి. జీవితంతో పోట్లాడటం ప్రారంభించి ముప్పై యేళ్ళపైచిల్లర అయ్యింది; చివరికి ఆ పోట్లాటలో అతనే వోడిపోయాడు. ఇప్పుడు ఊరిమధ్యనిలబెట్టి, చేతులు విరచి కట్టినట్లుగావుంది; వచ్చే, పొయ్యేవాళ్ళందరూ, అతని ముఖం మీద ఉమ్మివేస్తున్నారు. "దయతలచండి బాబుల్లారా! జ్యేష్ఠ మాసంలో యెండెట్లావుంటుందో, మాఘమాసంలో వర్షం యెట్లావుంటుందో తెలవకుండా పనిచేసిన మనిషిన్నేను. కావా

లంటే నారొమ్ముచీల్చి చూడండి. ప్రాణాలుపోయి చాలా రోజులయ్యింది. నావళ్ళంతా గాయాలే, నావీపంతా తాపుల్తో కాయలుగాసింది. ఎప్పుడైనా విశ్రాంతి తీసుకున్నావా? ఎప్పుడైనా నీడపట్టున కూర్చున్నావా? అనడగండి. నా జన్మలో చూచెరగను ఆ రెంటినీ! ఎందుకిట్లా అవమానిస్తారు నన్ను? నేనొారి పిరికిపందని, లోభిని, అధమాధముణ్ణి; ఐనా బ్రతికున్నాను, జీవచ్ఛవంల్లా బ్రతికున్నాను!"

ఇంతవరకూ అతనికున్న విశ్వాసం కాస్తా గుడ్డిదై పోయింది; ముక్కలు చెక్కలై పోయింది.

"ఐతే మరి నేవెళ్తా. నోఖేరాంగారి యింటికిమాత్రం..." అన్నాడు శాస్త్రి.

"వెళ్ళిపోతా బాబూ. తమరి దయ!" అన్నాడు హోరీ, దిగులుగా.

# 26

రెండురోజులవరకు గ్రామంఅంతా వైభోగంగా వుంది. బాజా భజంత్రీలు, మేళతాళాలు. కళ్ల నీళ్లు పెట్టుకుని రూప, అత్తవారింటికి వెళ్లిపోయింది. కాని హోదామాత్రం, గడప దాటి, అడుగు బయటపెట్టలేదు. ఏదో తప్పుపని చేసినట్లు బాధపడుతూ, ఇంట్లోనే కూర్చున్నాడు. గోవర్ గారి దొరసాని మాలతి రావటంతో మరింత హడావుడి యెక్కువైంది; చుట్టు ప్రక్కల గ్రామాలనుండిగూడా పేరంటాళ్లూ, ముత్తైదువులూ వచ్చారు.

గోవర్ మంచితనం చూచి, గ్రామంఅంతా ముగ్ధులై పొయ్యారు. ఎవరింట్లోచూచినా, అతని మంచితనాన్నిగురించీ, 'నెమ్మది'ని గురించీ మాట్లాడుకుంటున్నారు. భోలా, అతని కాళ్లమీద పడినంతపనిచేశాడు. భోలా ఇంటికి వెళ్లినప్పుడు, తాంబూలం తీసుకొచ్చి యిచ్చింది భోలా భార్య. వెళ్లేటప్పుడు వొక రూపాయి చేతిలోపెట్టింది; అతని లక్నో ముద్రను అడిగి, వ్రాయించుకుంది. ఎప్పుడైనా లక్నోవస్తే, తప్పకుండా మీ

ఇంటికివచ్చి మిమ్మల్ని చూస్తానని చెప్పింది. హోరీ తన కివ్వ వలసిన ఋణాన్ని గురించి మాట్లాడనుగూడా మాట్లాడ లేదావిడ.

పెళ్లైంతర్వాత, మూడోనాడు, లక్నోకి ప్రయాణం కట్టాడు గోవర్. ఇంతవరకూ, మనసులో దాచుకున్న విషయాన్ని బయటపెట్టేశాడు హోరీ. ధనియా వున్నప్పుడే, కళ్ళ నీళ్ళు బెట్టుకొని, "నాయనా! యీ పొలంమీద వుండే మమత్తో చేశాను యీపాడుపని. ఈ పాపానికేం శిక్షవేస్తాడో దేవుఁడు" అన్నాడు గోవర్‌తో.

గోవర్ నదర లేదు; బెదర లేదు; కోప్పడలేదు. ఎంతో నెమ్మదిగా, "యిందులో పాపఁవేంవుందిలే నాన్నా. రాంసేవక్ గారి కివ్వాల్సిన డబ్బిచ్చేస్తేసరి. నువ్వుమాత్రఁ వేంజేస్తావు? నేనుంటే, అక్కడికి రాకుండాపోతేని. పొలంఅంటే పండలేదు. అప్పుగూడా పుట్టలేదు. నెలరోజుల్నించీ యింట్లో పస్తులుంటాంటిరి. అట్టాంటప్పుడు నువ్వుమాత్రఁ వేంచెయ్యగలవు? తాతల్నాటి ఆస్తిగూడా పోతే, యేంతింటాం? యెక్కడుంటాం? మనిషేఁవీఁ చెయ్యలేనప్పుడేంచేస్తాడు ? భారఁవంతా దేవుఁడిమీదేసి ఊరుకుంటాడు. కాలవేఁ అట్లావుంది. మర్యాదా, గౌరవవూఁ-అన్నీ-వున్నవాళ్ళకే; లేనాళ్ళకేవీలేదు. నువ్వుగూడా అందరికిమల్లే కొంపలు దోచుకుంటే, బాగుపడేవాడివి. నీకిక్కట్టుబడుండా వుగాబట్టి, దేవుఁ డీపనిజేశాడు. నీకొచ్చిన కష్టాలేగనక నాకొస్తే యీపాటికి యే జైల్లోనో వుండేవాడిని; లేకపోతే యీపాటికె వురిగూడా తీసేసేవారేవోఁ. వళ్ళిరగ్గొట్టుకుని పనిచేసి, వాళ్ళకీపిళ్ళకీ కట్టబెట్టి, కడుపు కాల్చుకుంటా కూర్చోవటంఅంటేనే గిట్టదునాకు" అన్నాడు గోవర్.

కోడల్ని, కొడుకుతోపాటు పంపించేందుకు ధనియా అంగీకరించలేదు. కోడల్నింకా నాలుగురోజులు అట్టిపెట్టుకుని, పంపించాలనుంది ఆవిడకు. ఝునియాక్కూడా యింకా నాలుగు రోజులుండాలనే వుంది. గోవర్ ఒంటరిగా వెళ్ళటమే ఖాయమైంది చివరకు.

మర్నాడు వుదయంలేచి, లక్నోకని బయలుదేరాడు గోవర్. గోవర్‌ని సాగనంపేందుకని, ఊరిబయటిదాకా వెళ్లాడు హోరీ. కొడుకంటే యింత వాత్సల్యం యిదివరకెప్పుడూ కలగ లేదతనికి. గోవర్ వంగుని, తండ్రి కాళ్ళకు తాకబోతూంటే, హోరీ హృదయం నిండాకులయ్యింది. ఇక మళ్లీ యీ కొడుకు ముఖం చూస్తానాఅని అనిపించిందతనికి. గోవర్‌లాంటి కొడుకును కన్నందుకు సంతోషమూ, వుల్లాసమూ, గర్వమూ ఒక్కసారిగాకలిగాయి హోరీకి. గోవర్ చూపించే వినయ విధేయతన్ని చూస్తూంటే అతనికి మేరువెక్కినంత సంతోషం వేసింది. నిన్నటిదాకా అతను తనబ్రదుకంతా చీకటిమయం అని వాపోయాడు. కాని యివ్వాళ గోవర్‌ని చూస్తూంటే; చీకట్లో దారిని చూపించే ఆశాజ్యోతిని చూచినట్లుంది.

అత్తవారింట్లో రూపపని హాయిగానేవుంది. రూపకి బాల్యంలో ఒక్కటే ఒకటి పెద్దలోపంగా కన్పించేది; డబ్బు! డబ్బుకంటే విలువైనవస్తువు లేదనిఅనుకునేది చిన్నప్పుడు. ఇప్పుడాకొరత లేకుండాపోయింది. రాంసేవక్ నడికారువాడే ఐనా, ప్రస్తుతం నవయువకుడిలా వుంటున్నాడు. అతను ముసలివాడనే ఆలోచనేకలగలేదు రూపకు. ముసలివాడైనా, పడుచువాడైనాసరే, అతను తన భర్తఅనమాత్రం

అనుకునేది రూప. అతన్ని తన భర్తగాస్వీకరించేందుకు, అతని ఆకార వికారాలతోగాని, వయసుతోగాని నిమిత్తం లేనేలేదు. నిజమే! రూప మంచి వయసులోవుంది; యౌవనంలో వుంది. కాని తనయౌవనాన్ని, అందచందాలనూ, మరో వ్యక్తి ఆనందించాల్సినేభావంలేదు రూపకు. అట్లా అని, రూప శృంగారం చేసుకోకుండా వుండేదికాదు. శృంగారం చేసుకుని, అద్దంలో చూచుకుని, తనలోతానే ఆనందించుకునేది; మురుసుకునేది. రాంసేవక్ వున్నప్పుడు ఆవిడప్రవర్తన మరోవిధంగా వుండేది. గృహిణిలా గృహకృత్యాలు నిర్వర్తించటంలో మునిగిపోయేది. తనయౌవనాన్నీ, అందచందాలనీ చూపించి, భర్తను బాధపెట్టటంఅన్నా, సిగ్గుపడేట్లు చేయటంఅన్నా ఆవిడకు యిష్టం వుండేదిగాదు. ఏదో 'వెలితి' గా వున్నదనే భావమే వుండేది కాదు రూపకు. ఇంటిముందున్న ధాన్యప్పురుల్నీ, గాదెల్నీ; ఇంటిచుట్టూవున్న పచ్చనిపైరుల్ని చూచి, సంతోషించుకుంటూ కూర్చునేది.

అంతేగాదు. తన పుట్టింటివాళ్లని సుఖపెట్టాలని చూచేది ఎప్పుడూనూ. వాళ్ల బీదతనం పోగొట్టేదెట్లా? ఇంకా ఆ ఆవు సంగతి జ్ఞాపకంవుంది. వచ్చేటప్పుడు యెంతో ఆప్యాయతవున్న బంధువులావచ్చింది; అందరి గుండెల్లోనూ చిచ్చుపెట్టి, తన దారిని తాను పోయింది. ఆ ఆవుసంగతి తలచుకున్నకొద్దీ, బాధ పెరిగిపోతుంది. ఈ యింట్లో అడుగుపెట్టిందన్నమాటేగాని, ఇది తన స్వంతయిల్లనేభావం యింకా, రూపకి కలగలేదు. ఇప్పటికీ పుట్టిల్లే.తనయిల్లని భావిస్తూంది. పుట్టింట్లోవాళ్ళే ఆత్మీయులు; వాళ్ళ సుఖదుఃఖాలే రూప సుఖదుఃఖాలుగూడాను. ఈయింటి

ముందున్న గాదెలన్నిటినీ చూచినా, పుట్టింటిముందు కట్టేసిన ఆవుని చూచినప్పుడు కలిగినసంతోషంలో పదోవంతు సంతోషంగూడా కలగటంలేదు. తన తండ్రి కోరిక తీరనేలేదు. ఆ ఆవు వచ్చినప్పుడు యెంతసంతోషించాడు! ఆకాశంనుంచి దేవత దిగొచ్చిందా అన్నట్లు ఆనందించాడు. తర్వాత, చేతిలో డబ్బు ఆడలేదు; అందుకనే యింకో ఆవుని కొనలేకపోయాడు. ఐనా, ఇంకా వీలుంటే ఒక ఆవుని కొనుక్కొని, ఇంటిముందు కట్టేసుకుని, కళ్లారా చూడాలనే ఆయనకోరిక. ఈసారి పుట్టింటికి వెళ్లేప్పుడు, అత్తవారి దొడ్లోవున్న వొకావుని తోలి కెళ్లాలి. ఐనా, అప్పటిదాకా ఆగటండేనికి? ఒక మనిషికిచ్చి, తోలిపెట్టేపోదూ? రాంసేవక్‌ను అడగటమే ఆలస్యం. అడగ్గానే అంగీకరిస్తాడు. మర్నాడే ఒకగొల్లని పిలిచి, ఆవుని కన్న వారింటికి తోలిపెట్టెయ్యాలి. 'నాన్నతో అన్నయ్యగారబ్బాయి పాలకని తోలిపెట్టా'నని చెప్పమని చెప్పాలి గొల్లతో. హోరీ గూడ యెక్కడైనా వొకావుని సంపాయిస్తేనే బాగుంటుందనే ఆలోచనలోనే వున్నాడు. తనకనిగాదు. గోవర్‌గారబ్బాయి, మంగల్, యిక్కడే వుంటున్నాడిప్పుడు. అందుట్లోనూ వాడు తన మనుమడనేమాట, గోవర్ కొడుకనేమాట అట్లావుంచి, డాక్టరమ్మగారికి, అంటే మాలతీదొరసానిగారికి, ముద్దులబిడ్డ. వాడిని పెంచటంఅంటే మాటలామరి!

కాని, డబ్బేదీ? అదృష్టవశాత్తూ ఆనాడే ఒక కాంట్రాక్టరు రోడ్డు వేయించుతానంటూ వచ్చాడు. హోరీ గబగబా ఆయన దగ్గరకెళ్లి, కూలీకి కుదిరాడు. రోజుకు ఎనిమిదణాలుకూలి. ఏ రెండునెలలో పనిచేస్తేనేగాని, ఆవుకు పెట్టవలసినఖరీదు

పూడదు. ప్రొద్దుగూకులూ, ఎండనక, వానసక, వడగాలనక పని చేసేవాడు. చీకటిపడ్డతర్వాత ఇంటికివచ్చి, నాలుగు మెతుకులు తిని, మళ్లీ నూలువడుకుతూ కూర్చునేవాడు. పండుకునేప్పటికి రాత్రి ఒంటిగంటయ్యేది. ధనియాకూడ అతనితోపాటు రాట్నం వడుకుతూ కూర్చునేది. ఇద్దరూ, యెండి, కట్టెపుల్లల్లా తయారయ్యారు. ఆవును కొనుక్కోకపోతే యెట్లా? రాంసేవక్ గారు యిచ్చిన డబ్బుగూడా చెల్లగట్టాలి.

ఒకనాడు రాత్రి పన్నెండుగంటలయ్యింది. ఇద్దరూ కూర్చుని, నూలువడుకుతున్నారు. "నిద్దరొస్తొంటే యెళ్ళిపడుకో. మళ్ళీ తెల్లారుఝామునే లేవాలిగా" అన్నది ధనియా.

హోరీ తలెత్తి, ఆకాశంవంక చూచి, "వెళ్తాలే. పద్దైందనుకుంటా. నువ్వెళ్లి నిద్రపో" అన్నాడు.

"నేను మధ్యాన్నపూ టొకకునుకేస్తున్నాగా."

"నేనూ అక్కడ చెట్టుకింద నడుంవాలుస్తానే వున్నాలే."

"బాగా వడగొట్టటంలామరి."

"నీడుందిగా."

"ఏవోం బాబూ. పడకేస్తావేమోనని భయంగా వుంది."

"ఊరుకోవే! నీగొడవానూ నువ్వూనూ, తీరికవున్న వాళ్లేస్తారుపడక. మనకురెక్కాడితేగాని డొక్కాడదాయె. ఇంకా మనం పడకేంవేస్తాం. ఈసారి గోవరొస్తే, రాంసేవక్కివ్వాల్సిన దాంట్లో, సగంవన్నా జంవేస్తాడేమోనని నాఆశ. ఎంతో కొంత పట్టుకురాడంటూ. ఈ యేటి కీఅప్పుతీర్చేస్తే, తర్వాత మాట దేవుండెరుగును."

"మెదిత్తే, కదిత్తే గాపకంవొస్తున్నాడు బిడ్డ. నాబిడ్డ బంగారంకాదూ!"

"అంతేలేవే. ఆడబోయిన తీర్థం వెదురైందని."

"మంగల్ యెంతబాగావుండేవాడు యిక్కడికొచ్చినప్పుడు! బిడ్డికక్కడికొచ్చి, బక్కదేలిపోయాడుగాని."

"అక్కడంటే పాలూ, పెరుగూ, నెయ్యీ కావాల్సినంత తాగేవాడు. ఇక్కడేంవుంది? తింటానికి దొరికేటప్పటికే గగనమైంపోతాండె; ఏంజేస్తాం!"

"ఆం నువ్వు నా మాటింటావంటులే. తనకు దూరకంతలేదుగాని మెడకొక డోలన్నట్టు, పున్ని వెవసాయంగూడా నెత్తిని బెట్టుకుంటివి."

"ఏంచేస్తావేం? మన ధర్మం మనం చెయ్యకపోతే యెట్లా? హీరా పొరపాటే చేశాడనుకో. అందుకని వాడి పిల్లా జల్లా నష్టపట్టం యేంన్యాయం చెప్పు. మనం తప్పితే వాళ్ళకిమాత్రం యెవరున్నారు చెప్పు? మనంగూడా ఆదుకోకపోతే వాళ్ళేంవయ్యేవారో ఆలోచించావ్? ఇంతచేసినా మంగ్రూ షావుకారు వ్యాజ్యం వెయ్యనేవేశాడు."

"ఎందుకెయ్యడూ, డబ్బు పాతరేసుకూర్చున్నావని, బాకీ చెల్లగట్టకుండావుంటే?"

"అదేం వాగుడే? పండిందాంతో పొట్టనిండుతాంది, పాతరేస్తాందంటావుగాని."

"ఇంతకీ హీరా యేంవయ్యాడంటా"

"ఎప్పుడో వొకసారి తిరిగొస్తాడనేనే నా నమ్మకం."

తర్వాత యిద్దరూ లేచివెళ్ళి పడుకున్నారు. నిద్ర పోయారు.

హోరీకి మెలకువ వచ్చేప్పటికి యింకా తెల్లవారలేదు. కళ్ళునులుపుకుని చూస్తే ముందు హీరా నిలబడివున్నాడు. పెరిగిన గడ్డం, చిరిగిన గుడ్డలు, పీక్కుపోయిన ముఖం, మనిషి బాగా చిక్కిపోయాడు. పరుగెత్తుకెళ్ళి, హోరీకాళ్ళమీద పడ్డాడు.

హీరాని లేపి, కౌగలించుకుని, "ఇంత చిక్కిపోయావేం బాబూ? ఇవ్వాళల్లా నిన్ను తల్చుకుంటూనేవున్నాం. జబ్బు పడ్డావా యేంవన్నా?" అనడిగాడు హోరీ.

ఇప్పుడుహీరాని చూస్తూంటే, తానుకావాలని కొనుక్కు తెచ్చుకున్న గోమాతని పొట్టబెట్టుకున్న హీరాగాగాని, తన జీవితంఅంతా నాశనంచేసిన హీరాగాగాని కన్పించలేదు. తల్లీదండ్రీలేని చిన్నితమ్ముడిలా నిలబడివున్నాడు హోరీ యెదుట. ఈ మధ్య జరిగిన పాతికముప్పై సంవత్సరాలూ ఐపూ ఆనమాలు లేకుండాపోయినై.

హీరా జవాబు చెప్పలేదు. అట్లాగే యేడుస్తూ నిలబడి పోయాడు.

తమ్ముడిచేయిపట్టుకుని, "యెందుకు నాయనా! అనవసరంగా యేడుస్తావ్? మనిషై పుట్టింతర్వాత పొరపాటనేది జరగకుండా యెట్లావుంటంది? జబ్బుపడ్డావా నువ్వు?" అన్నాడు హోరీ, గద్గదంగా.

"ఏంచెప్ప నన్నయ్యా. నిన్ను చూడనోసుకున్నాను గాబట్టి బదికి బైటపడ్డా. కన్నుమూసినా, తెరిచినా కనబడతా

వుంటం దాలవు. నాకు పిచ్చెత్తిపోయింది. తీసికెళ్ళి, ఐదు సంవత్సరాలపాటు పిచ్చాసుపత్రిలో పడేశారుగూడాను. అందుట్లోనుంచి బైటపడి ఆర్నెల్లయ్యింది. ఇప్పటిదాకా అడుక్కుతిని బదికా. ఇక్కడికి రావాలంటే ధైర్యంచాల్లేదు. మొఖం చెల్లలేదు. చివరికి మనసొప్పలేదు. గుండె గట్టిచేసుకు నొచ్చేశా చివరికి. నువ్వు నాబిడ్డల్ని ... "

మాట మధ్యలోనేఆపి, "నువ్వారికేనే గాభరాపడి పారిపోయావుగాని, పోలీసాళ్ళచేతుల్లో పదిరూపాయలు పడేస్తే కేసుదాఖ్ని కేసుపోయేదిగాదూ? పిచ్చివాడ!" అన్నాడు హోరీ.

"నెయ్యికాదు, లక్ష జన్మలెత్తినా నీఋణం తీర్చుకోలే నన్నయ్యా."

"అదేవిట్రా. పరాయాడితో మాట్లాడినట్టు మాట్లా డతావ్ !"

హోరీకి అంతులేని ఆనందంకలిగింది. జీవితంలో ఎదు రైన సంకటాలూ, కష్టాలూ, నిరాశా-అస్ని-కలిసి అతని కాళ్ళమీద పడ్డట్టుగావుంది. బ్రదుకుకోసం చేసిన పోరాటంలో అతను వోడిపోయాడని యెవరనగలరు? ఈ వుల్లాసమూ, గర్వమూ, పులకింపూ! ఓడిపోయినవాళ్ల కీభావాలెలా కలుగుతాయి? ఓడిపోయినవాళ్ల లక్షణాలు కావేయివి? ఈ పరాజయాల్లోనేవుంది విజయం. ముక్కచెక్కలైన ఆయు ధాలే అతని విజయపతాకాలు! హోరీ ఛాతీ విరచుకొడు. అతని ముఖం యేదో నూతనో త్తేజంతో కళకళలాడింది. హీరా వ్యక్తంచేసిన కృతజ్ఞత అతనిజీవితానికొకసాఫల్యాన్ని చేకూ ర్చింది. పొలం విరగపండినా యింతఆనందం కలిగేదికాదతనికి.

అతనిముందు రూపాయలు రాశిపోసినా, యింతఆనందం కలిగేది కాదు.

క్రిందనుంచీ పైకొకసారి చూచి, "నువ్వుగూడా బాగా చిక్కిపోయావన్నయ్యా" అన్నాడు హీరా.

హోరీ నవ్వాడు. "లేకపోతే నేను బలిసేవయసంట్రా యిది! ఋణంలేనాళ్ళూ, మానంమర్యాదలంటే లెక్కలేనాళ్ళూ బలుస్తారు. ఈ రోజుల్లో అసలు లావవటంగూడా తప్పేననుకో. వందమంది బక్కాళ్ళని యేడిపిస్తేనేగాని ఒకడు లావవ్వడు. అందరూ లావైతే – అదీ సంతోషం. సరేగాని శేఖరన్నయ్యని కూడా చూసేవచ్చావా?"

"శేఖరన్నయ్యకి రాత్రే కనబడ్డా. నువ్వంటే, నీమీద కత్తికట్టినాళ్ళనీ దగ్గిరికితీశావు, వాణ్ణే దగ్గరికితీశావు. నీ గౌరవం నువ్వు దక్కించుకున్నావు. శేఖరన్నయ్య పొలవూ అదీ అంతా అమ్మేశాడంట. మరి యెట్టా కడతేరతాడో యేంవో."

* * *

హోరీ యివ్వాళగూడ కూలికివెళ్లాడు. వళ్ళంతా బరువుగావుంది. రాత్రి బడలికం యింకా తీరలేదు. ఐనా చకచకా పని చేసుకుపోతున్నాడు.

ఇవ్వాళ పది గంటలకే వడగాలి మొదలుపెట్టింది. మధ్యాహ్నం అయ్యేప్పటికి నిప్పులు కురుస్తున్నట్లయ్యింది. కంకరరాళ్లెత్తి పల్లికెలో పోసుకునివచ్చి, బండిలో వేస్తున్నాడు హోరీ. మధ్యాహ్నం అన్నంతినేవేళ అయ్యేప్పటికి పూర్తిగా అలసిపోయాడు. ఒకటే సాలి. ఇంతసాలి యిదివరకెప్పుడూ రాలేదు. కాలుతీసి కాలెయ్యాలంటేనే కష్టంగావుంది. లోప

ల్నుండి ఏదో అగ్ని దహించుకువస్తూన్నట్లుంది. కాళ్లూ, చేతులూ, ముఖమూ కడుగుకోకుండానే, అన్నంవైపుగూడా చూడకుండా వెళ్లి చెట్టుక్రింద పై పంచొకటి పరుచుకుని అట్లాగే వెన్ను వాల్చాడు. దాహంతో గొంతెండిపోతోంది. పరగడుపున మంచి నీళ్ళు త్రాగటంకూడా మంచిదిగాదు. దాహం తగ్గుతుందేమో నని చూశాడు; కాని తగ్గలేదు; నిమిష నిమిషానికీ యెక్కువై పోతోంది. ఇక వుండలేకపోయాడు. ప్రక్కనే యింకొకకూలీ బొక్కెనలో నీళ్లుపెట్టుకుని, భోంచేస్తున్నాడు. హోరీ ప్రక్కకు వత్తిగిలి, చెంబెడు మంచినీళ్ళు వంచుకుని, గటగటా త్రాగి, మళ్ళీ పండుకున్నాడు. కాని యింకో అరగంటలో పెద్ద వాంతి వచ్చి, వాంతి చేసుకున్నాడు. ముఖం అంతా నల్లకప్పేసినట్లై పోయింది.

"ఏం? వంటో బాగాలేదా హోరీఅన్నయ్యా" అన్నాడు ప్రక్కనేవున్న కూలీ.

హోరీకి తలంతా గిర్రునతిరిగిపోతున్న ట్లనిపించింది. "ఆఁ! యేమీలేదు. బాగానేవున్నా" అన్నాడు హోరీ.

అంటూనే మళ్ళీ యింకోవాంతి చేసుకున్నాడు హోరీ. కాళ్ళూ చేతులూ చల్లబడిపోతున్నవి. హోరీ కేమీఅర్థం కాలేదు. అంతా గాభరాగావుంది. ఈ తలతిరగటం యేమిటి? కళ్ళు చీకట్లుకమ్ముతున్నై. కళ్ళు మూసుకుపోతున్నై. గడచిన రోజులన్నీ జరిగినవి జరిగినట్లు, ఒక వరుసలేకుండా, ముందువి వెనకా, వెనకవిముందూ కలలో కన్పించినట్లు, ఒకసంబంధమూ, ఒక ఆకారమూ లేకుండా, తెరమీది బొమ్మల్లా కన్పిస్తూ

మాయమౌతున్నయి. చిన్నప్పుడు గోళీలాడుకున్నట్లూ, తరువాత తల్లి వొడిలో పండుకొన్నట్లూ కన్పించింది. ఇంతలోనే గోవర్ వచ్చి, కాళ్ళమీద పడినట్లు కన్పించింది. మళ్ళీ దృశ్యం మారిపోయింది. ధనియా పెళ్ళికూతురిలా సింగారించుకుని అతనికి అన్నం వడ్డిస్తోంది. ఇంతలోనే ఒకఆవు కన్పించింది; మూడు మూర్తులా కామధేనువులాగావుంది ఆ ఆవు. ఆ ఆవు కాళ్ళు కట్టేసి, పాలుపితికి మనుమడికి త్రాగించుతున్నానని అనుకుంటూండగానే, ఆవు యేదో వొక దేవతారూపందాల్చి ...

"పొద్దు వాలిపోతాందన్నయ్యా, పని కెళ్దాం పద" అన్నాడు ప్రక్కనే వున్న కూలీ.

హోరీ మాట్లాడలేదు. అతని ప్రాణాలేయేలోకాల్లో సంచారం చేసేందుకెళ్ళాయో తెలియదు. అతని వళ్ళంతా కందిగింజవేస్తే పేలిపోయేట్లు మండిపోతోంది. కాళ్ళూ, చేతులూ చల్లబడిపోతూన్నయి. వడదెబ్బ తగిలింది.

ఇంటికి కబురుపంపారు. ధనియా పడుతూ, లేస్తూ, పరుగెత్తుకుంటూ వచ్చింది. శేఖర్, హీరా డోలీకట్టి భుజాలమీదేసుకుని ఆవిడ వెనక వస్తున్నారు.

ధనియా వచ్చి, హోరీవంటిమీద చెయ్యివేసింది. ఆవిడగుండె ఆగిపోయినట్లైంది.

"ఎట్టావుంది?" అనడిగింది వణకిపోతూ.

హోరీ కళ్లుతెరచి, నిలువు కళ్లేసి, "వచ్చావాబాబూ, గోవర్! ఆవుని కొనుకొచ్చారా అబ్బాయిపాలకని. చూశావా అదుగో యెదురుగుండానే కట్టేశా. చూడు!" అన్నాడు.

చావు యెట్లావుంటుందో ధనియాకు చాలా బాగా తెలుసు. చావు ఒక్కోసారి, అడుగులు మెల్లమెల్లగా వేసుకుంటూ, పిల్లిలా వస్తుంది; ఒక్కొక్కసారి పెనుతుపానులా, భూమి దద్దరిల్లేట్టు గర్జిస్తూ వస్తుంది. ఆవిడ చూస్తుండగానే అత్త చనిపోయింది, మామ చనిపోయాడు. పుట్టిన యిద్దరుబిడ్డలూ పోయారు. ఊళ్లో చనిపోయినవాళ్ళసంగతి చెప్పేఅవసరమే లేదు. కాళ్ళక్రింది యిసుక కరిగిపోతున్నట్లుంది. కనా కాదు! ఇప్పుడు పిరికితనాన్ని దగ్గరికి రానీయకూడదు; ధైర్యంగా వుండాలి. ఇదంతా 'వృత్తి' భయం. ఏమీ లేదు. కాస్త వడతగిలింది. వడదెబ్బకొట్టింది అంతే. మరేమీలేదు. అందుకనే స్పృహ తప్పి పడిపోయాడు.

పొర్లివచ్చే కన్నీటిని ఆపుకుంటూ, "యిదిగో, నిన్నే యిటుచూడు. నన్నుచూశావా. నేనే. ఆనమాలుపట్టలేవూ నన్ను" అన్నది.

హోరీకి స్పృహవచ్చింది. మృత్యుదేవత దగ్గరకొచ్చింది. నిప్పు గప్పునమండే నిమిషం దగ్గరకొచ్చింది; అంచేత పొగ కన్పించటంలేదు. ధనియా కేసి దీనంగాచూశాడు హోరీ. రెండు కళ్ళనించీ, రెండు కన్నీటిచుక్కలు రాలి, క్రిందపడినై. "నా తప్పులన్నీ మన్నించు ధనియా! ఇక నేనెళ్ళిపోతున్నా. బ్రదికుండగా ఆవుని కొనుక్కోలేకపోయాను. కాస్తో, కూస్తో డబ్బుంటే అదంతా నాకర్మకాండ పూర్తిచెయ్యటానికే సరిపోతుంది. ఏడవబాకు ధనియా. ఏడి చేంలాభం? ఇంకెంతకాలం బతికించుకోగలవు నన్ను. నేను బతికుండిమాత్రం వేంలాభంలే. చచ్చిపోనీ" అన్నాడు క్షీణస్వరంతో.

మళ్ళీ అతనికళ్ళు మూతలుపడిపోయినై. ఇంతలోనే శేఖర్, హీరాలు డోలీ మోసుకుని వచ్చారు. హోరీని లేపి, డోలీలో వేసుకుని వూరిముఖం పట్టారు.

ఈ వార్త వూళ్లో గాలిలా ప్రాకిపోయింది. వూరంతా ప్రోగయ్యింది. హోరీ మంచంమీద పండుకుని యిదంతా చూస్తున్నాడో లేదో, యీ గొడవంతా అతనికి తెలుస్తూందో లేదో చెప్పటం కష్టమే. కాని అతను మాట్లాడగల స్థితిలో మాత్రం లేడు. హోరీకళ్ళంట నీళ్ళు ధారగట్టి కారుతున్నయి. ఈ మోహ బంధనాల్ని త్రెంచుకోవటం అంటే మాటలుగాదు; తాను చేయాల్నని అనుకుని, చేయలేకపోతే, అదంతా మోహం క్రిందనే లెఖ. నిర్వహించిన కర్తవ్యాలంటేనూ, నిభాయించిన పనులంటేనూ యింకా మోహంయెందుకుంటుంది? మనం సహాయం చెయ్యలేక వదలివేసే అనాథులంటేనూ, మనం పూర్తిచేసుకోలేని కోరికలంటేనూ మనకుండే మమతవేరేగదా మోహం అంటే.

ధనియాకు అంతా తెలుసు. ఎంత తెలిసినా ఆశమాత్రం వదలలేదు. కళ్లంట నీళ్ళు ధారగట్టి కారుతున్నాయి. యంత్రంలా వూరికే అటూయిటూ పరుగెత్తుతుంది. హోరీ శరీరమంతటా పసుపు పూస్తోంది. ఇంకేంచేస్తుందిమరి? చేతిలో కానీడబ్బులేదు. లేకపోతే డాక్టరుకు కబురుపెట్టి పిలిపించుకునేదే.

"ఇట్టా మరీ యింతయిదైపోతే యెట్టావదినా. గుండె రాయిచేసుకోవాలి. ఇక అన్నయ్య దక్కేటట్టులేడు. గోదానం చేయించేసెయ్యి" అన్నాడు హీరా యేడుస్తూ.

ఈ మాటలు వింటూంటే ధనియాకు చీకాకు వేసింది. గుండె రాయిచేసుకున్నది చాలదూ? ఇంకెంత రాయిచేసుకోవాలి. తన భర్తంటే యెంత ప్రేమవుందో యెట్లాచెబుతుంది వీళ్ళకి? జీవితకాలంఅంతా ఒకళ్లనొకళ్ళు నమ్ముకుని వున్నారే, ఈనాడతను చనిపోతూంటే, కళ్ళంట నీరుకారుస్తూ, ముక్కు చీదేస్తూ, ఏడుస్తూ కూర్చుంటే సరిపోతుందా?

"అంతేమరి. ఇంకేంవుంది. గోదానం చేయించెయ్యి" అన్నారు అందరూనూ.

బొమ్మలా లేచి యింట్లోకెళ్ళి యివ్వాళ నూలమ్మితే వచ్చిన రూపాయిపావలా పుచ్చుకునివచ్చి చల్లగా యుగంతా వున్న భర్త చేతిలో పెట్టి, శాస్త్రినంక చూచి, "శాస్త్రుల్లుగారూ! యింటో ఆవూ లేదు; ఒక్కగానొక్కబిడ్డ గోవరూ లేదు. ఇదిగో రూపాయిపావలావుంది యింటో. ఇదే యీాయన గోదానం."

అంటూనే, నిలుచున్నది నిలుచున్నట్టు కుప్పలా కూలిపోయింది ధనియా.



సమాప్తం





| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 1047B 187 |
| పుస్తకం పేరు | గోదాన్ |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 487 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Ch. Ramya |
| స్కాన్ చేసినది | Pratyush |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |